# జైమిని భారతము

సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు

సంపాదకుడు

డా॥ ఎమ్. కులశేఖరరావు






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు 4

# జైమిని భారతము

సముఖం వేంకట కృష్ణప్ప నాయకుడు

సంపాదకుడు

డా॥ ఎమ్. కులశేఖరరావు






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు 4

# తొలిపలుకు

ప్రాచీనాంధ్ర సాహిత్య స్వరూప స్వభావాలను సమగ్రంగా అవగాహన చేసుకోవడానికి ఆనాడు వెలసిన గ్రంథాలను అధ్యయనం చేయవలసిన అవసరం ప్రతి సాహిత్యవిద్యార్థికి కలుగుతుంది. అయితే ఆ గ్రంథాలను చక్కగా అచ్చొత్తించి సరసమైన ధరలకు అందించగలిగినప్పుడే అధ్యయనానికి చక్కని అవకాశాలు ఏర్పడతాయి. ఎప్పుడో ముద్రితమై ఇప్పుడు దొరుకకుండా ఉన్న గ్రంథాలను కొన్నింటిని ఎన్నికచేసి ప్రచురించాలని అకాడమీ ఉద్దేశం. ఇంతవరకు అకాడమీ ఎన్నో ప్రాచీన గ్రంథాలను విద్వాంసులచేత పరిష్కరింపజేసి చక్కని పీఠికలతో ప్రచురించి పాఠకలోకానికి అందించింది.

తెలుగులో వెలసిన వచనైకరచనల్లో ప్రముఖం వేంకటకృష్ణప్ప నాయకుని జైమినీ భారతము ఇప్పటికీ విద్వాంసులకూ, తెలుగుభాషాసాహిత్యపరిశోధకులకూ పఠనీయగ్రంథంగా ఉన్నది. ప్రస్తుతం ఈ గ్రంథం ఎవరికీ అందుబాటులో లేదు. ముఖ్యంగా విశ్వవిద్యాలయ విద్యార్థులకు అవశ్యపఠనీయమైన ఈ గ్రంథం లభించని పరిస్థితిని అధిగమించవలసిన అవసరం ఉన్నది.

ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు విభాగంలో రీడరుగా ఉన్న డా॥ ఎం. కులశేఖరరావుగారు ఈ గ్రంథానికి సంపాదకత్వం వహించి చక్కని పీఠికతో అకాడమీకి అందించినారు. సాహిత్య అకాడమీ డా॥ కులశేఖరరావుగారికి కృతజ్ఞతలు తెలుపుకుంటున్నది.

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

27.1.1980

# జైమిని భారతము

# విషయానుక్రమణిక

## ద్వితీయాశ్వాసము ... 41

## తృతీయాశ్వాసము ... 83



## చతుర్థాశ్వాసము ... 120

## పంచమాశ్వాసము ... 168

# ఉపోద్ఘాతము

ఆంధ్ర వాఙ్మయమున ఆది కావ్యము వెలువడిన నాటినుండి, ఆంధ్ర కావ్య కర్తలు పౌరాణిక గ్రంథములపైననే అభిమానము వహించుచు వచ్చిరి. దీనికి కారణములేవైనను, క్రీ. శ. 16వ శతాబ్దమున ప్రబంధ ప్రక్రియ తెలుగు సాహిత్యమున వెలువడు వరకు, రచయితలలో ఒకరిద్దరు తప్ప, మిగిలిన వారు పురాణములనే ఆలంబనముగా జేసికొని కావ్యరచన చేసిరి. ఆంధ్ర మహా భారతము వంటి చంపూ కావ్యములును, నిర్వచనోత్తర రామాయణము వంటి పద్యైక గ్రంథములును, పౌరాణిక కథేతిహాసములపై నాధారపడియున్నవే కదా !

ఆంధ్రులకు గల పౌరాణికాభిమానము పద్య కావ్యములతో, చంపూ గ్రంథ ములతో మాత్రమే తీరిపోలేదు. స్వతంత్రములుగాను, చాల భాగము కల్పితములు గానున్న ప్రబంధముల రచన కొంతవరకు తగ్గిపోగా, అనంతర ప్రబంధ యుగమున వచన రచనము వ్యాప్తిలోనికి వచ్చినది. అప్పుడు మన రచయితలకు తిరిగి పౌరాణిక దృష్టి యేర్పడినది. అందుచేతనే దాక్షిణాత్యయుగమున పురాణ కథాన్విత వచన రచనలు విరివిగా బయలుదేరినవి. పౌరాణిక రచనపై యభి మానము చేతనే కాబోలు, సింహగిరి వచనముల వంటి వచనైక రచనల నధి కముగా నభిమానించినవారుగాని, అనుసరించినవారుగాని, కానరారు. అందుచేతనే స్తుతి వచనముల సంఖ్య పురాణముల కంటె స్వల్పముగా కాన్పించును.

క్రీ. శ. 15వ శతాబ్దమున సన్నగిల్లిన పురాణ రచనము అనంతర ప్రబంధ యుగమున వచన రచనముతోబాటు తిరిగి విజృంభించుట కేమి కారణమో యోచింప వలసిన యవసరమున్నది.

తెలుగు వచనములో రచింపబడిన పురాణములలో అధికము దక్షిణ దేశముననే రచితములైనవి. దానికి చారిత్రక కారణములు కాన్పించును. విజయ నగర రాజ్య పతనము తరువాత, తంజావూరు, మధుర, పుదుకోట మొదలగు దాక్షిణాత్యప్రాంతములందు తెలుగు రాజ్యము లేర్పడినవి. ఆ ప్రాంతములందలి

స్థానికభాష తెలుగు కాదు. అయినను, చాలమంది ఆంధ్రులు, రచయితలు, సాహి
త్యాభిమానులు ఆ ప్రాంతములకు వెడలియుండిరి. వారు రాజకీయకారణముల
చేత చాల కాలమచటనే నివసించిరికూడ. అట్లు వారు తమప్రాంతమును వదలి
వేరొక ప్రాంతమున నుండుటచేత, నాతి కఠినమైన సాహిత్య మవసరమైనది.
వారికి కఠినములును, దీర్ఘములును నగు గ్రంథములు కాక, సరళము
లును సంక్షిప్తములును నగు రచనల యావశ్యక మేర్పడినది. తత్పరిణామముగా,
ఆంధ్రభాషలో పెక్కు పురాణములు వ్రాసికొనిరి. ఇందే భారతముగాని
నన్నయాదులు వ్రాసిన మహా భారతము వలె దైర్ఘ్యమును గాని, ప్రౌఢత్వమును
కాని కలిగియుండవు. ఏ రామాయణము గాని, భాస్కరాదుల రామాయ
ణమునకు సమానముగా నుండవు. సరళమైన వచనమున సంక్షిప్తముగా
నుండుటయే వీని ప్రధాన లక్షణము.

దక్షిణదేశీయాంధ్రులు పురాణముల నభిమానించుటకు వేరొక కారణము
కూడ నుండును. వీరికి మన దేశమున అనాదిగా వచ్చుచున్న వైదిక సిద్ధాం
తముల మీద అచంచల విశ్వాసమే ఆ కారణము. పురాణములన్నియు యజ్ఞ
యాగాది వైదిక కర్మలను, వాని మహత్త్వమును బోధించును. త్రిమూర్త్యాత్మక
శక్తులను ప్రదర్శించును. వాని ఐక్యతను నిరూపించును. అట్టి పురాణములను
రచించి శైవ వైష్ణవములనెడు వేరుపాటు ధోరణులను నిర్మూలించి, వానిని
సమన్వయ పరచుట యీ రచయితల ధ్యేయమై యుండును.

ప్రబంధ నిర్మాణము ఆంధ్ర సాహిత్యమున నెలకొన్న తరువాత,
ప్రారంభ దశలోనిమాట యెటులున్నను, క్రమముగా వీనిలో వైవిధ్యరాహిత్యము,
అసభ్య శృంగార ప్రదర్శనము, కఠినశైలీ ఆలంబనము వంటి దోషములు
చోటు చేసికొనుచు వచ్చినవి. ఇటువంటి సాహిత్యము సమాజమునకు మేలు
చేయకపోగా, కీడును కలిగించకపోవు, అని ఆ నాటివారు గుర్తించిరి. పరో
క్షముగా నీతిబోధచేయు పురాణములు, రసవంతములై, సంస్కార సామర్థ్యములై
యుండునని వీరు భావించి పురాణ రచనమును గావించి యుందురు. ఇది
మరియొక కారణమగు చున్నది,

ప్రబంధ రచనా ప్రారంభకులగు పెద్దనాదులు, వైవిధ్యమునకో,
రసపుష్టి కొరకో, కొంత పటుతరమైన శైలి నవలంబించగా, తరువాతి ప్రబంధ

రచయితలు ఆ శైలిని క్లిష్టతరముగా మార్చి, శబ్దాలంకారాదుల చేతను, ఓజోగుణము చేతను కఠిన తమములుగా జేసిరి. పాండిత్యస్ఫోరకములైన యిట్టి రచనలు దేశాంతరమున నున్న యాంధ్రులకెట్లు రుచించును ? అందుచేతనే వారు శైలీ సారళ్యమును కాంక్షించి, తెలుగు వచనమున పురాణ రచనమునకు పూనుకొనిరి.

ఈ విధముగా పురాణసన్నిభమైన జైమిని భారతము తెలుగులో వచన కావ్యముగా అవతరించు వాతావరణ మావిష్కృతమైనది.

## జైమిని భారతము-సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు

దక్షిణ భారతదేశములో వెలువడిన గ్రంథములలో జైమిని భారతము ప్రశస్తమైనది. దీనిని సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు వచన కావ్యముగా రచించినాడు. ఈతని తండ్రి మీనాక్షి నాయకుడు. తల్లి అలిమేలక్క. ఈ కవి జైమిని భారతమునేకాక, సారంగధరచరిత్రమను మూడాశ్వాసముల వచన గ్రంథమును, అహల్యాసంక్రందనమను మూడాశ్వాసముల శృంగార ప్రబంధమును, రాధికాస్వాంతన మనెడి యేకాశ్వాస శృంగార ప్రబంధమును కూడ రచించి నట్లు తెలియ వచ్చుచున్నది. * మధురానగరము రాజధానిగా, విజయరంగ చొక్కనాథుడు పాండ్యమండలమును క్రీ. శ. 1704 నుండి 1731 సం॥వరకు పరిపాలించెను. జైమిని భారత కర్త అతనికి సమకాలికుడు. ఇతడు విజయరంగ చొక్కనాథునికంటె వయస్సులో కొంత పెద్దవాడుగా నున్నట్లున్నది. మొత్తము మీద క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్ది ప్రథమ పాదమున వెలువడినదీగ్రంథము.

దక్షిణ దేశమున వెలువడిన ఆంధ్రవచన కావ్యములలో ప్రముఖమైనది జైమిని భారతము. విజయరంగ చొక్కనాథుడు దీని కృతిపతి. విజయరంగ చొక్కనాథుడు స్వయముగా రచయిత. ఈతడు శ్రీరంగ మాహాత్మ్యమును వచన

---

* జైమిని భారతము - కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు ప్రచురణ-పీఠిక.

కావ్యమును రచించియుండెను. మాఘమాహాత్మ్యమను వచన గ్రంథమును కూడ ఇతడే రచించెను.[1] అంతేకాదు, శ్రీకృష్ణ దేవరాయలవలె, రఘునాథరాయలవలె ఇతడు కవి పండిత పోషకుడు. అందుచేతనే యీతడు వేంకట కృష్ణప్ప నాయకుని ప్రోత్సహించి జైమిని భారతమును రచింపచేసెను. జైమిని భారతము ఈ ప్రధానునకే యంకితమైనది. మనుమసిద్ధి యాస్థానమున తిక్కనవలె, విజయ రంగని యాస్థానమున కృష్ణప్పనాయకుడు ముఖ్యసామాజికుడుగా నుండెనట. ఇతడు ఆస్థాన కవి కూడ.[2]

ముఖ్య సామాజికుడనగా ముఖ్యమంత్రియని శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు వ్రాసియున్నారు.[3] ఇది కొంతవరకు సమర్థనీయముగానే యున్నది. జైమిని భారతము నందలి యీ ఆశ్వాసాంత గద్య మీ అభిప్రాయమునకు బలమును కలిగించుచున్నది:

''ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగ మాందోళికా ప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధమాన సముఖ మీనాక్షీ నాయక తనూభవ మీనాక్షీదేవి కటాక్ష లబ్ధ కవితాసాంప్రదాయ వేంకట కృష్ణప్పనాయక ప్రణీతంబైన జైమిని భారతంబను అశ్వమేధ పర్వంబను వచన కావ్యంబునందు ప్రథమాశ్వాసము.''

ఈ గద్యమునుబట్టి యీతడు కేవలాస్థాన కవిమాత్రుడే కాదనియు, రాజ్యమున ప్రముఖుడే యనియు నిరూపితమగుచున్నది.

సంస్కృతమున జైమిని భారతమని ప్రఖ్యాతినందిన యశ్వమేధ పర్వము ననుసరించియు, నాంధ్రమున పిల్లలమర్రి పినవీరభద్రుడు రచించిన జైమిని

---

1. ఆంధ్ర వచన వాఙ్మయము - పుట 532.
2. దక్షిణ దేశీయాంధ్ర వాఙ్మయము - శ్రీ నిడదవోలు వెంకటరావు - పుట 333.
3. జైమిని భారతము - ఆంధ్ర సాహిత్య పరిషత్ప్రచురణ - పీఠిక.

భారతమను చంపూ కావ్యమును దృష్టియందుంచుకొనియు, వేంకట కృష్ణప్ప నాయకుడు దీనిని రచించి యున్నాడు.

సంస్కృతమున జైమిని భారతము అను పేరుతో నొక గ్రంథముండినట్లు, అందు అశ్వమేధ పర్వమొకటి మాత్రమే మిగిలినట్లు. తక్కిన పర్వములన్నియు నశించినట్లును, అందుకే దానికి జైమినిభారతమని పేరు వచ్చినట్లుగను కొందరు భావింతురు. కాని యిది సరిగా కాన్పించదు. సంస్కృతగ్రంథమును అనుసరించి తెనుగున వ్రాసిన పిన వీరభద్రుడు కాని, వేంకట కృష్ణప్ప నాయకుడు కాని, అశ్వమేధ పర్వము భారతమున శేషగ్రంథమని యెచ్చటను చెప్పి యుండ లేదు. మహాభారతములో లేని కొన్ని విశేషాంశములను చెప్పదలచిన వ్యాసుని శిష్యుడు జైమిని, వ్యాసుని యశ్వమేధ పర్వమునకు భిన్నముగానుండునట్లు ఈ యశ్వమేధ పర్వమును రచించియుండునని కొందరి యభిప్రాయము. అదియే జైమిని భారతమని ప్రఖ్యాతిని పొందెను. ఈ గ్రంథము భాగవత సంప్రదాయములు, వైష్ణవ మతము వ్యాపించిన తరువాత రచితమైయుండు ననువారును కలరు. ఇందలి సత్యాసత్యములెట్లున్నను, జైమిని భారతమున విష్ణుమూర్తి అవతారమగు శ్రీకృష్ణుని మహత్త్వమధికముగా వర్ణితమగుట యథార్థము.

సముఖము వేంకట కృష్ణప్ప నాయకు డీ భారతమును వచనముగా వ్రాయునప్పుడు సంస్కృతములోనున్న గ్రంథమును, తనకు ముందుగా ఆంధ్రమున రచితమైన పిల్లలమర్రి పిన వీరన గ్రంథమును చూచియున్నాడు. వానిని అనుసరించియే దీనిని వచన కావ్యముగా రూపొందించెను.

జైమిని భారతము ఐదాశ్వాసముల వచన కావ్యము. ఈ కావ్యములో వేంకట కృష్ణప్ప నాయకుడు వస్తువునకు, రచనకు సంబంధించిన యనేకాంశములను సందర్భోచితముగా పొందు పరచి యున్నాడు. వానిని క్రమముగా నింక పరిశీలింతము.

అశ్వమేధ పర్వము పంచమ వేదమని ప్రఖ్యాతి వహించిన మహా భారతమున నొక భాగము. అందుచేత, దానిలోని యితర పర్వము లందున్నట్లుగానే, వైదికములైన ధర్మవిశేషము, యజ్ఞయాగాది కర్మల ప్రశంస, వర్ణాశ్రమ ధర్మ ప్రతిపాదనము మున్నగు విశేషములుల్లేఖింపబడియున్నవి. మహా భారతమున

రెండు యాగముల ప్రాముఖ్యము విశేషముగా నుండును. భారత యుద్ధమునకు పూర్వము యుధిష్ఠిరుడు నిర్వహించిన రాజసూయ మొకటి. యుద్ధానంతర మతడే చేసిన అశ్వమేధ మొకటి. ఈ రెండింటిలో జైమిని భారతము రెండవ దాని ప్రాముఖ్యమును వివరించుచున్నది. సముఖము వేంకట కృష్ణప్ప నాయకునకును వైదిక ధర్మములపై నభిమానముండుటచే, వచన జైమిని భారతమున చాలచోట్ల వైదిక సంప్రదాయ సంబంధములైన విశేషములను ప్రవేశపెట్టి యున్నాడు. కొన్నింటిని ఉదాహరింతును:

"కులంబు ద్రుంచుటయు, గురువుల యెడఁ గల్ల లాడుటయుంగాక బ్రాహ్మణద్రవ్యం బపహరించితియేని పాతకంబునకుం గొఱంతయేమి?"

"విప్రులకు మోవందరంబు గాకఁ బరిత్యజించిన ధనంబు రాజులకుం గాని తక్కిన వారలకుఁ బనిలేదు."

పురాణములన్నియు లోకమునకు నీతిని, హితమును అందజేయవలసిన ధ్యేయమును కలిగి యుండును. జైమిని భారతము కూడ పౌరాణిక గ్రంథమే యగుటచేత, అనేక సందర్భములందు దీనిలో నీతి, హితము కనిపించునే యున్నవి. ఈ వాక్యములు చూడదగినవి:

"నీవు ధర్మజు నశ్వమేధాధ్వరంబు నవలోకింపఁబూను నప్పుడు హరికథా విముఖుండును, నన్యాయవర్తనుండును, ధర్మార్థరహితుండును, దపో వర్జితుండును, మిత్రవంచకుండు, స్వామిద్రోహి, పతితుండుఁ, బందయుఁ బరదారనిరతుండు, నల్లుని సొమ్ము భక్షించు నధముండు, ధర్మబాహ్యుండు, విదూషకుండు, దుర్వ్యసనాసక్తుండు, బహుభాషియు, విశ్వాస పాతకియు, ఋతుకాల పరిత్యాగియుఁ గష్టలోభియు ఖలుండు, నాత్మస్తోత్ర పరుండు గలహ శీలుండును, గృతఘ్నుండును, భృత్య వంచకుండును, క్షేత్ర విత్తాపహారకుండును నగువారలఁ దోడుకొని పోవలదు."

ఈ హితమును వసుదేవుడు వాసుదేవునకుబోధించినట్లు కథాసందర్భము నందున్నది. కాని, ఇట్టి హితము సర్వకాలములందు, అందరు పెద్దలు అందరు పిన్నలకు బోధించునట్టిదే. ఒక్కొక్కచో నా కాలమునందలి జనులకు గల

యభిప్రాయము హితరూపమున కావ్యములందు వ్యక్తమగుచుండును. ఇట్టి నీతి బోధక వాక్యములు చిన్నవియు, పెద్దవియునై గ్రంథము నందంతటను నున్నవి. ఒకటి మాత్రమే ఉదాహరించితిని.

పురాణములందు, ఇతిహాసములందు, విభిన్న రసములకు సందర్భమును బట్టి యవకాశమేర్పడుచుండును. జైమిని భారతమునందును, ప్రధానములైన వీర శృంగార భయానక రసములు కాన్పించుచున్నవి. వేంకటకృష్ణప్పనాయకు డీరసములను సమర్థతతో పోషించియున్నాడు. ఈ రచయిత హాస్యరసమును కూడ సందర్భానుసారముగా చక్కగా నిర్వహించెను. ఈ వాక్యములు చూడుడు. శ్రీకృష్ణుడు భీమునితో నిట్లనెను:

''వృకోదరా, నీకు బుద్ధి మందంబు. ఆహారం బపారంబు. పొట్ట రెట్టించుచున్నది. రక్కసి రతులం జొక్కినవాఁడవు. మాటల పోఁబడి యెఱుఁగవు. నీవంటి వాఁడు మంత్రియైయున్నఁ గార్యంబు లగుటకు సందియంబేమి?''

నిజమున కిది నిందకాదు. అపహాస్యము చేసి అవమానించుట కాదు. మఱదియగు భీమునితో బావయగు శ్రీకృష్ణుడు చేయు హాస్య ప్రసంగమే. బావమఱదుల హాస్యము మన దేశమున ప్రసిద్ధ సంప్రదాయము కదా!

ఇట్లే మరియొకచో శ్రీకృష్ణుడు భీమునితో పలికినట్లున్నది. 'బావా! నీ భావంబున నున్న కార్యంబులన్నియుఁ, గుశల ప్రశ్నంబును వెనుక నొడువుదువు. ఇంతియేకాని, మున్నుగా బుద్ధిమత్కృత్యంబగు భోజనంబు నాకంఠపూర్తిగావింపుము. అట్లుగాక నీకెద్దియుం దోచదు. నా పలుకులకు శంక వలదు. నీ కరణి బహు భక్షకులగు నగస్త్య కుంభకర్ణాదులు కొందరు గలరు. నీ వేమిటికి సిగ్గు పడియెదవు?''

ఇదియు పైనుదాహరించినదే, ఈ మాటలు విని భీముడును బావగారికి సముచితముగానే సమాధానము చెప్పినాడు.

జైమిని భారత కర్త, హాస్యరసభరితములైన వాక్యములు వ్రాసినట్లుగానే అధిక్షేపముతో గూడిన వ్యంగ్య గర్భితములగు భాగములు వ్రాయుటయందును

నేర్పరియే. ముఖ్యముగా శ్రీకృష్ణుని యౌన్నత్యమును నిరూపించుట కాతడు ప్రయత్నము చేయుచుండును. భీముడు శ్రీకృష్ణునితో పలికి యీ వాక్యములను తిలకించుడు.

"నీ కామాతురత్వంబునకు గొల్ల యిల్లాండ్ర గుబ్బపాలిండ్లు సాక్షి. నీచ స్త్రీ సంగంబునకు నీదు మత్స్య కూర్మ వరాహావతారంబులు సాక్షి. బహు భక్షకుండవగుటకు బ్రహ్మాండకోటి పరిపూరితంబైన నీ కుక్షి సాక్షి. నీ స్త్రీలోలత్వంబునకు సత్యభామా నిమిత్తంబుగా భూమికిందెచ్చిన పారిజాతంబు సాక్షి. నీదు మాయా చరితంబులు ప్రకటింప నెవ్వరి తరము ?"

స్వాహాదేవిం జూచి యామె చెలికత్తెలు పలుకు సందర్భమునను నిట్టి భావమే సూచితమైనది. శ్రీకృష్ణునికి సంబంధించిన పైనుదాహృత వాక్యములందు పైకి నిందలు కాన్పించినను, వ్యంగ్యముగా నాతని యాధిక్యమే వ్యక్తమైనది.

జైమిని భారతము ఇతిహాసమువంటి గ్రంథ మగుటచేత, మహా భారతము నందువలెనే యిందును, ప్రధానమైన పాండవుల యశ్వమేధవృత్తాంతమేకాక, అచ్చటచ్చట ఉపాఖ్యానములనబడు కథలు వచ్చు చుండును. ప్రధాన కథను చెప్పుట యందీ రచయితకెంత నేర్పుకలదో, ఉపాఖ్యాన రచనమునందు కూడ నంతటి నైపుణి యున్నది. మహా భారతమునందున్న ఉపాఖ్యానములు కొన్ని స్వతంత్రములుగా నుండును. మరికొన్ని ప్రధాన కథకు పూర్వరంగముగా నుండును. ఇంకకొన్ని ముఖ్యకథతో ప్రత్యక్ష సంబంధమును కలిగియుండగా, వేరొకకొన్ని పరోక్షసంబంధమును వహించును. కాని, జైమిని భారతములోని ఉపకథలు వేనికవే స్వతంత్రములుగా నున్నవి. ప్రధాన కథతో వాని సంబంధము నామ మాత్రమే. అగ్నిహోత్రుని కథ, ఉద్దాలక మహర్షి కథ, స్త్రీమండల వృత్తాంతమను ప్రమీల కథ, కుశలవోపాఖ్యానము మున్నగునవి యిందులకు నిదర్శనములు కాగలవు.

జైమిని భారతము విష్ణుపారమ్యమును బోధించు గ్రంథమని యిదివరకు చెప్పితిని. విష్ణుమహత్త్వమును బోధించు ఆంధ్ర మహాభాగవతాది గ్రంథములందు ఆ రచయితలు విష్ణుపరములైన స్తుతి వచనములను రచించియున్నారు. శ్రీరామానుజుల గద్యత్రయ సంప్రదాయమును ననుసరించిన సింహగిరి వచనములు,

వేంకటేశ్వర వచనములు కూడ తెలుగులో స్వతంత్రముగా వెలువడినవి. ఈ సంప్రదాయము తెలిసిన వేంకట కృష్ణప్ప నాయకుడు తన వచన కావ్యమున విష్ణు పరములైన యిట్టి వచనములనే వ్రాసియున్నాడు. ఇవి పరిశీలించుడు:

''ఆపదుద్ధారకా, ఆదిదేవా, ఆనంతా, అనంతశయనా, అంబుజనాభా, అచ్యుతా, హరీ, శ్రీకృష్ణా, నిన్ను నమ్మినవాడ! లక్కయింటం జిక్కువడకుండఁ, గౌరవ సభా స్థలంబున ద్రౌపదికి మాన భంగంబు గాకుండ, నడవుల నిడుమలం బడునప్పు డాపదలం బొరయకుండ, సైంధవ వధంబున ప్రతిజ్ఞా భంగంబు గాకుండ రక్షించి, సకల సంకటంబుల నెడఁబాపితివి. త్రిలోకాధ్యక్షా, పంకజాక్షా, ఇప్పుడీ సంకటంబు తొలగించి రక్షింపవే!''

కథా సందర్భము ననుసరించి అర్జునుడు శ్రీకృష్ణుని వేడుకొనుచు పలికి నట్లున్న యీ వచనము, ఏ భక్తుడును, తన యిష్టదైవమైన విష్ణుమూర్తిని స్తుతి చేసినట్లుగానే యుండుట యిందలి విశేషము.

''గజేంద్రవరదా, గరుడవాహనా, నీరజాక్షా, నిఖిల లోకాధ్యక్షా, దేవకీ నందనా, దీనజనాభినందనా, నారాయణా, భక్తత్రాణపరాయణా,నమో, నమో!''

సింహగిరి వచనముల కెంత సన్నిహితముగా నున్నదో యీ స్తుతివచనము నేను చెప్ప పనిలేదు. వచన కావ్యమునందు స్వతంత్ర ప్రతిపత్తి గల యిట్టి స్తుతివచనములు వ్రాయుటయందు ప్రథముడు వేంకట కృష్ణప్ప నాయకుడే. వీనిలో తనకుగల విష్ణుభక్తిని చక్కగా వ్యక్తము చేసినాడు.

ఇంతవరకు జైమిని భారతమునందలి వస్తువునకు సంబంధించిన విశేషము లను కనుగొంటిమి. ఇంక రచనా సంబంధములైన యంశములను పరిశీ లింతము.

జైమిని భారతమున ప్రారంభమున నుండు అవతారిక భాగము లేదు. దాని యందు పద్యములే యుండి యుండును. ద్వితీయాశ్వాసమునుండి, పంచమాశ్వా సము వరకు, ఆశ్వాసారంభములందు పద్యములే యున్నవి. ఇవి చొక్కనాథుని, - కృతిపతిని - సంబోధించు పద్యములు. ఈ పద్యములను చదివినప్పుడు ఈ

రచయితకు పద్యరచనయందును నేర్పుండెననియే చెప్పవలసి యుండును. ప్రారంభ పద్యము తరువాత "అభ్యుదయ పరంపరాభి వృద్ధిగా నారచింపం బూనిన జైమిని భారతంబునం దశ్వమేధ పర్వ వచన కావ్యంబునకు కథాక్రమం బెట్టిదనిన" అను ఉపక్రమణ వచనముండును. ఇట్టి వచనము నన్నయ్యగారి ఆంధ్ర మహాభారతము మొదలుకొని, తరువాతి అన్ని తెలుగు కావ్యములందును కాననగును. వచనమునందిట్టి ఉపక్రమణము ఆంధ్ర కావ్యరచనమున కాక సంప్రదాయముగా నిలిచినది. అట్టి సంప్రదాయమునే వేంకట కృష్ణప్ప నాయకుడును పాటించినాడు.

క్రీ. శ. పదునారవ శతాబ్దమునుండి తెలుగులో వెలువడిన ప్రబంధములందు వర్ణనములకు ప్రధాన స్థానము లభించినది. వానికి సంఖ్యానియమము కూడ నేర్పడినట్లు చెప్పుదురు. జైమిని భారతము ఐతిహాసిక పురాణమే యైనను తనకు పూర్వము వెలువడిన ప్రబంధముల ప్రభావమునకు లోనుగాక పోలేదు. ఈ కావ్యములో ప్రబంధములందున్నంతటి దీర్ఘవర్ణనములు లేవు కాని, సమయోచితముగా నచ్చటచ్చట వర్ణనములున్నవి. ఈ వర్ణనములు నిశ్చలములని చలనాత్మకములని రెండు విధములు గదా! వేంకట కృష్ణప్ప నాయకుడు ఈ రెండు విధముల వర్ణములు కూడ వ్రాసి, వర్ణించుటయందు తనకు గల ప్రాభవమును ప్రదర్శించుకొనెను. ఒక్కొక్క దానికి ఒక్కొక్క ఉదాహరణమును చూపింతును.

"లెక్కింపరాని సేనలు క్రిక్కిరిసి నలుదిక్కులం గొలువ, వంది మాగధ బృందంబులు బిరుదావళులు వంశావళులు సదువ, భేకులు, దమామలు, డక్కలు పలడుక్కలు దమ్మెటలు, గుమ్మెటలు, మురజమ్ములు, నరగజమ్ములు, కాహళంబులు, జయదోహలంబులైన శంఖంబులు, నసంఖ్యంబులుగా మొరయ, కదళికా స్తంభంబులు, పోఁకమ్రాఁకులు, చూతపల్లవ సముల్లసిత తోరణంబులు, కాలాగురు సాంబ్రాణికా ధూపంబులు మొదలైన యలంకారంబులంబొలుపారు, గోపురద్వారంబులు సొచ్చి యచ్చటచ్చట బచ్చవిలుకాని తేజీహనలంబోని చానల వలకారి చూపులనియెడి వలలందగిలి యట్టిట్టుగదలనేరక పిట్టల చందంబున జిట్టకంబునం బొదలు చిట్టవిటులచేత హరువులైన నెటితెరువులును, మొత్తంబులైన ముత్తియంబులు, సొంపులైన కెంపులు, పచ్చికలందచ్చనలాడు పచ్చలు, నిగరాల

మగణాలును, జగడంబులైన పగడంబులను, ముంగిళ్ళనత్త మిల్లిన యంగళ్ళను నిచిన మంగళద్రవ్యంబులును, నంతరిక్షంబునఁగాంతులు వింతలు పొంతలు సంచరించు వైజయంతికలును, భూసురాశీర్వాద పురస్సరంబుగ సువాసినీజనంబులు చల్లు తెల్లని పూవుల నక్షతలం దేజరిల్లు రాజమార్గంబునంజని ...... ''

''అప్పుడు కుశుండు సింహనాదంబుసేసి లక్ష్మణునెదుర్కొనిన నతండైదు తూపులచేఁ బేరురంబు వ్రక్కలించిన, సుక్కక యక్కుమారుండు వాయవ్యాస్త్రంబు సంధించి నిలునిలుమని యదల్చి యేయుటయు, లక్ష్మణుని యరదంబు సుడిగాలిలోనం దవిలి కుమ్మరసారెగతి ముహూర్త మాత్రంబు తిరుగుచుండఁ దద్వేగంబున నాలుగు రథ్యంబులు నాలుగు దిక్కులంబడి పంచత్వంబు నొందిన లక్ష్మణుడు వేఱొక్క తేరెక్కి కక్కసంబులైన యక్కుటమ్ములైదు ప్రయోగించి, కుశుని కవచంబును, గిరీటంబును దునుముటయుఁ గుబుసంబు వీడిన నాగేంద్రుని తెఱంగున మెఱయుచు, లక్ష్మణునుద్దేశించి, 'రిత్తమోపుగానున్న కిరీట కవచంబులు తీయించి, భారంబు మాన్పిన నీవు పరమోపకారివి. నీసైన్య భారంబంతయు బోవంజేసి ప్రత్యుపకారంబు సేసెద'నని పలుకుచు నాధర్వణ శిరోమంత్రంబుల నాగ్నేయాస్త్రంబు నభిమంత్రించి ప్రయోగించుటయు, దగ్ధంబులైన రథంబులును, మండెడు నేనుంగులును, గాలెడు తురంగంబులును, నివులులైన పదాతి వర్గంబులును, బొగలతోడఁగలసి యెగసిన ఛత్ర చామరాభరణంబులునుం గలిగి చమూసమూహంబులు దావానలంబు దవిలిన మెకంబుల రకంబున నలుదిక్కులం జరించుటయు, దాశరథి వారుణాస్త్రంబున నివారణంబొనరించినం, గుశుండు వాయవ్యాస్త్రంబు వింటనొంటించి చాపవిద్యాకౌశలంబు మెరయ వేయుటయుఁ జండమారుత వేగంబునఁ బండుటాకు లెగయు వడువున నాయోధనంబునం గల యోధవరులాకసంబున కెగసి వీరలక్ష్మి విహరించు మణిమండపంబునకు మంజిష్ఠపట్టు మేలుకట్టు తెఱంగునం గనుపట్టుటయు, సేనల దురవస్థగనుంగొని సేనాధీశ్వరుండగు కాలజిత్తు కుఱుచ కనుపులు కొరికొలచేఁ గుశునురంబు నాటించి, నవ్వుచు ''నా బల పరాక్రమంబు లెఱుంగవు. బాలుండవు. నీకేల యాలంబు తొలంగు'' మని పలుకునంతలోఁ గుశుం డలుక దొలుక నొక్క వాలిక తూపుచే వాని నాలుకద్రుంచి తోడన మహోగ్ర నారాచంబున శరీరంబు ఖండించె.''

పురవన సౌధములిత్యాదుల వర్ణనములు నిశ్చలములును, యుద్ధ వర్ణనములు చలనాత్మకములుగను నుండును. విజయరంగ చొక్కనాథుని మంత్రి

మగు వేంకట కృష్ణప్పనాయకుడెన్నియో యుద్ధములు చేసియు, చూసియు నుండ వచ్చును. అందుచేతనే దీనిలోని యుద్ధవర్ణనములు చైతన్యవంతములై వీర రసోద్దీపకములుగా నున్నవి.

అలంకార ప్రయోగము చేయునప్పుడు, మహా భారత కవులైన తిక్కనాదులు కాని, తరువాత వచ్చిన ప్రబంధ కవులైన పెద్దనాదులుగాని, వచన పద్యభేదమంతగా పాటించి యుండలేదు. వారికి ఔచిత్యమని తోచినప్పుడు పద్యములందును, వచనములందును అలంకారముల నుపయోగించిరి. అయిన, ప్రబంధ కవులు అలంకారములను విరివిగా ప్రయోగించియున్నారు. అనంతర ప్రబంధ యుగమున నివసించిన వేంకట కృష్ణప్ప నాయకుడు పురాణకవులను, ప్రబంధకవులను అనుసరించి సముచిత రీతిని అలంకార ప్రయోగము గావించి యున్నాడు. ఈతడుపయోగించిన అలంకారములందు ఉపమారూపకములు హెచ్చుగాను, అతిశయోక్తి ఉత్ప్రేక్షమున్నగునవి తక్కువగాను నుండును. అనగా తాను రచించినది భారత మగుటచే, తిక్కనాదుల మార్గమునే అనుగమించె ననవలసి యున్నది. ఇది సమంజసమే. ఈతని అలంకార ప్రయోగమునకు కొన్ని వాక్యము లుదాహరింతును.

"గంగా తీరంబునఁ జేరిన జనుల పాతకంబులుం బలె, లలాటలోచనుండాసిన కాలకూటంబు కరణి, శ్రీవాసుదేవ పాదారవిందచింతనంబు వలన మానవుని జన్మంబువలె, గయావర్జనంబు సేసినవాని పితృ వర్గంబుల దుర్గతిం బలె, నిమిష మాత్రంబులో నీ గదాఘాతంబున యౌవనాశ్వుని సైన్యంబు లయంబు నొందు"

"గజగమనంబులనియెడి గమనవిలాసంబును, బాశంబులనియెడి భుజంబులును, జక్రంబులనియెడి స్తనంబులు, శంఖంబులనియెడి కంఠంబులును గలిగిన శత్రుసేనా రమణిని నేను వరించినాఁడ"

"కెంధూళి యనియెడి కుంకుమ రసంబు నలంది, సింగిణి విండ్లను కనుబొమ్మలల్లార్చుచు, మెఱుంగుఁచూపులను దూపులఁ దళుకొత్తుచుఁ గరికుంభంబుల నొఱపు మిగిలిన వైరి సేనయనుచాన,"

శబ్దాలంకారములలో యమకము, అనుప్రాసము చాల చోటులందు కనిపించుచున్నవి. అందును, ప్రబంధ కవులవలె నీతడు అత్యాదరమును ప్రకటించి యుండలేదు.

వేంకట కృష్ణప్పనాయకుడు ఆంధ్రేతర ప్రాంతమున నివసించిన ఆంధ్రుడే యైనను, నీతనికి తెలుగు భాషలోని సహజత్వము, నుడికారము, మాధుర్యము చాల చక్కగా తెలియును. తెలుగు భాషకు జీవ ప్రాయములనదగిన జాతీయములు సామెతలు, ఈతని కావ్యమున నవకాశమున్న చోటులందు చక్కగా నుపయోగింపబడి యున్నవి. దిఙ్మాత్రముగా కొన్నింటిని ఉదాహరింతును.

''గొప్పతాయి దెప్పగా పైచికొని సముద్రము నీఁదఁ దలంచిన చందంబున''

''పోతుటీగ కేనియు బొలయఁ గూడదు''
''పాతెడు బండ్లకుఁ బాదంబులు సాఁచుమనియెదు.''

వచనమును హృద్యమైన శైలిలో రచించుట యందీతడు నిపుణుడు. రసానుగుణముగ ఉత్తమ భావమును వెలువరించునటుల సమానాంతర వాక్యములు వ్రాసి, పాఠకుని మనస్సునాకట్టు కొనుచుండును. ఇది చూడదగినది.

''ముకుందా, నందనందనా, అరవిందనయనా, ఇంద్రాది వందితా, భవదీయ పాదారవిందంబులు దర్శింపఁ గంటిఁ గావున నా జీవనంబు సఫలంబు. భవదీయ భక్తులైన భీమ వృషకేతు మేఘవర్ణులు మెట్టిరిగావున మా పురంబు సిరులకుం గాపురంబు. ధర్మజుని జన్నంబున కొదవెం గావున నీ తురంగంబును జనహృదయంగమమంబు. ఇన్నిటికి శేఖరంబుగ నీకు జోడు కోడె యైన యర్జునిం జూడ గలిగె.''

ఇట్టి మనోహర వాక్య విన్యాసము ఈ గ్రంథమునందు చాల చోట్లఁ గలదు. పురాణ, ఇతిహాస లక్షణములు కలిగిన జైమిని భారతమున నాడంబరమైన శైలికాక సరళముగా నుండు శైలినే యభిమానించినాడు కర్త. తేలిక పదములతో నుండి చూర్ణమనదగిన దీతని వచన రచనము. అయినను, కొన్ని చోట్ల

మాత్రము రసౌచిత్యము కొరకు కాబోలు, ప్రౌఢ సమాసాన్వితమైన వచనమును గూడ వ్రాసి యున్నాడు. కాని దీని పరిమాణము స్వల్పమే. ఉత్కలికాప్రాయ మనదగిన యిట్టి వచనరచనము తిక్కనాదుల కావ్యములందచ్చటచ్చట కాన్పించు నట్టిదే. ఒకటిమాత్ర ముదాహరింతును.

"అనిల సుతునకు మ్రొక్కి, శస్త్రాస్త్ర భీకరంబైన వైరి సైన్య నికరంబు సొచ్చి యరుణారవింద జైత్రంబులైన నేత్రంబుల జుఱజుఱం జూచుచు, లయకాల శంకాకరంబైన శింజినీటంకారంబు దిశా విటంకంబులకు సంక్రమింపం గోపాటోపంబునఁ దత్సైనంబుం జొచ్చి మేఘవర్ణునకుం గౌతూహలంబు సంపాదింపుచు"

ఈ శాబ్దికాటోపము మహాభారతాది గ్రంథములలోని వంటిదేకాని ప్రబంధ మార్గము ననుగమనించినదికాదు.

సముఖము వేంకట కృష్ణప్ప నాయకుడు సంస్కృతమునున్న అశ్వమేధ పర్వమునే అనుసరించి యీ తెలుగు వచన కావ్యమును రచించినను, తనకు పూర్వము చంపూ కావ్యముగా నాంధ్రమున వెలువడిన పిల్లలమఱ్ఱి పినవీర భద్రుని జైమిని భారతమును చూచినట్లుగను, దానిని అనుసరించినట్లుగను నిదర్శనములు కాన్పించుచున్నవి. ఈ ఉదాహరణము లీయభిప్రాయమును స్పష్టీకరించును.

"పంక నిర్మగ్నమగు గోవుఁ బరికరించి
సుకరముగ నుద్ధరించు గోపకుని మాడ్కి
ముదముదైవార నుద్ధరింపుదువుగాక
పంక నిర్మగ్నమగు నన్ను గోపాల తిలక"

—వీరభద్రుడు.

"పంక నిర్మగ్నమైన గోపాలకు చందనంబున శోకమగ్నులమైన మమ్ము నీ వుద్ధరింపుము"–వేం. కృ. నాయకుడు.

"పుడిసెడు నీటిచే నడఁగి పోయెడు ఘూర్ణికిఁ గాలమేఘముల్
దొడరునె, చెప్పవేయఁజెడు దోమల మీద సుపర్ణుడెత్తిపోఁ

గడఁగునె, యీ సుధస్వరథిక ప్రభుఁడెన్నఁగ మీకు నీడుగాఁ
డుఁడుగుడు, సంభ్రమంబితని నోర్చెదఁదెచ్చెద నధ్వరాశ్వమున్.''
—వీరభద్రుడు.

''పుడిసెడు నీళ్ళు చల్లిన నడంగి పోయెడు ధూళికిఁ గాలమేఘంబులు వర్షింప వలెనే ? తెప్పవేసినం బడిపోవు దోమల మీఁద గరుత్మంతుండెత్తి రావలయునే ? ఈ రాజు మీకు సమానుఁడుగాఁడు. మీరీతని మీఁదఁ జేయి చేసి కొనం బనిలేదు. నేనే యాతని గెలిచి యధ్వరాశ్వంబుఁ దెచ్చెద......''
—వేం. కృ. నాయకుడు.

''కలనన్ మనవారెల్లను బొలసిరి, నీ దుర్నయమునఁ బోయిన యని పెద్దలె నాకును 'స్త్రీ బుద్ధిః ప్రలయాంతక' మనెడు పల్కు బద్ధంబగునే''
— వీరభద్రుడు.

''నీ దుర్ణయ ప్రబోధనలచే యుద్ధంబునకుం బోయిన నాకుం గలవారెల్లను సమసి పోయిరి. 'స్త్రీ బుద్ధిః ప్రలయాంతక'మనెడు పలుకే యధార్థంబయ్యె''
—వే. కృ. శా. ఇట్టివింకను చాలచోటులందు కలవు.

జైమిని భారతము నందలి రచనలోని ప్రయోగ విశేషములను గురించి దానిని పరిష్కరించి, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి యధ్వర్యమున ప్రచరించిన శ్రీ మల్లాది సూర్య నారాయణ శాస్త్రిగారు కొన్ని విశేషములను చెప్పియున్నారు. వానిని ఇచట నుటంకింతును.

''కథాసందర్భమును బట్టి కథా పాత్ర నామములకు సర్వనామ వాచక పదముః లుపయోగించుటయే సరిపోవుచుండగా, మరల మరల నాయా పాత్రల నామములనే తఱచుగా నుపయోగించుటయు, యమక వృత్త్యనుప్రాసాది శబ్దాలంకారములకై కథాప్రసక్తి కభ్యంతరముగా విశేషణ బాహుళ్యము గల్పించుటయు, గ్రంథమామూలాగ్రముగా నెఱ సున్నలేకానియర సున్నలుపయోగింపకుండుటయు, నేను అనదగిన చోట్లఁ దానసుటయు, చెప్పెను అనుచోట్లఁ 'బలుకరించె' ననుటయు నీ కావ్యంబున సర్వత్ర కనుపట్టును. కాని యిందు నేను అనుటకు బదులుగా దానని యుపయోగించిన స్థలముల నేనని సవరింపబడినవి''

ఈ సవరణలదివరకే జరిగియుండుటచేత ఈ ప్రయోగ విశేషములు ఇప్పుడు కాన్పించుట లేదు. పలుకరించు అను ప్రయోగము మాత్రము కొన్ని తావులందు కాన్పించుచున్నది.

"ఇవ్విధంబున భీమసేన పౌత్రుండు మాయాబలంబున యాతురంగంబు న పహరించుకొని పోయిన తెఱంగు హత శేషులయిన భటులు పలుకరించు టయు,..."

"సువేగుఁడు యౌవనాశ్వ భీమ సేనులకు నాయమ్మ పల్కులు పల్క రించి కొంత తడవు నవ్వించి..."

పలుకరించు అను క్రియాపదమునకు మాటాడించు అనునది సామాన్యా ర్థము. చెప్పుట అను నర్థమున నిటయుపయోగింపబడినది. ఈ క్రియకు నిట్టి యర్థము మాండలికమైయుండవచ్చును. అందుచే దీనిని దోషముగా గ్రహించక, ప్రయోగ విశేషముగానే గ్రహించుట లెస్స.

ఇన్ని గుణ విశేషములు కలిగిన జైమిని భారతమును ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ముద్రణకై గ్రహించుట ముదావహము. వారిని నేను అభినందించుచున్నాను.

సామాన్యముగా పాఠకులకు అందుబాటులో లేని యీ వచన కావ్య మును తిరిగి వెలువరించుటకు నన్ను ప్రోత్సహించిన, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి, అందును, డా. ఇరివెంటి కృష్ణమూర్తి గారికి నా కృతజ్ఞతలు.

విజ్ఞానపురి-
హైదరాబాదు,
18-10-79.

ఎం. కులశేఖరరావు.

శ్రీరస్తు

# జైమిని భారతము

## ప్రథమాశ్వాసము

## కథాప్రారంభము

అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నారచియింపంబూనిన జైమిని భారతంబునం దశ్వమేధ పర్వ వచన కావ్యమునకుఁ గథావిధానం బెట్టిదనిన: శ్రీమంతుండును, సామ్రాజ్య లక్ష్మీమఘవంతుండు నైన జనమేజయ మహీకాంతుండు, వేదవ్యాస మహామునీంద్ర శిష్యుండును, మేధాసాంద్రుండునైన జైమిని మహామునీంద్రునిం గనుంగొని, 'మహాత్మా, సకల పాపహరంబును, బవిత్రంబునైన కురుక్షేత్రంబునందు శత్రు సంహారకుండు, శరధి గంభీరుండును, గురువంశకర్తయు, ధర్మమయుండునైన పాండవాగ్రజుండు కపట వర్తనులగు ధృతరాష్ట్ర కుమారులఁ జతురంగ బల సమేతంబుగఁ బదునెనిమిది దినంబుల లోన రణాంగణంబునఁ గీటడఁగించి, చతుస్సముద్ర ముద్రితంబయిన భూమండలంబునేకచ్ఛత్రంబుగ నేలుచు,నశ్వమేధ యాగం బొనరించెనని యెఱింగించితివి. ఆ కథ సవిస్తరంబుగా నెఱింగింప వలయు'ననిన, జైమిని మునీంద్రుండు జనమేజయ నరేంద్రు నవలోకించి, 'రాజేంద్రా! భవదీయ పితామహుండైన ధర్మనందనుండు విశ్వవిఖ్యాతంబుగా నశ్వమేధంబు గావించిన క్రమంబు వివరించెద వినుము. సకలశాస్త్రపారీణుండు, సంగర ధురీణుండు, సర్వజ్ఞుండునైన భీష్ముండు, స్వర్గలోకంబున కరిగిన యనంతరంబ యుధిష్ఠిరుండు శోకవ్యాకులిత మానసుండై చింత నొందుచున్న సమయంబున:-

### -ధర్మరాజునొద్దకు వేదవ్యాసుఁడు వచ్చుట-

వేదశాస్త్ర పురాణేతిహాస విద్యా విశారదుండును, దనుజప్రభావిజిత నీరదుండును,త్రైలోక్య పూజితుండు నైన వేదవ్యాసమునీంద్రుండు విజయంబు సేయు

టియు, ధర్మనందనుం డెదుర్కొని సాష్టాంగంబుగా నమస్కరించి, యర్ఘ్య పాద్యాది పూజా విధానంబులొనరించి, కనకపీఠంబున నునిచి యిట్లనియె: 'మహాత్మా, మేము రాజ్యంబు కొఱకుఁ గ్రూరత్వంబున కొడిగట్టి పితామహుండైన భీష్ముని, ధనురాచార్యుండగు ద్రోణుని, సగ్రజుండైన కర్ణుని, వధించితిమి. ఈ పాపం బేమిటం దీఱు? అక్కటా, భూవలయంబునం గల భూసురులు మా యన్నయైన కర్ణునిచే పలసిన వస్తువ్రాతంబులు గైకొని హర్షబాష్పంబులు గురియ బహు విధంబులుగా స్తోత్రంబులు సేయుచున్న వారలంద ఱిప్పుడు శోక జనితంబైన కన్నీరు గురియ రోదనంబులు సేసెదరు.

భీష్మ ద్రోణ కర్ణాదులైన గురుజనులు చూడని రాజ్య భోగంబు కన్నులు లేని కాయంబు కరణి సౌఖ్యావహంబు గానేరదు. పిన్ననాటి నుండి మమ్ముఁ బెంచి పెద్దలఁ జేసిన భీష్మాదులం జంపి చేకొన్న రాజ్యంబు నేనొల్ల. భీమునిం బట్టంబుగట్టి, కానలకుంజని తపంబొనరించి పాపంబునం బెడఁబాసెద. మునీంద్రా, ఏతపంబుల నేజపంబుల నేతీర్థయాత్రల నేయాగంబుల జ్ఞాతి వధం బొనర్చిన పాతకంబు దీఱు? శుభంబు చేకూరు?' అనినవిని—

## -వ్యాసుఁడు ధర్మరాజు నశ్వమేధం బొనర్పుమనుట-

సాత్యవతేయుండు కౌంతేయుఁగనుంగొని, 'ధర్మనందనా, నీవు బంధు వధం బొనర్చిన పాపంబు దీఱ నశ్వమేధ యాగంబుఁ జేయుము. సుగుణ సాంద్రుండైన రామచంద్రుఁడు పులస్త్య వంశంబునం బుట్టిన రావణునిం ద్రుంచిన పాతకంబు దీఱ హయమేధంబు గావించె. సంగరంబుల వలనఁ గలుగు జయంబు క్షత్రియునకు విడువం దగదు. నీ తమ్ము లొక్కొక్కరుండుం బెక్కు సమరం బులం గెల్పులు గన్నవారలు. యాదవులందఱు నీకుం గైవసంబుగావున్నం దక్కిన తలంపులు మాని, నియమ ముద్రంబూని, యశ్వమేధంబున కారంభంబు సేయుము.' అనినవిని, ధర్మనందనుండు డెందంబున దైన్యంబు దోఁపఁ గృష్ణ ద్వైపాయనుంగనుంగొని, 'మునీంద్రా, నిన్నటి సమరంబున రాజవీరు లెల్లను సమయుటంజేసి వారల కుమారులు తల్లిదండ్రులం బెడఁబాసిన వారలు. కావున దయసేయం దగిన వారలు. తక్కిన ప్రజలందఱు సుయోధనుని కప్పంబులు లొసంగి నొచ్చి యున్నవారలు. నేను నూతనంబుగఁ బట్టంబు గట్టుకొన్నాఁడ.

కావున నిమ్మహాయాగంబొనరింప రొక్కం బెక్కడ నున్నయది? రాజవంశంబుల సమూలంబుగాఁ బెల్లగించి కులంబు నీఱు సేసిన యట్టి దోసంబునంగాక ప్రజలం నెల్లబాధించి ధనంబులు దండుగలు గొనం దలఁచితి మేని గోరుచుట్టుపై రోఁకటి పోటు చందంబున జనులు నొవ్వదతె నన్నుంజూచి నవ్వుదురు. కావున బహు ద్రవ్య సాధ్యంబైన యశ్వమేధంబుఁ గావింప శక్తిలేద 'నిన విని, పారాశర్యుండు భరత కుల ధురీణుంజూచి, 'తొల్లి మరుత్తుండను మహీపాలుండు బహుసువర్ణకంబను యాగంబుగావించి యపారంబుగా దక్షిణలొసంగిన, బ్రాహ్మణులు తమ యోపిన కొలంది యెత్తుకొని తక్కిన ద్రవ్యంబులు హిమ శైలంబు చేరువం బాఱవైచి పోయిరి. కావున నా ధనంబు నీకు దొరికెనేని, యధ్వరంబుఁ జేయవచ్చు'ననిన విని,ధర్మనందనుండు, 'మునివరేణ్యా, తొల్లి మరుత్తుండు బహుసువర్ణ యాగంబుం జేసి భూసురుల కొసంగిన ద్రవ్యంబు వారల సొమ్ము. కావునఁ బద్ద్రవ్యంబు దానంబు సేసి తరింపఁగోరుట గొప్పవాఱు. దెప్పగా వైచికొని సముద్రంబు నీఁదఁదలంచిన చందంబగు. కులంబు ద్రుంచుటయు, గురువుల యెడఁ గల్ల లాడుటయుంగాక బ్రాహ్మణ ధవ్యంబపహరించితిమేని పాతకంబునకుం గొలంత యేమి ?' అనిన విని మునికుల తిలకుండు కురుకులతిలకుంగాంచి, మున్ను పరశు రాముండు కశ్యపునకు దానంబు సేసిన భూమండలంబు రాజులెల్లం బరిత్యజిం చిరే? విప్రులకు మోహం దరంబుగాక పరిత్యజించిన ధనంబు రాజులకుంగాని తక్కినవారలకుఁ బనిలేదు. అదియునుంగాక మరుత్తుండు యజ్ఞసమయంబున నుచితంబైన ధనంబు దక్షిణలిచ్చి మిగిలిన ద్రవ్యంబు కొల్లవిడిచిన బ్రాహ్మణు లెల్లఁదనిసి విడిచిన యర్థంబుఁ గైకొనుటకై వెఱవం బనిలేదు. ఇందునిమిత్తం బుగా నీ మనంబున నావంతయు వంత వలదు. అమ్మహాధ్వరంబు గావించు విధానంబు సావధానంబుగా నాకర్ణించుము.

## -వ్యాసుఁడశ్వమేధ విధానంబుఁ జెప్పుట-

వేదశాస్త్ర పురాణాది విశారదులును, సత్కుల ప్రసూతులును, గోవింద పాదారవింద కందళితాంతరంగులును, దేజోవిరాజితులును నైన బ్రాహ్మణు లఱువదివేలు (ఇరువదివేలు) ఋత్విజులు గావలయు. అందు నొక్కొక్కరికి హాటక సమేతంబుగా నొక్క ఘోటకంబును, నొక్క మదపుటేనుంగును, నొక్క యరదంబును, బయఁడేసి రత్నంబులును, వెయ్యేసి యావులును, నావునకు నూటేసి గొఱ్ఱెలుంగా దక్షిణ యొసంగి, నియమంబునం దురంగంబును

బూజించి విడువ వలయు. ఇది మొదటి దినంబున నీయందగిన దక్షిణ ప్రకారంబు దెలిపితి. ఇంక నశ్వలక్షణంబు వినుము.చంద్ర చందన కుందకుసుమ సవర్ణంబైన వర్ణంబును, నింద్రనీలంబు సరియగు చెవియును, గనక గుచ్ఛం బునుబోలు పుచ్ఛంబును గలిగి, నిరాఘాట ధాటీపాటవంబైన యశ్వరత్నంబశ్వ మేధయోగ్యంబగు. చిత్రా పౌర్ణమీ దినంబునఁ జతురంగంబుల జతనంబు సేసి, తమ్ముని నేనియుం, గొడుకుల నేనియుఁ దద్రక్షణంబునకు నియోగించి, కనక పట్టిక యందుఁ దన బిరుదాంకంబులతో, "వీరుండు శూరుండు ధారణిం గలిగిరేని యీ హయంబుం బట్టుం" డని వ్రాసి, యా సువర్ణపట్టంబుం దేజి నుదుటంగట్టి, యథేచ్ఛగా విడిచి, యా హయంబు మూత్ర పురీషంబులు విసర్జించు తావుల గోసహస్రంబు దక్షిణగా హోమంబు సేయబనిచి, సంవత్సరంబు సంక ల్పంబు సేసికొని, యయ్యశ్వంబు మగుడ వచ్చు పర్యంతంబు నియమంబు తోడం గూడం దీక్షించి, భార్యయుఁ దానును బ్రహ్మచర్యంబు, నధశ్శయ నంబునుం జేయుచు, నసిధారావ్రతంబుగా నుండ వలయు. మున్ను దేవేం ద్రుండు నూఱశ్వమేధంబులు సేసెంగాని నియమంబు సలుప నేరండయ్యె. పాండునందనా, నీవు నన్ని నియమంబుల తోడ నొక్క యాగంబు గావించితి వేని సకల పాప హరంబగు. వలరాజు వలలకుం దగులని భీష్ముండొక్కరుండు దక్కఁ దక్కిన వారలకుంగూడదు. కావున నిమ్మహాధ్వరంబు రాజులెవ్వరుం జేయ నోపరు. నీకు శక్యంబేని చేయుము.'

అనిన విని ధర్మనందనుండు కృష్ణద్వైపాయనుం గనుంగొని, 'మహాత్మా, నా తమ్ములు భీమార్జున నకుల సహదేవులు యుద్ధంబున మిగుల డస్సియున్న వారలు. మహాబలుండును, గర్ణ సూనుండు నగు వృషకేతుండు బాలుండు. ఘటోత్కచుండు మా కార్యంబున హతుండయ్యె. అతని తనయుండగు మేఘవర్ణుం డత్యంతబాలుండు, గావున వారల నిరువురఁ గయ్యంబునకుఁ బంపుట యయుక్తంబు. ఎవ్వాని ప్రాపునఁ గవ్వడి వైరి రాజులం బరాజయంబు నొందించె, నా గోపాలదేవుండు దూరంబున నున్నవాఁడు. కావున నియ్యాగ౦బే విధంబునఁ జేయగలవారము ?' అనిన విని భీమసేనుం డగ్రజు నవలోకించి, 'శ్రీకృష్ణదేవుండు సర్వత్ర పరిపూర్ణుండు. ఇచ్చట లేఁడననేటికి ? అద్దేవుం దలంచిన మాత్రంబునఁ బాపంబులు రూపడంగు.సుకృతంబులు లభించు. అదియు నుంగాక, యొక్క రహస్యంబు వినుము. శ్రీవాసుదేవుని యానతి ప్రకారంబున

ఘనము కయ్యం బొనర్చి జ్ఞాతి వధం బొనర్చితి మింతియకాని, స్వతంత్రంబుగఁ జేసిన వారము కాము. కావున మనకు లేశమాత్రంబును దోషంబు లేదు. అశ్వమేధంబు సేసిన నేమి? సేయకున్న నేమి? శ్రీకృష్ణదేవుని పాదాంబుజంబులు నమ్మియున్న మోక్షంబునకుం గొఱఁత లేదు. ఎట్లయినను రాజలోకంబులోఁ గీర్తి కలుగుటకునై యీ యాగంబు సేయ నుద్యోగింపుము. హయమేధ యోగ్యంబైన గుఱ్ఱం బీ లోకంబున నున్నం జాలు. ఎంతవారెదిరించినను జయించి తెచ్చెద.'

## -వ్యాసుఁడశ్వమేధ హయంబున్న తావుం జెప్పుట-

అనిన వ్యాస మునీంద్రుండు ధర్మరాజుతో నిట్లనియె: 'మహీపాలకా, భీముని వాక్యంబు నిజంబు. భద్రావతీ పురంబున యౌవనాశ్వుఁడను రాజు రాజ్యంబు సేయుచున్నవాఁడు. అతని లాయంబున నేఁజెప్పిన లక్షణంబులు గల గుఱ్ఱం బొక్కటి యున్నయది. పది యక్షౌహిణుల సైన్యంబు రేయునుం బవలు రెప్పవేయక దానినిఁ గాపాడుచు నుండుఁ గావునఁ, బోతుటీఁగ కేనియుం బొలయఁ గూడదు. అత్తురంగంబు నీకుం దక్కునే జన్నంబు నెఱవేఱు.'

## -భీముఁడశ్వంబు దెత్తునని ప్రతిన వట్టుట-

అనిన విని భీమసేను డిట్లనియె: 'అన్నా, దేవాసురులడ్డమై రేనియు, జయించి యౌవనాశ్వ నింటనున్న యశ్వమే ధాశ్వంబు దెచ్చెద. మీపాదంబులాన. అట్లు సేయనైతినేని వేదఘోషంబు లేని గ్రామంబునందును, శివాలయంబు, విష్ణుదేవుని దేవళంబును లేని స్థలంబునందును, వాసంబు చేయువాఁడును, తల్లిదండ్రులకు రెండు* దలంచిన దుర్జనుండును, జనంబు వాడని బావితో జలంబు గ్రోలిన వాఁడును, బ్రాహ్మణులతోడ ననత్యంబు పలికినవాఁడును, నప్పు దీసికొని యటమటించిన యధముండును, విశ్వాస పాతకియుం బోవు గతులకుఁ బోవం గలవాఁడ'. అని పలికి యూరకున్న తమ్మునింజూచి; 'యయ్యా, యౌవనాశ్వుండు పరాక్రమ ధురీణుండు. అతని సైన్యంబు బహు సమరంబుల నాఱితేఱిన శూరులు గలది. వారలం గెలిచి యశ్వంబు దెచ్చుట

---

*రెండు = భేదము

యత్నంబు మాత్రంబు. నీవట్లు ప్రతినఁ జేయ జెల్లునే ' అనిన విని, వృషకేతనుం డజాత శత్రువుతో 'మహీ రాజేంద్రా, భీమసేను తోడం గూడ నన్నుం బంపు' మనిన, వాయునందనుండు కర్ణనందనుం జూచి, 'కుమారకా, మీ తండ్రియైన కర్ణుని మా యన్నయని తెలియక సంగరంబునఁ గూల్చితిమి. నాఁట నుండియు మా మనస్తాపంబులకు మట్టు మితియు లేదు. నిన్నుం జూచిన యెడ సంకోచం బగుచున్నది'. అనిన వృషకేతుండు భీమునితో, 'నయ్యా, మా తండ్రి బుద్ధిమాలి వనమాలి భక్తులరైన మీయెడ ద్వేషంబు సేసి దివ్య మణిం బాఱవైచి గవ్వఁ జేకొన్న చందంబున దుర్యోధనుని నవలంబించి, ద్రౌపదీ స్వయంవరంబున దొమ్మి యుద్ధంబు సేసె. విరాటు నగరంబునఁ బసులంబట్టించె. మాయా జూదంబున మా తల్లియగు ద్రౌపదీదేవిం జీర లొలిపించె. దుర్యోధనుని వారింప శక్తి గలిగియు ధర్మాత్ములైన మీయందు మహాద్రోహంబు సేసె. అ ప్పాపంబులు వాయ శ్రీకృష్ణ దేవుని సన్నిధానంబున ధనంజయుని మహోగ్రబాణంబులచే సంగరాంగణంబున సంహారంబునొంది తండ్రియగు నా సూర్యదేవుం గలిసె. కావున మా తండ్రి యగు కర్ణున కర్జును ఋణంబుఁ దీర్చుకొనం గూడదు. అది యట్లుండె; నరేంద్రా ! నేను భీమసేనుని తోడంగూడంజని దుర్గమంబైన యౌవనాశ్వపురంబు ప్రవేశించి నా భుజ బలంబులచే శత్రుసైన్యంబులగెలిచి యశ్వమేధాశ్వంబుఁ దెచ్చి మీకు సమర్పణంబు గావించి, మా తండ్రి పాపంబులం బోజేసి, సద్గతికిం బనిచెద, నుత్తరువు దయసేయవలయు.'

అనిన ధర్మనందనుండు కర్ణపుత్రునిఁగౌఁగిలించుకొని, 'అన్నా, మీ పిన తండ్రితోడఁ గూడఁజని, శత్రుసంహారంబు గావించి, జయంబుఁ జేకొని, హయంబు దెమ్ము' అని పంచిన, నమ్మాటలు విని ఘటోత్కచ కుమారుండైన మేఘవర్ణుండుఁ నెయ్యంపు వేడుక మొగంబునఁ జెంగలింప, ధర్మనందనుం గనుఁగొనిన, యభిప్రాయం బెఱింగి భీమసేనుండు, 'వత్సా, మీ తండ్రియగు ఘటోత్కచుండు మేము వనవాసంబు సేయునప్పుడు గంధమాదన పర్వతంబున మమ్ము రక్షించె. మా నిమిత్తంబుగా రణంబునఁ బ్రాణంబువిడిచె. అతండు సేసిన యుపకారంబులఁ దలంచికొనిన మనంబు గరఁగుచు నున్నయది. కావున నిన్ను జగడంబునకుం దోడ్కొనిపోవనోప. మేము వచ్చుపర్యంతంబు ధర్మనందనుం గొలిచి యుండుము'. అనినవిని, మేఘవర్ణుండు తాతయగు భీమునిం జూచి 'తొల్లి శ్రీరామభద్రుని పాదారవింద రేణువులచేఁ బాషాణంబు పావనంబైన తెఱంగున, గంగానదితోఁ

గూడి యడవివాక యోగ్యంబైన కైవడి, మా తండ్రి మీకు జనియించుటవలన ధన్యుండయ్యెం గావున, నేను మిమ్ముం గొలిచి భద్రావతీ పురంబునకు వచ్చెద. అగస్త్యుండు సముద్రంబుం గ్రోలిన చందంబున, వైరి సేనాసముదయంబుల నీవు బింకంబులణంప, నీవృషకేతనుండు పగతుర సైన్యంబుల నడ్డగించి యావహంబు సేయు సమయంబున మేకపిల్లను బోలె నాయశ్వరత్నంబు నెత్తికొని యతి వేగంబునం జనుదెంచెద'నని పలికినం, బరమానందంబు డెందంబునం గ్రందుకొన సమీర నందనుండు ఘటోత్కచ తనయుం గౌంగిలించుకొని, 'పౌత్రకా, నీ భాషణంబులు మాకుం గర్ణభూషణంబులయ్యె. నీవు, నేను, వృషకేతనుండును గూడితిమేని, మన ముగ్వురితోం బ్రమథగణ సమేతుండైన త్రినేత్రుండు నెదిరింపం జాలడు' అని పలికి, యుద్ధ సన్నద్ధులైయున్న సహోదర పుత్రపౌత్రులం గనుంగొని, ధర్మపుత్రుం డానంద బాష్పాకులిత నేత్రుండును, పులకాంకిత గాత్రుండునునై, త్రేతాగ్నుల చందంబునం దేజరిల్లు నమ్మువ్వురం జూచి, లోకత్రయంబున వీరల కసాధ్యంబు లేదని యుత్సహించె. అంత పడమటి దిక్కు నియెడు పడంతి కొప్పునం జెక్కు, చెంగలువ చందంబున రవిబింబంబు కట్టెఱ్ఱనగు కాంతితోడం గూడ నస్తగిరి ప్రాంతంబునకుం జనియె. అప్పుడు వివిధ విద్యావిలాసుండును, జ్ఞాన కలావాసుడును, బ్రహ్మజ్ఞాన మహోల్లాసుండును నైన వేదవ్యాసుండు ధర్మనందను నాశీర్వదించి, యతండొనర్చు పూజలంగీకరించి, తన యాశ్రమంబునకు విజయంబు సేసిన, ధర్మతనయుండు సంధ్యావందనాది కృత్యంబు లాచరించి, తమ్ములు సమీపమ్మునం గొలువ రత్నసింహాసమ్మునం గూర్చుండె. తదనంతరంబు, కౌంతేయాగ్రజుండు క్రమ్మఱం జింతాక్రాంతుండై 'భద్రావతీ పురంబున కెవ్విధంబునం జనువారము! గుఱ్ఱంబు నెట్లు దెచ్చువారము? దక్షిణలకు ధనం బెక్కడ నున్నయది? యాగంబునకు నిర్వాహకుం డెవ్వండు? కృష్ణద్వైపాయనుండాడిన మాటలకేల యియ్యకొంటి? త్రిలోకాధిపతియైన శ్రీకృష్ణుండు నిర్వ్యాజ కరుణాకటాక్షంబునం దనకుం దానవచ్చి యీ యాగంబు నెఱవేర్చినం గాని, యెవరికి శక్యంబు? శ్రీకృష్ణా! వృష్ణికులభూషణా, కమలాక్షా, త్రిలోకాధ్యక్షా, భక్త సంకట విమోచనా, శోకార్ణవంబున మునింగి యున్నవాండ. నీ కృపయను నోడచే నన్నుద్ధరింపం జేయుము. మున్ను కౌరవ సభలో మానభంగంబు గాకుండం బాంచాలిని రక్షించిన క్రమంబున నన్ను రక్షింపుము' అని బహువిధంబులం బ్రస్తుతింపుచు, ఫాలతలంబున మోడ్పుంగేలు గీలించి 'శ్రీకృష్ణదేవా, నీవే దిక్కని' వేడుకొను నవసరంబున.

## శ్రీకృష్ణుండు హస్తినాపురంబునకు వచ్చుట

సర్వాంతర్యామియు, విశ్వరూపియు నగు గోపికా వల్లభుండు నర్ధరాత్రంబున హస్తినాపురంబునకు వచ్చి, ధర్మనందను నగరుసొచ్చి, ప్రతిహారిం గనుంగొని, 'మా రాక ధర్మనందనున కెఱింగింపుము. ఎంతవానికేనియు మహీకాంతుని సమయంబు దెలియక చనువు గలదని యంతిపురంబునకుం బోవుట యుచితంబు గాదని'న ప్రతిహారి గోవిందునకు వందనంబుగావించి, 'దేవర యేసమయంబున విజయంబు సేయుదు రదియ సమయంబ'ని మొదల నాతోన మా రాజుగా రుత్తరువిచ్చి యున్నవారు. కావున నవసరంబుఁ జూడంబని లేదు. పరస్త్రీ పరధనంబులు గోరు దురాత్మకులును, బరుల దూషించు దుర్మతులును, నీ కరుణ వడయలేరు. ధర్మనందనున కీ దుర్గుణంబు లెవ్వియులేవు. తానుం దమ్ములు నహోరాత్రంబు దేవర పాదారవిందంబులు ధ్యానంబు సేయుచు నున్నవా'రని పలికి, యతిశీఘ్రంబుగఁ బఱతెంచి, 'రాజేంద్రా, శ్రీకృష్ణదేవుండు నగరి ద్వారకిటికి విజయంబు సేసె'ననుటయుఁ, బాండవాగ్రజుండాశ్చర్య భరిత మానసుండై మొగంబు చెంగలింపఁ దమ్ములుం దానును నెదుర్కొనుటయు, వసుదేవనందనుండు ధర్మజు పదంబులకు వందనం బాచరించిన, నతండు ప్రేమఁ గౌగిటఁ జేర్చుకొని, యానంద బాష్పంబులు కపోలతలంబులంగురియు, రోమాంచంబు ముంచికొన, నద్దేవు దివ్యరూపంబు సందర్శింపుచు, నానంద సముద్రంబునఁ దేలి యాడుచుండె. అంత భీముండును, నర్జునుండును, శ్రీకృష్ణదేవుని పాదారవిందంబులకుఁ బ్రణామంబులు సేసిరి. నకుల సహదేవులు నట్ల కావించిరి. అంత సత్యభామాకాంతు నంతఃపురంబునకుఁ దోడుకొని పోయి యర్ఘ్యపాద్యాది విధానంబులం బూజించి హర్షించి కనకాసనంబున నునిచి, తాము నుచితాసనంబులం గూర్చున్న యెడఁ, బాంచాల రాజనందన ముకుందునకు వందనం బాచరించి, మందస్మితంబు వదనారవిందంబున జెలువొంద, ధర్మజు మొగంబు గనుంగొని, 'యర్ధరాత్రంబున నచ్యుతుండిచ్చటికి వచ్చెనని యచ్చెరువందనేల? తన భక్తులెచ్చటి నెచ్చటి నుపద్రవంబు నొందుదు రచ్చటికి వచ్చి రక్షించుట యద్దేవునకు సహజగుణంబు. ఆ కౌరవ సభలోన దుశ్శాసనుండు మీర లేవురుఁ జూచుచుండ వలువలొలుచునప్పుడు, హా, గోవిందా, పుండరీకాక్షా, శ్రీకృష్ణా, యని యెలుంగెత్తి పలికిన యనంత నక్షయ వస్త్రంబులిచ్చి మాన సంరక్షణంబు

సేసె. మన మర్జునుని ద్వారకా నగరంబునకుం బంపి పిలిపింప వలయునని తలంచుచు నుండఁ దనకుందానె వేంచేసె. ఇద్దేవుని భక్త వాత్సల్యంబెంతని కొనియాడం గలదాన? ' ననినఁ. బాంచాలి నవలోకించి, కించిదంకురిత హాసభాస ముఖార విందుండై గోవిందుండు చాల నాదరించె. అంతఁ గౌంతేయాగ్రజుండు రుక్మిణీకాంతుంజూచి మేఘ గంభీర స్వనంబున నిట్లనియె:

'కమలనాభా, నాదు మనస్తాపంబు నుపశమనంబు నొందింపఁగోరి దేవరఁ దలంచితి. నా తలంపునకంటె మున్నుగా నీవు ప్రసన్నుండ వైతివి. నా మనోర థంబులు ఫలియించె. వ్యాసమునీంద్రు ననుమతి నశ్వమేధంబుం జేయఁ దలంచితి. సకల కర్మంబులకుఁ గర్తవు భోక్తవు నీవ. కావున నీ యధ్వరంబు నిర్వహించు భారంబు నీయది,' అనిన విని, దేవకీ నందనుండు కుంతీనందనుం గనుంగొని-

## -శ్రీకృష్ణుండు భీముని తేజంబు వృద్ధినొందింప యత్నించుట-

'శౌర్యవంతులకుఁ జేయంగూడని కార్యంబు లేదు. నీ తలంపు సమకూరు' నని పలికి, పవననందను జూచి, నెమ్మొగంబునం జిఱునగవు తళుకొత్త 'వృకోదరా, నీకు బుద్ధిమందంబు, ఆహారంబపారంబు, పొట్ట రెట్టించుచున్నది. రక్కసి రతులకుం జొక్కినవాఁడవు. మాటల పోఁబడి యెఱుఁగవు. నీవంటి వాఁడు మంత్రియైయున్నఁ గార్యంబు లగుటకు సందియంబేమి ? అంగహీనుని, నిల్లటంపుటల్లుని, బ్రల్లదంబు పలుకు వానిని, గామినీలోలుని, మరుగుజ్జువానిఁ, జెవుడుగలిగిన వానిం, బందయగువాని, మామగారిని వెట్టిపట్టించువానిని, స్త్రీవశంవదుని, నిర్దయునిఁ, బ్రచండకోపనుఁ, బ్రమత్తుని మంత్రిఁజేసిన కార్యభాగంబులు సిద్ధినొండ నేఱవు. నీవు బాహుబల గర్వంబునఁ గార్యపద్ధతు లెఱుగవు. గర్వాంధులుఁ బాపస్వరూపులు నగు బక హిడింబ కిమ్మీర జరాసంధాదులం జంపినయట్లు సులభంబుగఁ దలంపకుము. సత్యసంధులును, భుజబల ధురంధరులును, జితేంద్రియులు, దాన శూరులు నగు రాజశ్రేష్ఠులు పెక్కండ్రు గలరు. ఒక్కొక్కని జయించుట కక్కసంబు, సూర్యు డస్తంగతుండు గాకమున్న సైంధవుని వధింతుననినాఁడు గాండీవిగావించిన ప్రతిన నెఱవేఱుట దైవయత్నంబు. మారుతనందనా, నీవంతకంటె సాహ సంబుగాఁ బ్రతిన సేసితివి. ఇది నెఱవేఱుట యెట్లు ? యజ్ఞఘోటంబు నిరాఘా

టంబుగా దిక్కులం జరించునెడ శౌర్యవంతులైన మహీనాథులు, దేవగ ధర్వ యక్ష రక్షోగణ నాథులును బహు విఘ్నంబులు గావింతురు. మున్ను దశరథ నందనుం డశ్వమేధంబు సేయుచు వానర బలంబులను, భల్లూక సేనలను, నశ్వరక్షణార్థముగా నంపిన శత్రుఘ్నుండు వీరమణి పురంబున సురథుండను మహారథుండు తురంగంబులతోఁ గూడ వానర వీరుల నెల్లంగట్టి వేసిన యెడ శ్రీరామభద్రుండు తానె చని యశ్వంబును మరల్చికొని వచ్చెఁ గావున నీవు, సహాయంబుగా నర్జునుం దోడ్కొని పోవుట కర్జంబు.'

అనినవిని కంసమర్దనునకు ఒకమర్దనుం డిట్లనియె. 'బావా! నేను నీ వానతిచ్చిన గుణంబులు గల వాఁడనగుదు. నీకు నటువంటి గుణంబు లెవ్వి యును లేవుగదా! నీ కామాతురత్వంబునకు గొల్ల యిల్లాండ్ర గుబ్బపాలిండ్లు సాక్షి. నీచస్త్రీ సంగమంబునకు నీదు మత్స్య కూర్మ వరాహావతారంబులె సాక్షి. బహుభక్షకుండవగుటకు బ్రహ్మాండకోటి పరిపూరితంబైన నీ కుక్షి సాక్షి. నీ స్త్రీ లోలత్వంబునకు సత్యభామా నిమిత్తంబుగా భూమికిందెచ్చిన పారిజాత వృక్షంబు సాక్షి. నీ మహామాయా చరితంబులు ప్రకటింప నెవ్వరి తరంబు? దేవర కటాక్షంబు తోడుగఁ దొల్లి బక హిడింబ కిమ్మీర జరాసంధుల గెలిచితి, నిప్పుడు నటువంటినే యౌవనాశ్వ విశ్వంభరా వల్లభుని గెలిచి, యశ్వమేధాశ్వంబుం దెచ్చెద. నా హృదయంబులో దేవర దివ్యశ్రీ పాద పద్మంబులు కుదురుగ నున్నంజాలు. తత్ఫలంబున గదాదండంబు కేలంగొని, కులపర్వతంబులం బెకలింతును. క్షోణీమండలంబుఁ జూర్ణంబు సేయుదు. దిగంత దంతావళంబుల దంతంబులు డుల్చి వైతును. నాకసాధ్యం బేమి యున్నయది? చాతకంబులు మేఘాగమనంబు కరణి మేము నీరాక నపేక్షించుచున్నారము. మమ్ము నీ కృపాదృష్టిచే రక్షింపుము. మీయెడ భక్తిలేనివారలకు నీవె యగ్ని వర్షంబు గురియుదువు. పంకనిర్మగ్నంబైన ధేనువును గోపాలకు చందంబున శోకమగ్నులమైన మమ్ము నీ వుద్ధరింపుము.'

అని అనిల నందనుండు పలుకు పలుకులకు ముదంబు దొలఁక, గోప కుల తిలకుండు తదీయ తేజంబు వృద్ధినొందించుచు, గాఢాలింగనంబొనరించి, 'సమీరకుమారా, నీ వాక్యంబులకు నా యంతరంగంబు సంతసంబు నొందె. నీవు ధన్యుండవు. రాజమూర్ధన్యుండవు. మాన్యుండవు. మీ రాజన్యసహ దైన్యంబు వలదు. జన్నంబు నెఱవేఱెడిని. ద్రోణ భీష్మ కర్ణ ప్రముఖులైన గురు

జనులం, దక్కిన సంబంధి బాంధవులం, దురంబున మనిమిన దుష్కృతంబు మిమ్ముల జెందదు. అశ్వమేధాధ్వరంబు గావించి మాకు సమర్పణంబు సేయుఁడు. మీకు వంతవలవ దయ్యాగంబు నేన సాగించెద.'

అనిన విని, భీముండు గోపాలదేవుం గనుంగొని వెండియు దండ ప్రణామంబు గావించి, 'దేవా, నీ పాణి పద్మంబున వస్తువొకటి కోటి గుణితంబై వృద్ధిబొందుంగాన, హయమేధంబు గావించి తత్ఫలంబు నీకె సమర్పింపఁ గోరి యున్నవారము. నేను భద్రావతీ పురంబునకుఁ జని, తద్రాజ వర్యుని గెలిచి హయంబు దెచ్చు పర్యంతంబు సవ్యసాచి ధర్మరాజు సముఖంబునం గాచికొని యుండు'నని మాటలాడు సమయంబున, ద్రుపద రాజపుత్రి వచ్చి 'యారగింపు సమయంబు బయ్యె, విజయంబు సేయుఁడనుటయు, ధర్మ నందనుండును, వసుదేవ నందనుండును, గృతమజ్జనులై, ధౌత పరిధానంబులు ధరియించి, యిష్టాన్న పానంబులం బరితుష్టినొంది, యుచిత ప్రకారంబుల నారాత్రి సుఖ నిద్రంజెంది, మఱునాఁడు వంది మాగధ బృందంబుల బిరుదగద్య పద్యంబులు, గాయక వైణికులయంత్ర గాత్ర గానంబులు, నాలకించుచు, నిద్ర మేల్కాని స్నాన సంధ్యావందనాది నిత్య కృత్యంబులు నిర్వర్తించి, సంతోష భరితాంత రంగులై సభాస్థలంబునకు వచ్చిరి.

## -భీముఁడశ్వమునకై భద్రావతి కేగుట-

అంత భీమసేనుండును, యుద్ధ సన్నద్ధుఁడై ధర్మతనయు పాదంబులకుఁ బంకజాక్షుని పదపంకజంబులకు వందనంబులొసరించి, కుంతికిం బ్రణమిల్లి, వివ్వచ్చుం గ్రుచ్చి కౌఁగిటం జేర్చికొని, తాను వచ్చు పర్యంతంబు ధర్మ తనయుం గాచి యుండుమని నియమించి, మాద్రీనందనుల నుపచరించి, ద్రౌప దికిం జెప్పి, మఱిమఱియు మురవైరి చరణాంబురుహములకుఁ బ్రణమిల్లి, ప్రమోద భరిత మానసుండై, వృషకేతు మేఘవర్ణులు సంగరోత్సాహ పరిపూర్ణులై తోడం జనుదేర, యౌవనాశ్వుండేలు భద్రావతీ పురంబునకుం గతిపయ ప్రయాణంబులం జనిచని, బంగరు మెఱుంగులం దురంగలించు నుత్తుంగంబులైన శృంగంబులం గీలుకొలిపిన కెంపుల సొంపులు గులుకు ప్రకాశంబుల రాత్రులం బగళ్ళు సేయుచు, నమరావతీపుర సమానంబున స్ఫటిక మణి మయంబులు, సంభర తల చుంబి

తంబులునైన కోటలును, పాతాళతలగంభీరంబులు నుల్లోల కల్లోల సముల్ల సితంబులుఁ, గమల కువలయ గంధ బంధురంబులునైన యగడితలును, గనక మయ శిఖరంబులం దాపిన గుత్తంపు ముత్తియంబుల డంబులచేఁ దారాగణంబుల విడంబించు సౌధంబులును,గోపురాగ్రంబులం గీలితంబులైన యింద్రనీల కాంతుల నకాలతిమిరములం గలుఁగఁజేయు గవనివాకిండ్లును, గలిగి,వేద ఘోషంబుల మట్టు పడం జేయుచు హోమధూమంబులచే మార్గంబులం గాన రానీయక యాగయూప సంఘంబులచే నడువం గూడక సాధుజన సంతోషణంబును, వైరిజన భీషణంబు నైన యాపురంబు సేరంజని, పూచికాచి ఫలించి కైవ్రాలిన మావులు మోవులుఁ బొన్నలుఁ బొగడలుఁ దాలహింతాల తమాల నారికేళ పనస క్రముక ప్రముఖ తరువులు, నల్లిబిల్లిగా నల్లికొనిన మల్లెలు మొల్లలు సన్నజాజులు మొదలైన తీవలం బొలుపొందుచు, చిలుకలుఁ గోయిలలు శారికలుఁ జకోరికలు నాదిగాఁగల పక్షి కులంబుల కలకలంబులును, జింకలు దుప్పులు సీహామృగంబులుఁ దక్కిన మృగ విశేషంబులచే భూషితంబులునైన పువ్వు బొదలం బొలుపొందు హృద్యంబైన యుద్యానంబునందు నిలిచి, సమీరకుమారుండు వృషకేతుంజూచి, 'కుమారకా,యీ వనంబునం జెంగలువలు నల్లగలువలుఁ దెలిగలువలుఁ జెందా మరలు వెలిదమ్ములు దొరంగిన పుప్పొడులం దేనియలం బొండచిత్ర వర్ణంబులైన తరంగమాలికలం జెన్ను మెఱసిన తటాకంబుఁ గనుంగొనుము. ఇచ్చటికి రాజు నగరి వాజిసంఘములు నీళ్ళు ద్రావం జనుదెంచు, నందశ్వమేధ యోగ్యంబైన యశ్వంబు వచ్చు,గావున దానిం గాపాడుకొని వచ్చుఁ సైనికానీకంబుం బాఱఁద్రోలి, హయంబు రయంబునం గొనిపోవ్వన, మని పలుకుచు నొక్క పొదరింటం బొంచియుండె.

అప్పుడు కర్ణసూనుండు పినతండ్రియగు భీమసేనుంజూచి, 'యీరాజునకు, గల సేనయంతయుం బదియక్షౌహిణులు. వానిలోఁ గొంతకొంత తురంగంబు వెంబడిం జనుదెంచుఁ గాని యెల్ల సైన్యంబుఁ బెల్లగిలిరాదు. కావున మనకీ యశ్వంబు గ్రహించుట సులభంబు. గంగాతీరంబునం జేరిన జనుల పాతకంబులుం బలె, లలాటలోచనుం డాసిన కాలకూటంబు కరణి, శ్రీవాసుదేవ పాదారవింద చింతనంబు వలన మానవుని జన్మంబునుం బలె, నిమిషమాత్రంబులో నీ గదా ఘాతంబున యౌవనాశ్వుని సైన్యంబు లయంబు నొందు'నని సల్లాపంబు లాడుచు నుండు సమయంబున, దండిమెఱయ డిండిమ వాద్యఘోషంబులును, గాంచన మణిమయంబులైన ఘంటల ఘణఘణారవంబులును, నంకుశాఘాతంబులం

బొడమ ఘీంకారంబులును, గండ స్థలంబులం దొరఁగు మదజలంబుల పరిమళంబులకై క్రమ్మయు తుమ్మెదల ఝుంకారంబులునుం జెలంగ, నేనుంగులు గుంపులు గుంపులుగావచ్చి యా సరోవరంబు సొచ్చి మచ్చికలు హెచ్చఁదుండాగ్రంబుల నుదకంబులం బూరించి పెంటి యేనుంగుల మీఁదం జల్లుచు, వానిచేఁ జల్లబడిన సలిలంబులచే మేనుల్పుదడియ మెల్లమెల్లనఁ దద్గాత్రంబులు నిమురుచుఁ, బుండరీక ముకుళంబులంబెఱికి యొండొంటితో నేటులాడుచు, నన్యోన్యముఖ సౌరభంబుల నాస్వాదించు సంతోషంబున ఘోషించుచు, నక్కు నక్కునుం జెక్కుఁ జెక్కును దొడఁ దొడయుం జెవిఁ జెవియుం బరిబరియు సరి కొరయఁ, గరాగ్రమ్ముల జలంబులం బీల్చి చిమ్మన గ్రోవులంబలెఁ జిమ్ముచుఁ, బెద్దయుం దడవు తద్దయుం గ్రీడించి, మావంతుల బలవంతంబున జలవిహారంబులు చాలించి యమ్మద గజంబులు పురంబునకుం జనియె.

తదనంతరంబ క్రొమ్మించుల మించుతేరి గండ్లయంచుల వలనం బొడమిన భూరేణువుల కాలతిమిరంబు సంపాదింపఁ, గాలరుద్ర ఢక్కాఢమఢమాత్కారంబులం ధిక్కరించు వాద్యఘోషంబులు మొఱయ, మృత్యువు నాలిక పోలికఁ జలదలంగదలు బిరుద కేతనంబులు మెఱయఁ, బట్టపగలింటి మార్తాండ కిరణంబులకు ననుకరణంబులైన ప్రహరణంబులం బొలుపొందు భట సమూహంబును, సందడింప, నేలయీనిన తెఱంగున, సముద్రంబు పొరలిన చందంబున, వచ్చు సైన్యముం గనుంగొని, యౌవనాశ్వ భూపాలుండు వచ్చెనొ యను తలంపున దిగ్గనలేచి, కర్ణకుమారుం డా సైన్యమును గలయంజూచి నీరుగ్రోలఁ జనుదెంచు తురంగ బృందంబుల సందడిగాని రాజుకాఁడని తెలిసి, యనిల నందనుం జూచి, 'యయ్యా, కయ్యంబునకుం గాలు ద్రవ్వు చందంబున ఖురంబుల భూతలంబు ద్రవ్వుచు నూరఁబిచ్చుకలు ముంగిసలు నొంచెలు నడచిన కైవడి బెడంగు నడలు మెఱయం, బరిచారకులు వాగెలం గుదియంబట్టి నిట్టట్టు గెరలుచు, వేసవేలు తురంగంబులు జల తరంగంబుల కరణిఁ ద్రొక్కిన చోటుం ద్రొక్కక యిక్కొలనికిం జనుదెంచి నీరు ద్రావుచుంబోవుచు నున్నయవి గాని యశ్వమేధాశ్వంబు గనంబడదు. దానికున్నచోటన గడ్డియుం గవణంబు నీరు సమరించి బయలువుచ్చరు గాఁబోలు' ననిన వృషకేతుం జూచి యనిలసూతి, 'కుమారకా, మనము ధర్మజుని సమ్ముఖమున నానావిధంబులైన ప్రతిసలు గావించితిమి. సవనహయంబు లేకయ రిత్త చేతులతో మగిడి పోవం జనదు.

పుత్రులు లేనివానికిం గతి గలుగనేరదని విధంబున, సంగనావశుండైన యజ్ఞానికి బంధుమర్యాదలు మాలినకరణిఁ, గార్యాలోచనము సేయని మనుజనాథునకు రాజ్యంబు సిద్ధింపని తెఱంగునఁ, శ్రీకృష్ణదేవుని చరణకమలంబులం దలంపని వానికి శుభంబులు లభింపని చందంబున, శంకరునిం బూజింపని వంకర కట్టెకు సంపదలు సంభవింపని కైవడి, హయంబునుం గైకొనకయు విఫలప్రతిజ్ఞుల మైతిమేని, మన కీర్తి హానిం జెందు' నని మాటలాడుచుండె.

## - అశ్వమేధాశ్వము నీరు ద్రావ వచ్చుట -

ఆ సమయంబున ద్విరదంబులు సరపంబులు ఘోటకంబులు, భటసమూహంబులు, వాద్య ఘోషంబులు మ్రోయ, పచ్చలంపు ముత్యాల కుచ్చుల గచ్చులు మెఱయు, ధవళాతపత్రంబు పున్నమ చందురు చందంబునఁగాంతిచంద్రికలు వెదచల్ల, నుభయ చామరంబులు,ధవళ శంఖంబులు,సాంబ్రాణి ధూపంబులు,చంద్రకావి పావడలు దీపింప, మహామండలేంద్రుని చందంబున నతిశయిత వైభవంబుతోఁ బద్మాకరంబునకు నయ్యాగ హయంబు రానాలోకించి, పట్టం దమకించు కుమారుని నివారించి, మనుమనిం గనుగొన్న, నమ్మేఘవర్ణుండు సమర విజయనేతయగు తాతకు నమస్కరించి, 'మహాబలనందనా, లెక్కకు మిక్కుటంబైన కక్కసంపు జోదులు పెక్కండ్రు చుట్టునుం బరివేష్టింప వచ్చుచున్నట్టి యిత్తేజిం జెవి పట్టి కొని లేఁగ దూడనీడ్చి తెచ్చిన విధంబునం బట్టి తెచ్చెద. యౌవనాశ్వుని, నాతనికుమారుని మూటకట్టుగాఁ గట్టి మీ ముందఱం దెచ్చి పెట్టెద. ఇంతయేల ? తురంగంబె చాలునంటిరేని, యత్తెఱంగునం జేసెద' నని సంగరోత్సాహంబున నంగంబు పొంగుచుండ, శైలశృంగంబునుండి చంగునం దుముకు సింగపుంగొదమ కరణి ధరణికిం జనుదెంచి, మాయాప్రభావంబునఁ గాల కంత కంత కుహాశీకరాళ కాలకూటంబు కరణిఁ, గాఢంబైన యంధకారంబుఁ గల్పించి, దిక్కులు విదిక్కులుం బటుక్కున. మెఱపు టూఱుపులు మిగులఁ బ్రహ్మాండ కుహరంబు విరియింపంజాలు గర్జితంబు లూర్జితంబులై యెల్లెడల వినంబడ, బలుపిడుగులు పడంజేసి, దేవ మానవాదులకు భయంకరంబుగ మేఘనాదుని చందంబున సింహనాదంబు సేసి, యుద్దనుజ సింహుండు పరాక్రమంబు మెఱయించుటయు, దేవేంద్రుండు చాపల వానఁ దప్పఁద్రాతంబువని, 'యీ పక్కసునిఁ డెక్కుడెవాఁడు? ఏల విజృంభించినాఁడు? తెలిసిర'మ్మని

యొక్క దూతనంపించిన, వాఁడుం ద్వరితంబుగా వచ్చి యంబరంబున నాడంబ రంబులు సేయు హిడింబా పౌత్రునింగాంచి, 'నీవెవ్వండవు? ఏమిటికిట్లు విపరీతం బులు సేసెదవు? దీన నీకేమి ఫలంబు? నిన్నెవ్వ రంపించినారు? త్రైలోక్య వల్లభుండైన దివిజనాథుండు తెలిసి రమ్మనెను,' ననిన విని యాఘటోత్కచ పుత్రుండు, 'నేను బాండు పుత్రుండైన భీమసేను పౌత్రుండ. మా పెద్ద తాత యగు ధర్మరాజు హయమేధంబు గావింపంగోరి యౌవనాశ్వుని నగరంబున యాగ తురంగంబున్న దని విని సన్నుంబంపిన నేను దానింబట్టి కొనవచ్చి మాయలం బన్నుచున్న వాడంగాని, దేవతలకు విరోధంబు సేయందలంచిన వాఁడఁగాను'. అనిన విని, యాదూత దేవేంద్రున కత్తెఱంగెఱింగించిన నతండు సంతోషంబు నొందె. అంతనంతకాల కాలుని చందంబున, నద్దనుజుండొక్కెడం బిడుగులు గురియించుచు, నొక్కదిక్కున ఱాళ్లుఋవ్వుచు, నొక్కచోట మిడుంగుఱులు నింగి కెగయ నిప్పులు గుప్పలించుచు, నొక్కదెస ఝుంఝూ మారుతంబులు విసరించుచు, నొక్కచక్క మిక్కుటంబైన దుమ్ము గ్రమ్మంజేయుచు, నొక్కచోట గాటంబు లైన చీఁకటుల నుత్పాదించుచు, నొక్కతావునఁ బెళపెళమని యుఱుము లుఱుమం జేయుచు, నొక్కొక్క దిక్కునం దళుక్కుమను మెఱుంగులచే దృష్టులుమిఱుమిట్లు వడం జేయుచు సేనల నెల్లం జీకాకు పఱిచి-

## -మేఘవర్ణుండు గుఱ్ఱము నపహరించుట-

పొట్టేటి పిల్లంబట్టిన-తెఱంగున నశ్వంబు నాలుగు కాళ్లంబట్టి, మూఁపునం బెట్టికొని, గగన మార్గంబున కెగసెన, బియచ్చరులచ్చరునొంది, 'యదెయదె దానవుండు హయంబుం బట్టికొని పోయెఁబోయె' నని మెడునెలుంగులు నింగిముట్టఁ బ్రశంసించి, కృపాయత్త చిత్తులై మేఘవర్ణుని పయింబుష్ప వర్షంబులు వర్షించిరి.

ఇవ్విధంబున భీమసేనపౌత్రుండు మాయాబలంబున యాతురంగంబు నపహరించి కొనిపోయిన తెఱంగు హతశేషులయిన భటులు పలుకరించుటయు, యౌవనాశ్వ విశ్వంభరాధీశ్వరుండు విని, యులికిపడి నిప్పులుప్పతిల్ల దశ దిశలం జూచుచు పరాప ప్రతాపదీపితుండై, యంబరతలంబున కెగయం జాలు రథికుల నాలుగు వేలకుం బనుపుటయు, వారలు క్రోధంబున యాఘంటులగుచు

విక్రమంబునఁ జక్రగదాకుంత కరవాల భిండిపాల ముసలముసుండికా పరిఘ పట్టిసాది సాధనంబులు సారించుచు, నవ్వీరుం జుట్టుముట్టిన, నాబిరుదుమగండు బెట్టుగా నట్టహాసంబు సేసి, యశ్వంబు నమరావతీ పురంబున నునిచి, తాను బెట్టిదంబైన చెట్టు వెఱికికొని, చుట్టుకొనిన మూకలం గనుపుకొట్టి, యిట్టట్టువడం జేసి, యాగహయంబును మగుడం గొనితెచ్చి, భీమసేను ముందఱంబెట్టి నిలిచిన, నతండు పౌత్రుం గౌఁగిలించుకొని దీవించె. ఆ సమయంబున యౌవనాశ్వుని సైన్యంబులు క్రమ్మఱం జుట్టుముట్టిన, మేఘవర్ణుండు మహార్ణవంబునం డిరుగు మందరనగంబు చందంబునం దచ్చమూ సముదయంబు గలగుండు వడం జేయుచుఁ, బరాక్రమించు సమయంబున, వృషకేతుండు తన మనంబున 'హయంబుం బట్టికొని వచ్చునప్పటి కయ్యంబున మేఘవర్ణుండు మిగుల నలసి యున్నవాఁడు. పెక్కండ్ర నొక్కనికి గెలువ శక్యంబు గాద'ని యూహించి, యనిల సుతునకు మ్రొక్కి శస్త్రాస్త్ర భీకరంబైన వైరి సైన్య నికరంబు సొచ్చి, యరుణారవింద జైత్రంబులైన నేత్రంబులం జురజురం జూచుచు, లయకాల హుంకారశంకాకరంబైన శింజినీ టంకారంబు దిశావిటంకంబులకు సంక్రమింపం, గోపాటోపంబునం దత్సైన్యంబుం జొచ్చి, మేఘవర్ణునకుం గౌతూహలంబు సంపాదించుచు, 'వత్సా, నీవు కయ్యంబున మిగుల నలసినాఁడవు. తలంచిన కార్యంబు నెరవేర్చితిమి. ముహూర్త మాత్రంబు బడలిక తీర్చుకొమ్ము'. అని భీము చెంతకుం బంచి, కంఠీరవంబు గంధగజయూథంబుపై నుఱుకు చందంబున నుఱికి, క్రొవ్వాడి మెఱుంగు తూపులనియెడు గోళ్ళచే భద్రగజకుంభస్థలంబులు పెకలించి, తురంగ సంఘంబులం దెగటార్చి, యరదంబులం జెక్కులుసేసి, కాలుబంట్లఁ కాలుని ప్రోలుకనిచి, రోదసీ కుహర మేదురంబైన సింహనాదంబు సెలంగఁ, ద్రిపురంబులపై గడంగు త్రిలోచనుని చందంబున, నిరర్గళంబుగ మార్గణ వర్షంబులు వర్షించిన, విదళిత మాతంగంబును, విధ్వస్త తురంగంబును, విశీర్ణశతాంగంబును, విఖండిత భటాంగంబునునై, యాసైన్యంబు చచ్చియుఁ నొచ్చియు జీకాకు పడుటయు నందొక్కరుండు బలుగాయంబుల నెత్తురు జొత్తిల్లు గాత్రంబుతోఁ బురంబునకుం బరువెత్తి, భద్రావతీశ్వరునకుం బ్రణమిల్లి, సైన్యంబు సమసిన తెఱంగును, యాగీయ వాజిం గొనిపోయిన చందంబును విన్నవించిన, యౌవనాశ్వుండు రోషారుణిత లోచనుండై, 'యెట్టెట్టురా! వింతలు వింటిమి! పరదళంబెంతవచ్చె? సప్తాంబెటువలెం బట్టువడె? విస రంబుగా నెఱుంగం బలుకు' మనిన 'దేవా, యెవ్వరో యెఱుంగము, మువ్వురు

వచ్చిరి. వారిలో నల్ల బాలకుండొక్కరుండు గగనంబున కెగసి డేగతూఱిన విధంబునం, దూఱి సేనా మధ్యంబున నున్న తురంగంబు నెత్తి మూపున నుంచుకొని, మీరంపించిన యంబర చరుల నాలుగు వేల రథికుల నంబరంబుననె సంహరించి, వెండియు నాబలంబుతో ఖండనంబు సేయుచు నుండఁ, బెద్ద నిట్టతాటి చెట్టు చందంబున లోకభీకరంబైన యినుప గుదియ కౌలంబూని యొకండు నిలిచియున్నాఁడు. వాని చెంగట సింగపు కొదమ తెఱంగున గర్జిల్లుచు నొక్క చక్కని రాచకొమరుండు కొలుచుచున్నవాఁడు.'

## -యౌవనాశ్వుండు భీమాదులపై యుద్ధమునకు లేచుట-

అని విన్నవించిన యౌవనాశ్వుండు, దన యిచ్చలో మచ్చరంబు నచ్చెరువు విచ్చలవిడిం బెచ్చుపెఱుగ, 'వారు మానవ సామాన్యులు గారు. కారణజన్ములు. నాకుంజూడఁ ద్రిమూర్తులు నరమూర్తులై వచ్చిరని తోచుచున్నది. ఒక్కండు గుఱ్ఱంబును బట్టుకొని పోవుటయేమి ? వేఱొక్కండు లెక్కకు మిక్కుటంబైన సైన్యంబు నుక్కడగించుట యెట్లు ? ఒకరుండు వేడుక చూచుచు నూరకుండుట యేమి ? ఐన, నశ్వమేధంబు సేయ వలయునని యతి ప్రయాసంబుగా నశ్వంబు సంపాదించితి, నది యిత్తెఱంగున బోయినఁ బోవనిమ్ము. ఇమ్మువ్వురితోఁ గయ్యంబను జన్యంబొనరించి దేవతలనెల్లం దృప్తినొందించెద' నని యాహవోత్సాహ కౌతూహలంబున నమ్మహీవల్లభుండు దిక్కులు పిక్కటిల్ల రణభేరి మ్రోయించి, మదపుటేనుంగులు, మనోజవ తురంగంబులు, మణిమయ రథంబులు, మహాసాహసిక వీరభటులు లెక్కకు మిక్కుటంబుగా దిశలు గ్రక్కదల నార్చుచు, వీరాలాపంబులం బేర్చుచు, నలుగెలంకుల బలసి చనుదేఱఁ, బురంబువెడలి సమీపంబునకు వచ్చి, యుగాంతకాల కాలుండు నుంబోలెఁ, బ్రచండ గదా దండంబు భుజాగ్రంబునం గీలించి, ఖండనంబు గనుచున్న వృకోదరు విలోకించి, లోకోత్తరంబైన తదీయ తేజోవిలాసంబున కచ్చెరువందుచు, నాయోధనంబున నాయోధులనెల్ల సమయించి, వింటి కోపునం జేయూదియున్న వృషకేతుంజూచి, శిరః కంపనంబు సేయుచు, యౌవనాశ్వుండు తన మనంబున, 'సాగరంబు మేఱ మీఱిన చందంబున

సపార చతురంగ బలంబుతో భూనభోంతరంబులు కంపింపఁ జేయుచు నెత్తివచ్చిన నన్ను సడ్డసేయక యనాదరంబుగఁ జూచుచు, సింహకిశోర బు కరణి శంకారహితుండై కర్మపాళ విసిర్ముక్తుండైన యోగిచందంబున, మరణ భయంబు లేక యుక్కుమారుండున్నవాఁడు,' అని సంతసంబు రోషంబు నగ్గలింప బలంబునకుఁ జేయివీచుటయు, వానిపయిం గడంగు వృషకేతనుం జూచి, మారుత నందనుండు రోష తామ్రాక్షుండై గదాదండంబు నంకించి కదలుటయుఁ, గర్ణ కుమారుండెదురుగాఁ బరతెంచి-

## -వృషకేతుండు భీముని నిలిచి చూడుమని కోరుట-

'అయ్యా, ఈ రెండు లోకంబు లెత్తి వచ్చినను మీకు సాటి గాదనినయెడ నీయల్ప సైన్యంబేమి లక్ష్యము! నీపుత్రుండగు నన్నుం దయచేసి చూచుచుండుము. నేనీ క్షణంబు కార్చిచ్చు చందంబునం జేర్చిన దళంబుల భస్మీకరించెద. తండ్రీ! కాయంబులు బుద్బుద ప్రాయంబులు. జవ్వనంబులు చంచలంబులు. బలంబులస్థి రంబులు. ఇంతయుం గలిగినప్పుడె త్రైలోక్య వర్తిని యైన కీర్తి నార్జింపవలయుం గాని, వ్యర్థంబుగా బ్రదుకం జనదు. గజ గమనంబు లనియెడి గమన విలాసం బులును, బాణంబులనియెడి భుజంబులును, జక్రంబులనియెడి స్తనంబులును, శంఖంబులనియెడి కంఠంబును గలిగిన శత్రుసేనారమణిని మున్నుగా నేను వరించినాఁడ. దానితోడం గ్రీడించి కీర్తియనియెడి సంతానంబుఁ గాంచెద. మీకుఁ జేర వావిగాదు. కోమలయైన సేనావధూటి మిమ్ముంజూచి వ్రాలుపతాకలనియెడి వ్యాజంబున మొగంబు వాంచుచున్నయది.' అనిన వాయు సూనుండు, 'కుమా రకా, సేనావధూటి నీకుఁ గైవసంబైన మిగుల లెస్స. అటుగాక నిన్నుం దల మీరెనేని, దౌదవ్వుల నస్మదీయ గదాప్రహారంబులఁ జేవయణంచి శిక్షించెద. మామగారు కోడలిని శిక్షించుట యుచితంబుగదా !' అనిపలికి, 'నీవు పాదచారివి. వారు రథికులు. నిన్ను నొంటిగఁ బనుపఁ జాల' ననిన వృష కేతుండు మారుత సూతిం జూచి, 'మీకటాక్షంబను వజ్రాంగి జోడు గలిగియుండ నాకు భయం బేమిటికి? చింత వలదు. నన్నుం బనుపు' మని, భీమునకుం బ్రదక్షిణంబు సేసి యుబ్బునం గబ్బు మీఱిన దేహంబుతోఁ గన్నులం గెంపు దొలంకఁ గాముకుండు కామినింగదియు చందంబునఁ, గెంధూళిఁ బొరసెడు కుంకుమ రసంబునలంది, సింగిణివిండ్లను కనుబొమ్మ లల్లార్చుచు, మెఱుంగుఁ దూపులను చూపుఁ దళు

కౌస్తుభము, గరికుంభంబు లనియెడు కఠిన స్తనంబుల నొప్పు మిగిలిన వైరి
సేనయను చానంగదిసి, వృషకేతుండు కౌతుకంబు నెమ్మొగంబునం జేసికొత్త,
మున్ను దన చేతం గూలిన చతురంగ బలంబుల నెత్తురులనియెడు సలిల పూరం
బులచే సాగరంబు తెఱంగునం గన్పట్టుచు, రుద్రవిహారస్థానం బగుటం జేసి కైలా
సంబుకరణి నొప్పుచు, విదళిత సైంధవం బగుట కతనం బార్థుని ప్రతిచందం
బునం దోంచుచు, శంఖ చక్ర సమన్వితం బగుట కతన శౌరిహస్తంబులం బోలె
చెలువొందుచు, నిజ నిశిత విశిఖంబులచే శకలితంబులైన రథగజతురగ పదాతి
గాత్ర ఖండంబుల చేత మిట్టు పల్లంబులైన సంగరాంగణంబు సొచ్చి, కార్ముక
జ్యారావంబును, ఘోర సింహనాదంబును, గనక పుంఖ చిత్రితంబులగు కంక
పత్రంబు లుల్లసిల్లం, గోదండ పాండిత్యంబు మెఱయ, వింట బాణంబుం దొడుగుట
తివియుట యేయుటయు నెఱుంగ రాకుండ, శరపరంపరలను వర్షంబు వర్షించుచు,
సమున్నిద్రంబైన రౌద్రరసంబు మూర్తీభవించిన చందంబునం గనుపట్టి, కుంభి
కుంభ స్థలంబులు పెకలించి ముత్యంబుల జలజల రాల్చుచు, నశ్వగాత్రంబుల
శకలంబులు వికలంబులు సేయుచుం, బరాక్రమించుచు నుండె.

## --యౌవనాశ్వ వృషకేతుల యుద్ధము--

ఇవ్విధంబునం జాప విద్యా నైపుణంబు సూపుచునున్న వృషకేతుం
గాంచి, యౌవనాశ్వుండు దంతావళంబు నెక్కి ధవళ చ్ఛత్ర చామరంబులు
మెఱయ దగ్గర వచ్చి, 'కుమారకా, ఆది విష్ణు దేవుండునుంబోలెం బ్రకాశించుచున్న
వాండవు. నీకులంబు గోత్రబు నామధేయంబు నెయ్యది? నీ తండ్రి తాతలెవ్వరు?
నీ రాకకు నేమికారణంబు? నీ చరిత్రంబు దెలియక యుద్ధంబు సేయరాదు కాన
నెఱింగింపు' మనిన, వృషకేతుండు 'కశ్యప మహామునీంద్రుడు మా వంశకర్త.
వేదమయుండైన సూర్యుండు మాతాత. త్రైలోక్య విఖ్యాత దానలక్ష్మీసముదీర్ణుం
డైన కర్ణుండు మా తండ్రి. నా పేరు వృషకేతుండు. మాపినతండ్రి ధర్మనందనుం
డశ్వమేధంబు సేయదలంచి నీ వశంబున యాగాయాశ్వమున్నదని విని, భీమ
సేను, నన్ను, ఘటోత్కచ పుత్రుండగు మేఘవర్ణుం బనిచె. ఆమేఘవర్ణుండు
తురంగంబు నపహరించె. నేను బలంబులం బొలియించితి. మాయయ్య వేడుక
చూచుచు నున్నవాడు.' అనిన నమ్మహీకాంతుండు సంతసంబునంది 'రాజనందనా,

ముహూర్త మాత్రంబు బడలికఁ దీర్చుకొనుము. చేయవలసిన వానితోఁ సంగ్రామము సేయరాదు. నీవు పాదచారివి. నేనేనుంగు నెక్కియున్నవాఁడ నడుచు నీతోడఁ గయ్యంబొనర్చుట పాడిగాదు. కనకమయంబైన యరదంబొసం గెదఁ గైకొని యుద్ధమునకు రమ్మ’ నిన, వేవెలుంగుల దొరమనుమండు, మొగం బునఁ జిఱునగవు తళుకొత్త, ‘నెవ్వాని పట్టణంబునఁ జెట్లు రాళ్లు పసులు సైత మఖిలార్థంబు లొసంగి యాచకులం బ్రోచు,నట్టియమర వల్లభుం డర్థియైవచ్చి వేఁడినఁ గవచ కుండలంబు లొసంగె,నట్టి దానశూరుండైన కర్ణునకుం గుమారుండ నైన నేను నీవలన నరదంబుఁ బుచ్చికొందునె? నీవాఁడెడు మాటలు వినిన సంధికి వచ్చిన యట్టులున్నయది. కాని సమరంబునకుగాఁ దోఁపదు.’ అనిన నారాజు నీవు బాలుండవు. మేము చాపవిద్యాప్రవీణులము. మున్నుగ నీవు పరాక్రమంబు జూపుము. నీ సామర్థ్యంబు చూచి మేము యుద్ధంబు సేసెద’ మనిన వృషకేతుండు నవ్వుచు,’ మున్నుగఁ దురంగంబుఁ బట్టితిమని చెప్పిన న్విని కోపాటోపంబున గృహంబు వెలువడి సకల దళంబులఁ గూర్చుకొని, ప్రతిజ్ఞలు వలుకుచు యుద్ధం బునకై బయలు మెఱసిన వారలు, తను పరాక్రమంబులు మెఱయింప వలెఁ గాని, ముందుగ నా ప్రతాపంబుఁ జూపితినేని మఱి నన్ను మెచ్చి యుద్ధంబు సేయు వారెవ్వరు? కాలమృత్యుముఖంబున బడిన పిమ్మటఁ గ్రమ్మర వచ్చుట యెట్లు? నీవు, పుత్రులు, పౌత్రులు, మిత్రులు బంధువులు, సింధురంబులు, హయంబులు, రథంబులు, నధిరోహించి, భేరులు బిరుదకాహళంబులు మొదలైన వాద్యంబులు మొరయ, బిరుద ధ్వజంబులు మెఱయ, పలువగల కైదువులు సారించుచు, కయ్యంబునకుం గాలుద్రవ్వుచు మెండుకొని యున్నవారలు. నీవు వృద్ధుండవు. నేను బిన్న ప్రాయంబువాఁడ. నన్నొంటి గాఁడని యనవలదు. కమలాక్షుని కృపాకటాక్షంబె నాకక్షయ బలంబు. పెక్కుమాట లేమిటికి ? తొలు దొలుత నీ గుఱ్ఱంబుఁ బట్టి తెచ్చితిమి. నీ చతురంగ బలంబులో సగము సమయించితిమి. తొలిపోటు మాదె కావున నీవె మార్కొను’ మనుటము, నా యౌవనాశ్వుండలిగి యేనుంగు దిగి, రథారూఢుండై గుణంబు మ్రోయించి, యిరువదియైదు సాయ కంబులు దొడిగి యేయుటయు, నక్కుమారుండొక్క బాణంబున ఖండించి, యర్ధచంద్ర బాణంబు నిగిడించుటయుఁ, గుటిలవర్తనులంగూడిన సజ్జనుని గుణంబు నమసినకరణి, యౌవనాశ్వుని ధవళచ్ఛత్రచామరంబులు తుమురమయ్యె. అంతటంబోక, మూఁడువాడితూపులు పింట సంధించి యొక్క బాణంబునఁ

జాపంబు, వేఱొక్క శరంబున గుఱ్ఱంబులను నొప్పించి, మఱియొక్క మార్గణంబున యౌవనాశ్వుని వక్షస్థలంబు నేయుటయు, నది యతని వఱితొమ్ము ప్రక్కలించుకొని వెన్నునడుస్సి, దబ్బరసాక్ష్యము పలికినవాఁడు ఘోరనరకంబునంగూలు తెఱంగున భూతలంబునంబడి, మరలఁ దెలివొంది, యరదం బెక్కి, యమ్మహీకాంతుండు వేఱొండు కార్ముకంబు కరంబునం బూని, సజ్యంబుగావించి, గుణస్వనంబున దిక్కులు గ్రక్కతిలంజేయుచు, నఱువది బాణంబు లొక్కపిడికిటఁ బట్టి, వృషకేతుని భుజమధ్యంబున గాటంబుగ నాటించుటయు, జిమ్మనఁగ్రోవులం జిమ్మిన చందంబునం గ్రొత్తనెత్తురు లెగసిన నక్కుమారుండు తరుణకిరణమాలిక కరణిం బ్రకాశించుచుఁ, గోలచే గొట్టువడిన బెబ్బులి కరణి బిట్టురోజుచు, నాలుగు వాలు తూపుల రథ్యంబులం గీటడంగించి, యొక్క మార్గణంబున సారథి శిరోధిం ద్రుంచి, బహు ముఖంబులైన శిలీముఖంబుల నజ్జననాథు మునుఁగనేసి, పందిరివెట్టిన కరణి శరకదంబంబుల నంబరంబుఁగప్పి రవికిరణంబుల మఱుంగు వరచి సింహనాదంబుసేసి, 'భూనాథుండు వొలిసెఁ బొలిసె'నని సైనికులెల్లఁ దల్లడంబంద నాగ్నేయాస్త్రంబు వింటఁ దొడిగి యేయుటయుఁ, బొగలుసెగలు మిణుంగురులు మంటలు మింటికి నంటఁ గడంగిన, నద్ధారుణీ రమణుండు వారుణాస్త్రంబున దాని నివారణంబు గావించినఁ, బంకజమిత్ర పౌత్రుండంతటం జోక వాయవ్యాస్త్రంబును సంధించిన, నమ్మేదినీనాథుండు పర్వతాస్త్రంబుఁ బ్రయోగించుటయు, నేనుంగులం బోలిన జాలుజుప్పుచు వచ్చు నయ్యస్త్రంబుమీద వజ్రాస్త్రంబుఁ బ్రయోగించి తత్పాషాణంబుల జూర్ణంబుసేసి,

## —వృషసేనుండు మూర్ఛిల్లుట—

హాలాహల విషజ్వాలలఁ గ్రక్కు వాలు తూపులపారంబుగా నిగిడించిన, నమ్మహీనాథుండొక్క భల్లంబునఁ దనపక్షంబు పెల్లగించిన, రవికిరణసంకాశంబైన యొక్క మెఱుగుటమ్ము రాజ భుజ మధ్యంబున నాటించి తాను మూర్ఛిల్లిన, భీమసేనుండు రణరంగంబునం బడియున్న కుమారుం గాంచి, కనుగవ జేవురింప, నవుడు గఱచి, యాంబున యౌవనాశ్వనృపాలునిఁ బుత్ర మిత్ర బంధుసేనాసమేతంబుగాఁ గాలుని పురంబున కంపకయే యీ బాలుని కొదవ దీఱదనుచు, నుద్దంఢ గదా దండంబు సారించి, రెండవ దండధరుండునుం బలె, ఖండనంబునకుం గడంగి, నితాంత కోపంబునఁ గొండలంబోని యేనుంగు

తండంబులం గనుపు గొట్టిన నప్పట్టున నెడలు నెత్తురు చేరు ( పారంబులై పారినం, బారవశ్యంబున నవ్వలద వెంబడింబోవు వాహనంబులు నా నెత్తురుచేటి యుభయ తీరంబులందును జొత్తు పాపలుం బలె నెమ్ముల తిత్తులై పడిన, రాహుత్తులును ప్రవాహవేగంబునం దలక్రిందులుగా డుల్లిన రథంబులును, రథంబుల చెంగట యమరపురంబునకుఁ బథికులైన రథికులును, కాలుకాలుం బెనచికొని తేలియాడు కాల్బలంబును గలిగి యాలంబు త్రిజగదాభీలంబయ్యె నప్పుడు, భీముని యూరు వేగంబునం బొడమిన చండ మారుతంబులు విస విస విసరినం, జతురంగ బలంబు బొందెతో స్వర్గంబునకుం బోవుకై వడి, సూర్యమండల పర్యంతంబు నెగసి యందుండి కాలుఁ గేలుఁ గీలువీడి పడునట్లుగ, విష్ణుద్రోహులు నరకంబునఁ గూలుకై వడి భూతలంబునం బడియె. మఱియు నవ్వృదముడి మ్రోకాలివేగంబునఁ బిక్కల వలనం బుట్టిన ఝంఝూమారుతంబు విసరినం, బెల్లగిల్లిన దంతంబులు, భగ్నంబులైన కుంభ స్థలంబులు, విఱిగిన చరణంబులుం గలిగి పీనుంగులైన యేనుంగులును, దనిసిన గళంబులుఁదెగిన ప్రేవులుఁ జెక్కులైన డొక్కలుంగలిగి చాఁపకట్టుగాఁ బడిన తురంగంబులును, జక్కులైన చక్రంబులును, నుగ్గనూచములైన నొగలును, విరిగిన కేతనంబులును విటతాటంబులైన యవయవంబులునుం గలిగి, శకలంబులైన యరదంబులును, పడుగులు పేకి కుత్తుక వెంచి పెదరూపంబులఁ బడిన వీరభటులునుం గలిగి సంగరాంగణంబు ఘోరంబయ్యె.

## —సువేగ భీమసేనుల గదాయుద్ధము—

అప్పుడు యౌవనాశ్వ కుమారుండగు సువేగుండు రథముడిగ్గి, మహోగ్ర గదాదండంబు సారించుచు, భీమునిం డాసి, వాసిమెఱయు, శిరంబుఁ నురంబుఁ బ్రక్కలుం జెక్కులు నొప్పించి, యల్లటంబోక సుడిగాలి తారునం బేరెంబులు వాటి, పతని గదాప్రహారంబుల మైమెలకువచేఁ దప్పించుకొని, యుప్పరంబునకెగిసియు, దిక్కులరికట్టియు, విచిత్రవిహారంబులు సలిపిన, నవ్వృదసుది గడపొదలికలు మెఱయఁ గుడియెడమలం జడియుచు, నొడలు దగులంగొట్టుచు, మండలప్రచారంబు గోమూత్రికా బంధంబుల సంచరించుచుఁ, గోలాటలాడు చందంబునఁ, గీలుబొమ్మలు నటించు వైఖరి, నాణెంబులైన విన్నాణములఁ ద్రాణలు మెఱయుంచుచు, గదలమర్చుకొని గగనము గదల నార్చుచు

నొకరొకరిని మెదలనీయక, పొదలికలుం గదలికలు మెఱయుం బెద్దయుం బ్రొద్దు
గదా యుద్ధంబు సేసియుం గసిదీఱక, గదలు దిగవైచి యాత్రైలోక్య
మల్లులు మల్లయుద్ధంబునకుఁ జొచ్చి, పాయుచున్ డాయుచుఁ జుట్టుకొనుచు వదన
వక్షోబాహు దేశంబులం దగలఁ బొడుచుచు 'మేలు, హైసరె, మాయన్న,
హేయిరే!' యని మెచ్చుచు, బాహాబాహిఁ గచాకచిం దొడరి, ప్రాబల్య దౌర్బ
ల్యంబులు లేక తుల్యంబుగా మెలంగిరి. అప్పుడు భీమసేనుండు సువేగునిం
జొచ్చి పడవైచి చరణంబులొడిసి పట్టి బిఱబిఱఁ ద్రిప్పి వేసిన, భూతలంబు
సోఁకి సోఁకకమున్న బంతిచందంబున నెగసి, వాయుతనూభవు నట్లు చొచ్చి పట్టి
వ్రేసిన, నవ్వడముడియు భూతలంబునం బడక నెగసి, దట్టంబులై పడియున్న
ఘోటక గజ కళేబరధట్టంబుల వైచిన, నవ్వీరుండు ముంజేత నొడ్డుచు దండెవెట్టి
కఠోర ముష్టిఘాతంబుల నొప్పించిన సమీర కుమారుండు వాని పెట్టు తప్పించి
కర్ణ కంఠగండ ప్రదేశంబులం బిడుగులం బోని పిడికిళ్లం బొడిచిన, వాఁడునుం
బొలివోవని బంటుతనంబున నొడ్డుకొని యఱచేతి పెట్టులఁ, బెడచేతి దెబ్బల,
ముష్టి ప్రహారంబుల, జానుఘాతంబుల నొప్పించిన, నాజగజెట్టు లొండొరుల
పెట్లవలన మూర్ఛల మునింగి పుడమిం బడిరి.

అంత వృషకేతనుండు కొంతవడికిం దెప్పిరి వదలిన కేశపాశంబు బిగి
యించి, యెప్పటి యట్ల కిరీటంబు ఘటియించి, నుమటిపయిం గనుపట్టు చెమట
బిందువులు చేలాంచలంబున నార్చుకొని, బలువిల్లు పిడికిటం బదిలంబుగాఁ బట్టి,
యెదుటనున్న విరోధి నీక్షించి ఱెక్కల తోడి పెనుఁబాము చందంబునఁ గుంద
నంపుఁ బింజల రంజిల్లు నైదుబాణంబు లొక పిడికిట నాకర్ణాంతంబుగాఁ దిగిచి,
యయిదు ప్రాణంబులు గొను తెఱంగున నమ్మండలేంద్రుని వక్ష స్థలంబుఁ
దూఱనేసిన నతండు నెత్తురు గ్రక్కుచు మూర్ఛమునింగి మరణంబు నొందిన
కరణి మేనుమఱచి, నిశ్చేష్టితుండై రథంబు మీఁద బోరగిలం బడుటయు, వృషకే
తుండు కరుణాకలిత మానసుండై, 'అక్కటా! క్షత్ర ధర్మంబింత క్రూరంబగునే?'
యని గర్హించుచు, నతని రథంబు మీఁదికరిగి, గాయంబులం దొరంగు నెత్తురు
కేలం దుడుచుచు, వృద్ధుండైన యమ్మహీధవుని శిరంబునకు దాపుగాఁ దనయూరు
కాండంబు నునిచి, తనువున నాటియున్న బాణంబులు తివిచివైచి, యుత్తరీ
యంబున గాయంబులొత్తి యొత్తి, తన బంగరు దట్టి ముంగొంగుచే నెమ్మొ
గంబున విసరి, యుచ్ఛ్వాస నిశ్వాసంబులును, హృదయంబునుం బట్టి చూచి,

'శ్రీ హరీ, నిర్వ్యాజ కృపాలహరీ, ప్రత్యహంబును నీపాదారవిందంబులే భజియింపుచు దేవతాంతరంబు నెఱుంగకుండితినేని, సుకృత శాలియు, సుగుణ హారుండును, బరాక్రమ విజిత శూలియు, మహాశూరుండును నైన యీ రాజేంద్రుండు బదుకుంగాక !' యని, శ్రీకృష్ణచరణారవింద యుగళంబు మనంబునం దలంచి, తలంచి, యగ్గాయంబు లభిమంత్రించిన, నెత్తురులడంగి, ప్రాణంబు కుదురు పడి, యుచ్ఛ్వాస నిశ్వాసంబులు యథాపూర్వంబుగా నిగుడ, ఱెప్పలల్లార్చి, లోచనంబులు విచ్చి కర్ణసుతుని మొగంబుసూచి లేచి కూర్చుండుటయు, వృషకేతుండు చివ్వన నతని రథంబు డిగ్గి నుఱికి తొంటి దిక్కునకు వచ్చి, విల్లు గైకొని, గుణధ్వని గావించిన, యౌవనాశ్వ మహీశ్వరుం డక్కుమారుని శౌర్య ధైర్యంబులుఁ గరుణా పరత్వంబునుంగాంచి, సంతోషభరితమానసుండై, శరశరాసనంబులు పైచి రథంబు దిగివచ్చి, కౌఁగిలించుకొని, 'కర్ణనందనా, నందనందనుండు, నరవిందనందనుండు, నిందుశేఖరుండు సాక్షిగా నన్ను రక్షించితివి. ప్రాణదానంబు సేసిన నీతోడ సమరంబునకుం గడంగితినేని, నాకంటెనె యెవ్వాడున్నాఁడు ? మీ తండ్రియైన కర్ణుండు నిఖిల దానంబులు సేసెఁగాని పోయిన ప్రాణంబువెచ్చి యిచ్చినవాఁడు కాఁడు. జయలక్ష్మీవల్లభుండవైన నీకు సామ్రాజ్యభాగంబులన్నియు సర్పించి కమల పత్రాక్షుండు గౌస్తుభ వనమాలికా కలిత వక్షుండును, యాదవ కులోత్తంసుండును, వేదశాస్త్ర కృతప్రశంసుండును నైన కంసారిం గొలుచుచు సంసార బంధంబుల నిరసించెద' నని పలుకుచు, నాతని సఖ్యంబు సేసికొని, సువేగుండును భీమసేనుడున్నచోటికి వచ్చి, వృషకేతుండు తన్ను రక్షించిన చందంబు వారలతో వివరించి, 'అనిలనందనా ! ఈ శిరంబు మీరిచ్చినయది. ఈ క్రతుహయంబు వెంట నన్నుంబనుపుము. నేనె దిక్కుల రాజులనెల్ల జయించి ధర్మజు సముఖంబునకు వచ్చెదను. అదియుంగాక, యైరావత కుంభ సంభవంబులైన పదివేల యేనుంగులు ధర్మజునకు సమర్పించెద. దయాసముద్రుండు, ననంత కల్యాణ గుణసమున్నిద్రుండును, బురుషోత్తముండునైన యదూత్తముని చరణారవిందంబులు నత్తమిల్లి పుత్రమిత్ర కళత్రాది బంధు సమేతముగా నా సర్వస్వంబు సమర్పణం బొనరించెద. విశేషించియును బ్రాణదానంబు సేసిన వారితోడి యుద్ధంబసంబద్ధంబు గావున, మీకు నేను మాన్యుండను'. అనియెడి రాజన్యుని సౌజన్య వాక్యంబులకుఁ బరితోషంబు నొందిన పవననందను సమీపంబునకు మేఘవర్ణుండు సవనహయంబునుం గొనివచ్చె.

## -యౌవనాశ్వుండు భీమాదులతో భద్రావతికేగుట-

తదనంతరంబ చిత్రవర్ణంబులును, రత్నపరిస్తీర్ణంబులునైన మెత్తలు,ఘణం ఘణిత దిగంత రాళంబులైన కాంచనఘంటికా జాలంబులును,శరచ్చంద్ర చంద్రికా డంబరంబులైన కర్ణ చామరంబులును,బౌరసుందరీ మందగమన సమానంబులైన గంభీర యానంబులును, గ్రమ్ము తుమ్మెదలకు సమ్మోద ప్రదంబులైన యష్ట మదంబులును, వజ్రవలయ ప్రభాధవళిత దిగంతంబులైన దంతంబులును, గైరికాది ధాతురసకల్పిత చిత్ర తిలకంబులైన గంధసింధురంబుల మావంతులు బంతులుగాఁదెచ్చి నిలిపిన, యౌవనాశ్వ పృథివీశ్వరుండు భీముండు దాను నొక్కొక్క వేదండంబును, రెండు శుండాలంబుల,మార్తాండపౌత్రుండును,ఘటోత్కచ పుత్రుండుగానెక్కి,లెక్కింపరాని సేనలు క్రిక్కిరిసి నలుదిక్కులంగొలువ, వంది మాగధ బృందంబులు బిరుదావళులు వంశావళులంజదువ,భేరులు ఢమాములు, ఢక్కలు, హుడుక్కలు, దమ్మటలు, గుమ్మెటలు,మురజంబులు, కరగజంబులు, కాహళంబులు, జయదోహలంబులైన శంఖంబులు, ననంఖ్యంబులుగా మొరయఁ, గదళికా స్తంభంబులు, పోఁక మ్రాఁకులు,చూత పల్లవ సముల్లసిత తోరణంబులు, కాలాగురు సాంబ్రాణి ధూపంబులు, మొదలైన యలంకారంబులం బొలుపారు గోపుర ద్వారంబు సొచ్చి, యచ్చట, బచ్చవిలుకాని తేజీ కూనలంబోని చానల, వలకారి చూపులనియెడు వలలందగిలి చుట్టట్టు గదల నేరక జిట్టలచందంబునఁ జిట్టకంబులం బొదలు చిట్టివిటులచేత హరువులైన నెఱి తెరువులును,మొత్తంబులైన ముత్తియంబులు, సొంపులైన కెంపులు, పచ్చికలం దచ్చనలాడు పచ్చలు, నిగరాల మగఱాలును, జగడంబులైన పగడంబుబును, ముంగిళ్ళ నత్తమిల్లిన యంగళ్ళ నునిచిన మంగళ ద్రవ్యంబులును, నంతరిక్షంబునఁ గొంతులు వింతలు పొంతలుగ సంచరించు వైజయంతికలును, భూసురాశీర్వాద పురస్సరంబుగా సువాసినీ జనంబులు సల్లు తెల్లని పూవుల నక్షతలం దేజరిల్లు రాజమార్గంబునంజని, నవరత్నకచితంబైన హజారంబు సేరంబోయి,మద దంతావళంబులు డిగ్గి, హితులఁ బురోహితుల మంత్రుల సామంతుల నిండ్ల కనిచి, యౌవనాశ్వ విశ్వంభరాధీశ్వరుండు భీమ వృషకేతు మేఘవర్ణులతోడంగూడ నంతిపురంబు నకుంజని, హాటక మయంబైన కొలువు కూటంబున సింహాసనంబు నందు సుఖాసీనులై యుండిరి. అప్పుడు యౌవనాశ్వుని భార్యయైన ప్రభావతి, సఖీజనులుఁ

దానును బంగరు మెఱుంగుం బళ్లెరంబున ముత్తియంబులఁ బగడంబులఁ గూర్చిన రంగవల్లికలు రంగమరఁ, గర్పూర దీపంబులు వెలుంగఁ, జెలంగుం జనుదెంచి, 'సంగరంబునఁ దనదు మంగళ సూత్రంబు సంగతిగ నిలిపిన సదయునకు జయమంగళం నిత్య శుభమంగళ'మ్మనెడు పాటలు పాడుచుఁ, గర్ణ కుమారుని కీర్తిలోకవిఖ్యాతంబగుగాక యని దీవించి, వారలకు నివాళిదీసి, యప్పరమ సాధ్వి యంతిపురంబునకుం జనియె.

తరువాత వరుణకాంతలు జలకంబులాడుచు, సన్నెకంటిమీద నునిచిన పసుపు ముద్ద చందంబున, నరవింద మిత్రుండస్తగిరి శిఖరంబు నలంకరింపఁ, గాటుక పొడి చల్లిన తెఱంగునఁ జీకటులు నలుఁగడల నల్లుకొనియె. క్రేపులఁ దలఁచి మందలనున్న యావులు తిరుగం బడియె. పక్షులు గూండ్లకు బంతులు గట్టె. కమల వనంబులు సొగసె.కలువలు విరిసె. అవ్వేళ గబ్బిగుబ్బెతలు తెచ్చిన బంగరు కుంతలసలిలంబుల సంధ్యావందనాది కృత్యంబులు నిర్వర్తించి, యౌవ నాశ్వుండు భీమసేన వృషకేతు మేఘవర్ణులును, దక్కుంగల బాంధవులును, బంతి గూర్చుండి బంగరు పళ్లెరంబులు, పటికపు గోరలు, మగజాల గిన్నెలు, కుందనపు గిండ్లు నునుచి, చలువ పరకాళ కుచ్చెళ్ళ పెకపెళలు, మగరాల కమ్మల ధళధళలు, మొలనూలి చిఱుగంటల ఘణంఘణలు, కంకణంబుల ఝణం ఝణలు, కీలందియల ఝళం ఝళలు, మట్టియల గిలుకు గిలుకులం గులుకులు, మెఱయఁ, గొమరు ప్రాయంపు బడంతులు చతుర్విధాన్నంబులు నింపుతో వడ్డింప, రుచుల నుతియింపుచు భోజనంబు గావించి, గంధోదకంబులఁ గరపద ప్రక్షాళనంబు చేసి, గంపపొళ్ళం జేతులార్చుకొని, యూడిగంబులు కరంపు వీడియంబు లందీయఁ గొలువునం గూర్చుండి, పవన నందనుని కోప ప్రసాదంబులు, వృషకేతను విక్రమంబును, మేఘవర్ణు నేర్పును వినుతించి, ధర్మనందన వసుదేవనందనుల సందర్శనంబు సేయఁగలిగెఁగదా యని తన పూర్వ పుణ్య పరిపాకంబునకు మెచ్చుచుఁ బట్టణంబునఁ జాటంబనిచి, మగసాలె పట్టుసాలె కుమ్మరి కమ్మరి చిత్రకార కలాద ప్రముఖులు, రజక క్షౌరక శిల్పా చార్య ప్రభృతులునైన పదునెనిమిది జాతుల వారిం బయనము సేసి, తన యొద్దనున్న మన్నీల వజీరుల రాజులంజూచి, 'మీమీ యంతిపురంపుటింతులతో దంతి పురంబునకుం జనుండు. కుంతీ ద్రౌపదీ ప్రముఖ కాంతా జనంబుల

గనుంగొని, ముకుంద చరణారవిందంబులకు మ్రొక్కి, గంగా తరంగిణిలో నశ్వమేధావభృథ స్నానంబులు సేసి, పావన మూర్తులరై వత్తురుగాక, యని యాజ్ఞాపించి, సుతుండగు సువేగునింజూచి, నీవు సకల దళంబులం దోడ్కొని మున్నుగా హస్తినాపురంబునకు నీ జననియగు ప్రభావతి తోడంగూడ నీపల్లకుల మున్నిడుకొని పొమ్ము.'

## -ప్రభావతి మౌఢ్యము -

అని యాజ్ఞాపించిన నతఁడంతి పురంబునకుంజని తల్లికి మ్రొక్కి, 'అమ్మా, ధర్మనందనుని యజనంబుఁ గనుగొనుటకు, గరినగరంబునకుం బోవలెఁ బయనంబుగ' మ్మనవుడు, నవ్వనిత కోపించి, 'పుత్రకా, నీకేమిటికి వెఱ్ఱిపట్టె? ఈ ధనంబు లీధాన్యంబులు నీరూకలు నీకోకలు నీయిండ్లు మొదలగు సంపదలు, వీటిఁబుచ్చి నన్నెందుకు వెడలి రమ్మనియెదు? మదిమది నుండి రాజ్యంబువిడిచి పోవుటకు నీకేల బుద్ధిపుట్టె? పురజనులు, మీరలు నెచ్చటకేని యుంబొండు; నీవేమి చెప్పిన నేవచ్చుదానంగాను.' అనిన సువేగుఁడు, 'అమ్మా, ఇంత మూఢత్వంబు, నింత సంసార భ్రాంతియు, నీకేల వచ్చె? ధర్మజుని అశ్వమేధంబున వేదవ్యాస ప్రముఖులైన మహామునులును, నింద్రాది దేవతలును, దేవ దేవుండైన వాసుదేవుండును, రుక్మిణీ సత్యభామా ప్రముఖలైన యద్దేవుని పట్ట మహిషులును, జనుదెంతురు. వారల సందర్శనంబు వలనఁ బంచ మహా పాతకంబులు బంచ బంగాళంబులై పాఱి పోవుం గావున మఱు మాటాడక లేచి రమ్మ'నిన, 'నోరీ! మా తాత తరంబున, మా తండ్రి తరంబున నా తరంబున నణుమాత్రం బేని పుణ్యంబు సేసి యెఱుంగను. ఈ ముదుసలి వయసున నీ తొడుసులు నాకు వలదు. ధర్మనందన వసుదేవ నందనుల దర్శింప కున్న నాకు గోరంత కొఱంతలేదు. ధర్మజునకు యాగంబు మీఁద విశ్వాసంబు, శౌరికి ధర్మ రక్షణంబునఁ బ్రేమ. నాకు సంసారంబు మీఁదఁ భ్రాంతి. ఇది యెవ్వరికిం దప్పింప శక్యంబు కాదు. వేయేటికి? నేను యాగంబునకు వచ్చు దానను గాను, వలయునేని మీరు సనుండు.'

అనిన సువేగుఁడు యౌవనాశ్వ భీమసేనులకు నాయమ్మ పల్కులు పల్కరించి కొంత తడవు నవ్వించి, యంతటం బరిచారికాజనంబులచే నయ్యంబం

బట్టి తెప్పించి మొత్తోయని కూఁతలు వెట్టుచు నీడిగిలంబడ, నెట్టకేలకుం దిగిచి యందలంబుపై నిడికొని కరిపురంబునకుఁ బయనమయ్యె. పల్లకులం దలంబులు, భద్రగజంబులు, కొలారుబండ్లు, గుఱ్ఱపు మోటులు, వేసడములు, మహోష్ట్రములు, మొదలైన వాహనంబులెక్కి, పురంబులోనంగలుగు బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది పౌర జనంబులు రాజుకంటె నయిదు దినంబులు మున్నుగా హస్తపురంబునకుం జనిరి. కరితురగ స్యందనములు, వీరభట సమూహంబులిరు వంకలఁ గొలువఁ, జలువలు వెదజల్లు వెల్ల గొడుగుల నీడ, యువనాశ్వ వృషదశ్వ తనూజులును, గుఱ్ఱముతో వృషకేతు మేఘవర్ణులును, గతి పయ ప్రయాణంబుల హస్తినాపురంబునకుఁ జేరవచ్చుచుండ, నిరువదియామడ దూరంబున నిలిచి, భీముడు యౌవనాశ్వుంగాంచి, 'కాంచనాహార్య ధైర్యా, మీరు విజయంబుసేయు విధంబు మున్నుగా మా యన్నతో నెఱింగించి యెదురుగ తోడి తెచ్చెద. వృషకేతుండు మిమ్ముం గొలిచివచ్చు' నని పలికి, శీఘ్రంబుగఁ గరిపురంబునకుం జని యంద నవరత్న ఖచితం బైన సభామందిరంబున బంగరు సింగపు మోము గద్దెయందుఁ దమ్ములు గొలువ, దెంతవ యాఖండలుం డన, నిండోలగంబైన యగ్రజుంగాంచి, సవినయంబుగా సాష్టాంగ నమస్కారంబు గావించిన, నతండు దీవించి, దిగ్గనలేచి కౌఁగిట జేర్చుడు నర్జునుండును, మాద్రీనందనులును దనపు వందనములు సేసిన, వారల నభినందించె. అంతఁ గౌంతేయాగ్రజుండు 'సమీర కుమారకా, సేమమే?' యని యడిగినఁ గరకమలంబులు ఫాలతలంబునఁ గీలించి 'రాజోత్తమా, యుత్తమంబైన నీ కరుణ గలిగి యుంత సేమంబునకుఁ గొఱంత యేమి? భద్రావతీశ్వరుండగు యౌవనాశ్వుం డశ్వమేధాశ్వంబుఁ గొనివచ్చె. విశ్వంబున నీ కీర్తి శాశ్వతంబుగా వర్తించు. అతని సతి ప్రభావతి సఖీ సహస్రంబుతోఁ బాంచాలిని కనుగొన వచ్చుచున్నయది. వృషకేతుండు భండనంబున నప్పుడమి జేసి మెప్పించె. మేఘ వర్ణుండు సాప ఘళంబుగా నధ్వరాశ్వంబుఁ బట్టి కొని వచ్చె' ననిన, ధర్మనందను డానంద కందళితాంత రంగుండై 'మన విజయంబు యాజ్ఞ సేనికి నెఱింగించి రమ్మ'నిన, నతండు నంతిపురంబునకుఁ జనినఁ, గనక పీఠంబునం గమల కర్ణికాసీనయగు కమలాదేవి కరణింగూర్చున్న ద్రౌపతి దిగ్గన గద్దియ డిగ్గి, యెదురు వచ్చి వాయు తనూభవుం గనక పీఠంబున నునిచి, 'విజయంబు గలుగ విజయం చేసి తిరే? కర్ణనందనుఁడును' నా మనుమఁడు మేఘవర్ణుండును సేమంబున నున్న వారె?' అని యడుగుచు నతని కడింది ఱొమ్మునఁ గనుపట్టు వెడదగాయంబులు

కర కమలంబుల నిమురుచుఁ గుశల ప్రశ్నంబులు వేసిన, 'భద్రేభయానా, భద్రావతీశ్వరు రాణియగు భద్రావతీ ముంజువాణి వేవురు చెలులతోడంగూడ నిన్నుఁ జూడ వచ్చుచున్నయది. కావున నీవు నలంకరించుకొని యమ్మింతుఁ జోడికి నెదురుఁగ రమ్ము. మనకు రక్షకుఁడైన పుండరీకాక్షుండు ద్వారకానగరంబునకు నరిగెనో ? ఈచ్చట నున్నవాఁడో ?' యని యడిగినఁ గృష్ణ యిట్లనియె. 'ఆ శ్రీ కృష్ణుండు నల్లదె నీలంపు టుప్పరిగలో నున్నవాఁడు, అనిన సంతోష 'భరితాంత రంగుఁడై. నీమందిరంబున నిందిరా కాంతుం డున్నవాఁడు గావున నీవు ధన్యవు. తామసింపక శృంగారంబు సేసికొని యంగనాజనులు, నీవునుం బ్రభావతికి నెదురుగా రండని' పలికి యనిలనందనుండు చనినఁ, బాంచాలియుఁ బన్నీట జలకంబులాడి, వెన్నలన్నిరసించు సన్నహొన్నంచు వలువ విన్నాణంబుగాఁ గట్టి, నెఱికురుల విరులు ముడిచి, సిస్తుగాఁ గస్తూరి రేఖ ఫాలతలంబునం దీర్చి, తారహారంబులు, హీర కంకణంబులును, జారు కాంచీమంజీరంబులు మొదలగు సొమ్ములు ధరించి, యలంకృతలైన సఖీసహస్రంబులతోఁ గూడ జీవ రత్నంపుగుంపుల నుల్లసిల్లు పల్లకిపై నెక్కి, హల్లక పాణులు వింజారమంబులు వీవ, నంతః పుర సంచారులగు కంచుకులు సందడి యెడగలుగం, జడియ వెడలు నపుడు యుధిష్ఠిరుండును, నచ్యుతుండును, శృంగారితంబులైన యేనుఁగుల పై నెక్కి, శంఖ కాహళ దుందుభి మృదంగ పటహ మురజ ఝల్లరీ జర్ఝరీ డిండిమ ప్రముఖ వాద్యంబులు, భూన్నభోంతరంబున బోరు కలంగ మ్రోయ, నెదురు వచ్చిన, యౌవనాశ్వుండధ్వరాశ్వంబు గానుకగా నునిచి, దండ ప్రణామంబు సేసినం, బాండవాగ్రజుండేనుంగు డిగ్గి, యానృపాలునిం గౌఁగిటంబొదివి 'నరవరేణ్యా ! భీమార్జున నకుల సహదేవులట్ల నీవును నాకు నొక్క సహోదరుండవు. ద్రౌపదితోఁగూడఁ బ్రభావతి నంతిపురంబునకుఁ బంపుమ, నుటయు నతండు నట్లకావించె

తదనంతరంబ, యౌవనాశ్వ మహీశ్వరుండు గోవిందుని పదారవిందంబులు తన శిరంబున సోఁకం బ్రణమిల్లి, 'ముకుందా, నందనందనా, అరవిందనయనా, ఇంద్రాదివందితా, భవదీయ పాదారవిందంబులు దర్శింపఁగంటిఁ గావున నా జీవనంబు సఫలంబు. భవదీయ భక్తులైన వృషకేతు మేఘ పర్ణులు మెట్టిరిగావున మా పురంబు సిరులకుం గాపురంబు. ధర్మజుని జన్నంబున

కొదవెంగావున నీ తురంగమంబును జనహృదయంగమంబు. ఇన్నిటికి శేఖ రంబుగ నీకు జోడు కోడెయైన యర్జునిం జూడఁగలిగె' నని పలుకు నవస రంబున, సవ్యసాచి యవ్విశ్వంభరాధీశ్వరుఁ బరిరంభణంబొనర్చి, 'నీవు నాకు ధర్మనందనునట్ల పూజ్యుండవు. నాచేసిన పురాకృత పుణ్యంబున నీ సందర్శ నంబు గలిగె,' నని కొని యాడె. అప్పుడు పాంచాలికిఁ, గుంతీదేవికిఁ, బ్రభావతి చాగిలి మ్రొక్కిన, వారలక్కోమలి నక్కునం గదియించి మిక్కిలి గారవించిరి. అంత భద్రావతీశ్వర పుత్రుండైన సువేగుండు, ధర్మజ ప్రముఖులకు వంద నంబు సేసి, 'కర్ణనందనుని కతంబున శ్రీవాసుదేవ చరణారవిందంబులు సేవింపగలిగె. మా భాగ్యంబు నెంతని వినుతింతుము ? ఇంక, సర్వకాలం బులందును నద్దేవుని చరణ కమలంబులు స్మరియింపుచు నుండ గలవారము. శ్రీకృష్ణునికి నర్పితంబుగాని రాజ్యంబు ధనంబును వ్యర్థంబులు. మఖతురంగంబు వెంట నన్నుఁ బనుపుము. ఎదిరించు మేదినీపతుల నెల్ల చెల్లాచెదురుగాఁ బాఱంద్రోలి, నేన యశ్వంబు రక్షించుకొని వచ్చెద,' నని పలికిన సువేగునిఁ గౌఁగిటంజేర్చి, శ్రీహరి, కరుణా కటాక్ష వీక్షణంబుల వీక్షించె. వృషకేతుండును నందనందన పురందరనందనులకు వందనంబు గావించిన, నందఱుం బ్రమోద కందళిత మానసులై కరినగరంబునకుం జనుదెంచిరి. అంత, రుక్మిణీకాంతుండు దంతిపురంబున నొక్కనెల వసియించి, ధర్మతనయుం జూచి 'యిందునకుఁ బదునొకండవ నెల చైత్రశుద్ధ పౌర్ణమాసినాఁడు జన్నంబు నొనర్చుట ముఖ్యంబు గావున నిప్పుడుగ్రసేన భూపాలకునిచే సంరక్షితంబైన ద్వారకాపురంబునకుం జనియెద. యౌవనాశ్వ, నర్జును, భీమునిం దక్కిన యోధులను దురగంబుఁ గావం బంపవలయు. నీవు ద్రౌపదీ సమేతంబుగా యాగదీక్షఁగైకొని సావధా నంబుగా నుండదగినయది. యాగ దీక్షాకాలంబున మమ్ముం బిలిపించితివేని బంధుమిత్రసమేతంబుగా వచ్చెద' నని పలికిన, గోవిందుని కందువ యెఱింగి కుంతీనందనుండు బహువిధములగు బహుమానములు గావించి వీడ్కొలిపిన, సంపత్పారంపరీ నిర్జితాలకాపురంబైన ద్వారకా పురంబునకు వనజాక్షుండు విజయంబు సేసె.

## -వ్యాసుఁడు మరల వచ్చుట-

తదనంతరంబ కృష్ణద్వైపాయన మహామునీంద్రుండు సన్నిహితుండ గుటయు ధర్మతనయుండు వినయంబున వందనంబు సేసి, యర్ఘ్యపాద్యాది

విధులం బూజించి, నవరత్న పీఠమున నునిచి, కృతాంజలియై, 'మహాత్మా, మున్ను మరుత్తుండను మహారాజు యాగం బెవ్విధంబునం జేసె? నానతి యొసంగ వలయు' ననిన, వ్యాసమునీంద్రుఁడు నరేంద్రునింజూచి, 'తొల్లి హరిధ్యాన సమాయత్త చిత్తుండైన మరుత్తుండశ్వమేధం బొనర్పఁగోరి బృహస్పతి నాచార్యునిగా వరించిన, నింద్రుండసూయచే నతనిఁ బోవలదని నివారింప, నతని తమ్ముండైన సంవర్తుని గురువుగా వరియించి యాగం బొనర్చునపు డింద్రాగ్నులు విఘ్నంబు సేయందలంచిన, వారల నిరాకరించి యాగంబు నెఱవేర్చి యామరుత్తునకు వరంబులొసంగి సంవర్తుండు యథేచ్ఛంబుగాఁ జనియె. అన్నరేంద్రుండు సర్వ భూత నివాసుండైన శ్రీనివాస దేవుని సాయుజ్యంబు వడసె' ననిన, విని, యమ తనయుం 'డేధర్మము వలన నరుండు భవ బంధంబులఁ దరించు? నా ధర్మంబాన తీయవలయు' ననుటయు, సాత్యవతేయుండు కౌంతేయునిం గాంచి, 'వేదశాస్త్రంబులు సదివి, తద్ధర్మంబు నెఱింగి తాను నాచరించిన బ్రాహ్మణుండును, నయ మార్గంబున భూమండలంబును పరిపాలించిన క్షత్రియుండును, వంచన లేక క్రయ విక్రయాదులు గావించిన వైశ్యుండును, శ్రీమన్నారాయణ స్మరణయు బ్రాహ్మణ పూజయుం గావించిన శూద్రుండును, నైహికాముష్మికంబుల సుఖంబుం గాంతురు. ఇంక స్త్రీ జనుల లక్షణంబు వినుము. చక్కని పురుషునిం గన్నఁ గూడఁజనుటయు, బిత్తరంపుఁ జూపున తెప్పలల్లార్చుటయుఁ, జెలిక త్తెలఁ బిలుచు విధంబున నుచ్చైస్స్వనంబునఁ గూయుటయు, బలుమాఱు నవ్వుటయుఁ, బొరుగిరుగులకుఁ బోవుటయు, మేరమీఱి పలుకుటయు, సారెసారెకుం బైఁట జార్చుటయు, మిగుల సిగ్గరిక త్తెయుంబలె మెలంగుటయుఁ, బరపురుషుల చంక నున్న పసిబిడ్డల ముద్దాడుటయు, గోడనెక్కి చూచుటయుఁ, గొప్పు దిద్దుకొనుటయు, న త్తమామలకు మగలకు మాఱు మలయుటయు, నివి మొదలగు వికారంబులు జారకాంతల లక్షణంబులు. మఱియుఁ బువ్వులమ్మి పువ్వుఁబోడితోడ, దాసీజనులతోడ, సైరంధ్రులతోడ, దాదులతోడ, మగలు విడిచిన సతులతోడ, మంత్రసానుల తోడ, దూతికలతోడ, జోగురాలితోడ, నాకులమ్మెడి యంగన తోడ, వితంతువు తోడంగూడి చెలిమి చేయుదానిం గులటయని యెఱుంగవలయు. ఈ చెప్పిన దుష్టసతులలో దూతయు, దాదియు నను నిరువురు జారిణికి సాహస సముద్రంబు గడవం దెప్పలు. కావున మాన ధనులగు పురుషులు చానలకుం జనవీయం జనదు. జననంబు మొదలు మరణ పర్యంతంబు వారల నమ్మం గూడదు. కావున, న త్తయు, మామయు, మగండును, గత్తుల బోనులవలె మత్త

కాశినులం గదల మొదలపంతఁ గాపాడం దగు. కౌమరు ప్రాయంపుటింతుల చిత్తము సదా పర పురుష భోగాయత్తంబై యుండునని యెఱుంగుము. విధవ యగు వెలంది యుపవాసంబులచే మేనుఁ గృశింప చేయక, పాలు పెరుగు ఘృతంబు మొదలగు రసద్రవ్యంబులచే దేహంబుఁ బోషించుచు, మలిన వస్త్రంబులు గట్టక, మడుంగులు గట్టుకొని, మైపూఁతలు బెట్టుకొని, దాన ధర్మంబులు సేయక, వడ్డికిచ్చి కూడబెట్టుచు, తల్లిదండ్రులకింద నడంగక, పొరుగిరుగిండ్లం దిరుగుచు, హరిస్మరణంబులేక దుర్భాషలం గూయుచు నుండెనేని, పెనిమిటితోడం గూడ దానును గల్పాంతరంబులు నరక కూపంబునం గూలు. నాలుకయుం, దాలువులు, నధరంబులు, నీలవర్ణంబులై యెవ్వతెకుండు, నేతరుణి పాదంబులు నేలమోపక యుండు, నత్తరుణి శీఘ్రంబుగ వైధవ్యంబు వహించు. విధవా సంగమంబు సేసిన యధముండు దాను జేసిన పుణ్యంబులెల్లం గోల్పడి నరకంబునం బడు. బాల్యంబునఁ దల్లిదండ్రుల మఱుంగునఁ, బ్రాయంబున మొగనియొద్ద, వార్ధకంబునఁ దనయునికడ, నుండవలయుంగాని, స్త్రీలకు స్వాతంత్ర్యం బెన్నటికిం జెల్లదు. ఇది నీ యడిగిన ప్రశ్నంబునకు నుత్తరంబు. నీవు జూదరుల, నాస్తికుల, నసూయాపరులఁ, గొండెంబులు పలుకువారలం జెంతంజేర్పక ప్రజలం బాలింపుము. పోషింపఁబడిన జనులచేత ధనంబుచే ధర్మంబును, ధర్మంబునఁ గీర్తియుఁ, జెకుఱుఁ గావున, రాజులకుం బ్రజా పరిపాలనం బవశ్యంబును జేయవలయు. తన కీర్తి మర్త్యులకుఁ గీర్తనీయంబై యుండ నారాయణ చరణారవింద సంస్మరణ శీలుండై యున్న భూపాలుండిహంబున భోగంబును, గీర్తిని, బరంబునఁ గైవల్యంబును గాంచు. శమ దమ సదాచార సంపన్నుండైన బ్రాహ్మణుండేనియు, శ్రీ విష్ణు భక్తి విరహితుండయ్యె నేని చండాలుండని యెన్నుము. చండాలుండేనియు శ్రీహరి పదాయత్త చిత్తుండైనఁ ద్రైలోక్య పూజ్యుండగుం గావున, నీవు శ్రీవాసుదేవ చరణారవిందంబులు త్రికరణంబుగ నమ్మి సుఖంబున నుండు' మన, ధర్మనందనుండు, 'మహానుభావా, ఆ భక్తి యవ్విధంబున వచ్చు? లక్ష్మీ వల్లభుండెవ్వారల గృహంబుల నిలుచు?' నని యడిగిన, నమ్మునీంద్రుండు తన శక్తివంచన చేయక పితృదినంబులు నెఱవేర్చు నతండును, దీర్ఘయాత్రాపరుండును, దానశీలుండయ్యు వినయపరుండగు వాఁడును, బర కాంతా సంగమంబు గోరనివాఁడును, ఉదారుండును. సత్యము శుచిత్వమునుం గలుగు వాఁడును, జననీ జనకుల బాంధవులం బోషించువాఁడును, పాప భీరువును,

సప్తసంతానంబులం బడసినవాఁడు, దయాపరుండు, చేసినమేలు మఱవని వాఁడు, తక్కుంగల పుణ్యపురుషుల గృహంబుల మహాలక్ష్మి వాసంబు సేయు, నచ్చటనే శ్రీమన్నారాయణుఁడు నెలకొనియుండు. జూదగాని, దుష్టుని, దుర్వ్యసనశీలునిం జోరునిఁ, జారుని, సజ్జనదూషకుని, నిర్దయు, గృహదాహకు, లుబ్ధుని, స్వోదరపోషకుని గర్వోద్ధతుం బెడఁబాసి లక్ష్మి, పరాన్న భోజన శీలుండగు బ్రాహ్మణుని వేదాది విద్యలు విడిచిన తెఱంగునఁ దొలంగి పోవు. ధర్మనందనా, తొల్లి నీవు దుర్వ్యసనాసక్తుండవై జూదం బాడితి వదికారణంబుగా నింత యనర్థంబు సంభవించె. ఇంక నెన్నండట్టు లా చరింపకుము. కృష్ణ పదభక్తి పరాయణుండవయి యుండుము. వ్యతీపాతవైధ్రుతి, సంక్రాంతి, యమావాస్య మొదలగు పితృదినంబులఁ, దీర్థయాత్ర, వ్రతచర్యా దినంబుల వనితా సమాగమంబొనర్చిన వానియొద్ద లక్ష్మిచేర వెఱచు. నీకుం దెలియ వలయు నర్థంబులు దేట పఱిచితి. ఇంకఁ దామసింపక జన్నంబొనర్పవలయు. కావున సకలశ్రేయంబులకు హేతువయిన శ్రీకృష్ణ దేవుం బిలిపింపు' మని యానతిచ్చె.

## --ధర్మజుపనుపున భీముఁడు ద్వారక కేగుట -

అంత నజాత శత్రుండు వైరిసేనా భీముండైన భీముంబిలిచి, 'నీవు ద్వారవతికిం జని యాగ యోగ్యంబైన చైత్రమానసంబు సేరవచ్చెంగావున, మంత్రి పురోహిత సామంత దండనాథ బంధుమిత్ర పుత్ర కళత్ర సమేతంబుగా, రుక్మిణీకాంతుం దోడ్కొనిర'మ్మని పంచిన, నన్ను పాదంబులకు మ్రొక్కి, వృకోదరుండు సత్వరంబుగా ద్వారకా నగరంబునకుం జని, దేదీప్య మాన దివ్యరత్న ప్రభా ధగద్ధగిత నిజారంబైన హజారంబు సొచ్చె.

## -శ్రీకృష్ణుని భోజన సమయము-

చిరత్న రత్న మయంబులును, గాంచన సమంచితంబులును గల ధౌత నిర్మితంబులు నైన జోడ పక్కెర పల్లంబు జానంబునంకవన్నెలు మున్నుగు ముస్తీదులతోఁ గైజామోఱలల్లార్చుచు రాజిల్లు వేనవేలు పడివాగె తేజీలును,

[illegible] సెలయేఱులం బోలుపొందు కైవడి మదధారా దూసరిత గండస్థ [illegible]లైన వేదండ తండంబులును, వివిధాయుధ సంపన్నంబైన వీరభట వ్రాతం [illegible] బోలుపొందు కక్ష్యాంతరంబులు గడచి, ఫణిహారిం గనుంగొని తనరాక [illegible]డైన పుండరీకాక్షునితో విన్నవింపుమని పంచుటయు, వాడు పుం జని, [illegible] ప్రభానికరంబులచే నంధకారంబు దూరంబునం ద్రోయుచుం, [illegible] సాంబ్రాణి గంధసార కర్పూర ధూపంబుల పరిమళంబులచే. భూన [illegible]లు వాసింపం జేయుచు, బంగరు చెఱంగుల రంగుమెఱయు చీనిచీ [illegible] తెరలునుం, గొత్రముత్తియంపు జల్లుల నుల్లసిల్లుచు గందొవలం [illegible] దందొవల చందువలును, రత్నప్రభాడంబరంబులైన రత్న [illegible]లును, జిలుకలుం, గోయిలలు, గోరువంకలుం, జకోరంబులు, [illegible]లుం*, పావురంబులు, మయూరంబులు, లేళ్లు, దుప్పులు, జింకలు [illegible] సకలవిషదోష పరిహార క్రియానిపుణ చాతురీ ధుర్యంబులగు [illegible] సమూహంబులచే నభిరామంబును, మల్లెలు, మొల్లలు, జాజులు, [illegible], పొన్నలు, పొగడలు, సంపంగలు, గోరంటలు, చేమంతులు, [illegible]. [illegible] మొదలగు పూవుల తోరణంబులచే నేత్రానంద [illegible] నైన భోజనాగారంబున మృగమదంబున నలికిన, ఘనసార [illegible] దీర్చిన చతురస్రవేదిక యందు, బాలభాను ప్రభా [illegible] రత్నపీఠంబున సుఖాసీనుండై, నవరత్నమయంబగు పళ్లెరంబున [illegible] పట్టింపం, దుమ్మి పూవుల చందంబునం దెల్లనగు రాజాన్నంబులును, [illegible] రూపంబులగు సూపంబులును, సద్యోఘృతంబులును, నప్ప [illegible]లు, [illegible], దాలింపులు, సంభార పరిమళ గంభీరంబులై [illegible] పచివెంబులు గల వంటకంబులుం, దియ్యచేరులు, మోరుంజేరులుం, [illegible], [illegible] లానవాలుం, జక్కెర పొంగలి, దధ్యోదనంబు, [illegible] [illegible], వడలు, నప్పంబులు, దోసెలిడ్డెనలు, [illegible], [illegible], సుకియలు, [illegible], మండంగుబూరెలు, సారె

---

* [illegible]

సత్తులు, మనోహరంబులు నరసెలు, సమ్మృతఫలంబులు మండెగలు, మొదలగు భక్ష్యవిశేషంబులును, పాయసంబులు, శిఖరిణులు *, ఫలరసాయసంబులుం, బచ్చళ్ళుం, బెరుంగు లూరుంగాయలు, పరుపులు నాదిగాఁ భక్ష్యభోజ్య లేహ్య చోష్య పానీయంబులును, గుండేలు, ఉడుము, ఆలవ, లేడి, యడవి పంది, మొదలైన భూచరంబులును, గండె, వాలుగ, జెల్ల, మలుగు, కొఱ్ఱ, మారు వాయి, బొమ్మడాయ, యిసుక దొందు, ఉలచ, తిరికిచేఁప, తాబేలు మొదలగు జలచరంబులును, గౌంజు, పూరేడు, పొట్టిపిట్ట, పొన్నంగి, వెలిచె, బెడిచె, లావుక, కేరజము, బెకప, పొడబెకవ, పచ్చబెకప, కాటిగాఁడు, ఉల్లంకి, చింతవంకలు, లకుముకి, వంగపండు మొదలగు ఖేచరంబులుందెచ్చి, లవణామ్ల మరీచికా జారక కర్పూర మృగ మదాది పరిమళ సంభార సంభృతంబులుగాఁ బాకం బొనర్చి, బంగరుగిన్నెలఁ బటికంపుదొన్నెల నుంచి యమర్చియుంత, రుక్మిణీ సత్యభామ లిరుకెలంకులఁ గంకణ ఘణఘణా త్కారంబులు తోరణంబులుగా, సురటులువీవ, జాంబవతీ మిత్రవిందలు చేపా వడలు వీవ, లక్షణాసుదంతలు బంగారు గిండ్లతో గంధోదకంబులు పూని యాయత్తముగా నిలువ, భద్రయుఁ గాళిందియుఁ జెలికత్తెలనంపి యుపయోగవస్తువులు వేవేగఁ దెమ్మని తీవరించుచుండ, నారగించుచు నుండిన సమయంబున నప్పుండ రీకాక్షునితో దౌవారికుండు భీమసేను రాక నెఱిగించిన, నవ్వి, నవ్వరించి గురుండు 'వాకిట నిలుపనేల ? వేగఁదోడుకొని రమ్మ'ని పంచిన వాయునంద నుండు నందనందనుని సన్నిధికిం జని సాష్టాంగ దండ ప్రణామంబు సేసిన;

## - శ్రీకృష్ణ భీముల సంభాషణము -

శ్రీ వాసుదేవుండు మందహాస భాసుర వదనారవిందుండై, 'బావా, నీ భావంబున నున్న కార్యంబులన్నియుఁ గుశల ప్రశ్నంబును, వెనుక నొసఁగుదువు. ఇంతియకాని మున్నుగ బుద్దిమతృప్తత్వంబగు భోజనంబు నాకంత పరిపూర్తిగఁ గావింపుము. అట్లుగాక నీకెద్దియుం దోచదు. నీ పలుకులకు శంక వలదు. నీకరణి బహు భక్షకు లగస్త్య కుంభ కర్ణాదులు కొందఱు గలరు. నీవేమిటికి సిగ్గుపడియెదవు ?' అనిన ననిలనందనుండు మంద స్మితంబు వసనం

* శిఖరిణులు = సిగరులు, మజ్జిగ పులుసు.

బునం గనుపట్టి, 'యాదవేంద్రా, నీవింత లెన్నెన్ని పల్కరింతు? కడుపారం దల్లిపాలు గ్రోలియుఁ జాలక పురిటింటిలోనఁ బూతన చనుబ్రాలుగ్రోలి దానిం బొలుకు మార్చితివి. జననివెట్టిన యుగ్గునం దృప్తినొందక వ్రేపల్లెలోనున్న వెన్నలు పాలు నిచ్చనిచ్చలు మ్రుచ్చరించితివి. యశోదమ్మ పొత్తున భుజియింపియు, నాఁకలి యడఁగమి, నింద్రయాగ విఘాతంబు సలిపి, యతనికై యుంచిన యన్నరాసుల భక్షించితివి. మాత యొసంగు నేతి కజ్జాయంబులు చాలక కుచేలు చేతి యడుకులు నాఁచికొని మెసమితివి. యుగాంత కాలమునఁ జరాచర పరిపూర్ణంబులైన బ్రహ్మాండకోటులుదరంబులోఁ గూరికొని యుండిన నఱకొలఁ దయగానిఁ దృప్తుండవుం బోలెనుండలేదు. ఇట్టి నీపొత్తునం భుజియింపు మనిన నాకుంబొసంగునె? నీవు మెండైన దీపనంబు గలవాఁడవు'. అని పరిహాసంబు లాడుచుండ, వాయునందనునిఁ గనకాసనంబునఁ గూరుచుండనియమించి, సరసాన్నంబులం దృప్తినొందించి, యొక్క రమ్యస్థలంబున వసియించి, యంగరాగంబులు, కర్పూరతాంబూలంబులుఁ, గుసుమ మాలికలు, నవరత్నఖచిత భూషణంబులు, దుకూలంబులు, వలయు వస్తు వాహనంబులు, బహుమానంబు లొసఁగి, వచ్చిన కార్యంబడిగి, యతని వచనంబులాలకించి, కృతవర్మం బిలిపించి, 'పౌరజనులకెల్ల నజాతశత్రుని యశ్వమేధాధ్వరంబు గనుగొనుటకుఁ బయనంబు గండని చాటింపఁ బనుపుము. నగర సంరక్షణంబునకు మాతండ్రియగు వసుదేవుని, నన్నయగు బలభద్రుని నియోగించు చున్నవాఁడ'నని యానతిచ్చె.

## -శ్రీకృష్ణుఁడు సకల జనులతో హస్తినాపురమునకు వచ్చుట-

అపుడు భోజ భూనాయకుండు కల్పాంతకాల తంతన్యమాన ధారాధర గర్జితానుకారయైన ప్రయాణభేరి వేయించినఁ, బురజను లాబాలగోపాలంబుగాఁ బయనంబు వెడలిరి. అపుడు పుండరీకాక్షుండు వసుదేవుని చెంతకరుదెంచి, నమస్కరించి, తన పయనంబుం దెలుపుటయు, నతండు కుమారుంజూచి, 'నీవు ధర్మజు నశ్వమేధాధ్వరంబు నవలోకింపం బోవునప్పుడు, హరికథావిముఖుండును, నన్యాయ వర్తనుండును, ధర్మార్థకామ రహితుండును, దపోవర్జితుండును, మిత్రవంచకుండు, స్వామిద్రోహి, పతితుండుఁ, బందయుఁ, బరదారానిరతుండు, పల్లునినొమ్ము భక్షించునధముండు, ధర్మబాహ్యుండు, వివాహకుండు, మద్యపానాసక్తుండు, బహుభాషియు, విశ్వాసఘాతకియు, ఋతుకాలపరిత్యాగియుఁ,

గష్టలోభియు, ఖలుండు, నాత్మస్తోత్రపరుండు, గలహశీలుండును, గృతఘ్నుండు, భృత్యవంచకుండును, క్షేత్రవిత్తాపహారకుండును నగువారలఁ దోడుకొని పోవలదు. నినుం బాసి నిమిష మాత్రంబేనియు నోరువంజాల' నని తానును బయనంబైనఁ, గమల లోచనుండు 'నగర సంరక్షణార్థంబు మీకుండక తీరద'ని యొడంబడఁ బలికి, ప్రశస్త ముహూర్తంబున నాప్తమంత్రి యోధభృత్యవర్గము పరివేష్టింపఁ, బల్లకుల ముందరగం బనిచి, యదువృష్ణిభోజాంధక వీరులతో నిరాఘాట ధాటీ పాటవంబునం బటుతరంబైన తురంగంబునెక్కి పురంబు వెడలి, గండస్థలంబులఁ దొరఁగు మదాంబుధారావాసనలకుం గ్రమ్ము తుమ్మెదలకై శిరంబులు గదల్చుచు ఘీంకారంబులు సేయు సింధురంబులును, సింధురంబులం జూచి కెరలి రాహూత్తులు తత్తఱంబంద దాఁటు తురంగంబులును, దురంగహేషా రవంబులకు బెదరి గోనెలుదిగవైచి పాఱు వృషభంబులును, వృషభమ్ముల సందడి దందడిగొని మోపులుఁ క్రిందఁ బడవైచి దైవంబును దూఱు భారవాహకులును, గలిగి తొమ్ము తొమ్ముఁ దొలఁగఁ ద్రోయరాని సందడిలో మంద గమనమ్మున గోవిందుండు చనుచు, జనుపవారలుంబోలు తలవెంట్రుకలు గాలికల్లాడ, వెలిచిన చెవ్వాకులు కర్ణంబుల వీడ, రొంటిమీఁదఁ గట్టిన మురుక చేలంబులాడ నాడాడ నల్లుండ్రం జూచి 'యింటికి రావైతివేమి? నాకూఁతురు నిన్నుంజూడక రాతిరియెల్ల నిదురరాక విరహవేదనం బొరలుచుండె' నని పలికి, బెల్లించి విటుల చేతులనున్న వక్కలాకలు జల్లించి కోలయూనికొనుచు, మెల్లమెల్లనం జని యెవ్వరినిఁ గన్న నవ్విధంబుననె పలుకుచుఁ బయనంబు సనుచున్న వృద్ధకాంతలం గనుంగొని, చిఱునగవు దళుకొత్త భీమసేను దిక్కుమొగంబై, 'వాయునందనా, తొల్లి వయసు కాలంబున నాటిన గోటిమీటులు, మోవికాటులు కాయలుకాచి, నీమేని గాయంబుల కరణి కనుపట్టు. చొట్టంబోని పొట్టలు నీ పొట్టకు సమానంబై చూపట్టు. అతి స్థూలాకారంబు నీకు సమానలై యున్న యీ వృద్ధ వేశ్యలం బరిగ్రహింపు,మనిన, నవ్వి భీమ సేనుండు, 'మున్ను మధురానగరంబున మువ్వంక గూనిదాని నొక్కతెం జక్కఁ బెట్టితివి. పావపన్మ రాగంబులచేఁ బాషాణంబును యోషా రత్నంబు సేసితివి. ఇట్టి కొఱమాలిన జంతువులనెల్ల దిద్దుకొనుట నీభారంబుగాని మాకుం దరంబే? ఎంత పాఱవేసిన వారలైనను నీకటాక్షంబున ధన్యులగుదు' రని పలుకుచు,నాయిరువురుఁ బరిహాసంబులాడుకొనుచుఁ,గొంత దూరంబు చనిరి.

పక్షిసంకాంతుం దందంబైన పెంపొదల పలనం జెందిన పుష్పోడులు గప్పి యొప్పులు గులుకు తరగంబులం జెలంగు రాజహంస చక్రవాక బకక్రౌంచాది పక్షిగణంబుల కోలాహలముచే మనోహరంబును, పాపహరంబును, మాఘరాజిత సుధాసారంబునైన కాసారంబుఁ గాంచి దాని, తీరంబులఁ జందన మందార కుందకురవకాశోక కదళీ ప్రముఖ తరువుల నీడల బాళెంబులు విడువ నియమించి, బ్రాహ్మణక్షత్రియ వైశ్యశూద్రులును, నట నర్తక గాయక వంది మాగధులును, చిత్రకార ఘటకార పటకార సూచీకారకులు మొదలైన జాతులవారును, సయ్యోత్రావుల గుడారంబులు వైచికొని నిలిచిరి.

అంతఁ, బ్రియకాంతయైన రుక్మిణీ రమణింజూచి, 'రాజహంసములు, మదపు పేసంగులు, గండుతుమ్మెదలు మధురసంబుల నాస్వాదింప సొంపు మెఱయు నీపద్మినిం గంటివె? పురుషులకంటెఁ బొలతులకుఁ గామం బెనిమిదింతలధికము గదా!' అని సకాంత తనకాంతునితో, 'దేవా, నీవు సర్వభూతాంతర్యామివి. నీవెఱుంగని యర్థంబేమి యున్నది? నీకుమారుండగు బ్రహ్మకు వాహనంబు రాజహంస. నీవాహనంబేసుంగు. తేఁటులు దాని యెడం బుట్టినవి. అన్నియుఁ దనాజులకు సమానంబగుటంజేసి యిట్లు పలుకందగ' దని పరిహాస పల్లవితంబగు సల్లాపంబుఁ జేయు పల్లవాధరితో నాజగద్వల్లభుండుల్లసిల్లుచున్న సమయంబునఁ బెల్లొరి పల్లెవాండ్రంబులును, దీగెల యొడ్డాణెంబును, బావంబులం బెట్టిన పిల్ల చెప్పులును, బెవులం జెక్కిన నెమలి ఱెక్కలును, గటితటంబునం దాల్చిన కంబళ్లును, పెరుగు పాలు నేతులు నించిన కావళ్లును నుల్లసిల్ల, వేల కొలది గొల్లలప్పుడికిపచ్చి, తెచ్చిన ద్రవ్యంబులు కానుకగా నిచ్చి, గ్రుచ్చి కౌఁగిలించుకొని, వసుమ్రాతునింజూచి, 'ఓరి కిసనా! నీయప్పటి కంబళి యేత నేసితివి? కొండగోఁగుల పువ్వులచాయ కంబళి యెవ్వరిచ్చిరి? చుక్కలం దెచ్చి కుట్టిన యట్లున్నయది. ఈ తెల్ల గురిగింజ పేరు లేద సంపాదించు కొంటివి? అప్పప్పా! చంద్రవనిప్పుల యొప్పున నొప్పులు గులుకు నీగాజు పూసలేదఁ దెచ్చుకొంటివి? గబ్బు కంపులం బొల్చిన నల్లని తిరునామం బేడ దొరకె? పిల్లతోఁక యేంది? మెడమీద జడలేంది? చెవ్వు చెవులేంది? అప్పప్ప! ఈ కోడె జోడి మెద్దేడ సవరించుకొంటివి? వింత వింత వేసంబులతో నీచుట్టునుం జుట్టు కొన్న యీగొల్ల పెద్దలు నుండు వారలు?' అని పలుక, వారి మూఢ వాక్యంబులకు సంతసించి విలోకించి జనకుండు వారల నాదరించె. అప్పుడొక్క కుంభ స్తని

నవనీత కుంభంబును, నొక్క మెఱుగుఁబోఁడి పెరుగుపంటకంబును, నొక్క బాలిక వనమాలికయు, బంగరు కుండయుఁ దెచ్చి శౌరినిం బొడగనిరి. ఒక్క వాలుగంటి జుంటి తేనియఁ గానుక యొసంగిన గోపాల చక్రవర్తి దాని యధరామృతంబు తొల్లి గ్రోలిన వాఁడగుటంజేసి, తలంచుకొని నవ్వె. ఒక్క వేదండయాన పూదండ దండనుండుటయుఁ దదీయ భుజాలతాలింగనంబు స్మరించి కనుగీఁటె. ఒక్క చెల్వ బిల్వ ఫలంబులు ముందర నునిచిన దాని కుచంబుల దృష్టి నిలిపె. మఱి యొకతె నెమ్మి గరుల కుంచె యెదుటనుంచిన నయ్యింతి కుంతలంబులు మున్నుదాఁ బట్టి యీడ్చినది తలంచి కనుమొగిచె. ఇవ్విధంబునం దొంటి వలపులం దలపింప నాగోపకాంతలంజూచి గోపాల దేవుండు నర్మగర్భంబుగాఁ బలుకుచు, వారల వీడు కొలిపి యారాత్రి యచట వసియించె.అని జైమినిమునీంద్రుఁ డాన తిచ్చుటయు, జనమేజయ నరేంద్రుండు తదనంతర కథావృత్తాంత శ్రవణ కౌతూహలాయత్త చిత్తుండై యుండె.

చ. అవిరళ దానశీల, శరణాగత రక్షణలీల, సత్కళా
కువలయమిత్ర, సూనశరకోటి మనోహరగాత్ర, సాహితీ
నవరస భోజ, నూత్న దిననాథ విడంబక తేజ, రాజమా
న్యవిజయరంగ చొక్క నరనాయక సజ్జన భాగ్యదాయకా.

క. శ్రీరంగ కృష్ణ ముద్దుల
వీరేంద కుమార, సమరవితరణశూరా,
శ్రీరంగ పతి పదాంబుజ
సారంగ సముదశైల సమసారంగా.

మానినీ — సనయ హృదయ పద్మా, శాశ్వతైశ్వర్య సద్మా,
మదన విమత శౌర్యా, మందారాహార్యధైర్యా,
విదిత విభవ సాంద్రా, విశ్వనాథాన్వయేంద్రా,
ముదిత కవి సమాజా, ముద్దమాంబా తనూజా.

గద్య

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయ రంగచొక్కనాథ
మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజ తురంగ మాందోళి
కాప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధమాన
సముఖ మీనాక్షీ నాయక తనూభవ మీనాక్షీ
దేవి కటాక్ష లబ్ధ కవితా సంప్రదాయ
వేంకట కృష్ణప్ప నాయక ప్రణీ
తంబైన జైమిని భారతం
బున నశ్వమేథ పర్వం
బను వచన కావ్యంబు
నందు
ప్రథమాశ్వాసము.



శ్రీ ర స్తు

# జైమిని భారతము

## ద్వితీయాశ్వాసము

శ్రీ రాధా వర చరణాం
భోరుహ భృంగాయమాన, భుజకరవీరా
ధారాఖండిత శాత్రవ
శూరా, శ్రీ విజయ రంగ చొక్క వజీరా !

అవధరింపుము; జైమిని మునీంద్రుండు జనమేజయ నరేంద్రుం గనుం గొని యిట్లనియె. 'అమ్మఱునాఁటి వేకువ జామున స్నాన సంధ్యావందనాది నిత్యకర్మంబులు నిర్వర్తించి, నంద యశోదాదులున్న తావునకుం బోయి, కుంతీదేవి మామేనత్త గావున నద్దేవికి నమస్కరించి, 'ధర్మజుని యశ్వమేధంబు గనుంగొని వత్తురుగాక, మీరలు ప్రద్యుమ్నాది కుమారులం దోడ్కొని మెల్లన రండని చెప్పి, కోడండ్రును, దానును, దేవకీదేవి కుంతీదేవి యొద్దను, నుషాకన్య సఖీజనంబులతోడఁ బాంచాలి సమీపంబునను, ప్రద్యుమ్నుని యాదవ కుమారులతోడఁ గూడ ధర్మజుని సమీపంబునఁ దనతో మున్ను బాల్యంబున నాటలాడిన గోపాలకుల నెల్ల గాండీవి చెంత నుండు నట్లుగా నియమించి, యాభీరవరులం జూచి, సింహరాశియందు బృహస్పతి యుండు సమయంబునఁ బ్రశస్తతరంబైన గోదావరీ ప్రభావంబుగాంచి, సకల తీర్థంబులు విస్మయంబు జెందినభంగి, మీరలు కిరీటి పరాక్రమంబు గాంచి ఱిచ్చవడి యుండక, తోఁచిన పాటి పరాక్రమంబు గావించి, యతని మెప్పింపుడని యాజ్ఞాపించి, కృతవర్మ భీమసేనులఁగాంచి, 'మీరిరువురు సకల దళంబులం దోడ్కొని మెల్లన రండు. నేను మున్నుగాఁ గరినగరంబునకుం జనియెద' నని పలికి, పవన జవంబైన తురంగంబు నెక్కి మిత్రజన పరిమిత సమేతంబుగా హస్తినాపురంబునకు వచ్చి, ధృతరాష్ట్ర విదుర కృప సంజయ సమేతుండైన ధర్మనందనుంగ దిసి, కంసారి సంసారి ఛంధంబున సాష్టాంగ దండ ప్రణామంబు గావించె.

## -శ్రీకృష్ణుఁడు హస్తినానగరమునకు వచ్చుట-

తనకు మ్రొక్కిన యర్జున నకుల సహదేవుల నుచిత సంభాషణంబుల నాదరించి, స్వర్ణపీఠంబున గూరుచున్న సమయంబున, యుధిష్ఠిరుండు, 'దేవా, నీవు పుత్రమిత్రామాత్య సమేతంబుగా రాక, యొంటిగ వచ్చినదేమి?' అని యడిగిన నవ్వి, యవ్వాసుదేవుండు, 'వసుదేవ బలదేవు లిరువురుం దక్కఁ దక్కిన వారలందఱు వచ్చిరి. రేపకడ నిచ్చటికిత్తు' రనిన, సంతసించి, కౌంతేయాగ్రజుండు పార్థునింగాంచి 'సకల దళ సమేతంబుగా రేపకడఁ గదలి యాగ తురంగంబు నడుమ నునిచికొని వారల కెదురుగాఁ జనవలయు'నని పలికి, మఱునాఁ డరుణోదయంబున వనజోదరుండు యౌవనాశ్వుండు మొదలగువారలు తోడరా, నధ్వరాశ్వంబు నలంకరించుకొని, కుంతీ ద్రౌపదీ ప్రభావతులం బైలుమెఱయుండని నియమించుటయు, వారలు రుటంపు సూర్యపటంబు గురాళంబులం దులకించు కుందనంపుటాందోళికల నెక్కి, యుభయ పార్శ్వంబుల ఘోటికాసహస్రంబులపైఁ జేటికా సహస్రంబులు కాంచన దండమండితంబులగు ఛత్ర చామర కలాచికా పాదుకాప్రముఖ రాజ చిహ్నంబులతోఁ గొలిచి నడువ, దేవకీ యశోదాదులకుం దగిన కట్టడంబులు పెట్టియల నలవరించి, కట్టాయితంబై పట్టణంబు వెడలి, రెండవ మహాఖండలుండునుంబలె నఖండిత వైభవంబునం గదలి, కాళిందీతీరంబుఁ జేరంజనియె. అంతకుమున్న భీమ కృతవర్మాదులు సకల సన్నాహంబులు మెఱయ నెదుర్కొను నప్పుడు, గంభీర భేరీభాంకారంబులను, గంచుకుల హేంకారంబులను, మదగజఘీంకారంబులను, జామరంబులు వేయు తోయజాక్షుల కంకణ క్రేంకారంబును, భూనభోంతరంబులు ఘూర్ణిల్లె. ఆ సమయంబున శమన నందనుండు సహోదరులుం దానును, దేవకీదేవికిం బ్రణమిల్లె. భీమసేనుండేనుంగు డిగ్గి ప్రద్యుమ్నాది యాదవ కుమారులుందానును నన్నకు నమస్కరించె. దేవకి కోడంద్రతోఁగూడఁ గుంతికిఁ బ్రణామంబుసేసె. ద్రౌపది ప్రభావతియుం దానును దేవకీదేవి పాదంబులకు మ్రొక్కె. మఱియుఁ దారతమ్యంబు లెఱింగి వారువారు తగు తెఱంగున వందనాలింగన యోగక్షేమ వాక్యాదివిధుల నొండొరులతో సంభాషించిరి.

## —అనుసాళ్వుఁడు సవన హయము నపహరించుట—

అయ్యవసరంబున, సౌంభ పురాధీశ్వరుండును, యాదవకులద్రోహియుఁ, గృష్ణదూషకుఁడునై సంగరాంగణంబున మున్ను గోవిందునిచే హతుండైన

సాల్వునికిం దమ్ముం డనుసాల్వుం డను వాఁడు, వసుదేవ నందనుం డగు ముకుందునిం జంపి యన్నపగ దీర్చుకొందునని సన్నద్ధుండై, తన సైన్యంబులనెల్ల గృధ్ర వ్యూహంబుగాఁ బన్నించి సేనాపతులం జూచి 'నేను యాగీయ ఘోటకంబునుం బట్టి తెచ్చెద. మీరలిచ్చట నిలువుం'డని నియమించి, సాహసంబు దూరిన ఛందంబున సేనల నడుమం జొచ్చి, కిట్టిన యోధావళి నట్టిట్టు పఱచి, యశ్వమేధాశ్వంబుఁ బట్టుకొని నిజసేనామధ్యంబునకుం జని, సేనాపతియైన సుతారకునితో 'నేను యాగ యోగ్యంబైన యీ హరింబట్టి తెచ్చుటయెల్ల హరితోడ సంగరంబు సేయుటకని యెఱుంగుము. ఆతండును, బాండవేయులు, దళసమేతంబుగా నిచ్చటికివచ్చి తాకుదురు. వారితోడం దారసిల్లి కయ్యంబు సేయుఁడు. శౌరి కంటెఁబరుండు వేఱొక్కండులేఁడు. అతని తెఱంగెఱింగి పట్టుకొననివాఁడు నాకు హితుండును, సుతుండును, బాంధవుండును, భటుండునుం గాఁడు. అవ్యాహితుండు, నభేద్యుండు, నవ్యయుండు, నాద్యంత రహితుండు నచ్ఛిద్రుండు, సకలలోక వ్యాపకుండు నక్షరుండునైన యచ్యుతుండు మనమేయు బాణములకుం దలగడు. ప్రహ్లాదుండు, నారదుండు, పరాశరుండు, పుండరీకుండు, వ్యాసుండు, నంబరీషుండు, శుకుండు, శౌనకుండు, భీష్ముండు, దాల్భ్యుండు, రుక్మాంగదుండు, నర్జునుండు, వశిష్ఠుండు, విభీషణుండు, వాయునందనుండు, బలియు మొదలగు వారలు కొందఱు భక్తిపాశంబున దేవకీనందనుని దమకైవసంబు చేసికొని యుందురు. ఇంతియకాని తక్కిన వారలకుం జిక్కఁడు' అని పలికి తన యోధులఁ బదిలపఱచి తానును గట్టాయితంబై సేనాముఖంబునకు వచ్చినిలిచె.

ఇక్కడ హయంబు నపహరించుకొనిపోవుట యాలకించి, శ్రీకృష్ణదేవుండు, రాణివాసంబుఁ బౌరజనులఁ బాళెంబునుం గాచుటకుఁ బార్థునిం బుచ్చి, మూల బలంబుతో ధర్మనందను నగరి వాకిటనుండఁ గట్టడసేసి, భీముండును, దానును యుద్ధ సన్నద్ధులై ప్రద్యుమ్న వృషకేతులం బిలిచి, 'మీరు మున్ను గయ్యంబునకుం బొండ'ని యనిపిన, సూర్యపౌత్రుండు వృషకేతుండు కృష్ణుం జూచి, 'నేను సాహసంబున, బాహుగర్వంబు మెఱయ సవనహయంబుఁ గ్రమ్మఱం బట్టుకొని పగతు గెలిచివచ్చెద, నట్లుసేయ నైతినేని బ్రాహ్మణీగమనంబు సేసిన పాతకియు, ఋతుకాలంబున నిజాంగనను బరిత్యజించిన వాఁడునుం బోవుగతికిఁ బోవుదు'నని ప్రతిజ్ఞచేసె.

## -వృషకేతుం డనుసాళ్వునిఁ బట్టి తెచ్చుట-

అంత నతండు సహాయుండుగాఁ 'బ్రద్యుమ్నుండు సాహవోద్యోగంబున గృధ్ర వ్యూహంబుగాఁ బన్నియున్న విరోధి సైన్యంబు సొచ్చి కోదండ మండలాకారంబుగాఁ దిగిచి చండకాండంబు లొండొండ నిగిడించి, సమదవేదండంబులఁ జెండాడియు, ఘోటకంబులఁ గీటడఁగించియు, మణిమయ స్యందనములఁ జిందరవందర సేసియు, వీరభట పరంపరల వెంపరలాడియు, సంరంభంబున విజృంభించిన ననుసాళ్వుండు ప్రద్యుమ్నుంగాంచి 'మకరకేతూ, విరహిజనుల, దరుణుల, వెఱ్ఱితాపసులఁ గుసుమ బాణంబులచే జయించితినని గర్వింపకుము. ప్రళయకాల దండధర దండోపమానంబులును, బ్రచండంబులు నైన కాండంబులు గాడినంగాని తెలియద'నిన, నవ్వి ప్రద్యుమ్నుండు, 'నాయమ్ములు పువ్వులగుట సహజము. నిన్నుఁదాఁకు నెడఁ గల్పాగ్ని కీలాభీలంబులగు'నని పలికి, యైదు శరంబులు వింటఁ దొడగి యాకర్ణాంతముగాఁ దిగిచి యేయుటయు నను సాళ్వుండు అయిదు బాణంబులచే వానిం దుత్తుమురుసేసి, దంభోళి సన్నిభంబైన యొక్క సాయకంబు ఱొమ్మునందుయ్య నేసిన, నతండు మురవైరి యెదుటం బిల్లమొఱము వైచిన పగిదిం ద్రెళ్లె. అంత, దనుజాంతకుండు మనంబునఁ గ్రోధ శోకంబులు పెనంగొనఁ బ్రళయకాల రుద్ర ఢక్కాఢమాత్కార ఘోరంబుగాఁ బాంచజన్యంబు పూరించి, తఱిమి నడిచిన, పవన నందనుండు ముందఱం దలకడచి యుద్దండ గదా ప్రహారంబుల రథగజ తురగ పదాతి వర్గంబులం బీనుంగు పెంటలు గావించినం, గర్ణనందనుండు వాయుపుత్రునిం జూచి, 'కంఠీరవంబు మదగజంబు విడిచి మఱియొక్క క్షుద్ర మృగంబునకుఁ బోవునే? నీ ప్రతాపంబునకు నీయల్పబలంబు సరియగునే? ఇంత మాత్రంబునకు మీరు గదా దండంబుఁ బూనందగదు మరలుం'డని పలుకు నవసరంబున నను సాళ్వుండు మహోగ్రబాణంబు వింట సంధానంబు గావించి, మారుతీ కుమారు మర్మంబులు లక్ష్యంబు గావించి యేయుటయు, మంత్రించి పడవైచిన కరణి మహీతలంబున గూలె. అంత మురవైరి యనుసాళ్వునిం గనుంగొని, 'యెందుఁ బోయెదవు నిలునిలు' మని యదల్చిన, నయిననుసాళ్వుండు 'కమలనాభా! నీవు మా యగ్రజుండగు సాళ్వునిఁగొని గగన మార్గంబునకుం గొనిపోయి బావిలోనం బడవైచి మృతినొందించితివి. కావున నిన్ను గీటడగింపక మాననను.

నీ కొడుకును, మఱందియును బడిన పాటు గన్నారం గనుగొంటివి గదా! ఇంక నీవు పాతాళంబు సొచ్చితివేనియు, మౌని మానసంబున డాగితి వేనియు, నిన్నుఁ బోనిచ్చు వాఁడను గాను. నీవు పురాణపురుషుండవు. నేను బ్రాయంపు వాఁడ. నీకు నాకు నంతరం'బని భ్రూకుటీ కుటిలంబును, వికటంబునగు నాననంబునం గనుపట్టుచు, నాలుగు తూపులు సంధించి రథ్యంబుల బ్రక్కలు వ్రక్కలించుటయు, యుగ్యంబులు మ్రొగ్గిన, దారుకుండు పగ్గంబులు పదిలంబుగాఁ బట్టి యరదంబు పిఱిందికిం దిపియించి, క్రమ్మరఁ దురంగంబుల సేదదీర్చి మెట్టకేలకు రథంబు ముందఱకుం దెచ్చుటయు, మురాంతకుండతని వక్షంబున బదుమూఁడు బాణంబులు గ్రుచ్చిన, నతండును జిచ్చులు రాల్చు మెఱుంగుఁదూపులు శింజినిం గూర్చి యాకర్ణాంతంబుగాఁ దివిచి మురవైరి వక్షంబు లక్ష్యంబు సేసి యేసిన, నచ్యుతుండు పెనుమూర్ఛ చేత ముచ్చముడింగి లీలా మానుష నటనంబున రథంబు పయింబడియె. అంత మురాంతకుని పాటు గనుంగొని, చతురంగబలంబులు పటాపంచలై, తండ్రి, బిడ్డ, యన్న, తమ్ముఁడనక విడిచి పాఱుటయు, వృషకేతనుండదలించి, విఱిగిన సైన్యంబు మగిడించి, యనుసాళ్వుని నిలునిలుమని గద్దించి, సప్తసాయకంబుల నిగిడించిన, వాఁడును దశనిశాత బాణంబులు కర్ణకుమారుని వక్షంబు వీక్షించి యేయుటయు, నబ్భాను పౌత్రుండు తురంగంబుల ద్రుంచి, సారథింబడగెడపి, రథంబు చెక్కలు సేసిన, నుక్కుదక్కక యనుసాల్వుఁడు రథంబు మీఁదకు నుఱికి కర్ణజుని వక్షంబు తన్నినం బడక, యతండు వాని కిరీటంబు వీడఁ దట్టి, ముందలఁ బట్టి, బిఱబిఱం ద్రిప్పి, పుడమింబడవైచి, ఱొమ్మునం దుమికి తన వింటనారి వాని కంఠంబునం దగిలించినఁ, గన్నుల ముక్కుల నెత్తురులు గ్రమ్మ మమ్మరించిన మూర్ఛం గ్రమ్మి, మే నెఱుంగక యున్నయెడ, వేఁటకాడు లేడిం బట్టి యీడ్చి తెచ్చిన తెరంగున బట్టి తెచ్చి, 'వీఁడె గుఱ్ఱంపు దొంగ వచ్చెఁ గనుంగొన నవధరింపుము' అని విన్నవించుటయు, యాదవేంద్రుండు కర్ణ కుమారుం జూచి 'వత్సా, నీవు ధన్యుండవు, వీర లోకమాన్యుండవు. నీకుందక్క నన్యునకు నిమ్మహారథుం బట్టి తేఁగూడునే' యని గోపాలదేవుండు సూర్య పౌత్రునిం గొనియాడ, నతండును వాని కంఠంబునం దగిలించిన గుణంబు వదలించుటయు, ననుసాళ్వుండను మూర్ఛ దెప్పిఱి శ్రీకృష్ణ దేవుం గనుంగొని, శాంత చిత్తుండై, 'స్వామీ, మీ పాదంబులకుఁ బ్రణామంబు. కర్ణనందనుని

సామర్థ్యంబు వలన మేనర సందర్శనంబు లభించె, నని యనేక ప్రకారంబులఁ ప్రశంసించిన యనుసాళ్వునిం గృపాంతరంగితంబులగు నపాంగ విలోకనంబులం గనుంగొని, గారవించి, కౌఁగిలించి, యతని కరంబునవలంబించి, తోడ్కొని పోయి ధర్మనందనునిం గానిపించి, దండప్రణామంబు సేయించినఁ, బాండ వాగ్రజుండాదరించి, 'నాకు నీవు వృకోదరాది సహోదరు లట్ల గాదిలి సోదరుండవు. క్రతురక్షణంబున సావధానుండవై యుండు' మని యానతిచ్చె.

అంత, ధర్మనందనుం డయ్యధ్వరాశ్వంబునుం గొనితెచ్చిన ప్రద్యుమ్న వృష కేతనులం బ్రీతులం గావించి, కరిపురంబునకు వచ్చి, యాదవుల విడియించి, కృష్ణానుసాళ్వ యౌవనాశ్వ మహీపతుల సబహుమానంబుగా నిజ నివాసంబునకుం బోవం బనిచి, తానభ్యంతర మందిరంబునకుఁ జని, యజ్ఞ రక్షా సమయంబుఁ బ్రతీక్షించుచుఁ బుణ్యకథా ప్రసంగంబులం బ్రొద్దులు గడవు చుండఁ, జైత్ర శుద్ధ పౌర్ణమి వచ్చుటయు, నప్పుణ్య దివసంబున ధర్మనంద నుండు ద్రౌపదీ సమేతంబుగాఁ గృతస్నానుండై నిత్యకృత్యంబులు నిర్వర్తించి, యాగ దీక్ష వహించి, తురంగంబు దెప్పించి, గంధ పుష్ప ధూపదీప నైవేద్యాది పూజలు గావించి, నిజ బిరుదాక్షర సమేతంబుగా సువర్ణ పట్టంబు దాని లలాటంబునం గట్టించి రత్నఖచిత మంజీరంబులును, గనత్కనక కింకిణీ జాలంబును, బురుసాకు రాశంబును, ముత్యంబుల జల్లులపై దండలు, నీలాల దృష్టిదండలు, హేమ పద్మంబుల మెచ్చులు, మీఁజు దుమ్మెచ్చులు, బంగరు తంగు పట్టియు, వజ్రాల మోముట్టు, సింగంపు మోము తలాటంబును, జలచ్ఛామరంబులు, గబ్బిమీఁజు హారబ్బ్కవికయుం, జోక గావించి, పవిణ మలహరి సాంబ్రాణి ధూపంబులు, పచ్చపావడలు విరాజిల్లు వేసవేలు తేజీలు, గంధ సింధురంబులు, స్యందనసందోహంబులుం గూర్చి, ధనంజయుని నశ్వ సంరక్షణార్థంబుగా నియమించి యాశీర్వదించి పంచిన, నతండును ధర్మజునకు మ్రొక్కి, శౌరిపాదాబ్జంబులకు వందనంబు గావించి, దేవకీ దేవికిం దన్నుఁ గన్నతల్లికి, గాంధారికి, ధృతరాష్ట్రునకు నభివాదనంబులు గావించి, కృష్ణాను మతంబునఁ బ్రద్యుమ్నుండును, వృషకేతుండును, యౌవనాశ్వుండు నను సాళ్వుండు మొదలగు మహారథికవరులు నిజ చమూసమేతంబుగా వెంబడిం జను దేర వెడలె. అశ్వరంగంబు నఖిలమహీమార్గంబునం గడలి గ్రామంబులు, పల్లెలు నగరంబులు, పేటలు, కోటలు, చెఱువులు, పొరుపులు, గ్రమించుచు యథేచ్ఛ

విహారంబుగా వచ్చి వచ్చి, దక్షిణదిశామండల మండనంబైన మాహిష్మతీ పురంబు సేరం జనుదెంచె.

## -ప్రవీరుఁ డశ్వమును బట్టుట-

అవ్విధంబునఁ దురగంబు మాహిష్మతిం జేరంజని, హృద్యంబులైన యుద్యానంబులం బూచిన పూవుల తావులకుం దావలంబులైన మందానిలంబులచే నందంద కదలెడు చిఱు తరంగంబుల వలనం బొడమిన జల ధూమ్రంపుసొంపు నందెరువరుల బడలిక నపనయించుచుఁ, త్రిలోక శర్మదంబైన నర్మదాతటంబు చేరంజని, యందొక్క శృంగార వనంబుఁ జొచ్చి, యయ్యశ్వరాజంబు జంబూ కదంబాది వృక్షజాతంబుల నీడ దూరంబు నడచి వచ్చిన బడలిక దీఱం జరియింపుచుఁ, గోమలంబులైన దూర్వార దళంబులు మేయుచు, జలంబులు గ్రోలుటకై కొలంకుల కడకుం డాయుచున్న సమయంబున, నద్దేశాధీశ్వరుండగు నీలధ్వజుని కూర్మి తనయుండైన ప్రవీరుండనువాఁడు నిజకళత్రంబైన మదనమంజరి తోడంగూడ నయ్యుద్యానంబున విహరింపుచుండి, కుంద చందన మందార చంద్ర శకల శరచ్చంద్ర కిరణంబులం బలెఁ దెల్లనగు శరీరంబును, సంపెంగ పూవుల చాయం బచ్చనైన పుచ్ఛంబును, నింద్రనీల వర్ణంబైన కర్ణంబులును. బాల సూర్యుని బింబంబునుం బోలి యధరంబును, బగడంబులవలె, గోరోజనంబు కైవడిఁ, గుంకుమ పంకంబు పోలిక, నెఱ్ఱనైన కంఠంబునుం గల యత్తురంగ రత్నంబుం గనుంగొని యయ్యంగన తన నాథునితోఁ, 'గోటానఁగోటి ఘోటకంబులలో మేటియైన యీ ఘోటకంబు నీ లాయంబున నుండెనేని, నీవు చేయు రాజ్యంబు సఫలంబగు' ననిన, విని నీలధ్వజుని కుమారుండైన ప్రవీరుండు చేరంజని, దాని నుదుటఁ గట్టియున్నట్టి బిరుదు పట్టంబు గనుంగొని యందు 'రాజాధి రాజ రాజపరమేశ్వర సకలసామంత రాజభయంకర వీరప్రతాప మూర్తియైన యుధిష్ఠిర మహారాజేంద్రుం డధ్వరంబు సేయంబూని విహరింపం బంపిన యీ యశ్వరాజంబు, నీశ్వరునిం బోరిలో గెలిచిన నెఱ యోధుఁడు, దుర్జన దండధరుండైన యర్జునుండు రక్షింపం బూని వచ్చె. ధారుణీ తలంబున వీరుండు శూరుండునుం గలిగె నేని పట్టి కట్టుం'డని వ్రాసిన వక్కాణ చదివి, యా చెక్కర బొమ్మం జూచి 'యత్తురంగంబు వెంబడి వచ్చిన యర్జునుం గెలిచి నే నీ హయంబు దెచ్చెద. నీవు సఖీజనంబులతోడం గూడఁ బట్టణంబునకుం

బొమ్మని' పంచిన, నమ్మించుఁబోఁడి, గడగడ వడంకుచు గుజ్జంబుమీఁది వాంఛం జాలించి, తన తనూవల్లికి సమానంబైన పువ్వుదీగెల పంచుటమాని, కరపల్లవం బుల సౌరు గలిగిన చివురు గిల్లుట లుడిగి, గబ్బిగుబ్బలవలె నుబ్బుమీఱు కుసుమ గుచ్ఛంబులు ద్రుంచుట వర్జించి, పెదవి తేనియలకుం బదులైన పువ్వుఁదేనియ లానుట విడిచి, వనంబు వెడలి ప్రాణేశ్వరు నెడఁబాయ జాలక, కాళ్లు తొట్రువడ, మెల్లనఁ బల్లకినెక్కి, సఖీజనంబులతోడఁ గూడఁ బట్టణమార్గంబు వట్టి చనియె.

అంత నరాతి భయంకరుండైన ప్రవీరుండు నేనుంగులు, దురంగంబులు, నరదంబులు, వీరభట పటలంబులు, దృఢవ్యూహంబు పన్ని, వజ్రకవచంబును, జగ్గుమీఱు తలగొగ్గియు, నుదుము చర్మంబునం బొదివిన కరతల త్రాణంబును మెఱయ, దివ్యబాణతూణీరంబులు మూఁపునంగట్టి, కనక రేఖాలంకృతంబైన కార్ముకంబు భూతలంబున నూది, వింటికొప్పునం దనకిరీటంబు పేర్చి, సరకు సేయక పరదళంబులఁ గనుగొనుచున్న సమయంబున, నయ్యాజ్ఞికులు నెదురుగాఁ బఱచి, పార్థునిం గనుంగొని, తురంగబు పట్టుపడిన వృత్తాంతంబు పల్కరించు టయు, ముఖారవిందంబున మందస్మితంబు దళుకొత్త, గయ్యంపు వేడుక ముఖంబునం జెంగలింప, దిగ్గజంబు కర్ణపుటంబులకుం గఠోరంబుగా గాండీవి గుణారావంబు నెగడ 'నరదంబు త్వరితంబుగా బోవనిమ్మ'ని(యె).

## - వృషకేతు ప్రవీరుల యుద్ధము -

(అట్లు) వచ్చు విచ్చవ్చుని మున్నాడి వృషకేతుండు, పట్టిన హయంబుతో సడ్డపెట్టక దిట్టయైయున్న రాచపట్టిని విలోకించి, 'తురంగంబు విడిచెదో? మాతోడంబోరి ప్రాణంబులు విడిచెదో? రెంటిలో నొక్కటి విడువక కర్ణ సుతుండు నిన్ను విడువఁ'డని పలికిన, ప్రవీరుండు మొగంబునం జిఱునగవు దొలఁకఁ 'జిన్నయ్యకుం దలమీఱివచ్చిన నిన్ను సురనగరంబున కలంకారం బుగాఁ బంచి, యాపిమ్మటఁ బరాక్రమోపార్జనుండైన యర్జునుం జెగటార్చెద'నని నాలుగు క్రొవ్వాడిబాణంబుల గుజ్జంబుల నొప్పించి, యొక్క శిలీముఖంబున సారథిని మూర్ఛపుచ్చి, యమ్ముదు మెఱుంగు దూపుల వక్షస్థలంబుఁ జెకలించినఁ గర్ణకుమారుండు నేఁడు వాఁడి మెఱుంగుటమ్ముల దురంగంబుల గేటడంగించి, యొక్క బాణంబున సారథి నొప్పించి, నాలుగు వేటు బల్లెంబుల నా రాజకుమా

రుని ఫాలంబు దూయవేసిన, నా ప్రవీరుండు కంపంబు నొందక, మహామేఘం బులు పిడుగులు వర్షించు వడువున నపారంబులైన శరవర్షంబులు గురియించి, కర్ణనందనుని స్రుక్కించి, వేరొక్కతూపు వింటం గీలించి, యాకర్ణాంతంబుగాఁ దీసి యనుసాళ్వుని మూఁపు నాటించి, యుద్ధంబునకు నిలిచిన, వాఁడును సువర్ణ పుంఖంబులు, మనోమారుత రింఖంబులు, నైన కంక పత్రంబులు ననంఖ్యాకంబు లును, బుంఖాను పుంఖంబులుగాఁ గురిసినఁ, గాలుసేయాడక, ప్రవీరుండాహవం బున కోహటించి యుండు సమయంబున, సేనలు కలంగఁ దారి, యాహాకారంబు లొనర్ప, నాసుద్దియాలకించి, మాహిష్మతీ పురాధీశ్వరుండైన నీలధ్వజుండు మూఁడక్షౌహిణుల సైన్యంబుతోఁ దన యల్లుండైన యగ్నిదేవుని మున్నిడుకొని కదనంబునకుం గదిసె.

## - నీలధ్వజుండు పరాక్రమించుట -

(అతఁడు) తన కుమారుండగు ప్రవీరుని యరదంబునకుం బలకదచి చొచ్చి విచ్చలవిడి నస్త్ర వృష్టిచే ననుసాళ్వుని ముంచి, వచ్చిన యోధవీరుల నెల్లం బదేసి విశిఖంబులం గ్రుచ్చుటయు, సేనాసందోహంబులు పటాపంచలై నలుగడలకుం బఱచిన, ధనంజయుండు విరిసిన సైన్యంబుల మగుడం బురికొల్పి కొని, యాభూపాలునిందాకి, యయిదు బాణంబులు ప్రయోగించుటయును, నీలధ్వజుండు నైదమ్ములు దొడిగి త్రోవనేయ, నబ్బాణంబులు మగిడించి సింహ నాదంబుసేసిన, యౌవనాశ్వుండును, సువేగుండును, ననుసాళ్వుండును, వృష కేతుండును మొదలుగాఁగల యోధవర్గంబుల నర్గళంబులగు మార్గణాసారంబులు గురిసిన, నీలధ్వజుండు వెఱవక యందఱ కన్నిరూపులై తూపులసోనలు గురి యుచుఁ దన యల్లుఁడైన యగ్నిదేవునింబిలిచిన, నతండు నస్త్రరూపంబై యెదు టంగనుపట్టిన, నయ్యాగ్నేయాస్త్రంబు కార్ముకంబునఁగదియించి మౌర్వీనాదంబున దశదిశలు ఘూర్ణిల్లంజేయుచుఁ బ్రయోగించిన, నర్జునుండు వారుణాస్త్రంబు సంధించుటయు, జలకణంబునుంబోలె నయ్యస్త్రంబు నొక్కఁగ్రుక్కఁగా బీల్చి ఛటచ్ఛటార్భటులు మింటనంట నొంటుకొను మంటలును, మంటలకంటె మున్నుగా మిణుంగురు బావులకైవడి మీఱి నింగికెగయు మిణుంగురులును, మిణుంగురుల

సంవర్తకవహ్ని ప్రళయకాలంబున గబ్బిమెఱయు మబ్బులవలె నుబ్బుమెఱయు పొగలును. పొగలకంటె మున్నుగా గగనంబునంటుచు దివ్యవిమానంబుల ధగధగమని రగులుకొనంజేయు సెగలునుంగలిగి, సాక్షాత్కారంబుగా నగ్నిదేవుం డట్టుపడి సైన్యంబులంబొదివిన, భద్రగజకుంభంబులు పగిలి పెటపెటంజిటిలిన ముత్తియంబులరాసులును, యుగ్యంబుల పగ్గంబులు, కేతనంబుల పతాకలు, ఛత్రంబులు, నివుఱులై పూదెలుకట్టిన కనకరథంబులును, గిరీటంబులందాసిన రత్నంబులు చిటిలి పడఁదెటిలిన దేహంబులతో నటునిటుం బొరలాడు వీరయోధులును, గత్తులు, కేడెంబులు, జీరాగొగ్గి ముస్తీదులు, తరకసంబులు, సింగిణులుం గమలి, భస్మావశేషంబులై గాలికింబోవఁ గమలిన దేహంబులతోఁ బిసుగుపెంటలైన వీరభటులును, రూకలపెటికలు క్రిందంబడవైచి మంటలు వెంటనంటఁ గుంటుచుంబాఱు నొంటెలును, నొంటెలకంటెమున్నుగా అంకెలు వైచుచు మోపులువైచి పరుగిడు వృషభంబులునుంగలిగి, పాండవబలంబులు ధూమపటలంబులై పఱచినంగని నీలధ్వజుండు నవ్వుచుఁ దురంగంబుం బట్టికొని యాలంబుచాలించి, పురంబునకుం జనియె.

## -అర్జునుం డగ్నిదేవుని స్తుతించుట-

అప్పుడర్జునుండు ధనుర్ధరుండై వహ్ని నుద్దేశించి యంజలి యొనర్చుచు, 'దేవా, దేవముఖుండవు. శ్రుతి స్మృతి పురాణేతిహాసంబులు నిన్నుంగొనియాడు. నీవు సకల దేవతలకు ముఖంబవు. ఆహవనీయంబును, దక్షిణాగ్నియు నీ యందు ప్రభవించె. సర్వసాక్షివగు నీకుం బ్రియంబును, శ్రీకృష్ణదేవునకు నారాధనాత్మకంబును, బృందారకుల కానందకరంబునుంగా, ధర్మనందనుండశ్వమేధంబు సేయ నుద్యోగించె. క్రతుదీక్షా సంరక్షకుండవైన నీవు దీనింబక్షీకరక్షింపవలయుంగాని యుపేక్షింపందగునె?' యని ప్రస్తుతించిన గై కొనకమేర మీఱి మాయనాకి మీఁది కనికరంబున శిఖానికరంబులు పరగించుచుఁ, బొగలు సెగలు మిగుల రగులుకొన దిగదిగమని తగులుకొని యొరగలి పగిది మించి చను చెంచు నవ్వహ్నిం గనుంగొని, వివ్వచ్చుండు మనంబున నతని కామాతురత్వంబు నకు గర్హించుచు, శ్రీమన్నారాయణుని చరణంబుల స్మరణంబు గావించి, నారాయణాస్త్రంబు వేదోక్త ప్రకారంబుగా వింటనొంటించి, ప్రయోగింప నుద్యోగించుటయు, మార్తాండ చంద్రాంగారకాది గ్రహతారకాగణంబులు గతులువప్పె. దగ్గ

జంబులు మ్రొగ్గె. పంచభూతంబులు హాహాకారంబులొనర్చె. వేదంబు మఱచి మోదంబుమాని చతుర్ముఖుఁడు తమ్మిగద్దియవిడిచి దిగ్గనలేచె. సప్త సముద్రంబులు కలంగె. కులపర్వతంబులు వణంకె. భూమి పెటపెటం బగిలె. బ్రహ్మాండభాండంబు దిగఁబడియె. ఇంద్రాది దిక్పాలకులు, సిద్ధసాధ్య కిన్నర కింపురుష గరుడోరగాదులు దిక్కొకమొగంబులై పాఱం జొచ్చిరి. అపుడు హవ్యవాహనుండు భయంబొంది, వేంద్రంబుమాని, యుంద్రసందసుని చెంతకు బ్రాహ్మణరూపంబునం జనుదెంచి వినయంబున నిట్లనియె. 'మహాత్మా, నాయెడం దయసేయుము, ఏ దేవునిం దలంచినంత మాత్రంబుననె నూఱువేల యశ్వమేధంబులు, పది లక్షల షోడశ మహాదానంబులు, కోటి తీర్థయాత్రలు ననేక కోటి వ్రతంబులుం జేసిన ఫలంబు లభించు, నట్టి శ్రీవత్సాంకుండును, రమా కళత్రుండును, బరమ పవిత్రుండును, బరంజ్యోతియుఁ బరబ్రహ్మంబును, వేదాంత వేద్యంబునైన పరతత్త్వంబు నీయింట నుండి కంటికి రెప్పగాచిన చందంబున నిన్నుంగాచుచునుండి నాబోంట్లకుఁ దేటి చూడందగునే? శ్రీహరిని విసర్జించి, దేవతాంతరంబు లపేక్షించు నతండు, పాలసముద్రంబు దొరకినను బాలకై మేకను బితుకువాని చందంబున, సూర్యకిరణంబులఁ గాదని మిణుంగుఱుఁ బురువుల కాసపడు నపస్మారి వితంబునఁ, బరిహాస యోగ్యుం డగుం గావున, నంబుజోదర దివ్యపాదారవింద వందనానందంబునం బొదలు నీకు నశ్వమేధాది యాగంబులు సిద్ధించుట యెంత వింత ? నాకు మామయైన మాహిష్మతీ పురాధినాథునిం దోడ్కొని వచ్చి నీకు సేవకునిం జేసెద. ఇమ్మహా నారాయణాస్త్రంబుపసంహరింపు' మని ప్రియ వాక్యంబుల వేఁడుకొనుటయుఁ, గ్రీడి పావకుని యెడఁ బ్రసన్న చిత్తుండై యమ్మహాస్త్రంబు నుపసంహారంబు గావించిన, నగ్ని దేవుండు భండనంబునం బడిన సేనల నెల్ల నైంద్రజాలికుని పగిది మగుడన్ బ్రదికించి, యర్జునునకుం బ్రదక్షిణంబు గావించి, పురంబునకుం జనియె. అనిన విని జనమేజయ నరేంద్రుండు జైమిని మునీంద్రుం గనుంగొని పావకుండు నీలకేతున కెవ్విధంబున నల్లుండయ్యెనని యుడిగిన నతఁడిట్లనియె.

## - అగ్ని దేవుని వృత్తాంతము -

రాజేంద్రా, నీలధ్వజుని పట్టంపురాణి జ్వాలయను వధూటి కలదు.అప్పు రంధ్రీమణికి నీరేడు లోకంబుల నీడుజోడుకాని చక్కదనంబుల నుతికెక్కిన స్వాహా నామధేయయగు కన్యకారత్నంబు గలిగిన, నా తరుణి జవ్వనంబును, సౌందర్యంబు, గుణంబు, లీలావిలాసంబు, త్రిభువన మోహనంబులు గావున

దానికిం బెండ్లి సేయందలంచి, నీలధ్వజుండు రూపలావణ్యవంతులు, కీర్తిమం
తులు నైన రాజకుమారులఁ, బెక్కండ్ర వ్రాసితెచ్చిన చిత్రపటంబులు సూపి,
యందొక్కని వరియింపుమనిన, నగ్గజగమన సిగ్గునం దలవాంచి, 'మదాంధులు
గర్వగ్రంథులు వసుంధరాధిపతులు. తక్కిన మానవులెల్ల దీనులు. వారల శరీరం
బులు నిత్యంబులుగావు. కావున మర్త్యుల వరియించుట నాకు సమ్మతంబు గాదు.
అమర్త్యులందు నొక్కరుని వెదకు'మనిన, నీలకేతుండు కూఁతుంజూచి 'మంచిది
వాసవుని రప్పించెద వరియింపు'మనిన, నమ్మదిరాక్షి మదిలోన విచారించి, 'సుర
పతి నాకుం దగిన పతియగుంగాని, యతండు జారుండు. తపోవిఘ్నకరుండు.
కుల గోత్రవిదారుండు. సవికారుండు. అదియుంగాక, దేవాది దేవుండైన శ్రీ
విష్ణుదేవునిం దనకుఁ దమ్మునిగానెంచి భక్తి గావింపఁడు. కావున దేవేంద్రుండు
సమ్మతుండుగాఁ'డన, నతండు 'మఱి యెవ్వరిం గోరుదు?' వనిన, 'యగ్ని
దేవుండు జగత్పూజ్యుండు. దేవతలకెల్ల నగ్నిముఖబంని వేదవచనము గలదు.
కావున నతవి యెడ నా భావము నిలిచి యున్నయది. పతి తోడంగూడి ననుగమ
నంబు సేయం దలంచిన సతి తన శరీరం బాహుతి గావించెనని దాని దురి
తంబుల నడంచి కైవల్యంబు నొసంగం జాలునట్టి దైవం బగ్నిదేవుండు దక్క
వేఱొక్కరుండులేడు. సుర గరుడోరగ విద్యాధర సిద్ధసాధ్య చారణ గంధర్వా
దులలో నొక్కరుండును నా మనంబునకు సమ్మతుండు గాఁడు. వైశ్వానరుని
యందు నా డెందంబు లగ్నంబయ్యె' ననినఁ, జెలులు నవ్వుచు నప్పువ్వుబోఁ
డింజూచి, 'యేమని కోరితివమ్మా! రాఁజుచుండెడు మొగంబేమి! నిప్పులు కుప్ప
ళించు నడకలేమి ? సర్వభక్షకత్వమేమి ? ఎచ్చటకువచ్చి నంగాల్చుటమేమి ?
పోయిన మార్గం బెల్ల మలినంబగుట యేమి? ఇట్టివానిం బెండ్లియాడు నాఁడు వారుం
గలరె? అదియునుంగాక, రెండుతలల తోడి మూఁడు కాళ్ళ ముదుసలిని వరియిం
పందగునే?' అనిన సఖీజనంబుల వాక్యంబులు నిరాకరించి, తండ్రిచే ననుజ్ఞఁ
గైకొని, తపోవనంబునకుంబోయి, నియమవ్రతంబు సంకల్పించి, సమంత్రకంబుగా
వైశ్వానరునావాహనంబు సేసి, కర్పూరంబు, కుంకుమంబు, కస్తూరియు నగరుచంద
నంబు, మలయజంబును, లవంగశరక్కరాఘృత పాయసంబులు, తేనెయు, బిల్వఫ
లంబులు, తెల్ల చెఱకులు, కదళీ ఫలంబులు, తాంబూలంబులు, మొదలైన పూజా
ద్రవ్యంబులు దెచ్చి హోమంబు నర్చనంబునుం జేయుచు, బహుకాలంబు భజించు
టయుఁ, జిచ్చుదొర మెచ్చి, నృపాలుని పురంబునకు వచ్చి, విప్రరూపంబున రాజ

మందిరంబుసొచ్చి,సముచితోపచారంబులఁ బూజితుండై, 'మహీశ్వరా, నీకన్యయగు స్వాహా వధూరత్నంబు నాకుం గన్యాదానంబు సేయు' మనిన, నీలధ్వజుండు ధూమ ధ్వజునింజూచి, 'నా కన్యక యగ్నిదేవునిం దక్క నితరుల నొల్లదు గావున, వేఱొక్క కన్నియ నొసంగెద వివాహంబుగ' మ్మనిన, ననలుండు నిజరూపంబుఁ జూపిన, రాజు ప్రమోద భరితుండై, స్వాహాకన్యకను జిత్రభాను నకుం గన్యాదానంబు సేసె. అది మొదలుగా వీతిహోత్రుండు వారియింట నిల్లంట్రపుల్లుండై తత్పురంబు రక్షించుచు, వైరుల మీఁదం దార్కొనుచు నతనికి నప్తుంబై యుండె. ఇది జాతవేదుండు నీలధ్వజునకు నల్లుఁడైన తెఱం"గని వినరింప జనమేజయుండవ్వలి కథ సెప్పుమనుటయు, జైమిని యిట్లు సెప్పందొడంగె.

అవ్విధంబున ధూమకేతనుండు నీలకేతనుని సమ్ముఖంబునకుం బోయిన నతఁడు నల్లునింజూచి 'శత్రుసైన్యంబు నిశ్శేషంబుగా దహించి వచ్చితివే?' యని యడిగిన ననలుండతనింజూచి, 'నరేంద్రా, అర్జునుండు నారాయణపరాయణుండు కావున నావ్యూహంబు నాకు దురవగాహంబు. దాహంబు నొందింపంగూడదు. అది యునుంగాక, తొల్లి దేవేంద్రుఁడు ప్రయోగించిన వజ్రాయుధంబు స్తంభింపజేసి ఖాండవ వనంబు నా కాహుతిసేసె, నయ్యుపకారంబు దలంపక యతనితో నాచేత నైన యంతఁబోరితి, నింక నాకు నసాధ్యంబు. నీవు నిరర్థక విరోధంబు పాటింపక యాగహయంబు రయంబునఁగొనిపోయి పార్థున కొసంగి కృతార్థుఁడవుగమ్ము'. అనిన రాజపుంగవుండు తన కులాంగనయగు జ్వాలాసతింగనుంగొని 'యల్లుండైన యగ్నిదేవుండు మనకు హితంబు సెప్పెఁగావునఁ గ్రతుఘోటకంబుఁగొనిపోయి కిరీటికి నప్పగించి స్నేహంబుగావించుకొనియెద'ననిన, దంటయగు నావాలుగంటి తన నాథునితో, 'ముక్కంటివాఁడు పెనంగెనేనియుఁ జలపట్టి తన పట్టిన కార్యంబు విడువక కీర్తిఁజేపట్టుట రాజధర్మంబు. సాహసంబు సేయక శ్రీయును కీర్తియుఁగలుగనేరవు. పట్టిన గుఱ్ఱంబు మగుడనిచ్చి యతని వేడుకొనంబోయితి వేని, నరిరాజులు నవ్వరే! గెలిచితివేని నరలోక రాజ్యంబును, మృతుండవైతి వేని సురలోక రాజ్యంబును ననుభవించెదవు. పరునకుంబ్రియంబు సెప్పిబ్రతుకుట కంటె క్షత్రియునకు మరణంబుమేలు'. అనినవిని, యమ్మనుజనాథుఁడట్లే కావిం చెద' నని యమ్మింముఁబోఁడితోఁబంతంబులు పలికి రణభేరి భాంకారంబులును, గజఘీంకారంబులును, శింజినీ టంకారంబులును సెలంగ, నహంకారంబున సేన

లంబురికొల్పికొని, పురంబువెడలి, పురందరనందనునితోడం దలపడుటయు, గాండివి గాండీవ గుణధ్వని దిక్కులు గ్రక్కదలంజేయు ప్రళయకాల నీల జలధరంబు వర్షించిన తెఱంగున నంపరలపరంపరల వెంపరలాడుటయుఁ, బడిన యేనుంగులును, మడిసిన గుఱ్ఱంబులును, బొడియగు రథంబులును, జడిసిన వీరభటులును, దునుకలైన కేతనంబులును, దుమురులైన గొడుగులును, ద్రుంగిన సేనాంగంబులును, విరిగిన కైదువులును, విటతాటనంబులైన మైమఱువులును, విశకలితంబులైన కిరీటకేయూర హారాది భూషణంబులును, వ్రేలెడు ప్రేవులును, దుమ్ములైన యెమ్ములును, గ్రమ్మిన రుధిరమ్ములును, నాడెడు నట్టలును, నందంద విహరించు భూత భేతాళులును, నానందంబునొందు కంక కాక గృధ్ర జంబుకంబులును గలిగి సంగరాంగణం బతి ఘోరంబయ్యె. అంత నీలధ్వజుండు కపిధ్వజునిందాకి నిశిత విశిఖంబులనొప్పించిన, గాండీవి మండలీకృత కోదండుండై, చండకాండంబులు తండోపతండంబుగాఁ గురిసిన, నొక్క తీక్ష్ణభల్లంబున భుజ మధ్యంబు పగులనేయుటయు, నెత్తురులు గ్రక్కుచు మరణసమానంబైన మూర్ఛనొందిన, సారథి యన్నీలధ్వజుని దుర్దశయును, సైన్యంబులు సమయుటయును, గాలు కాలుంబెనచుకొని పడిన సుత భ్రాతృ బంధు యోధజాలంబునుం గాంచి, యరదంబు కదన రంగంబునకుం దొలగించి, పట్టణంబునకుం దెచ్చుటయు, నెట్టకేలకు మూర్ఛఁదెప్పిఱి, యప్పుడమిఱేడు సారథిం జూచి, 'మేలు సేసితి' వని కొనియాడి, మంత్రులం బిలిపించి, మంతనంబుగావించి, 'కృష్ణసహాయుండైన జిష్ణుని మార్కొనుటకు నెవ్వరికిఁ దరంబు ? పర్వతంబుపై సన్నపడినఁ దగరు శిరంబు నొచ్చుటయే కాని, పర్వతంబునకుఁ గొఱంతయేమి ? బలవద్విరోధంబు తగద'ని యాలోచన నిశ్చయించి, తన పట్టపురాణికిం దెలుపుటయు, నియ్యకొనక యయ్యతివ ప్రల్లదంబులు ప్రేలినఁ గినిసి 'నీ దుర్నయంపుబోధనచే యుద్ధంబునకుఁ బోయిన నాకుంగలవారలెల్లరు సమసిపోయిరి. స్త్రీబుద్ధిః ప్రళయాంతకీ యనెడు పలుకె యథార్థంబయ్యె' నని యాగ్రహంబున 'నిస్సీ ! ఇటువంటి దంటతోడం గాపురంబు సేసిన గుణంబు సెడి మాన ప్రాణంబులకు హాని సంభవించు'నని యప్పుడె దానిం బట్టణంబు వెడలనడచి, చీనాంబరంబులును, జిరత్న రత్న భూషణంబులును, జిత్రంబులైన కానుకలును, జిన్నారి నారీమణులునుంగూడ, నయ్యధ్వరాశ్వంబుఁదెచ్చి, విజయున కొప్పగించి, వినయ పూర్వకంబుగా మ్రొక్కుటయు, నర్జునుండు నతని నాలింగనంబుసేసికొని, 'నీవు

సహోదర సమానుండవు. ఈ సంవత్సరంబులు నాతోడంగూడ నశ్వరక్షణంబు సేసి యాగంబుంగనుంగొని, ధర్మనందన వసుదేవనందనులకు వందనంబు సేసి వత్తువుగాక' యని ప్రార్థించి, యమ్మహీధవునిందోడ్కొని, యధ్వరాశ్వంబునుం దరలించిన, నదియును దక్షిణదిశాభాగంబునకై యతివేగంబునం జనియె.

## -జ్వాలాదేవి సోదరుని కడ కేగుట-

అంత నీలధ్వజుని భార్యయైన జ్వాలావతి మగనిచే నవమానంబు నొంది, డెందంబునం బట్టరాని రోష విషాదంబులం బొగులుచుఁ, గాశీనగరంబునకుంజని, యాదేశంబున కధీశ్వరుండు నవక్ర పరాక్రమాటోప దీపితుండు, నాత్మీయ సహోదరుండునైన యుల్ముఖుని యొద్దకుంబోయి, విషాదవేదనాదోదూయమాన మానసయై, పాదంబుల పయింబడి రోదనంబు గావించుటయు, నతండును గరుణాయత్త చిత్తుండై యూరడించి, 'నీవొంటిగా వచ్చుటకుఁ గారణం బేమి! ఇంత వంత యేమిటికిం జెందెదవు? ఎంత కార్యంబయిన నిర్వహించెద,' నని యడుగుటయు, నామె, యశ్వమేధాశ్వంబు వచ్చుటయు, బహుజన క్షయమును, దన మగని పరాజయమును, దాను మగుడ సమరంబునకుఁ బురి కొల్పుటయు, నతఁడు మంత్రులతో యోచనచేసి కయ్యంబున కియకొనక తన్ను నవమానించి పురంబు వెడల నడుచుటయు, నాద్యంతంబును బూస గ్రుచ్చిన విధంబునఁ దెలియఁ బలికి, మఱియునుం దద్విరోధంబు రూఢమూలంబు సేయందలంచి యిట్లనియె: 'అన్నా, నాబన్నంబు లెన్నని వివరించెద! నీ మఱంది, తానును, పుత్రుండును, దండనాయకులును, దళసమేతంబుగా ధనంజయునిందాకి, దావాగ్ని జ్వాలలంబడిన శలభంబుల కైవడిఁ నొచ్చియు,జచ్చియు,వెన్నిచ్చియుఁ, బార్థుని కోలలకుం జాలక, కలహకారిణియగు నన్నుం బురంబు వెడల నడిచి, యతని శరణంబునొందె. ఈ యవమానంబు సహింపఁగూడక యేనిందు వచ్చితి. నీవు దక్క నాకు రక్షకులు లేరు.ఎవ్విధంబుననైన నీయవమానంబు దీఱునట్లుగాఁ బార్థుని తోడంబోరి సంహరింపుము'. అనుటయు నతండు సహోదరింజూచి, 'యట్లకానిమ్ము రేపటికి హయుం బిచటికి వచ్చు. నేను బట్టి కట్టెద, నతనికి నాకును సమరంబయ్యెడు, నపుడర్జునుని నిర్జించెద, నీవు వంతం బొందవల' దనుటయు, నాజగజంత సహోదరుంజూచి, 'యింద్రనందనుండు గుఱ్ఱంబు పోయిన త్రోవనే పోవుఁగాని, యిచ్చట కేలవచ్చు? గుఱ్ఱంబు వెంబడి నతండు

పోయిన నీవెవ్వరితోడఁ గదనంబు సేసెదవు?' అని తీవరించుటయు, 'సహోదరీ! ఇంతలోన నేమి కార్యంబుదప్పె? ఎన్నటికేనియు నతనికి, మనకు విరోధంబు పుట్టకపోవునే? నాఁటికి నీకొఱఁతఁదీర్చెద. ఈ వేళ మారకుండు' మనుటయు, నాపంట యతనింజూచి, 'యన్నా, పుట్టిన జగడంబు తోడుత నడుపవలయుం గాని, యేండ్లు పూండ్లు చెల్లిన నేమి ప్రయోజనం?' బనిన, నుల్కుఖుండు నాగ్రహోదగ్రుఁడై 'పాపాత్మురాలా, చొచ్చిన యిల్లు చెఱచిన యదిగాక, పుట్టిన యిల్లునుం జెఱుపవచ్చితివే ? నీవంటి చెఱపనచేట మా యింట నుండందగదు. పాఱెడు బండ్లకుఁ బాదంబులు చాఁచు మనియెదు. నీవలసిన యెడకుం బొమ్ము' అని విదనాడుటయుఁ, బిడుగు వడిన దానిం గొఱవిఁ జూఁడిన తెఱంగున నదృశ్యాంగన కెరలి, మనంబులో మిడుకుచు గంగా సమీపంబునకుం జనిఁ(యె).

## -గంగ యర్జును శపించుట-

(అచట) నోడ యెక్కి యవ్వలి గట్టునకుఁ బోవు వారల తోడంగూడఁ బోవునెడఁ, దన యెడమ కాలిమీఁద గంగా జలంబు తుంపర పడుటయు, 'శివ శివా, యెంత పాపాత్మురాలినంటితిని! ఇందుకింకనేమి ప్రాయశ్చిత్తంబు సేసికొందు ?' నని పలికినఁ, దీర్థవాసులయిన జనులందఱు గువ్వాకరిగాని 'త్రిలోక పావనియగు పుణ్యవాహినిం దూషించిన నీ నోరు పుచ్చవలదా ! కర్మచండాలీ, నీవు మాతోడం గూడ నుండ దగ'వని యేక వాక్యంబుగాఁ దిట్టిన, నా గంగానది నవ్వుచు నంగనా రూపంబునఁ బ్రత్యక్షంబై, 'నీమాటి ! నాయందేమి యన్యాయంబుగంటివి ? నీవిట్లు దూషించుటకుఁ గారణంబేమి ? ఎఱింగింపుము' అనినఁ, 'బుట్టినబిడ్డల నేడ్వురం దొట్టితొట్టిన మెడలు నులిపి వేసిన పాతకివి ! నీకుఁ గడపట నుప్పురాయివలె నొక్కండు నిలిచె. సత్య వ్రతుండగు నమ్మహానుభావుని, శిఖండిని మున్నిడికొని యర్జునుండు వధించె. ఆ సూడు దీర్చుకొనక యున్నదానవు. పుత్రహీనవు. నీ మొగంబు సూడరాదు.' అనిన, నా దివ్యనది కోపశోకంబులు మనంబునఁ బెనంగొన, 'నేటి కాఱవ నెలనాఁటికి నర్జునుని శిరంబు వాని కుమారునిచేఁ ద్రెళ్ళుంగాక' యని శపియించి యంతర్ధానంబు నొందుటయు, నాజ్వాలయు సంతసంబునొంది, యా దివిజ నదీ తీరంబున దారువుల చేతం జితి యమర్చికొని, శివునుద్దేశించి తన శరీరం బాహుతిఁ

గావించి,మృత్యు దంష్ట్రాకరాళంబును, జ్వాలామాలికా భీలంబును,నర్జును ప్రాణాపహారంకబును,నగు శరంబై జనియించి బభ్రువాహను తూణీరంబునందుండె.

## -అధ్వరాశ్వము జాతినంటుకొనుట-

అంత నా సైంధవంబు జవంబున నయ్యేదేశంబులు దాఁటి, వింధ్యపర్వత సమీపంబునకు వచ్చి, యచ్చటఁ దిలకంబులు, క్రముకంబులు, కదంబంబులు, కరవీరంబులు, నర్జునంబులు, నామ్రంబులు, కుటజంబులు, కరంటకంబులామకంబులగురులు, సాలంబులు, రసాలంబులు, పాటలంబులు, వటంబులు, లవంగంబులు, నారంగంబులు, నీపంబులు, ధూపవృక్షంబులు మొదలగు తరువులచే బహుళంబులైన గహనంబులు సొచ్చి, పోవునెడ, మార్గమధ్యంబున యోజనంబు నిడివియు, నరయోజనంబు వెడల్పును, నంతియ పొడవుం గల యొక్క శిలం జూచి, దేహంబు తీఁట దీరుటకై యా శిలతో నొరసికొను మాత్రంబునఁ, జిగురుఁగండెలోనం దగిలిన పక్షికైవడి, నా గుంటితో నంటికొని, యవ్వలివ్వలం గదలనేరకఁ, గనకంబునం జెక్కిన రత్నంబుకైవడి, నిశ్చలంబై యుండుటయు, నా సాహిణులాసహేనినాదంబుల నదల్చి, కశాఘాతంబున వైచి, వాగె పట్టి సాగఁదీసిన, రాక యూరకుండుటయు, నయ్యశ్వ రక్షకులు భయభ్రాంత మానసులై, వడిగాఁ గవ్వడి కడకు వచ్చి యా వృత్తాంతంబు విన్నవించుటయు, నరుడఁది పురందరనందనుండశ్వంబు దురవస్థఁ దప్పించు నుపాయంబు గానక, తత్సమీపంబున నున్న సౌబరి యాశ్రమంబునకుం జనియె.

## - అర్జునుండు సౌబరి యాశ్రమంబునకుఁ బోవుట -

అందు శరభంబు పిల్లలం బ్రక్కలోనుంచుకొని చన్నుబాలిచ్చి పాలించు గండభేరుండంబులునుఁ, బొదుగులం బాలుదాఁచి సింహకిశోరంబుల కొసంగి నిదురపుచ్చు శరభంబులును, నేనుఁగు గున్నల కటంబుల తీటతీఱ మెలమెల్లన గోరులంగీఱు సింగంబులును, లేడిపిల్లలం జూచి చన్నులుచేఁపి వాని మేనులు నాకు సివంగులును, బాముపిల్లలకు నెండ సోకకుండ ఱెక్కలం గప్పు నెమిళ్ళును, నెలుకపిల్లల మెల్లనం గలుగుజేర్చు మార్జాలంబులుం గలిగి, జాతి వైరంబులు లేని జంతు నివహంబులచే సకల భువన సంతోషకరంబైన

యాశ్రమంబునకు ననతిదూరంబున సైన్యంబును నిలువ నియమించి, ప్రద్యుమ్న వృషకేత నానుసాళ్వ యౌవనాశ్వ నీలధ్వజులం గూర్చుకొని, యాశ్రమ ప్రదేశంబున కరిగి, వేదాంత విద్యావిశారదుండును, దయారస వక్షనీరదుండును, శ్రీమదష్టాక్షరీ మంత్రలబ్ధ మహత్త్వుండును, రుద్రాక్షమాలికా విభూతి జటా వల్కలధారియు, శమ దమాది గుణహారియు, నగు సౌబరింగాంచి, సాష్టాంగంబుగా మ్రొక్కి సేవించి, సవ్యసాచి నిటలంబునఁ గరకమలంబులు మొగిచి, 'మౌనికులచంద్రా? ధర్మనందనుండు జ్ఞాతివధం బొనరించిన పశ్చాత్తాపంబునఁ గృష్ణద్వైపాయను ననుజ్ఞచే నశ్వమేధాధ్వరంబు సేయంబూని, చైత్రశుద్ధ పౌర్ణమాసి దినంబున దీక్ష గైకొని, బ్రాహ్మణులకు మణికనకాది దానంబులొసంగి, మఘవాజిం బయనంబుసేసి, పూజించి పంపుటయు, నేను శ్రీకృష్ణ యుధిష్ఠిరులకు నమస్కరించి, వారల యనుమతిఁ గైకొని, యీ యౌవనాశ్వాదులు వెంబడిం గదలిరా, దేశంబులన్నియుఁ గడచివచ్చి, వింధ్యవాటిఁజొచ్చి, యయ్యశ్వంబు యోజనవిస్తారంబైన ప్రస్తరంబుతో నొక్కటిగా నంటికొనియె. శిలానిబద్ధంబైన యీ హయంబేవితంబున విడిపడు నావితంబెఱిగింపవే ! దయానిధీ, నీకు నమస్కారంబ'ని ప్రార్థనంబు సేసె.

## - ఉద్దాలక మహర్షి కథ -

అంత సౌబరి యింద్ర తనూభవుం జూచి, 'తొల్లి యుద్దాలకుండను (మహర్షి) మహామునీంద్రుండు యథోక్తంబుగా బ్రహ్మచర్యవ్రతంబు నెఱవేర్చి కర్కశభాషిణియుఁ గలహకారిణియుఁ బ్రతికూలాచారయు, ననుదిన కృతాపచారయునైన చండిక యనుదానిం బెండ్లియాడి, బాల్యంబున నుండి యౌవన కాల పర్యంతంబు నానావిధంబులుగా మనోరంజనంబు సేసియు, దానివలన యేగుణంబు గానక చింతించుచుండు. వేఁపచెట్టునకుం బాలుపోసి చక్కెర యెరువువేసి పెంచిన నేనియుఁ జేదుగాక మాధుర్యంబు గలుగనేర్చునే! అతండు సంధ్య వార్వఁ బాత్రంబు దెమ్మనిననది రాతి మీఁదం బగులఁ గొట్టు. దాని నతికింపకొనుట యతి ప్రయాసంబగు. తడి దోవతి యెత్తి యుమ్మనిన, నడిమికి రెండుగాఁ జింపు, నది బ్రహ్మకమ్మివైచి కట్టుకోవలయు. జపమాలికం దెమ్మనిన, సూత్రంబు త్రెంచి పూసలు వెదజల్లు, నవి వెదకి యేఱి తెచ్చుకోవలయు. సమిధలు దెమ్మనినఁ గుండంబార్చి వైచు, నది యూఁది రగులుకొల్పు

ప్రయాసంబు దైవంబెఱుంగు. వంట వేగంబె కావలెననినఁ, గడవలు పగులఁ గొట్టు. కోపంబు వలదే యనిన రోకలిచేఁ బ్రహరించు. ఇవ్విధంబునఁ బ్రతిదినంబుం బ్రతికూల వర్తనయగు భార్యచేతం బడరానిపాట్లు పడుచు, బ్రహ్మచారియు గృహస్థుండును గాక, రెంటికిఁ జెడ్డ రేవఁడై వంతం బొందుచున్న యెడ, నతనికి గురుండగు కౌండిన్యుండను ముని వర్యుండు, శిష్యులు గొలువం దీర్థయాత్ర పోవుచును ద్రోవవచ్చి, యుద్దాలకుని యాశ్రమంబునకుం జనుదెంచుటయు, నతండర్ఘ్య పాద్యాది విధానంబులం బూజించి కుశలంబడిగి, కౌండిన్యునితోఁ దన భార్య ప్రతికూల వర్తనంబు లెల్ల సవిస్తరంబుగాఁ బలుకరించి, దుఃఖించుటయుఁ, గౌండిన్యుండుద్దాలకునింజూచి, 'యయిన పనికి నేమి సేయం గలవారము? అగ్నిసాక్షికంబుగా వివాహంబైన సతు లెటువంటి వారైనను విడచుట యెట్టు? దీని కొక యుక్తిఁబలుకరించెద: చేయవలసిన కార్యంబు చేయవలదనుము. చేయనొల్లని కార్యంబు చేయుమనుము. ఇట్లుచెప్పితివేని యకృత్యంబులు మాని కృత్యంబులు సేయుచునుండు. నీయభీష్టంబు సిద్ధించు'నని యానతిచ్చిన నయ్యుద్దాలకుండు తన పత్నింజూచి, 'మన యింటినడవలో నెవ్వరో కొందఱు వచ్చియున్నారు. వారల నవ్వలికిం బొమ్మని తీర్థంబు మొదలుగనీయక దుర్భాషలం దిట్టు' మనిన, నా చండిక 'యక్కటా !యిట్లు చేయుదురె?' అని వారలకు నమస్కరించి, తోడ్కొని వచ్చి షడ్రసోపేతముగా నన్నపానంబులొసంగి పూజించె. వారలు చనిన యనంతరంబ యుద్దాలకుండు మఱునాడు భార్యనుం గనుంగొని 'రేపటికిఁ బైతృకంబు నేను జేయం గలవాఁడనుగాను. కాదని చేసితి నేనియుఁ గుండ గోళకుల దురాచారుల వేశ్యాపతుల, బధిరుల, నంధుల, విష్ణుభక్తి వర్జితులఁ బరదారాద్రవ్యనిరతుల, బ్రాహ్మణార్థంబునకు నియమింతు; నింతియకాని నిన్న మనయింటికి వచ్చినవారు మగుడ వచ్చిరేని వారల నియమించు వాఁడంగాను. పైతృకంబు సేసితినేని యులువలు, చామలు, నారుగలు, కందులు, నలసందెలు, ననువులు, తమిదలు, జొన్నలు, కంబులుల్లి పుచ్చకాయ ముల్లంగి, సొరకాయ, పిండికూర మొదలైన యభక్ష్యద్రవ్యంబులు దెచ్చి వడ్డింతు, నదియునుంగాక, తెల్లవాఱిన జాముమీఁద బ్రాహ్మణులం జెప్పుదును గాని, తొలినాటిరాత్రియే విజ్ఞాపనంబు సేయువాఁడనుగాను. సాయంకాల సమయంబున, రాత్రిఁయేనియు నర్చనంబు సేయుదుఁ గాని, కుతప కాలంబున నిద్ర పోవంగల వాఁడ. నట్టింటఁ జిట్టముకయు, దవుడు మట్టిడి పెంటలు నెఱపుదు, నింతియకాని

గృహంబు నలంకరింప. బ్రాహ్మణుల వస్త్రంబులు దోఁచుకొని, దక్షిణ లేదు పొమ్మని, యవిశ్వాసంబుగా నాచరింతును.' అనిన చండి విని, మండిపడి 'సదాచారసంపన్నులు, వేదవేదాంగపారగులు నైన బ్రాహ్మణోత్తము నాఁటి రాత్రియే నియమించి, గృహంబు ముంగిలియు నడవయు గోమయానులేపనంబు, రంగవల్లికలచే శృంగారంబుగావించి, తానును నరుణోదయంబుననే స్నానంబు సేసి, మినుములు, పెసలు, యవలు, గోధుమలు మొదలగు ధాన్యంబులును, దోసకాయ, పనసకాయ, కాకరకాయ, యూరుదొండకాయ, బలుసుకూర, మొదలైన శాకంబులు, నతిరసంబులు, వడలు, దోసెలిడ్డనలు మొదలగు ప్రేక్ష్యంబులైన భక్ష్యంబులును, గమనీయంబులైన నూతన భాండంబులం దలవరించి, దక్షిణలు, హెచ్చు వస్త్రంబులు, మంచిగంధంబులు సంపాదించి, యుక్తకాలంబున యథావిధిగా శ్రాద్ధంబుఁ జేయించి, మగనికి, నిష్టబాంధవులకు షడ్రసోపేతముగా భోజనంబులు పెట్టి, తాంబూలాదులొసంగి, సంతోషంబు నొందించు సమయంబున, సూర్యమండలంబు బింబిఫల డంబర విడంబనంబై కాంతికపంబకంబులం గనుపట్ట, నస్తగిరి శిఖరంబునఁ గనక కలశంబు కరణిం బ్రకాశించె. అప్పుడుద్దాలకుండు భార్య చేసిన యుపచారంబులకు సంతుష్టుండై, మేనుమఱచి, తద్విపరీతంబుగాఁ బలుకక 'పార్వణంబు గొనిపోయి గంగా జలంబులోవైవు' మనినం గోపించి, యాపాతకి యింటి సమీపంబున నున్న పెంటమీఁద వైచుటయు, నుద్దాలకుం డాగ్రహ వ్యగ్రుఁడై, కనుఁగొలకుల నిప్పులుప్పతిలం జూచుచు, 'నిర్భాగ్యురాలా, పవిత్రంబులైన పార్వణంబులు పెంట మీఁదవైచి శ్రాద్ధంబు వ్యర్థంబు గావించితివి. ఈ యకృత్యంబు లెన్నాళ్లు సహింపఁగలవాఁడ? గొండారణ్యంబున గుండు రాయివై పెద్దకాలంబు పడి యుండు' మని శపియించి, గడగడ వణంకు పడంతుకం జూచి, కరుణా కలిత మానసుండై, 'కొంతకాలంబునకు ధర్మనందనుని యశ్వమేధాశ్వ సంరక్షణార్థంబుగా నర్జునుండు వచ్చు; నతని కరంబు సోఁకినం గృతార్థవయ్యెద' వని శాపమోక్షణంబు ననుగ్రహించెంగావున, నీకరంబుచే నిప్పాషాణంబు నంటుము. అశ్వమేధ హయంబు వీడివచ్చు. చండికయును శాపమోక్షణంబు గాంచు' ననిన, నక్కిరీటి సౌబరి మహామునికి సాష్టాంగ నమస్కారంబు సేసి, వాజి సమీపంబునకుంజని, నిజకరారవిందంబుచే (రాతి) నంటుటయు, (హయంబు దాని తోఁక నంటువాసె.) శ్రీరాముని చరణారవింద రేణువులు సోఁకిన యహల్యకైవడి

చండికయు శాపమోక్షంబునొందె. ఉద్దాలకుండును గ్రమ్మఱ దాని తోడం గాఁపురంబు సేయనొల్లక సన్న్యసించె.

అంత నయ్యశ్వంబు, వింధ్య కాననంబుదాఁటి, యాదిభుజంగ పుంగవుని ఫణాశృంగంబులు బరువుచేత గ్రుంగఁబడునట్లుగాఁ జతురంగంబుఁలు నడువ, హంసధ్వజ మహారాజ ప్రతాప సంరక్షితంబును, గోపురాగ్రపరిచుంబిత గగనంబైన చంపకాపురంబు చేరంజనిన, నాహవ ప్రవీణులును, మహా సాహసికులును, బాహుబలభరితులునైన యోధ వీరులతో నింద్రనందనుండు తోడనె వచ్చె. అప్పుడధ్వర ఘోటకంబు వచ్చుటయు, నానాధ్వజినీ సమేతంబుగా ధనంజయుఁడు కూడం జనుదెంచుటయు, నుపలక్షించిన వేగరులు వేగంబజని హంసధ్వజుని కెఱిగించుటయు, (నాతఁడు) మంత్రులం బిలిపించియాలోచనంబుసేసి, 'ధర్మజుని యశ్వమేధాశ్వంబు వచ్చెనట! వివ్వచ్చుండు తోడనే వచ్చుచున్నవాఁడట ! నేనత్తురంగంబుఁబట్టి బెట్టుగా సమరంబు గావించెద. అపుడు భక్తసంకట మోచనుఁడును, బద్మలోచనుఁడును, గరుణావర్ధిష్ణుండును నైన శ్రీకృష్ణుండతనికిఁ బ్రాపై వేంచేయఁగలఁడు. నేనద్దేవుని దివ్యపాదారవిందంబులు సందర్శించి కృతార్థుండ నయ్యెద.'

## - హంసధ్వజుఁడశ్వమును బట్టివచ్చుట -

అని నిశ్చయించి, సన్నాహ సముచితంబైన రణభేరి మ్రోయించుటయుఁ, గోలఁగొట్టిన భంగిఁ జతురంగ బలంబులు వెలువడియె. బలపరాక్రమ ధురీణులును రణకలాప ప్రవీణులును, బరమాప్తులునైన డెబ్బదుండ్రు సేనాపతులు, నొక్కొక్కనికి డెబ్బదియొక్కవేయి భద్రగజంబులును, నవరత్నమయంబులునైన యన్ని యరదంబులును, నందఱు వీరభటులునుం గలరు. ధనబలుండును, సురథుండును, సుధన్వుండును, సుబలుండును, ధర్మబాహుండు ననంబరఁగిన కుమారులేవురు గలరు. వారలందఱు ధర్మపరాయణులును, శ్రీవిష్ణుభక్తి నిష్ఠా గరిష్ఠులును, నేకపత్నీవ్రతులును, సత్యభాషణులును, దాతలును, శూరులును, సంగరప్రియులునై యెప్పుదురు. అట్టి సేనలతో హంసధ్వజుండు కయ్యంబునకు వెడలునపుడు నిజ పురోహితులైన శంఖ

లిఖితులం బిలిచి, 'నాయాజ్ఞ సుల్లంఘించి రణంబునకు రాక వెనుకఁజిక్కిన వారిని, కాగిన చమురు కొప్పెరలో వైవుం' డని యాజ్ఞాపించి, భద్రగజంబు మీఁదనెక్కి శ్వేతచ్ఛత్ర చామరంబులు మెఱయ వెడలునపుడు, మేడలుప్పరిగలు చంద్రశాలలు, నెక్కి పౌరసతులు మహీపాలుని మీఁదంజల్లు కమల దళంబులు, తత్కటాక్షంబులతోడంగూడ మేనంబడిన, నమ్మేదినీనాథుం డర్జునునితోఁ దాఁకఁ దలంచినంత మాత్రంబున దేవేంద్రుఁడయ్యెనో యనం జూపట్టె.

## -సుధన్వుఁడు సంగరమునకు రాక జాగు చేయుట-

ఆయ్యవసరమున సుధన్వుఁడనం బరఁగిన యతని మూఁడవ కుమారుం డాహవంబునకుం గట్టాయితంబై, తల్లియొద్దకు వచ్చి వందనంబు చేసిన, నయ్యంబ నెయ్యంబునఁ గౌగిఁటంజేర్చి, 'కులంబునకుం గీర్తి తెమ్మ'ని పంపినం, దనకు నగ్రజయగు కువలాదేవికి మ్రొక్కిన, నాయమ్మయు నట్లదీవించి 'తామసింపక తండ్రి వెంటంజను' మని పంచుటయు, సంతసంబుతోఁ దన మోహంపుటింతి యగు ప్రభావతి చెంగటకు వచ్చి, 'సంగరంబునకుం బోయి వచ్చెద' ననిన, నయ్యంగన కర్పూర నీరాజనంబుల నివాళి దీసి, చెట్టఁబట్టు కొని, కేళీగృహంబునకుం దోడ్కొని పోయి, వలపు దెలుపు కలికివాలుఁ జూపులం జూచుచు జాఱుపయ్యెద సవరించుచు, జెదరిన ముంగురులు కొన గోట దిద్దుచు, రతికేళీ కౌతుకంబు తెలియంబడఁజేసిన, నారాకుమారుండు 'బోటీ ! కిరీటిం గెలువక నిన్నుం బొందునది లేద'నిన నమ్మగువ చిఱు నగవు మొగంబునకు వింత సొగసు సంపాదింప, 'నీవు సకలధర్మంబులు దెలిసిన వాఁడవు. నేవిన్నవింపఁ దగిన దేమున్నయది ? ఋతుధర్మంబు దాఁటవు గావున విన్నపంబు గావించితిని. నా కోర్కె నెఱవేర్చిపోవుట యుక్తం'బని కౌఁగిలించి కొనిన, సుధన్వుండు నిజ సతిం జూచి, 'దివాసురతంబు ధర్మంబు గాదు. రాజు మహోగ్ర శాసనుండు. రణభేరీ నినాదంబు వినివినకమున్న పురంబు నందలిసైన్యపతులెల్లఁ గరితురగస్యందన వీరభటుల తోడం గూడఁ గదనంబునకుం జనిరి. నేను వెనుకఁ జిక్కిపోయితినేని, చండశాసనుం డైన మండలేశ్వరుండు పురోహితులకు నొప్పగించు. వారలు నిర్దయాత్మకులై తప్త తైల కటాహంబునం బడ వైచెదరు. రమణీమణీ, నీ ఋతువాసరంబులు పెక్కుగలవు గాన, నేటికిఁ గిరీటిం జయించి వచ్చెద. నేఁడు చక్క దినంబు

లేకయున్నయదియే ?' అనిన నయ్యిందువదన కందర్పబాణ బాధితయై 'నేటి తోడం బదియాఱు దినంబులు నిండె నింక ముందర ఋతుదినంబులు లేవు. తండ్రి తిథియైనను, భార్యయెడ ఋతుకాల గమనంబు సేసిన దోషంబు లేదని శాస్త్ర వచనంబులు గలవు. అదియునుంగాక, యిది తెల్లవారుజాముగాని, సూర్యోదయంబుగాలేదు. కావున దివాసంగమ దోషంబును లేదు. కయ్యంబునకుం బోక వెనుకఁ జిక్కిన, శంఖలిఖితులు కాఁగిన నూనె తొట్టిలోనం బట్టివైవుదురని భయపడియెదవేని, ఋతుకాలంబు తప్పిన భ్రూణహత్యా దోషంబు వచ్చు, నందుచే యమలోకంబునఁ దప్తతైల కటాహంబునఁ దూలవలయు. కాకున్న నిప్పుడే మదన వేదనచే శరీరంబు నిలువదు. నామాట జవదాటి పోయితివేనియు స్త్రీహత్యయు, భ్రూణహత్యయు, రెండు దోషంబులును బ్రాపించుచున్న యవి'.అని పలుకుచుఁ గులుకు బెళుకుఁ జూపుల జంకింపుచుఁ గర్ణకంకణంబులు మొరయఁ జను గుబ్బలందు హారంబులు మెరయ, నెఱికురులు విరియ, రయంబున బింకంబు జను గుబ్బలురంబునం జేర్చి కౌఁగిటఁ బొదివి, గందంపుఁ జెట్టునంజుట్టిన చిలువ చెలువ చందంబునఁ దల్పంబునం బడ గెడపుటయు రాజనందనుండా కుందరదన మాట జవదాటఁ జాలక రతికేళిం దనియించె.

తదనంతరంబ, సుధన్వుండు సత్వరంబుగా వెలువడి వచ్చుటయు నంతలో హంసధ్వజుండు తన కుమారుండైన సుధన్వుండు తోడరాకుండుట వలన మండిపడుచు,దండధరకింకరులంబోని లంకె నాయకుల వంకఁ గనుఁగొని, 'నాయాజ్ఞ నుల్లంఘించిన సుధన్వునిం బట్టుకపోయి, మత్పురోహితులైన శంఖ లిఖితుల కొప్పగింపుఁడు. ఇంచుకయు శంకింపవల'దని, నిరుత్తరంబుగా నాజ్ఞా పించుటయు, వారలు చంపకాపురంబున కరుగుదెంచుచు, ముందట సఫలీకృత మనోరథుండు నాహవోత్సవ సమున్నతుండునై, కవచ కార్ముకంబులు ధరి యించి, కవదొనలు బిగియించి, కరత్రాణంబు నంగుళిత్రాణంబును బూని సింగంపుఁ గొదమ కైవడిం జనుదెంచు రాజకుమారునింగాంచి, మ్రొక్కి, 'సుధన్వా, నీవు రాజశాసనంబు మీఱి వెనుకం జిక్కితివి గావున నీయెడ మిగులం గోపించి భూనాయకుండు నిన్నుంగట్టుకపోయి ధర్మశాస్త్ర గురువులైన శంఖలిఖితుల కొప్పగించిరండనె,' నవవుడు సుధన్వుండు 'తండ్రి యాజ్ఞ దాఁటిన కుమారు, నేలిన వాని యానతి మీఱిన బంటు నేమిచేసినఁ జెల్లు .

తండ్రియు ధరణీవల్లభుండునైన యమ్మహారాజు నానతిఁ జేయుటయే జన్మ ఫలం'బని రథంబు డిగ్గుటయు, నధిజ్యకార్ముకుండు, నాబద్ధ కవచ తూణీరుండు, నఖిల భూషణ భూషితుండు, నంగజాకారుండునైనయక్కుమారునిం బెడకేలుగట్టి పట్టికొనిపోయి, బ్రాహ్మణోత్తములైన శంఖ లిఖితుల ముందరఁబెట్టి, 'యితండు రాజాజ్ఞమీఱి, వలరాజు నాజ్ఞకు లోఁబడి. కృష్ణపాదకమలంబులఁ జూడవలయు నను వేడుకలేక తన చేడియతోఁ గ్రీడారతుండై వెనుకఁజిక్కెం గావున, నితని దప్త తైలకటాహంబునవైవుం'డని పలుకుటయు, లిఖితుండగ్రజుండైన శంఖునింజూచి, 'భూమిలోన నేమనుజుండు తనుపలికిన పలుకు నిజంబు సేయక తప్పించు, నమ్మనుజునకు రౌరవాది నరకంబులు సిద్ధించు. తొల్లి సత్యంబు నిర్వహించుటకునై తన రాజ్యంబంతయు విశ్వామిత్రునకొసంగి, కుమారుని, భార్యను, గాశిలో విక్రయించి, తానును జండాలునిచే విడువఁబడి సత్యంబు ప్రతిష్ఠించిన హరిశ్చంద్ర నరేంద్రుని వినలేదా ? అట్లే రామచంద్రుం డును, సత్యపరిపాలనంబునకై రాజ్యంబు త్యజించి వనంబునకుంజనియె. దశ రథుండు కైకకిచ్చిన వరంబులు దప్పక సత్యంబు నిమిత్తంబుగాఁ దనువు దొఱంగె. సత్యంబు దప్పిన రాజసేవ వలనఁ గోటివేలు వచ్చినం గాదు. సజ్జన నిందితంబైన యసత్యంబున గొగ్గునట్టి రాజుచేసిన పాతకంబులు పురోహితుండెందు. పతియాజ్ఞ మీఱినయెడ మిత్రుండైనను, దల్లియైనను, దండ్రియైనను, బాంధవులైనను దండనార్హు లగుదురు.

## -సుధన్వుఁడు తప్త తైల కటాహమున దిగుట-

అని చెప్పిన, శంఖుండు నిని 'యట్ల చేయదగిన యది. రాజకుమారకా, నీమనంబున కెట్లు తోఁచుచున్నది ?' యనిన సుధన్వుండు చిఱునగవంకురింప ధనుర్బాణంబులు క్రిందవైచి, కవచంబు సడలించి, కవదొనలు వదలించి, తొల్లిపరవీరుల జయించి తెచ్చిన రత్న భూషణంబు లుజ్జగించి, శ్రీకృష్ణపాదార వింద సమర్పితంబులైన తులసి మాలికలు, పద్మాక్షమాలికలు కంఠంబునం గదియించి, శ్రీహరి పాద తీర్థంబు గ్రోలి, కమలాక్షుండును, త్రిలోకాధ్య క్షుండును, గనకాంబరధారియు, యోగిజనహృదయ పద్మ విహారియు నగు శౌరినిం బేర్కొని, యుపనిషద్వచనంబులచే నద్దేవునిం బ్రస్తుతింపుచు,

నీలమేఘ శ్యామలంబును, గోటిమన్మథోపమానంబును, బూర్ణ చంద్ర వద నంబును, నాశ్చర్యకరంబును నైన శ్రీమన్నారాయణ మూర్తిని హృదయ పంకజంబునం గుదురుకొలిపి, సోపానంబులు గట్టినయట్టి నూనియ తొట్టి యొద్దకుం బోయి, సెగలచే నలుదిక్కులం గప్పుచుఁ బొగలెగయు నుడుకు నట్టి తైలంబు కేలం ద్రోయుచు, మగదజంబు సరోవరంబు సొచ్చు చందంబున, మొదట మెట్టునకుందిగి, రెండవ మెట్టునకు నడుగు వెట్టి, మూడవ మెట్టునకుం బోయి, నాల్గవ మెట్టు నిలుచుటయు, నగ్నిమయంబైన నత్తైలంబు కుత్తుక బంటియయ్యె. అప్పుడతని వదనంబు యమునా జలంబునం గనుపట్టు కమలంబు కరణి నతి మనోహరంబై యొప్పె. వ్రేలెత్తి చూపగూడని యా స్నేహంబును, శ్రీ విష్ణు భక్తుండగు రాజకుమారునితో స్నేహంబు చేసిన చందంబున జంద్ర కిరణంబుల కైవడిఁ, బన్నీటిధార తెఱంగునఁ, జందన రసంబు చందంబున, నతి శీతలంబై యుండె. జనమేజయ నరేంద్రా ! హరిదాసుల కసాధ్యం బేది యుంగలదె ?

## -దేవతలు సుధన్వునిపైఁ బూలవాన గురియుట-

అవ్విధంబు గాంచి శంఖలిఖితు లాశ్చర్యంబు నొంది, యిక్కుమారుం డిట్లుండుట యింద్రజాలంబుగాఁ దోఁచుచున్నయది. లెస్సగాఁ బరీక్షింప వలయు నని, నారికేళ ఫలంబు లత్తైలంబులోన వైచుటయుఁ బెటాలుం బెటిలియించుచుక చిప్పలై యెగసి చుట్టునున్న జనులపయిం బడిన బొబ్బలెగసి బొబ్బరించుచుఁ బరువెత్తిరి. అంతయుంగాంచి యమ్మహా మునులు, 'హరిభక్తి యుక్తుండైన రాకుమారుని మహత్త్వం బెఱుంగక యవమానించిన మహాపాపం బేమిటం దీఱు ? జ్వాలా మాలికా భీలంబైన యాతైలంబులోనం బడుటయే ప్రాయ శ్చిత్తం'బని, యయ్యిరువురుఁ దోడనె యా తైలకటాహంబునం దుమికిరి. ఆపుడమ్మువ్వురి మీఁద దేవతలు పుష్పవర్షంబులు గురియించిరి. ఆ సమయంబున నింద్రాది దిక్పాలకులు సుధన్వునిం జూచి, 'కుమారకా, నీవు ప్రహ్లాదు నంతటి వాఁడవు. నీ స్వరూపం బెఱుంగక యవమానంబు సేసిన యిమ్మునులకు నీ పాదారవిందంబులు సోఁకిన తైలంబులో మునుంగుటయే గంగా స్నానంబు

సేసిన గతిం బ్రాయశ్చిత్తంబయ్యె, నింక బయలు వెడలుం' డనుటయు; రాజ
పుత్రుని తోడంగూడ సమ్మునులు బయలు దేఱి, ధౌత వస్త్రంబులు ధరియించి,
హంస ధ్వజుని చెంతకు వచ్చి యతని వృత్తాంతంబు వివరించుటయు, నతండు
సంతోషభరిత మానసుండై, 'తప్తతైల కటాహంబున నవగాహనంబు సేసిన
నిన్ను శ్రీహరి రక్షించెంగావున నీవు ధన్యుండవు. నా యాజ్ఞ చెల్లించి సత్యంబు
నిర్వహించి వచ్చితివి. కావునం గులోద్ధారకుండవు. సేనాధి పత్యంబొసంగెద'
నని యాలింగనంబు సేసినం, దండ్రికిం జాగిలి మ్రొక్కి కరంబులు మోడ్చి,
తొంటికరణి సముజ్జ్వల భూషణంబులు ధరియించి, నిజ తేజంబున దశదిశా
భాగంబులు ప్రకాశింపం జేయుచుం, దన్ను దండించిన శంఖ లిఖితులుం
దక్కిన జనంబులు బహువిధంబులం గొనియాడ రథంబు నధిరోహించె.

## - హంసధ్వజు డధ్వరాశ్వమును బట్టించుట -

అవ్విధంబున సుధన్వుండు తండ్రిచే సేనాధిపత్యంబు గైకొని, రథచక్ర
సముద్భవంబులగు ధూళులచే సప్తసాగరంబు లిఱింకు లింకంజేయుచు, భేరీ
పటహడిండిమ శంఖ కాహళాది వాద్యధ్వనులచే దిగ్గజంబుల చెవుడుపడంజేయుచు,
గైదువులు సారించుటవలనం బొడము మిఱుంగురులచే సూర్యునకు
వేడిమిచేయుచు, బాలసూర్యకిరణ ప్రకాశంబులైన మణిమయ ధ్వజంబుల
యౌన్నత్యంబుచే నాకాశంబు తూట్లుపడం జేయుచుం, జటుల ధాటీ
నిరాఘాటంబులైన చతురంగబలంబులు నలుదిక్కులం గ్రమ్మి చను దేఱ
వియన్నారి మ్రోయించుచు, సాహసోత్సాహంబున వెడలు నగ్గలిక గనుంగొని
హంసధ్వజుండు సంతసంబున నయ్యధ్వరాశ్వంబుంబట్టి తెప్పించి, పద్మ
వ్యూహ మధ్యంబున నుంచి తాను ముందుగాం గయ్యంబు వేడుక మొగంబునం
జెంగలింపం గదలివచ్చి, ధ్వజంబు లనియెడి వృక్షంబులును, బతాకలనియెడి
తీంగెగుంపులును, వీరభటులనియెడి సింహశార్దూలంబులునుం గలిగి ప్రవేశింపం
గూడని కతంబున, మహారణ్యంబునుంబోలె, రాజాధిరాజ కిరీటంబులం దాపిన దివ్య
రత్నంబులనియెడి గ్రహంబులును, గజకదంబంబులనియెడి మేఘంబులును, నర్జున
రథంబనియెడి మార్తాండ మండలంబును గలిగి, గగనంబుచుంబలె నంటం దరంబు
గాక, వెలిగొడుగులనియెడు తెల్లదామరలును, జామరంబులనియెడు రాజహంసంబు
లును, ఖడ్గకాంతులనియెడు వారిపూరంబులును, యోధవీరులనియెడి బలుమొసళ్ళు
నుంగలిగి, మహాతటాకంబు చందంబున, దురవగాహంబగుచుం, జతురంగంబు

లనియెడి తరంగంబులును, గజంబులను పర్వతంబులును, రథంబులను ద్వీపం బులును, విజయ జయ భుజ ప్రతాపంబనియెడి బడబానలంబునుంగలిగి, సము ద్రంబు కరణి నపారంబగుచు, వృషకేతనుండును, ప్రద్యుమ్నుండును, యౌవనా శ్వుండు, ననుసాళ్వుండును, నీలధ్వజుండును, సువేగుండును, మేఘవర్ణుండును మొదలైన మహారథులచే దుర్నిరీక్ష్యంబును నై వచ్చు విపక్షచ్చు సైన్యంబు నాలో కించె.

అప్పుడు సవ్యసాచి ప్రద్యుమ్నునింజూచి, 'కృష్ణనందనా, నా పరాక్ర మంబు మీరలందఱుం గనుంగొనుఁడు. దురవగాహంబైన యీ పద్మవ్యూహంబు సొచ్చి, చెండాడి, తన్మధ్యంబున నున్న మఘాశ్వంబు గొనితెచ్చెద'ననినఁ, ప్రద్యుమ్నుండు పార్థునితో నిట్లను. 'మా తండ్రియగు వాసుదేవుండు సేనాసమే తంబుగా నన్నుంగూర్చి మీ వెంటనంపుటకుఁ బ్రయోజనంబేమి ? ఎదుటి దళంబు లెల్ల నాపాలుసేసి మీరు కనుంగొనుచు నుండుండ'నుటయు, వృషకేతనుండు క్రీడి నవలోకించి, 'పుడిసెఁడు నీళ్ళుచల్లిన నడింగిపోయెడి ధూళికిఁ గాలిమేఘంబులు వర్షింపవలెనే? తెప్పవేసినం బడిపోవు దోమల మీఁద గరుత్మంతుండెత్తి రావల యునే? ఈ రాజు మీకు సమానుండు గాడు. మీరీతనిమీఁద జేయిచేసికొనం బనిలేదు. నేనే యీతనిగెల్చి యధ్వరాశ్వంబు దెచ్చెద'.

## -వృషకేతు సుధన్వుల యుద్ధము-

అని పలికి యర్జునుని వీడ్కొని యరదంబు సధిరోహించి కిఱకిఱం దిరుగు రథ చక్రంబు వలనఁ బొడమిన మిఱుంగుఱు లంబరంబున కెగయ గుణంబు సారించుచు వచ్చు నావృషకేతనుం జూచి, సుధన్వుండు 'ఓయీ, నీ కులగోత్ర నామధేయంబు లెఱుంగక నీతోడం గదనంబు సేయనొల్ల' ననిన, వృషకేతనుండు, 'కశ్యపమహాముని మాకుం గూటస్థుండు. నాచే నిహతుండవై యెవ్వాని బింబంబు భేదింపగోరెద వాసూర్యుండు మాతాత. త్రిలోకాధిపతియైన దేవేంద్రుండెవ్వాని కడకు యాచకుండై వచ్చి యాచించె నట్టి దాతల దాతయు, శౌర్య సముదీర్ణుండు నగు కర్ణుండు మా తండ్రి. నా పేరు వృషకేతుం' డనిన, విని సుధన్వుఁడిట్లనియె. 'మధుచ్ఛందనుండను మహాముని మాకుం గుల

గురుండు; హంస ధ్వజుండు మాకుఁ దండ్రి. నా పేరు సుధన్వుండు. మన యిరువురకు జోడు తగియున్నది'. అనిన విని రోషావేశంబులం గన్నులు జేవుఱింపఁ, గోదండంబు మండూకాకారంబుగాఁ దిగిచి సానలందీఱిన మెఱుంగు వాలమ్ముల వానలు గురియించి, చుట్టునున్న సైన్యంబులఁ జెల్లాచెదరుగాఁ గొట్టి, యయిదు విశిఖంబులు చాపంబునం గూర్చి విల్లు ఖండించి, కేతనంబు దునిమి, సూతుని ప్రాణంబులు గొని, తురంగంబులం గూల్చి, రథంబు చక్కాడుటయు, సుధన్వుండు వేఱొండు రథంబెక్కి, విల్లు గైకొని, యయిదు బాణంబులచే వృషకేతు రథంబు దూరంబునం ద్రోచి, విల్లు తునియలు సేసి, సేనలకుం జేయి వీచుటయుఁ, జుట్టుముట్టి, పరిఘంబులు, పట్టిసంబులు, గదలు, గుదియలు, ముసలంబులు, చంద్రహాసంబులు మొదలగు కైదువుల వానలు గురియుటయుఁ, జిక్కువడియునుం జేవ చెడక, సూర్యపౌత్రుండు మధుసూదనుని పాదార విందంబులు డెందంబునం దలంచుచు, నొక్క రథికుని చేతివిల్లూడిచి తీసికొని, దురంబొనరించుటయు, సుధన్వుం డతని సాహసంబునకు సంతసించుచు, వజ్రాయుధంబు చందంబున జ్వాలా మాలికాభీలంబయిన యొక్క బాణంబు శరాసనంబున సంధించి, యాకర్ణాంతంబుగాఁ దిగిచి యేయుటయు, నడు ఱొమ్మునం దాకి, వెన్నున వెడలి భూతలంబున మునింగినం, గర్ణ నందనుండు కీడెడలిన జంత్రంపు బొమ్మ చందంబున రథంబు మీఁదఁ బడి బలు మూర్ఛ నొందె.

## -ప్రద్యుమ్నుండు సుధన్వునిం దాఁకి మూర్ఛిల్లుట-

అంతఁ బ్రద్యుమ్నుండు దుర్వార భుజాగర్వంబునం దేరు దోలించి, నిలు నిలుమని యదల్చి, యయిదు నారసంబుల నొప్పించి, నాల్గు సాయకంబుల నాలుగశ్వంబుల నిరువది తునుకలు గావించి, మూఁడు బాణంబుల నొగలు ఖండంబులు చేసి, యొక్క కాండంబునఁ గోదండంబు రెండు ఖండంబు లొనర్చి యార్చుటయు, సుధన్వుండు ప్రద్యుమ్నుని కరకౌశలంబునకు మెచ్చుచుఁ, బదాఱు బాణంబు లొక్క పిడికిటం బట్టి విల్లు దునిమి, సారథిం గూల్చి, ధ్వజంబు చక్కడిచి, తురంగంబులఁ గీటడఁగించి, బలు పిడుగులంబోని మూఁడు తూపులు నడుఱొమ్మునం గ్రుచ్చి, యచ్యుతుని పట్టిని నొప్పించి, సింహనాదంబు

సేసె. ఇవ్విధంబునఁ బక్షుల గతి గగనంబున నెగయుచు, సర్పంబుల వలెం బెనఁగొనుచు, బొట్టేళ్ళ కైవడి గిట్టల తోడనే చండించుచు, నిరువురును నొక్కమ్మడిగఁ గరలాఘవంబులును, లక్ష్యశుద్ధి దృఢచిత్తత్వంబులును మెఱయ, విలువిద్యా నేర్పులు చూపుచుఁ బెద్దయుందడవు పోరిపోరి మూర్ఛా పరవశులై వ్రాలిరి.

## —కృతవర్మాదులు సుధన్వునిం దాఁకుట—

అంత సుధన్వుండు శీఘ్రంబున దెప్పిఱి, వేఱొక్క యరదం బెక్కి, సేనం గనుపుగొట్టుచునున్నఁ గృతవర్మ యెదదాఁకి, తొమ్మిది తూపులు నిగిడించిన, సుధన్వుండు నడుమనె ఖండించిన, వెండియుఁ గృతవర్మ మూఁడు వాఁడితూపులు మఱియు నైదు సాయకంబులు నించిన, హంసధ్వజనందనుం డది గణింపక, కృష్ణసర్పంబులంబోని తొమ్మిది వాలమ్ములం నిగిడించిన, సహింపఁ జాలక తేరుడిగ్గి పలాయనంబు గావించె.

అనంతరంబ, యనుసాళ్వుం డెదిరించి, యదరించి నిజబాహుబలంబు గాన్పించి, శరవర్షంబులు గురియించి, మఱియు నవ్వీరాగ్రేసరుం డుభయ దళంబులు గొనియాడ, 'నేను బ్రయోగించు నీ యస్త్రంబు సైరింతువేని నిన్ను మెచ్చెద'నని యెచ్చరించి, బడబానల జ్వాలికయుంబోలె, మృత్యుజిహ్వయుం బోలె, వాఁడి మిగులు వాలికతూపులు నడుఱొమ్మునఁ గ్రుచ్చుటయు, సుధన్వుండు ధైర్యంబు వదలక నిలిచిన, ననుసాళ్వుండు వెండియుఁ బ్రచండ కాండంబు లొండొండ నిగిడించి, యట్టహాసంబు సేసి, మూఁడు వాఁడితూపులు ఱొమ్మున నాటించుటయు, సుధన్వుండు మూర్ఛిల్లి, తోడనే తెప్పిఱి యయ్యను సాళ్వునిపయి శరవర్షంబులు గురియించి మూర్ఛ నొందించి, సేనల విఱియించి, యంతకుని చందంబునఁ గోటి సైన్యంబులం గనుపుగొట్టుచు నక్కజంబుగఁ బెక్కు నారసంబులు పఱపిన, దొర్లిన హయపంతులును, ద్రెళ్ళిన మత్తవారణంబులును, జెక్కుచెక్కలైన చక్రకూబరాదులును, విశ్లథంబులైన రథంబులును, విదారితంబులగు కేతనంబులును, విధ్వస్తంబులగు కార్ముకంబులును, గూలిన రథికులును, గొఱప్రాణంబులతోడం బొరలు మహారథులును, శిరంబులు దెగి పడిన రాహుత్తులు కబంధములు మోచుకొని నలుదిక్కులం బఱచుచు, దెగిన

మొదలు, విఱిగిన కొమ్ములు, పగిలిన ప్రక్కలు, తెగిన తోఁకలు, ఖండితం బులైన పాదంబులు, శిథిలీకృతంబులగు సంధిబంధంబులుం గలిగి పొరలు సైంధవంబులును, శిరంబులు, ఉరంబులు, జానువులు, జంఘలు, కర్ణంబులు, కపోలంబులు, వెన్నులు, కన్నులు పచ్చడికిం దఱిగిన చందంబున శకలంబులై నెత్తురులు గురియ, వీరమార్గంబు గైకొని కాలుంగాలుం బెనచుకపడ్డ వీరభటు లును, ఖండంబులైన కోదండంబులును, దుత్తుమురులైన కత్తళంబులును, జందెంబు మాఱిన పిండంబులును, జూర్ణంబులైన శూలంబులును; భంగంబులైన ప్రాసంబులును, వింతింతలైన కుంతంబులును, జక్కులైన చక్రంబులునుం గలిగి, యాభీలంబైన సమరభూభాగంబునఁ దెట్టువలు గట్టునట్టులతోడం గూడ గట్టు పొరలినట్టు మట్టుమీఱిన నెత్తురులును, గైరికాది ధాతు రంజితంబులగు హిమశైల కటకభాగంబుల బహువిధంబులుగాఁ బ్రవహించు భాగీరథీ ప్రవాహం బు కరణిం గనుపట్టె. ఆ సమయంబున సాత్యకి సుధన్వునిం దాఁకి నిశితాస్త్ర పక్షంబులు గురిసిన వాఁడునుం దోడ్తోన మరలించిన, శైనేయుం డెనుబది నార సంబులు ప్రయోగించి యతని యరదంబట్లు కావించె.

అప్పోరంబున విరథులై సాత్యకి సుధన్వులు వేఱు నరదంబులెక్కి పంతంబు డింపక యొండొరుల మైమఱపు లఱవుళ్ళు సేసి నెత్తుటం జొత్తిల్లుచుఁ బూచిన మోదుగుల చందంబునఁ బొలుపొందిరి. అంత సుధన్వుండు సాత్యకి నదల్చి మృత్యుదంష్ట్రాకరాళంబును, జ్వలత్పావక సంకాశంబును, గనక మాలికాలంకృతంబైన శక్తి కేలం గైకొని వేయుటయు, సాత్యకి చేష్టలుడిగి వసుధాతలంబున వ్రాలె. అంతఁ గౌంతేయ మధ్యముండు శత్రుభీకరంబైన యాకారంబునం గనుపట్టుచు సుధన్వునిం జూచి, 'నృపాలకుమారకా, ద్రోణ భీష్మ కర్ణాది మహాయోధవీరులతోడం బెనంగి, వారల బలపరాక్రమంబు లెఱింగి యున్నవాఁడ. నీ విక్రమం బంతకంటె నతిశయించి యున్నయది' అనుటయు, నభిజ్ఞధన్వుండగు సుధన్వుండు 'కిరీటీ! నీ బోఁటి మేటి వీరునకుఁ బెక్కు మాట లేమిటికి? తొల్లి కృష్ణసాహాయ్యంబున జయంబు చేకొంటివి. ఇప్పుడొంటిగా వచ్చినాఁడవు. చక్రంబు కేలంబూని చక్రి నీకు సహాయుండయ్యెనేని హయంబు విడువంగలవారము గాము. శ్రీకృష్ణ దేవునకుం బ్రియంబుగా మా తండ్రి హయమేధంబు సేయుంగాక,'

## —అర్జున సుధన్వుల యుద్ధము--

అనిన విని యర్జునుండు క్రోధారుణలోచనుండై, నూఱు నారాచంబులు నిగిడించిన, నతండు నన్నియ బాణంబుల వానిం ద్రుంచి, పదితూపులు మేనం గీలించి నవ్విన, నవ్వీరుండును గాలమేఘంబు చందంబున శరవర్షంబు లపారంబుగాఁ గురిసిన, సుధన్వుండు మండలీకృత శరాసనుండై, మిన్ను నేలయు, దిక్కులు విదిక్కులు శరపరంపరలచే ముంచె. అంతఁ గుంతీనందనుండును గాలకూట విషాగ్నిజ్వాలలుంబోని కీలాజాలంబులం బొలుపొందు నాగ్నేయాస్త్రంబు ప్రయోగించిన, హంసధ్వజకుమారుండు, సప్తకుల మహామేఘంబులు పుట్టింపంజాలునట్టి పర్జన్యాస్త్రంబు ప్రయోగించుటయు, ధళధళాయమానంబులైన మెఱపులు, పెళపెళమని యుఱుము నుఱుములును, జెనుగుండ్లంబోని వడగండ్లును, మిక్కుటంబుగా దిక్కులు క్రిక్కిఱియంబాఱు మహాప్రవాహంబులును, నెడనెడం బడు పిడుగులునుం గలుగుటయుఁ, దురంగంబులు, మాతంగంబులు, శతాంగంబులు, పదాతిసంఘంబులు, బక్కెరలు, పల్లంబులు, జోళ్ళు, ఛత్రంబులు, చామరంబులు వెల్లింబడిపోవ, మిఱ్ఱుపల్లంబును నొక్కటిగా బహు ప్రవాహంబులు పాఱందొడంగిన, నింద్రనందనుండు వాయవ్యాస్త్రంబుచే నయ్యస్త్రంబు మాఱుంచిన, హంసధ్వజ కుమారుం డర్ధచంద్రబాణంబున నర్జునుని సారథి శిరంబు ఖండించి, దీప్తపావక సదృశంబులైన నిశితవిశిఖంబుల నాపాదమస్తకము గ్రుచ్చి, యార్చుటయు, రథవాహంబులు క్రుంగంబడి నలుదిక్కులు పఱచుచు జికాకుపడెను.

## - శ్రీకృష్ణుఁడర్జునకుఁ బ్రత్యక్షమగుట -

అప్పుడర్జునుఁడు దుస్తరంబైన యాసంకటంబు నిస్తరింపం జాలక 'ఆపదుద్ధారకా, ఆదిదేవా, అనంతా, అనంతశయనా, అంబుజనాభా, అచ్యుతా, హరీ, శ్రీకృష్ణా, నిన్ను నమ్మినవాఁడ. లక్కయింటం జిక్కువడకుండఁ గౌరవ సభాస్థలంబున ద్రౌపదికి మానభంగంబు గాకుండ, నడవుల నిడుములం బడునపుడాపదలం బొరయకుండ, భీష్మ ద్రోణ కృపాశ్వత్థామ కర్ణాది యోధవీరుల యస్త్రాగ్నిజ్వాలలం గ్రాగకుండ, సైంధవ వధంబునఁ బ్రతిజ్ఞా భంగంబు గాకుండ రక్షించి, సకల సంకటంబులు నెడఁబాపితివి. త్రిలోకాధ్యక్షా, పంకజాక్షా, ఇప్పుడీ సంక

టంబు తొలఁగించి రక్షింపవే! రక్షింపవే!' అని ప్రార్థించుటయు, భక్త రక్షణ విచక్షణుండగు కమలాక్షుండు తెలిదమ్మి రేకులం దెగడుచుఁ గరుణామృతంబు వెదజల్లు చల్లనిచూపులఁ జెన్నుమెఱయు కన్నులును, బున్నమ చందురుం బురుడించు నెమ్మొగంబున నందంబుమీఱు మందహాసంబును, గలుముల జవరాలికి నిజనివాసంబైన వెడంద యురంబున బాలసూర్యబింబ విడంబకంబైన కౌస్తుభంబును, నద్భుతంబులైన పరిమళంబులం గుప్పళించు వనమాలికయు, శార్ఙ్గ కోదండమౌర్వీ కిణాంకంబులును, ఆజాను దీర్ఘంబులు కంకణకేయూర కటకాంగుళీయకాది నానాభూషణ భూషితంబులును, సర్వాభీష్టప్రదాయకంబులును, లోకరక్షా దీక్షితంబులును, శుభ లక్షణలక్షిత కరాంగుళీ విలసితంబులునైన చతుర్భుజంబులును, జిగురుటాకులంబోలి మౌని మానస ధ్యాన యోగ్యంబులును, వేదాంత వీధీ సంచారయోగ్యంబులునగు మృదుల పాదంబులును గనుపట్ట, నీలమేఘ శ్యామలుండును, పీతాంబరధరుండును, గోటి కందర్ప లావణ్య నిధియును, ప్రసన్నముఖారవిందుండునైన గోవిందుండు తత్ క్షణంబ ప్రత్యక్షంబయ్యె.

అంత, ఫల్గుణుండు సాష్టాంగ వందనంబు గావించి, కరంబులు మొగిచి, కరుణారసంబు వెదజల్లు చల్లనిచూపులం గటాక్షించి, యాదరంబున నిటలతటంబున ఘటియించిన (చేతులతో) ఆనందబాష్పంబులు ఱెప్పల నుప్పతిల్ల రోమాంచ కంచుకితగాత్రుండై గద్గద కంఠంబున నేమియుఁబలుకనేరక యూరకయున్న, యయ్యర్జునుని గాఢాలింగనంబుగావించి,సారథ్యంబునకుంబూని, యాముకుందుండు పగ్గంబులు బిగియంబట్టి, మునికోలం గేలం గైకొని, తురంగంబుల కందంబు లప్పళించి, తేరు మరలించి యర్జునింజూచి, 'యవక్రపరాక్రమశాలియైన శత్రునిం జయింపుము. శీఘ్రంబు లెమ్మ. జయమ్ము చేకొనుము'. అనుటయు, గాండీవి మ్రొక్కి, గాండీవంబు సజ్యంబుగావించి, జ్యానాదంబులచే రోదసీకుహరంబు పూరింపుచు దేవదత్తంబొత్తుటయుఁ, గమలాక్షుండును ప్రళయకాల జలధర గంభీర స్వనంబైన పాంచజన్యంబు పూరించె.

## - అర్జున సుధన్వుల ద్వంద్వ యుద్ధము -

ఇవ్విధంబున యుద్ధ సన్నద్ధులును, రథిక సారథులునై వచ్చు నా కృష్ణుల నిరువుర నుపలక్షించి, సుధన్వుండు వదనారవిందంబున మందస్మితంబు తళ్ళు

కొత్త, 'శక్రనందనా, చక్రపాణి నీకు సహాయుండై యుండఁ బరాక్రమించుట కేమి భయంబు ? ఉభయ బలంబులు వృథా సమయనేటికి ? రిత్తయంపపోకడ కయ్యం బెంత తడవు ? 'ఇన్ని బాణంబుల్లలో నిన్ను జయించెద'నని ప్రతిన గావింపు'మనిన, పురందర నందనుండు, 'రాజనందనా, మూఁడు బాణంబులచేత నీ శిరంబు పడఁగెడపెద. అటు చేయంజాలనైతినేని, తండ్రియుం దాతయు మొదలైన మా పూర్వులు పుణ్య విహీనులై నరకంబునఁ గూలుదురు గాక'యని ప్రతిన గావించుటయు, 'నీ వేయు బాణంబులు నే నడుమ ఖండించెద. ఇట్లు సేయనైతినేని నేనును, మా పెద్దలును నాచరించిన సుకృతంబులు రాక్షసుల పాల గుంగాక. పూజావిరహితుండైన దురాత్ముండును, వసిష్ఠ సమానుండైన బ్రాహ్మణునిం జంపిన బ్రహ్మఘాతుకుండును బొందు దుర్గతిఁ బొందఁగలవాఁడ'నని త్రివాచకంబుగాఁ బ్రతినఁ గావించి సుధన్వుండు, సుపర్ణపుంఖంబులును, గంకపత్ర విచిత్రంబులు నగు నూఱమ్ములొక్క ముష్టింబట్టి విల్లాకర్ణాంతంబుగాఁ దిగిచి యదుకులాధ్యక్షుని వక్షస్థలం బుపలక్షించి యేయుటయు, నా బాణంబు నకుం గట్టిన బలుతెక్కల గాడ్పుల నయ్యరదంబు నన్నూఱు మూరల కొలఁది పిఱిందికిం జని భూనభోఽంతరాళంబు లేకంబుగా దువ్వ గ్రమ్ముట వలన రథ రథ్య కపిధ్వజంబుల తోడంగూడఁ గృష్ణార్జునులు గానంబడరైరి. అప్పుడా సుడిగాలి బిసలోసందగిలి యా రథంబు బొంగరంబు చందంబునఁ, గుమ్మరిసారె తెఱంగునం దిరుగుచునుండెఁ గాని నిలువదయ్యె. అప్పుడు విశ్వంభరుండైన శ్రీ కృష్ణదేవుండు తన యుదరంబు నందున్న బ్రహ్మాండ కోటుల బరువు తోడం గూడ నయ్యరదంబు చిక్కంద్రొక్కి, యెట్టకేలకుఁ గదలకుండ నిలిపి, 'అర్జునా, పెక్కు బవరంబులు గనియున్నారము. ఇంత కడింది వీరు నెక్కడం గానము. ఇతండు సత్యవ్రతుండు. అదియునుంగాక యేక పత్నీవ్రతుండు. అత్యంత కాముకులమై, బహుస్త్రీలోలురమైన నీకు నాకును వీనిం జయింపఁ గూడునే? నీ ప్రతిన యెట్లు నెరవేఱం గలయది ? చిత్తంబు త్తలంబగుచున్నయది !' అనిన విని, కిరీటి నవ్వుచు, 'శ్రీకృష్ణా, నీ కటాక్షంబు గలిగెనేని యసాధ్యం బేమి యున్నయది ?' అని పలికి గాండీవి జ్యానాదంబు దిక్కులు బ్రక్కలింజేయఁ గాంచన పుంఖంబును గాలదండోప మానంబును నైన సాయకంబొక్కటి వింట సంధించి, వాని కంఠంబుపలక్షించి యేయు నవసరంబున, గోపాల దేవుండు మున్ను దాను గోవర్ధనాచలం బెత్తి, గో గోప సంఘంబులఁగాచిన సుకృతఫలంబు

నయ్యస్త్రంబున కొసంగిన, నదియును గాండీవి నిర్ముక్తంబు ప్రళయకాల దండధర దండోపమానంబునై దిక్కులు విదిక్కులు ఘూర్ణిల్లంజేయుచు మెఱుంగు ముత్తంబులు నుమియుచు, గాలదండంబు కరణిం బఱతెంచిన; నయ్యేక పత్నీ వ్రతుండు నంతకంటె మిన్నైన తూపొక్కటి వింట సంధించి ప్రయోగించిన, నదియును బక్షీంద్రుండురగంబు ఖండించిన తెఱంగున దాని ఖండించె. తోడనే సుధన్వుండు నిప్పులు గుప్పళించు శరంబు లపారంబుగాం గృష్ణార్జునుల పయిం గప్పినం, గిరీటి హాటక పుంఖంబును, గోటి సూర్య ప్రకాశంబు నగు నేకొక్క సాయకంబు గాండీవంబునం బూన్చి యేయుటయు, నచ్యుతుండు దాను మున్ను పరశు రామావతారంబున సకల క్షత్రియుల జయించి చతుస్సముద్ర ముద్రితంబైన భూవలయంబు కశ్యపునకు ధారవోసిన ఫల బయ్యంబకంబున కొసంగిన, నదియును బ్రళయకాలానలంబు చందంబున జ్వలింపుచు, దుర్వార వేగంబునం జనుదెంచు తఱి, హంసధ్వజ కుమారుండు తాదృశంబైన బాణంబా కర్ణాంతంబుగాం దిగిచి యేసిన గాండీవి కాండంబు రెండు ఖండంబులై భూమండలంబునంబడియె.

## -అర్జునుండు సుధన్వుని తల ద్రుంచుట-

ఇవ్విధంబున శరప్రయోగమ్ము వమ్మగుటయుం బురుహూత సంభవుండు డెందంబున గ్రందుకొను చలంబును, మచ్చరంబును, విచ్చలవిడిం బెచ్చు పెరుగం గల్పాంత ఘూర్ణాండ మండలంబు వేడిమిం గ్రేణి సేయు మూండవ బాణంబు ధనుర్గుణంబునం బూన్చుటయు, నప్పురుషోత్తముండు నకాండంబునకుం బుంఖ దేశంబున హిరణ్యగర్భుని మధ్య ప్రదేశంబున సమవర్తి సహితుండగు రుద్రుని బాణాగ్రంబునం దన తేజో విశేషంబు నునిచి, తొల్లి శ్రీరామావ తారంబునం బితృవాక్య పరిపాలనంబును, సత్యవ్రతంబును, నేకపత్నీవ్రతంబును, శరణాగత రక్షణంబును, నశ్వమేధాది యాగంబులును జేసిన ఫలంబు తత్సాయకంబు నందునిచె. అంతకమున్న రంభోర్వశీ ప్రముఖులైన యచ్చర మచ్చెకంటు లమ్మహా వీరుండగు సుధన్వు నెదురు కొనుటకై కానుకలు గైకొని వచ్చిరి. ఇంద్రాది దిక్పాలకులు విమానారూఢులై యతివేగంబున వచ్చి, సుధన్వార్జునుల ప్రతినలు, నిరుపుక జయ సందేహ సమర విజృంభణంబును, హర్షాద్భుత భయంబులం బొరలు నంతరంగంబులం బొగడుచుం గనుంగొను చుండిరి.

ఆ సమయంబున పార్థుండు లయకాలశిఖాసంకాశంబైన యాశిలీముఖంబు సంధాన క్రియాచాతుర్యంబున సంధించి యేయుటయు, మంటికిమింటికి నేకంబుగా మంటలెగయ మిణుంగురుల కుప్పల గుప్పలగుప్పునం గప్పుచు ఛటచ్ఛట శబ్దంబుల భూనభోఽంతరాళంబులం గ్రక్కతిలం బజలెంచు నయ్యస్త్రంబు నురవడిం గనుంగొని, సుధన్వుండు చండమార్తాండ కిరణప్రకాశంబును, దంభోళి సంకాశంబునగు బాణంబొక్కటి వింట సంధించి ప్రయోగించుటయు, నక్కాండం బతిరయంబునఁ బజలెంచి యర్జునుండేసిన బాణంబు నడిమికి రెండు తుండంబులు సేసిన, నా శరంబు సగంబు తెగిపడియును, వేడిమియు వేగంబును జెడక, శ్రీ వాసుదేవుని సంకల్పంబు వలన నతి త్వరితంబుగాఁ బజలెంచి, చంద్రబింబోప మానంబును, గిరీట కుండలాభిరామంబును, వీర రసోన్నిద్రంబును, విజృంభిత సింహనాదంబునైన సుధన్వుని శిరంబు ఖండించె.

తదనంతరంబ, తత్కబంధంబు బిఱబిఱం దిరిగి, రథగజతురగ పదాతి బృందంబులు చాఁపకట్టుపడం జేయుచు, ధరాతలంబునం బడియె. ఫల్గుణ ఖండితంబగు నతని శిరంబు గగనంబున కెగసి 'గజేంద్రవరదా, గరుడ వాహనా, నీరజాక్షా, నిఖిల లోకాధ్యక్షా, దేవకీనందనా, దీనజనాభినందనా, నారాయణా, భక్తత్రాణపరాయణా, నమో, నమో' యని దివ్యనామ సంకీర్త నంబు సేయుచు నతివేగంబున వచ్చి శ్రీ గోపాలదేవుని చరణపద్మంబునఁ దుమ్మెద కైవడి వ్రాలె. అప్పుడతని దివ్యతేజంబు దిశదిశలు ప్రకాశింపఁ జేయుచుఁ గేశవుని దివ్యదేహంబునఁ గలిసె. కంసమర్దనుండును దన్మస్తకంబు కేలంగైకొని హంసధ్వజుని మ్రోలవైచుటయు, నమ్మహీధవుండు పుత్రశోకా ర్తుండై పెద్దయుం బొద్దువగచి, యా శిరంబు గ్రమ్మర రుక్మిణీ వల్లభుని పాదాబ్జంబులం గడియవైచుటయు, సద్దేవుండు దానినెత్తి గగనంబున కెగుర వైచుటయుఁ, దోడనె యంతర్ధానంబు నొందె.

అంత సుధన్వునిపాటు గనుంగొని చింతావ్యాకులిత మానసుండై 'హా కుమారకా, హా కులోద్ధారకా, హా గుణభూషణా, మాతాపితృ సంతోషణా, మేరునగధీరా, వీరాధివీరా, హా కుసుమశరీరా, సుజనాధారా, బుధవిధేయా, దాసరాధేయా, నందనందన చరణారవిందవందనా, దీనజనాభినందనా, అయ్యయ్యో! నన్నును నీ తల్లిని నగతికులంజేసి వాసుదేవుని సాయుజ్యంబు

నొందితివే ! నీ వృత్తమోత్తంబైన దివ్యపదంబున కేగితివిగావున నీకు వగవం బనిలేదు. నన్ను గన్నతండ్రీ ! పరాక్రమోపార్జనుండగు నర్జునుని నిర్జించివత్తువని నీ రాక కెదురుచూచుచునుండు నీ తల్లితో నేనేమనం గలవాఁడ ? నీ రాణియగు ప్రభావతి ముఖంబేమని చూడఁగలవాఁడ ? కుమారా ! అనాథుల మగు మా జీవనంబునకు వగచెద'మని పలవించు, హంసధ్వజుని చెంతకుఁ జనుదెంచి, సుధన్వున కగ్రజుండైన సురథుండు తండ్రినూరార్చుచు, 'రాజేంద్రా, శూరుల కాహవమరణంబు మోదకరంబుగాని ఖేదకరంబుగాదు. నీవంటి ధీరుండిట్లు దైన్యంబు నొందనగునే ? నన్ననికిఁ బంపుము. వైరిసేనలం జుట్టుముట్టి కనుపు గొట్టెద. మాధవుని ప్రాపున సుధన్వుని వధించిన వాసవతనూజునిం బాఱఁదోలెద. కాక యెదిరించెనేని,నా తమ్మునికి సహాయంబుగాఁ బనిచెద. దిక్కులఁగీర్తినించెద' అని అనేకవిధంబుల హంసధ్వజు నూరార్చి,సురథుండు కైదువులు మెఱుంగులీన జోదులిరుగెలంకులం ఏలసి చనుదేర, నరదంబు నెక్కి, ద్విరదంబులు, తురంగంబులు, భట సంఘంబులు నసంఖ్యాతంబులుగాఁ జనుదేరఁ, గుహానానృసింహుని కహకహార్భటుల చందంబుగా నందంబు మీఱు బృందంబు పూరించుచు, సింహనాద మేదుర రోషోద్ధతరాముండై బయలుమెఱయు సురథుని రాకఁ జూచి, మధుసూద నుండు పార్థునుద్దేశించి (యిట్లనియె:)

## -సురథుఁ డర్జునునితో యుద్ధము సేయుట-

'అర్జునా, దుర్జయ కాలభైరవుండునుం బలె మండుచు, సుధన్వాగ్రజుండైన సురథుండు సర్వసన్నాహంబగు సైన్యంబుల తోడంగూడ నిదె వచ్చె. వీని నీకె కాదు. బ్రహ్మవిష్ణు రుద్రాదులకైన నెదుర్కొనంగూడదు. తమ్ముని యమ్మలి కమ్మున రోషమ్మునం జనుదెంచు వీని ధాటికిఁ బ్రథమ కబళంబు గానేమిటికి ? మనమీవేళం దొలంగి యుండుదము. పురుషరూపంబు గైకొన్న సత్యంబు కైవడి, నరాకృతి వహించిన ధర్మంబు కరణి, సాకారంబైన సదాచారంబు చందంబున, సద్గుణాభిరాముండైన యీ రాజకుమారుండు నీకు నసాధ్యుండగుట కతనఁ బ్రద్యుమ్న వృషకేతన మేఘవర్ణ యౌవనాశ్వ నీలధ్వజాది యోధుల నిచ్చట నిలిపి, మనము కొంత తడవునకు మరలివత్త' మని పలుకుచుఁ, బర బలంబుల మీఁదఁదమ బలంబుం బురికొల్పెడు చందంబున నరదంబు తఱిమికొని మూఁడు యోజనంబులెడ గలుగం జనియె.

అప్పుడు సురథుండు రమణమెఱయ నేగుదెంచి, పిడుగులు పడువడువున బెడిదంబులైన శరంబు జడిగొనం గురియుచు, నర్జునుని సైన్యంబుసొచ్చి, మారి మసంగిన భంగి, మంత్రించి పడవైచినగతి, లయకాల దండధరుండు తాండ పించిన దారి, విజృంభించి, గంభీర గుణారావంబుచే నంభోనిధులు గలంగ, భద్ర గజ సమూహంబుల గుదులు గ్రుచ్చిన చందంబునం గూలనేయుచుఁ, దేరుల తిల మాత్ర శకలంబులఁ జేయుచు, భటకదంబంబుల నంబకంబులం బడఁగెడపుచు, ఖండంబులైన శస్త్రాస్త్రకాండంబులును, బ్రోవులైన ప్రేవులును, బంకంబులైన మాంస మజ్జ మస్తిష్కంబులునుం గలిగి, రణాంగణంబు ఘోరంబుగాఁ గను పట్టం బరాక్రమింపుచు, యోజనత్రయ విస్తారంబుగాఁ బన్నిన సైన్యంబుల నెల్లఁ జించి చెండాడి, శ్రీకృష్ణునిఁ బార్థునిం గనుగొని సురథుండిట్లనియె. 'కృష్ణా, నీవు మూఁడవతారంబులం జేసిన సుకృతంబు నీ బలంబును బార్థునకొసంగి సుధ న్వునిం జంపింప నగునె ? పురాణపురుషుండవయ్యుఁ బడుచుదనంబు మానవై తివి. రేను(గు) పండ్ల నిమిత్తంబుగా ముత్తియంబులు వేలములువేయు చందం బున, గోవిందా, నీవిట్లు చేయందగునె ? నిన్ను ధర్మదయాసాంద్రుండని మహా మునులు గొనియాడ విందు. నీవిందు మఱందిచేత సుధన్వునిఁ జంపించి పోవం జూచిన పోవనిత్తునే ?" అనిపలికి యలుక మొగంబునందొలుక వేలకొలందులగు కడింది బాణంబులు పురందర నందనుని పయి నిగిడించిన, నతండు వానినన్నిం టిని ఖండించి, క్రొవ్వాడి బాణంబులచేఁ గోదండంబు ఖండించి, గుఱ్ఱంబులఁ బడెగడపి, సారథిని వధించి, రథంబు వితథంబు గావించిన, వాడును బొలివోని బంటుతనంబున వేఱొండు రథం బెక్కి, సముజ్జ్వలంబైన కార్ముకంబు సజ్యంబు గావించి, కమలాక్ష పార్థుల రథాశ్వ కేతన సమేతంబుగా బాణవారాశిలోనం జిక్కువడఁ జేసినం, గ్రీడివేడుక మెఱయ వాని తూపులు రూపఱంజేసి, యొక్క మెఱుంగు నారసంబు నభిమంత్రించి వేయుటయు, వాని రథంబు ఱెక్కల తోడి మేరు శిఖరంబు చందంబున సూర్యమండలంబుదాఁకం గొనిపోయె. అన్నరుని ధనుర్విద్యా కౌశలంబు వర్ణింపం దరంబె ? సురథు నీతీరునం గొనిపోయి సురపథంబున, నిల్చివాడు భువన భయంకరంబుగా నట్ట హాసంబుసేసి, భీకరంబయిన సాయకంబు వింట నరిఁజోసి పార్థునరదంబు గుఱి సేసి యేసిన, నది బిఱబిఱం దిరిగి భూమిలోనం జూచుకొనుటయు, మురజభం జనుండు ధనంజయుని తోడంగూడ దుమికి తన బాహుదండంబులు సాఁచి

యయ్యరదంబు సుబుక నెత్తంజాలక, 'తొల్లి వరాహావతారంబున శైలకానన సమేతంబైన వసుంధరావలయంబు దంష్ట్రాగ్రంబున నుద్ధరించితి, నిప్పుడు నింత బరువుతోఁ జలే'దని పార్థునితోఁ బలుకు నవసరంబున, నాంజనేయుండు తత్కేతనంబున నుండి డిగ్గనుఱికి మహా మేరు శైల సమానంబుగాఁ బెరిగి దీర్ఘతరంబైన వాలంబునం జుట్టిపట్టి యీడిగిలం బడనీడ్చియు నరదేరు నెత్తంజాలడయ్యె.

అంత సురథుండును గరుడవాహన శ్వేతవాహనుల మీఁద నర్బుదన్యర్బుద ఖర్వమహాఖర్వశంఖ సంఖ్యాతంబులును, బుంఖానుపుంఖంబులైన మార్గణంబులం గురిపించుటయును, నాజనార్దనుండు వాని నైరింపఁజాలక యర్జునింజూచి 'కిరీటీ, నీ మేటితనంబెక్కడికిఁబోయె? అని మొనలం గనుచెదరని పేరాధివీరుండవని కదా నిన్ను నమ్మి మా యన్న సమ్మతిలేకుండియు, నాచెలింపలేనౌసంగితి! ఇంకనైనఁ దెలివొంది కయ్యంబు సేయుము. అదియుఁగాక సాటిలేనిమేటి పోటుబంటువని, సరిబావమఱందివని, లాఘవంబెన్నక సారథంబు గవపనొతఁబడి పార్థుని సారథి యను నామధేయంబు జగద్విఖ్యాతంబుగా ధరించితి. అయిననేమయ్యె? ఇప్పుడవక్రపరాక్రమంబగు చక్రంబు నొసంగుదునో? లేక నేను రథికుండనై శార్ఙ్గకోదండంబు మండలాకారంబుగా గుడుసుపడం దిగిచి యాశీవిషోపమానంబులగు నిశిత విశిఖ పరంపరల వెంపరలాడి వైరిసమూహంబులం గనుపు గొట్టెద. నీవు సారథ్యంబునకు నాయితంబుగమ్ము రెమ్ము. పగ్గంబులు గైకొమ్మ'నియె.

అంత ఫల్గుణుండు రోషారుణలోచనుండై, బాణాసురమర్దనుంగనుంగొని, 'దేవా, నా పరాక్రమంబు చూడుము'. అని పలికి, నూబులకొలందులు, వేల సంఖ్యలు, నయుతనియుత గణంబులునైన యంబులం బ్రయోగించి, వాని తేరు తిలమాత్రంబులు, నణుమాత్రంబులు, బరమాణుకల్పంబులును, దుమ్ముధూళియుం జేసి భూతలస్థునింజేయుటయు, సురథుండు విరథుండై మాధవాంజనేయులచేతఁ దెమలింపంగూడని పార్థుని రథంబు పెల్లగించి సంగడంబుచందంబునం బొడవుగా నెత్తి, కంస కర్ణభంజనులంజూచి, 'కృష్ణులారా, మీ యరదంబు భూమింబడవైచి చూర్ణంబుగాఁజేయుదునో, సప్తసాగరంబులకవ్వలి తీరంబునఁబడవైతునో, హస్తినాపురంబున ధర్మజుని సన్నిధానంబునఁ బడఁజిమ్ముదునో' యని పలుకుచు ఘాత చేసిన, నాఖండలనందనుండు దంభోళి సంకాశంబులైన యయుతము బాణంబులు గాండీవంబునందొడిగి సురథుని వక్షంబు ఛేదించిన, వాఁడును విసంజ్ఞుండై, చేవదగ్గి ధరణీతలంబునం బడియె.

## -అర్జునుఁడు సురథునిం జంపుట-

అంతలో రమాకాంతుండెప్పటి తెఱంగునఁ దేరాయత్తంబుసేసి, పార్థుండును దానునెక్కి, దేవదత్త పాంచజన్యంబులు పూరించుటయు, సురథుండు సారథి తెచ్చిన వేఱొక్క తేరిమీఁదఁ దాను నవలీల నెక్కి, నిరర్గళమార్గణాసారంబులు గురియుఁ బోటుపంతంబు మాటలాడం దొడంగిన, ధనంజయుండు సురథునింజూచి, 'యవశ్యంబును భవదీయ మస్తకంబు ఖండింతు, నట్లు చేయనైతినేని నా పూర్వజులకు ద్రోహంబు సేసినవాఁడ నగుదు'ననిన, సురథుండు పార్థునిం గనుంగొని, 'నీ శరీరం బవశ్యంబు ధరణీతలంబునం బడద్రోయుదు, నట్లు చేయనైతినేని నీ చెప్పిన శపథంబె నాకును సరి' యనుచుఁ, గిరీటిపై ననేక కోటి బాణంబులు నిగిడించిన, వానిం ద్రుంచి యతండు సురథునిపై శత సహస్ర సంఖ్యాతంబులైన విశిఖంబులు సంధించె. అంత నా సురథుండు రోషారుణలోచనుండై విప్పవచ్చు వింటినారిఁ ద్రెవ్వ నేయుటయుఁ బార్థుండు వేఱొక్క నారిసవరించి, రథంబు చెక్కలు గావించిన, నతండు వేఱొక్క శతాంగంబుపై నెక్కి, యుద్ధతి మోహరించుటయుఁ, బార్థుండు దానిని బహుశకలంబులు గావించె. క్రమ్మఱ నొక్క రథం బెక్కినం దునిమె. మఱియు నొక్క శతాంగంబు నధిరోహించిన ఖండించె. ఇవ్విధంబున నూట యెనిమిది రథంబులు పొడిచేసిన, సురథుండు విరథుండయ్యుఁ గార్ముకంబు సారింపుచుఁ, దూణీరంబునకుం గేలుసాచి బాణంబు నందుకొనునంతలో నర్ధచంద్రాశుగంబున నతని బాహువు ఖండించె. అట్లు ఖండిత బాహుఁడయ్యు శౌర్యంబు వదలక సురథుండు కేలం గద యమర్చికొని, త్రిప్పుచుం బఱతెంచి కిరీటి తేరి గుఱ్ఱంబులం జదియమోఁది, రెండువేల యేనుంగులం బీనుంగులు గావించి, యన్నియ రథంబుల మర్దనంబొనర్చి, పదివేల వీరయోధుల మడియించి, యన్నియ తురంగంబులఁ గీటడంగించి, సింహనాదంబు సేసినం, గిరీటి కృష్ణ సర్పోపమానంబైన క్రొవ్వాఁడి మెఱుంగుఁ దూపు వింటం దొడిగి గదతోడంగూడ వామ భుజంబు ఖండించిన, రెండు భుజంబులు లేకుండియు, గొమ్ములు లేని యేనుంగు కైవడి నౌద్ధత్యంబునఁ బాదఘాతంబులచే రథ రథ్య సారథి మాతంగ తురంగబుల మర్దింపుచువచ్చునెడ, బాండవ మధ్యముండు రెండు బాణంబులచే రెండు పాదంబులు ఖండించిన, సురథుండు దొర్లివచ్చుట కనుగొని యింద్రనందనుండు

కనక పుంఖ విభ్రాజితంబును, మయూర పత్ర చిత్రితంబును, ననేక సూర్య ప్రకాశంబునైన సాయకంబు సంధించి యభిమంత్రించి యేసిన, నది యతి రయంబునంబోయి సురథుని శిరంబు ఖండించిన, నా శిరంబు రాతిమీదంబడిన చందంబుగా బెట్టుగా మిట్టిపడి పార్థుని మస్తకంబు మీఁదం బడుటయుఁ బిడుగు పడు చందంబున రిమ్మవట్టి, కిరీటి వివశుండై, భూతలంబునం బడియె. సురథుని మొండెంబు కరితురగ రథ సమూహంబుల నుగ్గు నూచము చేయుచుఁ జేగుఱు కొండ చందంబునఁ గుంభినీ తలంబునఁ గూలె. అంత, మూర్ఛనొంది పుడమిపయింబడిన కౌంతేయునిం గనుగొని, దనుజాంతకుండు నిజపాణిపల్లవంబుచే మేనునిమిరి సేదదీర్చినం గిరీటి స్వస్థుండై నిలిచె.

## -శ్రీకృష్ణుండు గురుత్మంతునిఁ దలంచుట-

అంత సురథుని శిరంబు నెత్తామరమీఁద వాలు మధుకరంబు తెఱంగున శ్రీహరి చరణారవిందంబుల మీదఁ ద్రాలె. అప్పురుషోత్తముండు నయ్యుత్తమాంగంబు కేలంగైకొని పార్థునకుం జూపి, 'యితండు ప్రాణావసాన సమయంబు నందును సత్యంబు దప్పఁడు. శీలవంతుడును, దాంతుండును, సమర దురంతుడును నగు నీ యుత్తమ శ్లోకుండు నిఖిల లోక వందనీయుం' డనుటయు, సంక్రందన నందనుండు పరమానందంబున నందుకొని, తచ్ఛిరంబునకు వందనంబు గావించె. అంత మురాంతకుండును రాజ తనూజుఁ గృతార్థుఁ జేయ నూహించి, వైనతేయుం దలంచిన, నిబ్బరంపు మబ్బులోనం గబ్బిమీఱు విద్యుల్లత తెఱంగున విద్యోత మానంబులైన ఱెక్కల వలన మిక్కుటంబుగాఁ బొడమిన ఝంఝూమారుతంబుచేఁ గుల పర్వతంబు లొడ్డగిల్లునట్లుగా నెగసి వచ్చి సన్నిధానంబున నిలిచి, 'దేవరదాసుండునగు నేను వచ్చితి; నేమి కార్యంబున నియమించెద?' వని పలుకుటయు, నుపేంద్రుండు ఖగేంద్రునిఁ జూచి, 'నీ వీ శిరంబు గైకొని శీఘ్రంబుగా నరిగి ప్రయాగలోఁ ద్రివేణీ మధ్యంబున వైవుము. సురథుం డుత్తమ లోకంబు గాంచుఁ గాక!' అనిన నాగాంతకుండు నరకాంతకుని యానతి శిరసావహించి, 'దేవా, భవదీయ దివ్య పాదారవిందంబు లొకసారి మదిం దలంచినంతనే యెట్టి మానవుండైనను గృతార్థుండై పరమ పదంబు నొందు. అట్టి మీ భక్తునిం దలంచిన వారికిఁ దీర్థ యాత్రా ఫలంబు సేకూరు, ననునెడ భవదీయ భక్తులకుఁ దీర్థయాత్ర లేమిటికి? అయినను మీ యానతి

యనుల్లంఘనీయంబు గాననట్లే గావించెద,' నని పలికి, యమ్మస్త్రకంబు గైకొని గురుత్మంతుండు నిజపక్ష విక్షేపంబులచేఁ గిరుల నూటాడం జేయుచు వచ్చునెడ సదాశివుండు పార్వతీ సమేతంబుగా వృషభారూఢుండై యంబరంబునం జనువాఁడు, తనయొద్ది భృంగిరిటినిం జూచి, 'నీవు జవంబునం జని గరుడండెత్తుకపోవు శిరంబుఁ దీసికొని రమ్మ'ని పంపుటయు, భృగింపై పైన తేయుం జేరవచ్చి యతని ఱెక్కల గాడ్పులో సుడివడి సురగలితో సంపగిలిన చొక్కాకు చందంబునఁ బెద్దయుం బొద్దు తిరుగుచు వడి యెట్టకేలకు విడివడి, యతిరయంబున బఱతెంచి, 'దేవా, మహాదేవా, ఇక్కార్యంబు నాకశక్యంబ' బనుటయుఁ, బార్వతీదేవి నాథుని విలోకించి నవ్వుచు నిట్లనియె. 'అత్యంత వికారంబులైన యంగంబులం గనుపట్టు భృంగి పరమ భృత్యుండు. పిశాచంబులు సఖులు. పంచముకోడు కైదువు. ఇంటింటఁ బిచ్చంబె కూడు. పునుకల పేరు హారంబు. ముదియెద్దు పడివాగె తేజి. ఇన్ని యమంగళంబులు గల మీకు సంగర జయం బబ్బుట కేమి యాశ్చర్యంబు?' అని పరిహాసంబు లాడు శైలరాజ కన్యకం గనుగొని నవ్వి, యవ్వృషభాంకుండు తారకాసుర వైరి నవలోకించి, 'షణ్ముఖా, నీవుపోయి తచ్ఛిరంబు గొని రమ్మ'నుటయు, నతండు గరుడని వెనుకం బఱచి, కూడం జాలక, తదీయ పక్షవిక్షేప జాతంబులైన వాతూలంబులచేఁ ద్రిలోకంబులం దిరుగుచు నెట్టకేలకు గరుడునిం గూడె. అంతలో భాగ్యవశంబునఁ బ్రయాగ తోఁచుటయు వినతానందనుండు త్రివేణికా మధ్యంబున సురథుని శిరంబు వైచిన, నీటిలోనం బడక మున్నె కుమారస్వామి తూఁటి యెత్తుకొని వచ్చి మహాదేవుని సన్నిధి నునిచె. అతండుం దానిం గరాంబుజంబునఁ బట్టుకొని హిమశైల బాలికకుఁ జూపి, 'దానశూరులు, దయాపరులు, సత్యవ్రత పరాయణులు, జితక్రోధులు, మాతాపితృ భక్తులు నైన వారల శిరః కపాలంబులు నేను హారంబుగా ధరియింతు. ఈ యుత్తమ శ్లోకుని యుత్తమాంగంబు తన్మధ్యంబున నాయక రత్నంబుగాఁ దాల్చెద,' నని ధరియించె. అంత నాగాంతకుండు సత్వరంబుగాఁ జని మురాంతకున కవ్వృత్తాంతం బెఱిగించి, తదనుమతంబున యథేచ్ఛంబుగాఁ జనియె. అనిన విని జనమేజయుండు జైమినిం గనుంగొని తరువాతి వృత్తాంతంబు వినవలయుననియె.

గద్యః

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ
మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగమాందోళికా
ప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధ మాన
సముఖ మీనాక్షీ నాయక తనూభవ మీనాక్షీ
దేవీ కటాక్ష లబ్ధ కవితా సంప్రదాయ
వేంకటకృష్ణప్ప నాయక ప్రణీ
తంబైన జైమిని భారతం
బున నశ్వమేధ పర్వ
మ్మను వచన కావ్యంబు
నందు
ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు

# జైమిని భారతము

## తృతీయాశ్వాసము

క. శ్రీపాండ్య ధరాభరణా,
భూపాలక మకుటరత్న పూజిత చరణా,
రూప రతి స్మర నిర్వ్యా
జోపకృతీ, విజయ రంగ చొక్క నరపతీ!

అవధరింపుము. జైమిని మునీంద్రుండు జనమేజయ నరేంద్రునిం గనుంగొని, తదనంతరంబు హంసధ్వజుండు బలపరాక్రమ సంపన్నులయిన కొడుకు లిరువురు సమరంబునం గూలుటయు, సైన్యంబులు పరాజయంబు నొందుటయు, నాకర్ణించి కోపాటోపదీపితుండై చెదరిన బలంబులనెల్ల గలయం గూర్చి సమర, సముత్సాహదోహలంబులైన వీరకాహళంబులును, నిస్సాణంబులును, భూనభోఽంతరంబులం బూరటిలంజేయ, నిజభుజపరాక్రమంబుచే మాధవునారాధింపం దలంచి సింహనాదంబులు, సట్టహాసంబులు, నార్పులు, బెడబొబ్బలు, జంకెనలు, గజఘీంకారంబులు, శింజినీటంకారంబులు, వీరహుంకారంబులు, భుజాస్ఫాలనంబులు, ధ్వజ పటపటాత్కారంబులు, రథచక్ర ఘోషంబులు, హయ హేషారవంబులు, రత్నభూషణంబుల ధగధగలు, కైదువుల ధళధళలు, నీఁటెల నిగనిగలు నొక్కమ్మడిం గ్రమ్మ, సాగరంబు పొరలిన తెఱంగున నాహవ యజ్ఞంబునం బ్రాణంబు లాహుతులు సేయందలంచి, సాహసంబున మోహరించి వచ్చు నా హంసధ్వజుం గనుంగొని, కంసవైరి కరుణాకలిత మానసుండై, దిగ్గనందేరుడిగ్గి, పీతాంబరంబు వలెవాటుజాఱ, వనమాలికా పరిమళంబుమీఱ, గంధసింధుర గంభీర గమనంబున నెదురు వచ్చుటయు, నమ్మహీనాథుండును తోడనే యరదంబు దుమికి, భక్తి వినయ సంభ్రమంబులు మనంబునం బెనంగొనం జనుదెంచి, పాదారవిందంబుల వ్రాలిన, శ్రీవల్లభుండు శుభలక్షణ లక్షితంబులును, శార్ఙ్గ

మా ౯ఁకిణాంకితంబులును, లక్ష్మీవిగచిత మకరికాపత్త్రాభిరామంబులును, గరిక రోపమానంబులునైన తన భుజంబులం జాచి లేపనెత్తి, యా మండలేశ్వరుని నిండు కౌఁగిటం జేర్చి, భక్తవాత్సల్యంబునం గన్నుల బాష్పంబు లొలుక నూఱడించుచు, 'రాజచంద్రా, జనన మరణాది సుఖదుఃఖములు బ్రహ్మాదులకైనం దప్పవు. నీ కుమారులిరువురు సమరయజ్ఞంబు సాంగంబుగా నెఱవేర్చి ప్రాణాహుతులు గావించి మమ్ముం దృప్తినొందించి మా సాయుజ్యంబు నొందిరి. వారికై వగవం బనిలేదు'. అనిన విని, హంసధ్వజుండు, 'కంసాంతకా, దేవరపాద పద్మంబులు సేవింపంగోరి కయ్యంబునకుఁ బూనితి. నా మనోరథంబు ఫలియించె. ఇహపర సౌఖ్యంబులకు నిధానంబైన తావక దర్శనంబు లభించె. ఇఁక నాకు దుఃఖంబు గలుగదు'. అనిన, గోవిందుండు 'నరాధిపా, నీ సఖ్యంబు మాకు దొరకె. నీ వాప్తబంధుండవు. పాండవులు నాకుం బ్రియులగుట నీకునుం దెలిసియుండుఁ గావున నిఖిల సేనా సమన్వితుండవై యశ్వంబు రక్షించుచు, నర్జునునితోఁ గూడవచ్చి, ధర్మనందనుని యాగంబు నిర్వహించి, యాతనిచేఁ బూజితుండవై వచ్చుట మాకుం బ్రియంబు'. అని సవ్యసాచి సమేతంబుగాఁ దత్పురంబునకుంజని, యతనిచేఁ బూజలు గాంచుచు, నయిదురాత్రులు వసియించి, యంబుజనాభుండు హస్తినాపురంబునకుం జనియె. తదనంతరంబు విజయుండు హంసకేతనుని తోడంగూడఁ దురంగంబుఁ దరలించుకొని చనుటయు, నయ్యశ్వంబు పవనజవంబున నుత్తరాభిముఖంబుగాఁ జని చని, యెండ తాఁకునంగొట్టువడి, యొకవనాంతరంబుఁజొచ్చి, నవరత్న ఖచిత సోపానంబులును, నమృతోపమానంబులైన తేట నీళ్లను, జెంగలువలు, తెలిగలువలు, తెలిదమ్ములు, జెందమ్ములు నందమ్ముమీఱ నొక్క సరోవరంబు సొచ్చె.

## -నవనాశ్వము గోడిగయై పులియగుట-

(అప్పుడది) కంఠదఘ్న జలంబుల నిలిచి, సలిలంబు గ్రోలి, తనిసి వెలు పలికివచ్చి, యందుఁబు నరుదంది కనుంగొన గోడిగయయ్యె. క్రీడి యది కనుంగొని విచారంబు నొందునెడ, నయ్యశ్వాంగన వేఱొక్క కొలనికిం జని, జలంబులు గ్రోలి, తోడనే బెబ్బులియయ్యె. అనిన విని, 'మునీంద్రా, అట్లగుటకుఁ గారణమేమి'? అని యడిగిన జనమేజయునకు జైమిని యిట్లనియె.

## -స్త్రీమండల వృత్తాంతము-

తొల్లి దాక్షాయణి శంభునుద్దేశించి, వినయంబుతోఁ దపం బాచరించు చుండ, దుర్మదాంధుండైన యొక్క రక్కసుం డద్దేవిని జెనకంజూచిన, హుంకారంబుచే వాని భస్మంబు గావించి, 'యిదిమొదలేజంతువు లీజల జాకరంబు సొచ్చిన తోడనే యాఁడు జన్మంబుఁ జెందుగాక' య శపియించెఁ, గావున నీగుఱ్ఱంబు గోడిగయయ్యె. అదియట్లుండె, మున్ను కృతయుగంబున నకృతవర్ణుండను మునివరుండు తీర్థయాత్ర సేయుచుఁ, బుణ్యస్థలంబులు, నదులు, నదంబులు, తటాకంబులు నవలోకించుచు, దత్సరోవరంబునకు వచ్చి యఘమర్షణ స్నానంబు గావించునెడ, నొక్క మొసలి యతని పాదంబులు వట్టుకొని, తివియుటయుఁ బెనంగి విడిపించుకొని, 'నేడు మొదలేజంతువు లిందు జొచ్చిన వ్యాఘ్రంబు లగుంగాక' యని శాపంబొసంగె. అది కారణంబుగాఁ బెద్దపులి యయ్యె. అవ్విధంబు గనుంగొని పార్థుండు ముందు తోఁచక శ్రీకృష్ణ దేవుని మనంబున ధ్యానంబు సేయుటయు, నా హరి కరుణా కటాక్షంబుచే వ్యాఘ్రం బెప్పటి ఘోటకంబయ్యె. అంత భేరీ పటహాది వాద్యంబులు మ్రోయ రయంబున ననేక దేశంబులు క్రమించుచు, జని యాఁడు మండలంబునకుం జనియె.

తద్దేశంబునకు రాణి నీలనిభవేణియు, రాకేందుబింబ వదనయుఁ, గుంద కోరక సమాన రదనయుఁ, బల్లవాధరయుఁ, గంబుకంధరయుఁ, బర్వతోప మాన వక్షోరుహయు, మల్లికామృదుబాహయు, నణుమధ్యయు, నతిపుణ్య సాధ్వియు, జలజనిభపాణియు, సైకతశ్రోణియు, రంభాసమోరుకాండయు, రాజీవరక్త చరణయు, రత్నమయ సర్వాభరణయునై, హావభావవిలాస విభ్రమంబుల నింపుమీఱుచు, పురుషుని మనంబెఱింగి శృంగార విలాసంబులం బ్రొద్దులు పుచ్చుచు, సరస వాగ్విలాసంబులు నెరపుచుఁ, బ్రమీలయను నామ ధేయంబుగాంచి, నరులకు సురల కసురులకు, సిద్ధులకు, సాధ్యులకు, నసాధ్య మైన ధనుర్విద్యా కౌశలంబునం బొలుపొందుచు, ధైర్యవీరసాహసంబు లుగ్రశానంబులుకు మెఱయ, లక్ష యేనుంగులు, నన్నియ గుఱ్ఱంబులు, నన్నియ రథంబులును, విషకన్యకలనం బరగిన పది లక్షల కన్నెలు గదాముసలముద్గర భిండిపాల తోమరశక్తి ముసుండి శరశరాసన ఖడ్గఖేటకాద్యాయుధంబులతో గరిడి సాధనల నెప్పుడుఁ జరించుచుండ, నఖండిత వైభవంబున రాజ్యం

బేలుచునుండు. తద్దేశంబునకు మార్గవశంబున బోయిన పురుషులను జేరంబిలిచి యందలి యిందుముఖు లమృత మధురాలాపంబుల నాహ్లాదంబు పుట్టించి వశీకరించి యొక్కొక్క పురుషునితోఁ బెక్కండ్రు వనితలు క్రీడించుచుండ, నొక్కమాసంబులో నాపురుషుండు పరలోకంబున కరుగు. వానితో రమించిన యకాంతలందఱు నగ్నిప్రవేశంబు సేయుదురు. అందొక్క యువతికి గర్భంబు నిలుచు.అది కనియెనేని యాఁడుబడుచుం గాంచుఁగాని,పుత్త్రునింగాంచదు. ఇది యాదేశంబునందలి నడవడి. జనమేజయ నరేంద్రా, విజయ భుజ విక్రమ రక్షితంబైన యశ్వరత్నం బవ్వీటి సమీపంబునకుం జని, పచ్చిక మేయుచు నుండు నెడఁ గఱివంక కనుబొమ్మల వంకలకుఁ గొంకిన చందంబున గుడువడం దిగిచిన సింగాణివిండ్లును, గలికిచూపుల కలికి వెనుకదాఁగిన వితంబున నంప పొదులలోనం బొదలుల కోరి కోలలును, వట్రువగబ్బి గుబ్బలు గనుంగొని భ్రమపడిన చందంబున బిఱబిఱఁ దిరుగు చక్రంబులును, బెడంగుజడల యందంబునకు వణంకెడు చందంబునఁ దళతళమని కత్తులు మెఱయ వీర శృంగార రసంబులంగనారూపంబు గైకొన్న కైవడి, వీఁకమీఱు రాకేందు ముఖులు, తేజీలు దువాళింపుచుఁ గోకిలలొక్కుమ్మడిఁ గాకలీ స్వనంబు లొన రించు కరణి వీరాలాపంబులు, నార్పులు, నట్టహాసంబులు, పంతంబులు మెఱం యం బాఱుటయు, నందొక్క కుందరదన గుఱ్ఱంబు మీఁటి యధ్వర హరింబట్టుకొని వచ్చి తను యేలికసాని సమ్ముఖంబున నిలిపి, 'రాజ రాజేశ్వరీ ! ఈ హయంబు ధర్మజునిచే విడువఁబడినది. హయ రక్షణార్థంబుగాఁ బరాక్రమో పార్జనుండగు నర్జునుండు చనుదెంచి యున్నవాఁడ'ని పలుకరించిన, నయ్యంగ నామణి బంగరు రంగులం దురంగలించు తురంగశాలలోనఁ గట్టుటకు నియ మించి, యంతరంగంబున నెంతయు సంతసం బెసంగ, 'నేటితో నా కోరికలు నెఱవేఱె. సుఖంబు సమకూఱె. సందియంబు లేదు. ఇందుకొఱకా పురందర నందనుండిచ్చటికి వచ్చు. ఇది మొద లనుదినంబును వానితోడం గూడెద. నా పాలి దైవంబులను వేడెద'నని, యెడవీడని కోరికలు పొదమ, నప్పడఁతుక పదివన్నియ బంగారునకు మెఱుంగు పెట్టిన హొరంగునఁ, బైగోవవ్వాదికిఁ బువ్వుఁదావి గట్టినరీతిఁ, జిన్నారి జాబిల్లిమీఁద సుధారసంబు చిలికించిన చందం బున, రంగైన యంగంబును, శృంగారింపఁ దొడంగి, యంగజుని, చక్రంబులం బోలెఁ దళుకు తళుక్కునఁ జెక్కులఁ గుల్కు కళ్క రతనంబుల కమ్మలు

వెట్టి, చివురాకుఁ గెమ్మోవి కెంపుల సొమ్ము మీఁఱు సుహాణి ముత్యపు ముంగర ధరియించి, వింత వింత మణుల కంఠసరములు, కంటెయు, సేవళంబును, ముత్యాల దండలు, సందిటి కడెంబులు, ప్రత్తికాయ తాయెతులు, కంకణంబులు రవల గాజులు, కడెంబులు, మొలనూలు, నొడ్డాణంబు, నందెలు, పాడగం బులు, పాద (రసములు) సరములు, మెట్టెలు, బిల్లాణులు, వీరముద్రికలు, మొదలగు నానావిధ భూషణంబులఁ గైసేసి, తన యనురాగ రసంబు వెల్లువ గట్టెనో యన, నందంబగు చందురకావి పావడపైఁ దన (మనో) మాలిన్యంబు వెలికుఱికిన తెఱంగున, మవ్వంపుఁ జువ్వనివ్వటిల్లు రాయంచ యంచుల మించు పైఠాణి దుప్పటంబుగట్టి, మట్టు మీఱిన మదనానలంబు తన్నుఁ బట్టుకొనిన తెఱంగున నిండు తగటి అవిక కుంకుమ పూఁత పొంకంపు సిబ్బెంపు గుబ్బల గబ్బుమీఱ నిండు ముస్తీబుచేసి, చిలుక తేజీవజీరుని తేజి తెఱంగునఁ గనుపట్టు మరకతంపుఁ బిడెంపు బాకు చేపట్టి, విరజాజి సరుల తావియుఁ బైగోవజవ్వాజి పట్టెల వాసనయు, దిక్కుల గుమ్మని క్రమ్మ, గిలుకు పావలు మెట్టి, నెమ్మిమై మేఘమండలంబు వెలువడు క్రొక్కారు మెఱుంగు తీవియవోలె నంతిపురంబు వెలువడి, యాప్తలైన చెలి కత్తెలు వెంటరా, బంగరు గుమ్మలం బోలు నండజయానలు దడలం జేరి కైదండలొసంగ, నవరత్న ఖచితంబగు బంగరు బెత్తంబుల మొత్తంబులు చెలంగఁ గటికవారలు 'రాజరాజేశ్వరీ, రాజపరమేశ్వరీ, కేరళ దేశాధీశ్వరీ, స్వామినీ, పరాకు, హెచ్చరిక, జితను, సావధానత,' అని హెచ్చరికలు దెలుప, నల్లనల్లనవచ్చి, డాలుమీఱు పగడాల కంబంబులు, దారవజ్రంబుల బోదెలు, జీవ దంతంపు దంతెలు, నీలంపు దూలంబులు, కెంపుటోడు బిళ్లల పైకప్పడంబును, నానారత్న విచిత్రంబులు, బాలభాను ప్రభాభాసమానంబులు, గగనలక్ష్మి నివా సంబులునైన తమ్మిరేకులఁ బోలుపొందు, కనక కలశంబుల విలసిల్లు ద్వారంబు లును, జంద్రకాంతమయంబులైన వజ్రమణిమయ గజరాజ శోభితంబులైన పార్శ్వంబులం గనుపట్టు సోపానంబులును, హెచ్చురతుల పచ్చరాతిన్నెయుఁ, గలశంబులు తుండంబులఁ గైకొని యభిషేకంబులొనర్చు దారవజ్రంపు టేనుంగు లిరుగడలం గడలుకొన, మూర్తీభవించిన సామ్రాజ్య లక్ష్మివలె నొప్పుచు, లక్ష్మి విగ్రహంబులం బొలుపొందు ద్వార దేశంబులం గలిగి, జాళువా సరిగ కుట్టు పని హరువుల ప్రతిమలం బ్రతిఫేని తెరలును, కొత్త ముత్తెంబుల జల్లుల మేలు

కట్టుచు, నెమలి చెక్కడల ఛాయలం బ్రతి క్షణంబును వింతలైన కాంతులు మంతు మీఱ రత్నగర్భయైన పుడమి కన్నకరణి నున్న తివాసుల నొప్పుచు, సుధర్మా స్థానంబు కరణిఁ బ్రభాశోభితంబైన వాటంబును, ప్రభావిజిత మేరు కూటంబును నగు కొలువు కూటంబున, బాల భానుకిరణంబులతో వాదంబులు సేయుపాదంబులును, బసిఁడిగట్టుపై తట్టువడఁ గనుపట్టు విస్తారంబును గలిగి, గోమేధిక పుష్యరాగ మరకత ముక్తాప్రముఖ నిఖిల రత్న విరాజితంబైన గ్రహ నక్షత్ర తారకా నికర కోరకితంబైన యాకసంబు తెఱంగున (రమ్యం బును), నఖిల సురాసుర పూజితంబునైన సింహాసనంబునం గూర్చుండి, సామ దాన భేద దండోపాయలగు మందయానలు సందడించి కొలువ, నొక్క చక్కిఁ జక్కెర బొమ్మలు చక్కెరయు చెక్కుటలకన్న మిక్కుటంబైన చౌకాటంబులు నైనదంపక తారావళీ ప్రముఖ ప్రబంధంబులు విన్నపంబు సేయ మఱియొక్క దిక్కున రాకేందువదనలు మీమాంసావ్యాకరణాది శాస్త్రంబు లనర్గళ ప్రవా హంబులుగా నుపన్యసింప, వేఱొక్క చాయఁ బల్లవాధరలు బ్రహ్మాండ పురా ణంబు, విష్ణుపురాణంబు, పద్మపురాణంబు మొదలగు నష్టాదశపురాణంబులు, కథలు, వినిపింప, మఱొక్క దిక్కున నీలవేణులు చిత్తరు బొమ్మలవలె శిరః కంపనము చేయుచు, జంత్ర గాత్రంబుల తాయి గీత ప్రబంధంబులు ఘన నయ దేశీయంబులు వీనికిసేయ, నొకవంక మకరాంక విజయ పతాకలం బోలె రంభో ర్వశీ మేనకాదుల నెంత లేవను బిరుద పాత్రలు చర్చరి చారి మొదలగు పదిఁ యారు నాట్యంబులు నభినయంబులు గనుఁగొనిపింప, నొక్క ప్రదేశంబునఁ గలకంఠకంఠులు పరిహాసంబులు వినోదంబులుగాఁ బ్రసంగంబులు సేయ, నిరుపంకల ధవల కంకణంబులు ఘల్లు ఘల్లనఁ బంకజాక్షలు కనకదండ మండి తంబులైన ధవళ చామరంబులు వీవఁ, గత్తి, కేడెంబు, సురె, చికటారి, సిడెము, వంకి, పట్టిస, బాణముసల ముద్గర భిందిసాలములు, బరిచి, నేజా మొద లగు ముప్పది రెండాయుధంబులు, గుండె కాళంజియు, జేమిపావడ యడ పంబును, గిండి సురటియు, నిలువుటద్దంబులు మొదలగు మహారాజ చిహ్నం బులఁ బూని యూడిగంపు జెలువ లూడిగంబులు సేయ, సాక్షాత్కరించిన వీరమోహిని చందంబునఁ నిండోలగంబున నుండె.

అంతఁ గుంతీ సుత మధ్యముండు కాంతాజనులు మఘవాజింగొనిపోయి రని చారులు పలుకరించిన నవ్వి, తగిన రాయబారులం బనిచి 'గుఱ్ఱంబు విడువు'

మని మందలించిన యెడ, నమ్మండలేశ్వరి ముఖ చంద్రమండలంబున వెన్నెలయు నుంబోలె మందహాసంబు గందళింప 'గిరీటి మేటి వీరుండని వింటిమి. అతని రణకౌశలంబు పరీక్షింపకయె కవ్వడిం గడవనీయము. నేనిదే సమర సన్నాహంబుగా నరుగు దెంచెద. పార్థుని రమ్మనుఁడు, పొండు'. అని బహుమానంబులు సేసి పంపిన, నియోగులు వేగంబె యరుగుదెంచి యవ్విజయునకు వివరించిరి.

## -ప్రమీలా విజయుల యుద్ధము-

అంతఁ దురంగ మాతంగ శతాంగ వీరభట మహార్భటీ సమేతంబుగాఁ బ్రమీలమోహరించి, రథచక్ర ఘోషంబును, గేతనపటాత్కారంబును, గార్ముకజ్యా నాదంబును, లలిత మధుర సింహనాదంబును, ఘనభో ౽ం తరంబు దీఁటుకొన, శతమఖతనయుం గాంచి, తన కులుకు జూపులంబోని వాలుతూపులు వింటం సంధించి రథరథ్య కేతన సమేతంబుగా నించుటయుఁ, బార్థుండును నంగన తోడి కయ్యంబునకు రోయుచుఁ, దీఅని కతంబున మూఁడు వాఁడితూపులు సంధించి యేయుటయు, నది తోడనే ఖండించి తీవ్రముఖంబులైన శిలీముఖంబులచే దశదిశాముఖంబులు గప్పి, తక్కిన బోటులు ఘోటకంబుల మీటి, సామజంబులఁ బురికొల్పి, రథంబులం దోలి, చిలుకుటమ్ములచేఁ గ్రుచ్చియు, నీఁటెలం బొడిచియుఁ, బట్టిసంబుల నఱికియు, శూలమ్ములం గ్రుమ్మియు, వంకులఁ జిమ్మియు, జముదాళ్ళం బొడిచియు, గదలనడిచియు, ముసలంబుల మోదియు, ముద్గరంబులఁ జిదిమియు, గిరుసకత్తుల విదళించియుఁ, జిరుత కడ్డియలఁ గొట్టియుఁ, దారసిల్లిన నయ్యిరువాఁగును బూర్వపశ్చిమ సముద్రంబులవలెం దాఁకి తుములంబుగా సమరంబు గావించునెడఁ, బ్రమీల యింద్ర నందనుం జూచి, 'కిరీటీ, మమ్ము నీ బోఁటికిం గెలువఁగూడదు. నీకే కాదు. అనిమిష సిద్ధ సాధ్య గరుడోరగాదులేనియు నన్ను గెలువ లేరు.

## -ప్రమీల యర్జునుని మోహించుట-

నీకు గెల్పుంబు గావలయునేని దురాభిమానంబు మాని ప్రియంబున నన్ను వరియించిన హయంబు నిత్తుంగాక. లేకయున్న నిన్నుంబోనిత్తునే ? నీ యగ్రజుండైన యుధిష్ఠిరుండు సోమపానంబు సేయ నిమ్ము. నీవు నా యధ

రామృత పానంబు సేయుము. అతండు కురుదేశం బేలనిమ్ము. నీవు నా (మనో) దేశంబేలుము. ఈ దేశంబునకు నీవె యొడయుడ వయ్యెదవు'. అనిన ధనంజయుండు దరహాసంబు నెమ్మొగంబునఁ గనుపట్ట, 'జవ్వనీ, నిన్నుం గూడిన నరుండు మాసమాత్రంబునఁ బంచత్వంబు నొంది యధోగతికిం జను. అంతట యువతీ మండలంబేలు వాఁడెవ్వండు ? ధర్మజునకు మరల హయంబు సేర్చువారెవ్వరు ?' అనినం బ్రమీల వాలారు మెఱుంగుఁ జూపులం జూచుచు, 'నీవు దైవయోగంబున మా దేశంబునకు వచ్చిన వాఁడవు. ఇంక నెచ్చటికిఁ బోవంగలవు ? ఎట్లయిన నీ ప్రాణంబు లపహరింపకమాన. నా మహోగ్ర బాణంబులచే నీమేను జల్లెడ క్రంతలుగా గాయంబులంబడి వేదనం బొరలుచు వృధా ప్రాణంబు లప్పగింప నేల ?' అనినఁ గన్నులఁ గెంపు నింపుచు నిలింప పతినందనుండు నారి నాఱమ్ములు సంధించి యేసిన, నవ్విలాసిని యన్నియ నారసమ్ముల వానిని రూపఱంజేసి, వెండియు నేడు వాఁడి బాణంబులు మేనం గీలించి, మఱియు వేల కొలంది తూపుల వాన గురిసిన, సురపతి తనూభవుండు సమ్మోహనాస్త్రంబు వింట సంధించిన, నవ్వాలుగంటి యయ్యస్త్రంబు తోడం గూడ గాండీవ గుణంబు ఖండించిన, నరుండు కోదండంబున వేఱొండు నారింగూర్చి, 'యిన్నారిం బరిమార్పక మా...' నని కట్టలుకఁ గను బొమ ముడిపాటు గదియించుటయు, నాకాశవాణి, 'అర్జునా, నిర్జరులకైనం దీనిం గెలువ శక్యంబు గాదు. నీవు పదివేల యేడులు పోరినం జయంబు చేకూరదు. రిత్తయాయాసంబేమిటికి ? ఒకనాటి రాత్రి దీనిఁ దనియించి హయంబు గొని యథేచ్ఛంబుగా జనుము'.

## - ప్రమీల యర్జును నంతిపురంబునకుఁ గొనిపోవుట -

ఆనిన (విని) అర్జునుండు నమ్ములు విల్లు, సరదంబున నునుచుటయు, నయ్యంగన యతి త్వరితంబుగా వచ్చి యాలింగనంబు సేసి, పురంబునకుం దోడుకపోయి యంతిపురంబున బంగరు పడుకటింటం బువుల పాన్పున లీలా వినోదంబునం బ్రొద్దుగడపి, మరునాడు మత్త మాతంగ మణి భూషణావళుల తోడంగూడ మఖ వాజి నర్పించి మ్రొక్కుటయు, నయ్యర్జునండు సాదరంబుగా పీడ్కొని చనియె. అని చెప్పి మఱియు జైమిని మునీంద్రుండు జనమేజయ నరేంద్రునిం గనుంగొని యిట్లనియె:

## - వృక్ష దేశ వృత్తాంతము -

తదనంతరంబ యత్తురంగంబు వృక్ష దేశంబునకుం జనియె. అందలి విశేషంబులు వినుము. అచ్చటి మానవ పశుపక్షి వృక్ష సంఘంబులు ప్రాతః కాలంబునం బుట్టి, తోడనే యౌవనంబునొంది, మధ్యాహ్నకాలంబునం గాపురంబు సేసి, సాయంకాలంబున మరణంబు నొందు. అనుదినంబు నివ్విధంబున జనన మరణంబులొందుచుండు. ఇది యద్దేశాచారంబు. పార్థుండవ్విశేషంబులు గని యచ్చెరువొందుచుఁ బోవునెడ, స్వకర్మానురూపంబుగాఁ బుట్టిన యేకపాదులు, ద్విపాదులు, త్రిపాదులు, ననేకపాదులు, వికటపాదులు నైన జనులును, గుందేలు, ఎద్దు, ఎలుఁగు, వానరంబు, ఏనుఁగు, జింక, గుఱ్ఱంబు, పంది, పశువు, పులి, మార్జాలము మొదలగు జంతువుల వలె కనుపట్టు ముఖంబులు గలిగిన మానవులు, గూబ, కోకిల, ఎంద్రకాయ మొదలగు వానివలె వికృతంబులు, కపిల వర్ణంబులు, విషమంబులునైన కన్నులం గనుపట్టు జనులునుం గలిగి, వింతవింతలైన దేశంబు లతిక్రమించి పోవుచు, నత్తురంగంబగ్రభాగంబునఁ బిశాచ నిశాచర శాకినీ ఢాకినీ భేతాళాదులకాలయంబును, సింహ శరభ శార్దూల గండభేరుండ వేదండ గండక శశ వరాహాది నానా మృగ సమూహంబులకు శరణ్యంబైన యరణ్యంబు ప్రవేశించె. అందుఁ బాపంబులు కాపురంబుసేయు తావును, నశుభంబుల కాలయంబును, జనలోక భయంకరంబునగు దనుజ పురంబొక్కటి కలదు. అప్పట్టణంబున మూఁడు కోట్ల దానవులు పార్శ్వంబులం గొలువ, నిర్దయ చిత్తుండును, దంష్ట్రాకరాళవదనుండును, క్రూరకర్ముండును, గెలునకుఁ బదివేల దిగ్గజంబుల సత్తువ గలవాఁడును, భీషణాకారుండును, నైన బకాసుర తనయుండు భీషణుండను నామధేయంబు గలవాఁడు రాజై యుండు. తత్సమీపంబు నందొక్క పర్వత గుహలోఁ బ్రాణి హింసా దీక్షితుండును, భీషణాసురునకుఁ బురోహితుఁడును నైన బ్రహ్మరాక్షసుఁడుండు. వాఁడు, నిడుపలైన ప్రేవుం జందెంబులును, నెత్తుటి పట్టెవర్ధనంబులును, గపాల జపమాలికయుఁ, బచ్చిచర్మంబనియెడి కాషాయ వస్త్రంబును, నేనుఁగు తల కమండలువును, గర్దపవిత్రంబులును, వెన్నెముక యూత కోలయుం గలిగి, మేదోహోతయను నామధేయంబున వర్తించు. వాఁడు నర్జునుని యశ్వమేధాశ్వంబు వచ్చుటంజూచి, భీషణాసురుని చెంగటికి వచ్చి

దీవించి యిట్లని విన్నవించె. 'దానవేంద్రా, మీ తండ్రియగు బకాసురుని బలాతిశయంబున భీముఁడు చంపె. వాని తమ్ముండగు నర్జునుం డశ్వమేధాశ్వంబు వెంబడి మన వీటి చెంగటికి వచ్చె. తండ్రిని జంపిన పగ దీర్చుకొనుట కిదియే సమయంబు. నీవు నరమేధంబను యాగంబు సేయుము. నే నౌద్గాత్రంబు సవరించెద. నేఁజేయు వ్రతంబులు వినుము. ఆషాఢ మాసంబునఁ బౌర్ణమాసి యందు సన్న్యాసుల రక్తంబులను జలంబులే యాహారంబుగాఁ దపంబు సేసితి. శ్రావణమాసంబున విధవలను దలవీయకయే పండుటాకుల కరణి మ్రింగి వ్రతంబు సలిపితి. భాద్రపద మాసంబునఁ బాశుపత దీక్షాపరుల గుండెకాయలు కందమూల ఫలంబులంబోలె నశనంబు సేయుచు నియమంబు నెఱవేర్చితి. ఆశ్వయుజ మాసంబున బ్రహ్మచారుల పలాహారంబు సేయుచు నిష్ఠా సమన్వితుఁడనై యుంటిని. ఇవ్విధంబునఁ జాతుర్మాస్య వ్రతంబు సలిపి, కార్తిక మాసంబునఁ గన్నియల భక్షించి పారణ చేసితి. ఈ పురంబునఁ బెక్కండ్రు బ్రహ్మరాక్షసులు గలరు. వారలిత్తెఱంగున నియమంబు నడుపంజాలరు. పుణ్యకాలంబు వీటిం బుత్తురు. అదియట్లుండె. ఇప్పుడు బ్రహ్మరాక్షస సహస్ర భోజనంబు సేయ సంకల్పించి నరుని బలంబులనెల్ల ధారవోయుము.' అనిన విని, భీషణుండు కొద్దిగా నవ్వుచు, 'నీకుం గావలసిన భోజనం బెద్ది? ఏ మాత్రంబు భక్షింపఁ జాలుదువు? తెలియంబలుకు' మనియె.

తదనంతరంబ యా బ్రహ్మరాక్షసుండు, 'బలపరాక్రమవంతు లున్నతాకారు లాజానుబాహులును మూర్ధాభిషిక్తులైన రాజకుమారుల వేయిమందిని, గజతురగ వీరయోధుల తుద మొదళ్ళు కూరలుగా మెసవం గలవాఁడ, నింత మాత్రంబు దయచేయవలయు' ననిన, దనుజ నాయకుఁడు నవ్వి, చేతంజేయప్పళించి, 'బ్రహ్మరాక్షసోత్తమా, ప్రాణి హింసాయజ్ఞంబు నేఁ జేయంబూనితి. తగిన యాగోపకరణంబులు సంపాదింపుము-పొ' మ్మని యనిపి, భూమి గ్రక్కదల, దిక్కులు పిక్కటిల్ల, రణభేరి చఱచం బనిచి, హుంకారాట్టహాస సింహనాద భుజాస్ఫాలన భేరీభాంకార భయంకరంబుగా నాప్తబలంబులతోఁ బురంబు వెలువడి, శాత్రవ శోషణుండైన భీషణుండు భండనంబునకుం గడంగు నప్పుడు, జగడంబు చూచు వేడుక మీఱ, పొలదిండి పడంతులు బంతులుగా వెడలి, రెండు యోజనంబులు, మూఁడు యోజనంబులు, నాల్గు యోజనంబులు, నిడివియైన చన్నులును, దావాగ్ని దగ్ధంబులైన కొండచఱులం బోలె భీకరంబులగు

మొగంబులును, ప్రళయకాల మేఘ మాలికలంబోని యాకారంబులునుం గలిగి, భువన భయంకరంబుగా ముచ్చట లాడుచు, వచ్చి పర్వత శిఖరంబు లెక్కి, పాండవ సైన్యంబుఁ జూచి, యర్జును రథ ధ్వజంబున మంతు మెఱయు హనుమంతునింజూచి, 'వీఁడుగదా, తోఁకచిచ్చున లంక నివుఱు సేసిన మర్కటంబు! సప్తమంత్రి కుమారులఁ బంచసేనాగ్రగుల, జంబుమాలి నక్షయ కుమారుని ద్రుంగిన క్రోఁతి!వీఁడేమిటి కీత వచ్చినాఁడు? వీఁడు దానవుల వేరువిత్తు.' అని కలంగంబడు సమయంబున నొక్క బలురక్కసి వారల నోడకుండని భయంబు దీర్చి, తానొక్కతెయై నాకసంబున కెగసి, నల్లమబ్బుకరణి మైపెంచి, హుంకరించుచు, వేదెంబులు వాఱుటయు, మూఁడు యోజనంబులు నిడివియైన దాని చన్నుల చేతం గొట్టువడి యర్జును సైన్యంబులు దైన్యంబునొందె; నింత దక్కిన రాక్షస వనితలు సప్రోషంబుననె కుచతాడనంబులఁ జతురంగ బలంబులం గీటడంగించుటయుఁ, గేతన స్థితుండైన వాయు పుత్రుండు మహోగ్ర కోపంబున గర్జించి, వాలంబు పెంచి, వారల కంఠంబులు బిగియించి, పర్వత శిఖరంబులం గొట్టియుఁ, బయోరాశిలోన వైచియుఁ, బది దిక్కులం ద్రిప్పి వైచియు, ముష్టిఘాతంబుల, మోకాటి పోటుల, మోఁచేతి కుమ్ముల, నఱచేతి పెట్టులఁ బెడచేతి దెబ్బలఁ జెంపకొట్టులఁ బాదఘాతంబులంగెడపి, యద్దానవ భామలం దెగటార్చుచుండె,

## -అర్జునుఁడు భీషణుం జంపుట-

అంత భీషణాసురుండు రథచక్ర ఘోషంబును, ధనుర్గుణారావంబును, దుందుభి ధణంధణాత్కారంబులు రోదసీ గహ్వరంబునం బ్రతిధ్వనులు సంపాదింప బిరుద కేతన ప్రభలు రవిమండలంబుఁ గబళింప, నమరేంద్ర నందనుం దాకుటయు, నుభయ బలంబులు రభసంబునఁ దారసంబయ్యె. అప్పుడు దానవేంద్రుం డింద్రనందను మీఁద నైదుశరంబు లేయుటయుఁ గిరీటి మూడు బాణంబులు నాటించె. అసుర యాఱుతోమరంబు లడరించుటయు, సురేంద్ర సూనుం డయిదు నారసంబులం గ్రుచ్చి, యొక్క యర్ధ చంద్ర బాణంబునఁ గోదండంబు ఖండించిన, దైతేయుండు వేఱొక కార్ముకంబు సజ్యంబు గావించిన, సవ్యసాచి దానిని గుణంబుతోఁ ద్రుంచె. రాత్రించరుండు చక్రంబుం బ్రయోగించిన, నరుండు నడుమనఁ దునుమాడె. ఒక తనూభవుండు ఖడ్గంబు

జడిపించిన, బకవైరి తమ్ముండు మొసలి వాకొలందికి ఖండించె. భీష ణుండు భీకరశక్తి వైచుటయు, ఫల్గునుండు దానిం బది తునియలు గావించె. రాక్షసేశ్వరుండు పర్వతంబై చనుదెంచిన, నరుండు వజ్రాస్త్రంబేసె. పుణ్యజనుండు మహారణ్యంబై క్రమ్మిన, వివ్వచ్ఛుండు చిచ్చుబాణంబేసె. క్రవ్యా దుండు నీల జీమూతంబగుటయు, భీమానుజుండు వాయవ్యాస్త్రంబేసె. మఱియు నసుర సింహ శార్దూల మృగ వృశ్చికాది రూపంబులం జనుదెంచిన, ధనంజ యుండు నయ్యోబాణంబులం జదిపె. అవ్వేళ నొక్క మునీంద్రుండు పార్థుకడకుం జేరి, బహువిధంబులగు కథాప్రసంగంబులు గార్యకలాపంబులుం బలుకుచు మోసంబుసేయఁ జూచిన, దానిని దానవమాయగాఁ దెలిసి విజయుండు గపట మౌనిం బరిమార్చె. అంతనప్పొలదిండి గదాదండంబు కేలంగైకొని కదియ వచ్చుటయుఁ, బాండు తనూభవుండు గల్పాగ్ని కీలాకల్పంబును, గనక పుంఖ విరాజితంబును, గంకపత్ర విచిత్రంబును నగు బాణంబొక్కటి యేర్పఱిచి, గాండీవంబు గుడుసువడం దిగిచి యేయుటయు, వజ్రాయుధంబున ఖండితంబైన శైల శృంగంబు కరణి దైత్యుని శిరంబు పుడమిం గూలె. అవ్విధంబున దనుజుని వధియించి, తత్పురంబునం గల సమస్త వస్తువులుఁ జేకొని యవ్వలం బోవునెడ, నయ్యశ్వంబు మణిపురంబు చాయలకుం జనియె.

అంతఁ బద్మరాగమణిమయాకారంబులైన, ప్రాకారంబులును, బాతాళంబు నంటిన యగడ్తలును, నమరావతీపురంబున కంతటం తటంగనుపట్టు గోపురంబు లును, నింద్ర సౌధంబైన వైజయంతంబుతోఁ బంతంబులాడు సౌధంబులును, నిజధర్మంబు దప్పని చాతుర్వర్ణ్య జనంబులును, శత్రుచమూ భయంకరంబు లగు చతురంగ బలబులును, వివిధ వస్తు సమ్మర్దంబులైన యంగడి వీధులును, బల్లవ కుసుమ ఫల భరితంబులైన యారామంబులును, నానావాద్యఘోషితంబు లైన దేవాలయంబులును గలిగి, యలకాపురంబు నదలించుచు, నమరావతి నెది రించుచు, నతులితైశ్వర్య ధుర్యంబును, నాశ్చర్యకరంబును, బభ్రువాహన భుజా పరిపాలితంబును నైన మణిపురంబు గనుపట్టిన, నింద్రుని ముద్దుపట్టి హంస ధ్వజునింజూచి, 'ముందఱి పట్టణం బెవ్వరిద ?' నుటయు, నతండు 'భవదీయ కుమారుండును, బాలభాను సమాన తేజుండును నగు బభ్రువాహనుండేలు పట్ట ణంబిది. వైరివీర నరహంకుల కంతంబులనియెడు కదళీకాండంబులకు ఖంప బనం ప్రసిద్ధిగాంచి, బలపరాక్రమ సంపన్నుడైన కుమారునికి మావంటి రాజులు

వేవురు, సహస్ర హాటక భరితంబులైన శకటంబును గానుకగానిచ్చి పొగడ వత్తురు. నీవు తండ్రివని, తాను కుమారుండనియు మేర దప్పక యితండూరకున్న లెస్స గాక, యెదిరించి తురంగంబు వట్టించెనేని యెటువంటి వారికేనియు నెదిరింప శక్యంబుగాదు. అని పలుకు నవసరంబున, సుబుద్ధియనం బరగిన బభ్రువాహ నుని సేనాపతి వేడుకగా సరాళంబుగా వచ్చిమగుడు నప్పుడత్తురంగంబుం గాంచి పట్టుకొని వచ్చె. అప్పుడు సామవేదమయంబైన బింబంబునం గనువట్టుచు నాదిత్యుండు పశ్చిమ సముద్రంబునం గ్రుంకె. పక్షు లంతరిక్షంబున వివిధ నాదం బులు సేయుచు గూండ్లంచేరం జనియె. తారకానికరంబు లింతంతటం దోంచె. దిగంతంబు లంతంతకుం గొంచెంబులయ్యె. చీంకటులు వేంకటులయిన కరణిం బెరిగె. ఇవ్విధంబున నర్కుండ స్తమించు సమయంబున సుబుద్ధిపురంబునకు వచ్చె. కెంపు గోడలు, మగఱాల నెలకట్లు, పగడాల కంబంబులు, దంతపుం దలుపులు, బంగారు సోపానంబులు, ముత్యాల చూరుమొగ్గలు, కుందనంపు బొమ్మలు, చీనాంబరబుల మేలుకట్లు, నగరుసాంబ్రాణి ధూపంబులు గలిగి, పెంపొందు కొలువు కూటంబున, మూర్ధాభిషిక్తులైన మండలాధీశ్వరులు కొలువు నకై సందడింప, రెండవ యాఖండలుండునుం బలె బభ్రువాహనుండు కనక రత్నమయంబులైన కరదీపికా సహస్రంబులు పగలు పత్తులు వియత్తలంబు పట్టపగలింటి కరణిం జేయ నిండోలగంబున నుండె.

ఆ సమయంబున బంగరు పల్లంబులు పక్కెరలు మోముట్టులు సింహపుం దలాటంబులు, చామరంబులు, కనకమయంబులైన కళ్లెంబులుం గలిగి, నశక సింధ్వారట్టకాంభోజాది హయంబులం దెప్పించి కనుగొనుచుండు నవసరంబున, సుబుద్ధి భూజానికి మ్రొక్కి యత్తురంగమ శ్రేష్ఠంబు కానుకగా నర్పించె. అవ్వి భుండు దానియాకార రేఖాలక్షణంబుల కాశ్చర్యంబు నొంది, సమీపంబునకుం దెప్పించి, మొగంబు నిమిరి, లలాటంబునం గనుపట్టు కనక పట్టికం దీసి, 'రాజాధి రాజ రాజపరమేశ్వరాష్ట దిగ్గాజ మనోభయంకర రాజమార్తాండుండైన యుధిష్ఠిరుచే విస్పష్టంబయ్యె. నిటలాక్షు నెక్కటి కయ్యంబున గెలిచిన కిరీటి యిత్తురంగంబున కంగ రక్షగాం జనుదెంచె, ధారుణి శూరులు గలరేని పట్టు దురుగాక!' అనియెడు బిరుదు గద్యంబు చదువుకొని, సుబుద్ధినింజూచి, సాద రంబుగా, 'మా పెద్ద తండ్రియను, సమానుష పరాక్రముండునైన యుధిష్ఠిరుండశ్వ మేధంబు సేయ దీక్షించి, విడువం జనుదెంచిన దీహయంబు. దీనికి మా తండ్రి

సహాయంబుగా వచ్చె. ముక్కంటి నొంటి పోట్లాటం గెలిచిన నెఱజోదు. ఇంద్రుని యర్ధాసనంబెక్కిన మహానుభావుండు. కాలకేయాది దానవులం గీటడం గించిన త్రైలోక్యమల్లుండు. చిత్రాంగదానాయకుండిచ్చటికి విజయంబు సేసె. ఇంక నా భాగ్యం బేమని వర్ణింతు! ప్రభాతకాలంబున మా తండ్రి సమ్ముఖం బునకుం బోవలయు. వలయు వస్తు వ్రాతంబులు సమాకూర్పుము'. అని యానతిచ్చి, మంత్రుల నిజ నివాసంబుల కనిచి, బభ్రువాహన మహీకాంతుం డంతిపురంబునకుం జనియె. అంతఁ బ్రభాతంబగుటయు, మణిపురాధీశ్వరుండు నిదురమేల్కాంచి, కాలకరణీయంబులు నిర్వర్తించి, మణిభూషణాంబరగంధ మాల్యాలంకృతుండై, సామంత మంత్రి పురోహిత దండ నాయకులు గొలువ, శుభ లక్షణ విరాజియైన తేజినెక్కి, కంచుకులు సాహోనినాదంబుల హెచ్చరికలు దెలుపఁ, బౌర పురంధ్రీ నివహంబులు గుసుమాక్షతలు సల్ల, వంది మాగధ వైతాళికులు పాఠకులు బిరుదు గద్యంబులు గైవారంబులు సేయ, శంఖ భేరీ మృదంగ డిరుద కాహళంబు లురియఁ, జతురంగ వాహినీ పరివృతుండై, మేరు శైలంబు కైలాసగిరియు, బెల్లగించితేని మాత్రంబెకాని, యంతకంటె తక్కువ కాని బంగరు వెండి రాసులును, మఱియు శైలంబు తేని దోషంబకాని, యంత కంటె గణనకుమించిన గంధసారంబులును, గంధమాదనగిరి తేలేదనినమాత్రంబె కాని, యంతకుఁ గడమ లేని కర్పూరంపు బెటికలును, దండ్రికిం గానుకలు దెచ్చె. మేలు మేలని సకల రాజులు కొనియాడ బభ్రువాహనుం డధ్వరాశ్వంబు గొనుచు వచ్చి, యెక్కిన గుఱ్ఱంబుడిగ్గి యవ్వమ్మ చెంతకుంజేరి, క్రొత్తముత్తియం బులు పాదంబులపయింబోసి, సాష్టాంగ దండ ప్రణామంబు సేసి, 'నిన్నుఁ దప్పిదంబుగా మావాఁడు హయంబుఁ బట్టి తెచ్చె; నీ యపరాధంబు సహింపుము. బిడ్డ లెంతనేరక నడిచినను దండ్రికి సహించుటుచితంబె కదా!' అని వేడియుఁ బాదంబుల పయింబడియె.

అంతఁ బాండవ మధ్యముండు గంగానదీ శాపంబు వలన విపరీతకాలంబ గుటంజేసి, బుద్ధి భ్రంశంబు నొంది, యాగ్రహంబుడుపలేక రత్నమయంబగు నతని కిరీటంబు పీడివడం దన్నుటయు,సందలి రాజులందఱును హాహాకారంబులు చేసిరి. అప్పుడు బభ్రువాహనుండు మొగంబున వికారంబు నొందక చేతులు గట్టుక యూరకున్న, సాత్యకి 'తనయునిం గృపఁజూడు' మనియె. కర్ణనందనుం 'డెంతకోపంబేమిటి' కనియె. నీలధ్వజుం'డింకనైన మన్నింపు' మనియె. ప్రద్యు

మ్మునం'డిదియేమిరిత్త గొడవ !' యనియె. కృతవర్మ 'యిది తగవుగా దపకీర్తి' యనియె. అనుసాళ్వుం 'డయుక్తం' బనియె. యౌవనాశ్వుం 'డీచందంబు నీవంటి వాని కర్హంబగా' దనియె. తక్కిన రాజులందఱు వేనవేలభంగుల విన్నవించిన; బార్థుండంతకంతకు నగ్గలంబగు కోపంబునఁ జుఱచుఱంజూచుచు, 'ఓరిపందా, ముందఱఁ బఱతెంచు గుఱ్ఱంబు పట్టికొని యాపిఱుంద నవచ్చు నీదళంబులం గనుంగొని, ప్రాణభీతిచేఁ గదనంబునకు బ్రాలుమాలి కాళ్లమీఁదంబడి యెదవు. నీవు నాకు జనియించుటకల్ల. చిత్రాంగదా వధూటికిం గోమటివానికి బుట్టినవాఁడవు, నాకెదురుగా నుండకపొమ్మ'నిన, నాకాచకొమరుండు పొక్కి పడుచు, 'నన్ను నేమన్న నేమి? ఏమి చేసినం గొఱంతలేదు. పరమ పతివ్రతా తిలకంబును, సీతాసమాన చారిత్రయు, నుభయకుల పవిత్రయునైన మా తల్లిని దూషించితివి గావున నేవినంజాల. నీవేమిచేతువు ? నావినయంబింతకుఁ దెచ్చె పెక్కుమాటలేమిటికి ? ఎక్కటి పోరునం జయించెదో, దళంబులు సహాయంబుగాఁ గొనిపోరెదో ? ఆయత్తము గమ్ము. లెమ్ము. నేను క్షత్రియ కుమారుండ నగుటయు, వైశ్య పుత్రుండ నగుటయుఁ జూచెదవు'.అని తెచ్చిన కానుకలు పురంబునకు మగుడననిచి, యశ్వంబు లాయంబునకుఁ గొనిపొమ్మని,మొగంబున గంటు పెట్టుకొని గిఱుక్కున మరలి, రెండు గడియల దూరంబవ్వలికిఁ జని, సుబుద్ధియను సేనాపతిఁ జూచి, 'సైన్యంబుల నొక్క ముఖంబుగా మోహరింపం జేయు' మనుటయు. సైన్యపతియుఁ, గనక కింకిణీ ఘంటికా కేతన పతాకాలంకృతంబులైన యేడుకోటుల రథంబులును, గీలుమదంబునం బొదలు భద్ర గజంబు లర్బుదంబులును, జటుల ధాటీ సిరాఘాటంబులును, మనోహరంబులు నైన తెల్లగుఱ్ఱంబులు రెండర్బుదంబులును. సమరకర్కశులు బాహుబల ధురీణులు నైన వీరభటులు మూఁడర్బుదంబులును, గ్రందుకొనఁ గాలచక్రాకారంబును, నాహవభయంకరంబును, నగు మోహరంబు సంఘటించె. అప్పుడు కపికేతనుని పాలికిం దోఁచు ధూమకేతుచందంబునను, నీలమణి దండ మడితంబైన మయూరధ్వజంబును, గనక మయ నిర్వక్రంబులైన చక్రంబును, తిరస్కృత వజ్రాయుధంబులైన యాయుధంబులును, మరకతమణి విభాంగంబులైన తురంగంబులును గలిగి, సఫలితమనోరథంబైన రథంబెక్కి, బభ్రువాహనుండు బాణ బాణాసన తూణీర కరవాల ఖేటక కవచ తనుత్రాణ శిరస్త్రా

ణంబులు మెఱయ, భద్రగజంబు మీఁదం గమకించు సింగంపుఁ గొదమ తెఱంగున నెదురుగా మోహరించి నిలిచె.

తదనంతరంబ యుభయ బలంబులొండొరులం దార్కొని, పూర్వ పశ్చిమ సముద్రంబుల తెఱంగున, నేనుంగు లేనుంగు, లశ్వంబు లశ్వంబులును, రథంబులు రథంబులును, గాల్బంట్లు గాల్బంట్లును, సేనాపతులు సేనా పతులును, దొరలు దొరలుగాఁ దలపడి నెత్తురుటేరులు, మాంసపర్వతంబులు, మేదోమస్తిష్క పంకంబులుం గలుగునట్లుగా ఖడ్గాఖడ్గి, దండాదండి, బాహాబాహి, కచాకచియుంగా బెనంగునెడ బభ్రువాహనుండు, తేరు కదియందోలించి, క్రీడినుద్దేశించి, 'తండ్రివిగావున వందనంబు సేసెద. నేనువచ్చినయెడ మేరమీఱిన మాటలాడితివి. నాపరాక్రమంబుఁజూడంగోరి యవ్విధంబునఁ బలికిన నేమి ? నీ తలపు నెఱవేర్చెద. ఇంక శంకింపంబనిలేదు. కార్ముకంబు గైకొనుము. నీవు గురుండవు గావున మున్నుగా బాణంబులు నాపై ప్రయోగింపుము'. అని పలుకు నవసరమ్మున ననుసాళ్వుం డక్కుమారు నెదిరించి, కార్ముకంబు గుడుసుపడం దిగిచి, తొమ్మిది యమ్ములు నిగుడించుటయు, నది సరకుఁగొనక, చిత్రాంగదా నందనుండు చిలుక తెక్కలు గీలు కొలిపిన వాలికల కోరి కోలలు నూఱు ప్రయోగించిన, వాఁడవి నడిత్రోవనే తునియలు గావించి, శత సహస్ర సంఖ్యాతంబులగు కంక పత్రంబులేసె. ఈ చందంబున సింహ విక్రములైన యయ్యిరువురు శిలీముఖంబుల మేనులఁ గ్రుచ్చుచుఁ బూచిన మోదుగుల తెఱంగునఁ దురంబు సేయు నవసరంబునఁ, బాండు పౌత్రుండు నాలుగు నారాచంబుల నశ్వంబులను, నయిదు ప్రదరంబుల సారథి శిరోధియు, నేడు వాఁడి తూపులఁ గార్ముకంబును, నెనిమిది విశిఖంబుల రథంబునుం దుత్తునియలు గావించిన ననుసాళ్వుండు, నూతన శతాంగారూఢుండును, సజ్జీకృత కార్ముకుండునునై, చండ కాండంబుల బాండుపౌత్రునిం దూలించుటయు నతండు రోషావేశంబున శస్త్ర వర్షంబులు గురిసి క్రమ్మఱ విరథునిం గావించిన, ననుసాళ్వుండు గద కరంబునం గైకొని యెదురుగా నడిచిన, దొమ్మిది చిలుకుటమ్ము లురంబున నాటించిన, నతండు రెమ్మవట్టి భూతలమ్మున వ్రాలె. అంతఁ బ్రద్యుమ్నుండు విద్యుల్లతా సంకాశంబైన బాణాసనంబు మండలాకారంబుగా దిగిచి, ప్రదర వర్షంబులు గురియుచు ననుసాళ్వునకుం బ్రాపై యెదిరించిన, బభ్రువాహనుండు బాహు విజృంభణంబున లక్షల కొలందులగు తీక్ష్ణ

బాణంబులు ప్రయోగించిన, శ్రీకృష్ణ కుమారుం డనంగుండను పేరు యథార్థంబుగా నావరింపంబడి యేదు వెఱంగిన చందంబునం గనపట్టి సమర వ్యాపారంబులు మఱచి, ముందువెనుక దోఁచక తిరుగుడు పడుచు నుండు సమయంబున బార్థ కుమారుండు చతురంగ బలంబులఁ గసి మసంగుటయు, ప్రద్యుమ్నుండు గొంతతడవునకుం దెలివిం జెంది, బభ్రువాహను దేహంబును దనయట్ల శరమయంబు గావించి, యతని సైన్యంబులోనం జొచ్చి, కఠోరంబులును, కాలదండోపమానంబులును, గనక పుంఖ పుంఖితంబులును నైన కాండంబు లకాండప్రళయ జలధరంబు గతిం గురిసిన, భ్రమగ్న పదాపళంబులును, బహుమావంతులును, గెడయు రౌతులును, దన్నుకొను గుఱ్ఱంబులును, నఱపడలైన యరదంబులును, జచ్చిన రథిక సారథులును, బొలిసిన వీర యోధులును, మఱుపులైన చక్ర గదా కుంత తోమర ముసల ముద్గర పట్టిసాది సాధనంబులును, జినిగిన మైమఱువులును, ఛిద్రంబులైన శిరస్త్రాణంబులును, వాడియైన చిందంబులును, గాలికింబోవు చామరంబులును, జూర్ణంబులైన భూషణంబులునుం గలిగి, మృత్యు విహారస్థానంబునుం బోలె రణాంగణంబు దుర్నిరీక్ష్యంబయ్యె. అప్పుడు శాకినీఢాకినీ భూతబేతాళ కూష్మాండ బ్రహ్మరాక్షస ప్రేత సంఘంబులు చొరబడి గజ కళేబరంబుల, హయ కంకాళంబుల, వీరభట శరీరంబుల, మంచదిగా నేర్పఱిచి, చర్మములం దిత్తులుగా నొలిచి, జాను ఘన పార్శ్వ కంఠాది స్థానంబులం గల పలంబు కపాల పాత్రంబుల వడ్డించి, పునుక గిన్నియలఁ గ్రొత్తనెత్తురులు నించి, చుట్టంబులుం దామును, బంతులు దీఱి యాకంఠ పూర్తిగా మెసవి, చిట్టెముకలు చప్పరించి, లోనున్న మెదడు పీల్చి, రక్త పూరంబులు గళంగళం గ్రోలి, తృప్తిఁజెంది యాడందొడంగె. అందొక్క ఢాకిని కిరీట కుండలాభిరామంబులైన రాజుల శిరంబులు పదియుఁ బదియునైదు మింట కెగుర వైచి యచ్చన గండ్లాడె. ఒక్క శాకిని యేనుఁగు దంతంబు బిఱబిఱఁ ద్రిప్పుచుఁ జౌపదంబుల నటింపం దొడంగె. వేఱొక్క ప్రేతంబేనుఁగు చర్మంబు ముసుంగు చెఱఁగుగా నిడి యభినయింపుచు దేశీయ నాట్యంబు సేసె. ఒక్క బేతాళుండు భుజంబుల మేని చట్టంబులు దగిలించికొని సరిచేసి యాటలాడం దొడంగె. భూతగణంబులు కరతాళంబులు ఘటియింపఁ బూతనాగ్రహంబులు కపాల కుండలంబులు వదల శల్యా హారంబులు పొదలఁ జకచక ఝుంకృతులతోఁ జిందులు ద్రొక్కం దొడంగె. ఒక్క భైరవుండు గండుమిగిలి దశదిశలు గగ్గోలుగా నార్చుచు దువాళింపం దొడంగె. ఇవ్విధంబున నతి

భయంకరంబగు రణాంగణంబున నవక్ర పరాక్రముండగు చక్రి కుమారుండు విజృంభించె.

అయ్యవసరంబున బభ్రువాహనుండు తెప్పిఱి, రుక్మిణీనందనునకు నడ్డంబుగా రథంబు దఱిమించి, లెక్కకు మిక్కుటంబులైన యుక్కుటలుగులు చెక్కుటయు, గూఁటిలో నొదిఁగిన గువ్వల చందంబునఁ గొంత తడవు రౌక్మిణేయుండు తన్నుం గప్పినయట్లు తీవ్రవిశిఖంబులఁ జిత్రాంగదాసుతునిం గప్పిన, నతండు గమకించి కృష్ణతనూభవు రథంబుఁబెక్కు శకలంబులుగా ఖండించిన, జనార్దన తనూజుండు వేఱొక్క రథం బధిరోహించిన నదియు ఖండించె. ఇవ్విధంబున నరగడియలో నిరువది యరదంబులు ద్రుంచిన, మీనకేతనుండు కపికేతన కుమారకుని కరలాఘవంబు గొనియాడుచు నతండెక్కిన రథంబు తునుకలు సేసినఁ, బాండ్యపతి వేఱొక్క రథంబెక్కె, నదియుం ద్రుంచిన మఱియొక్క స్యందనం బధిరోహించె. ఇత్తెఱంగున యాదవ కుమారుండు త్రుంచిన యరదంబులు లెక్కపెట్టం దరంబుగాదయ్యె. అంత నయ్యిరువురు దివ్యాస్త్ర యుద్ధంబుసేసి తనివి సనక, చక్రంబు, గదయుఁ, గత్తి, కేడెంబు, గండ్రగొడ్డలియుఁ, బ్రాసంబు, ముసలంబుచుం, యురవళ్ళు మీరు పరవళ్ళు మెఱయ, సాదన మెలకువలు చూపఱకు నయనానందంబు సేయఁ, ద్రాసునం దూచిన చందంబున నెక్కువ తక్కువలు లేక పెనంగుచు, మనోగతంబులైన క్రోధాగ్నిజ్వాలలు వెలికుఱికెనో యను తెఱంగున గాయమ్ములం గ్రమ్మ రుధిరమ్ములు కుంకుమ రసంబులకరణి నెమ్మేను నలంకరింపఁ, గోదండంబు లూఁదికొని, వింటికోటులం దమ మోములు చేర్చికొని, సొమ్మసిలియుండిరి. అపుడు బభ్రువాహనుండు గాండీవధ్వని చెవులం బడుటయు, మూర్ఛతప్పిరి శరశరాసనంబులు గైకొని, తొల్లి కుశుండు శ్రీరామచంద్రునితో నెదిరింపం గడంగిన చదంబున గాండీవితో భండనంబు సేయం జనుదెంచె.

## -కుశలవోపాఖ్యానము-

అనిన విని, జనమేజయుండు జైమినిం గనుంగొని, 'సీతాకుమారుండైన కుశునితో శ్రీరామచంద్రుం డేమిటికి యుద్ధంబు సేసె ?' ననిన, మునీంద్రుండు

నరేంద్రునింజూచి, దురితహరంబు శుభకరంబును, మనోరథప్రదంబును విఖ్యాతంబునైన కుశలవోపాఖ్యానంబు వినిపించెద. సావధాన చిత్తుండవై వినుమ(నెను).

శ్రీరామభద్రుండు తండ్రి పంపునఁ బదునాలుగు వత్సరంబు లరణ్యంబునం దపంబు గావించి, రావణ కుంభకర్ణ మేఘనాద ప్రముఖ రాక్షసుల సమయించి, తన ప్రవేశంబువలన ననలునిం బావనంబు జేసిన జానకీదేవిం జేపట్టి, సౌమిత్రి విభీషణ సుగ్రీవ జాంబవత్ప్రముఖులైన యోధవీరులు గొలువ, నయోధ్యానగరంబునకు వచ్చి, పురజనులెదుర్కొనఁ బుష్పకంబు డిగ్గి, వశిష్ఠ మహాముని కభివాదనం బొనర్చి, తల్లులకు మ్రొక్కి, తనకు వందనంబు సేసిన భరత శత్రుఘ్నులఁ గౌగిటంఁజేర్చి, సుమంత్రుండు మొదలగు మంత్రుల సంతాపంబు దీఱ వారి వారి నాదరించి, పతి వియోగ దుఃఖితయు, నిజ వియోగ క్లేశితయు, నైన కౌసల్య కడకుంజని దండ ప్రణామం బొనర్చుటయు, దనయునిఁ గౌగిటంజేర్చి, గద్గదస్వరంబున, 'అన్నా, రాఘవా, మున్ను వశిష్ఠాది మునులు నన్నుంజూచి నీ కుమారుం డక్షయ కుమారుండాద్యుండు, నప్రమేయుండు నచ్ఛేద్యుండు నభేద్యుండు నఖిల లోకాధీశ్వరుండునని పలుకరించిన దబ్బఱగా నెంచి యుండితి. ఇప్పుడు జలధిబంధనంబును, దశముఖ సంహారంబును జేసి, బ్రహ్మరుద్రాది దేవతా పూజితుండవై యేతెంచుట కతనఁ, దద్వాక్యంబులు నిజంబులని తోఁచె' నని పలుకు నంబ పలుకులకు శ్రీ రఘువీరుండు సంతసించుచుఁ, బురందర వైభవంబున నయోధ్య వేంచేసి పట్టాభిషిక్తుండై రాజ్యపరిపాలనంబు సేయుచుండె. (అప్పుడు) వృక్షంబులు సర్వకాలంబులందును గిసలయ కుసుమ ఫలభరితంబు లయ్యె. ధేనువులపారంబుగా క్షీరంబు లీయం దొడంగె. తన పతి దొరకుటవలన ధరణీతరుణి నిశ్చలత్వంబు నొందె. తస్కర భయంబులు సున్నయయ్యె. పుత్రశోకంబులు లేవయ్యె. వైధవ్యంబులు రావయ్యె. ప్రాణులు రోగంబు లెఱుంగరైరి. నెల మూడు వానలు గురియసాగె. ధాత్రీతలంబు దున్నకయె పండె. ధారణ పోఁకకుఁ బుట్టెనయ్యె. ఈతిబాధ లొక్కటి లేవయ్యె. ఇవ్విధంబున శ్రీరామచంద్రుండు గుణత్రయంబు తోడంగూడిన పరతత్త్వంబుచందంబున, ననుజత్రితయంబుతోఁ గూడ జలధి వలయవేల్లితంబైన జగతీతలంబు నేలుచు, సీతా సమేతంబుగా నిష్టోపభోగంబు లనుభవించుచుఁ, బదుమ్మిదివేల సంవత్సరంబులు ధాత్రి పాలనంబు సేసి, 'యపుత్రునకు లోకంబు లేమకదా'ఁ యని యూహించి, మనుజమాత్రుని

చందంబునఁ, బిత్రాణంబు దీఱు నుపాయంబు యోజనసేయుచుఁ బుత్రార్థియై, సంతాపంబునంగుందుచుండ, జానకి శ్రవణా నక్షత్ర చతుర్థ పాదంబునఁ జరమ లగ్నంబున నజనిం బట్టణంబు వెడలింపం జాలుముహూర్తంబునఁ బ్రథమ గర్భంబు దాల్చె. అంత నాలవ మాసంబునఁ గడపటి దినంబు ప్రభాతకాలంబున లక్ష్మణుండు సీతాదేవిం గొనిపోయి యడవిలో విడిచివచ్చునట్లుగాఁ గలగని, దిగ్గనలేచి, మనంబునం గలంగుచు, సంధ్యాదివిధులు నిర్వర్తించి, గురుండైన వశిష్ఠమహామునితో, నిశాచతుర్థయామంబునం గన్న కల తెఱంగెఱింగించిన, నమ్మునీంద్రుండు రఘూద్వహుంజూచి, 'భావికార్యంబు గాక మానదు. శీఘ్రం బుగా జనక పుత్రికి బుంసవనాది కర్మంబు లాచరించిఁ గర్భ సంరక్షణంబు సేయందగు. తమ్మునింబంపి సత్వరంబుగా -జనకుని రప్పింపుము. ఐదవ మాసంబునందు శుక్లపక్ష సప్తమీ దివసంబున నిరువురకుఁ జంద్రతారాబలంబులు పొసంగియున్నయవి. నాఁటికి ధనుర్లగ్నంబున సీమంత పుంసవనంబులు సేయం దగినయవి'. అని ముహూర్తనిర్ణయంబు సేసిన, రఘువీరుండు జనకునిం దోడ్కొని వచ్చుటకు సౌమిత్రిం బనిచి, వశిష్ఠ వామదేవాదులునిచిన లగ్నంబునఁ బంద్రెండు ఘడియల దూరము చౌకంబుగా నింద్రనీల (మణి) మయంబులును, వజ్రఖచితంబులును, వైడూర్య నిర్మితంబులును, దీప్తకాంచిన ఘటితంబులైన స్థంభంబులు నిలిపి, పెండ్లి చవికె వేయించె.

తదనంతరంబ జనక మహీపతియు యుధాజిత్తు మొదలయిన బంధువులు వచ్చుటంజేసి, సప్తమీ దినంబున వశిష్ఠ మహాముని వామదేవాదులతోడంగూడ నాజ్యతిలచరు హోమంబులు గావించి, సీతాదేవి కొప్పున ములుపంది ముండ్లతో సూత్రవేష్టంబువేసి, గోధుమ పూసలపేరు, పత్తికాయల పూసలపోరు, నాగ మోక్ష విధానంబున నా జగదంబ గళంబున నిలిపి, శంఖ భేరీ మృదంగ ఝల్లరీ మురజ గంభీర ధ్వనులు దిశామండలంబు నిండ, బ్రాహ్మణులకుఁ గనక రత్నాంబర గజ తురగాది దానంబులు గావించి, మహీసురులతోడంగూడ, బాంధవులం బంతులు తీర్చి, బంగరు పళ్లెరంబుల బహువిధాన్నంబులు భుజి యింపఁజేసి, భూసురాశీర్వాదంబులు గైకొని, మహోత్సవంబు సేయుటయు, జనక మహారాజు తన కోరిక నెరవేఱుటవలన నానందభరిత మానసుండై యమ్మహోత్సవంబు చూచి, తనయేలు రాజ్యంబునెల్ల నల్లునకొసంగి, విశ్వా మిత్రునితోఁ గూడఁ దపోవనంబునకుం జనియె. కాకుత్స్థుండు సర్వ సర్వం

సహోవలయంబు నేకాతపత్రంబుగా నేలుచున్నయెడ, నొక్కనాఁడేకాంతంబున జానకీకాంత కాంతునితో నిట్లనియె. 'వల్లభా! నా యుల్లంబున నొక్క కాంక్ష యున్నది. నీవు నెరవేర్పవలయు. గంగాతీరంబునం దపంబుసేయు తపసి యిల్లాండ్రతోడంగూడ వనంబుల విహరింపుచు నుండఁ గోరెద'. అనిన, రావణాంతకుండు గుండె జల్లన 'నీ యొప్పులకుప్ప యింత యొప్పని కోరిక గోరునే?' అని వగలం బొగులుచుఁ, 'దొల్లి పదునాల్గు సంవత్సరంబు లడవులలో నిడుమలుపడినదియుం జాలక యిప్పుడు నదియ కోరె. నేను దొలుతఁ గన్న దుస్స్వప్నంబను లతిక కిది ఫలంబయ్యె'నని నిశ్చయించి, 'కొమ్మా, యటుల కానిమ్ము. రేపటికి నిన్ను వనంబులకుం బనిచెద'నని యభ్యంతర మందిరంబున కయ్యింతి ననిచి యున్న సమయంబునఁ బ్రతీహారి యరుగుదెంచి, 'పౌర వృత్తాంతంబులు దెలుపుటకుఁ జారులు వచ్చియున్నా' రనిన, రఘువీరుండు వారలం బిలిపించిన నందఱు వందనంబులు సేసి, కేలుమోడ్చి వరుసగా నిలుచుటయు, 'నేఁటి కెవ్వియేని వింతలు గలవేని దెలుపుఁడు. నన్ను, నా తోఁబుట్టుగుల, జనకనందన నుద్దేశించి జను లేమనియెదరు? వెఱవక పలుకుం' డనినఁ, జారులు భయకంపితులయి, 'దేవా, తారక మంత్రంబునకు నీ వర్థము. పంచమహాపాతకంబు లనియెడు చీఁకట్లకు దేవర నామాక్షరంబులు చండభాను కిరణంబులు. త్రిలోకపావనుండవైన నిన్నుం దలంచిన యంతఁ బాపంబులె పుణ్యంబులగు. అట్టి దేవరతోడ దుష్టచిత్తులైన పౌరుల మాటలు పలుక నలికెదము. అయినను స్వామిమాఱలడుగుటంజేసి వినిన మాట దాఁపక తెలిపెదము. ఈ పురంబున నొక్క చాకిత మగండు తిరస్కారంబు సేసెనని యలిగి పుట్టినింటికిఁ బోయినం దాని తండ్రి, 'కూతురా, జనంబుల దేహంబులు సోఁకి మయిలవడిన కోకలు శుద్ధిసేసి, ధారణయోగ్యంబులు సేయునట్టి యుత్తమ కులంబునకు మయిలఁ గల్పించితివి. ఇంటి జగడం బింటిలోననే యడంపక యింత దూరంబు వచ్చుట తగవు కాదు.' అని కూఁతుం దోడ్కొని యల్లుని కడకు వచ్చిన, వాఁడు నెయ్యివోసిన యగ్ని చందంబున భగ్గున మండుచు, 'నిల్లు వెడలి నాలుగుదినంబులు వేఱొకచోటనుండి, మగుడ నా కడకు వచ్చిన పడంతి నేలుటకు రక్కసుండు గొనిపోయిన సీతం దెచ్చికొనిన రాఘవుండనుగాను.' అని యస్నేచుండు దుర్భాషలు వలికినఁ, జెవులు మూసికొని వాని మామ కొమరితం దోడ్కొని యింటికిం బోయె. మలినాంబరంబులకు నిరవగా మిగిలిన యెంగిలి

గంజి ద్రావుచుఁ బొట్టబోసుకొను నీచునియందు నిట్టి దుర్గుణంబులుగాని, మంచి మాట లేమిటికిం బొడము? ఐన నీ వృత్తాంతంబు దేవర కెఱింగింప వచ్చితి' మనిన, మను కులతిలకుండు మనంబు జల్లన, మేను ద్రిమ్మర్పడఁ, గొంత తడవుండి ధైర్యంబవలంబించి, చారులం బొమ్మని, యా రాత్రి నాలవ జాము బ్రహ్మకల్పంబు గడపిన కరణిం గడపె.

అనంతరంబ వేగుటయు, భరత లక్ష్మణ శత్రుఘ్నులు సత్వరంబుగా రామ భూమీశ్వరు సమ్ముఖంబునకు వచ్చి చింతాక్రాంతుడును, వివర్ణవదనుం డును, బాష్పాకులిత నేత్రుండునునై, రాహుగ్రస్తుండైన పూర్ణచంద్రుండునుం బోలె, కాంతివిరహితుండై యున్న యన్న నవలోకించినంత మాత్రంబున, ఖిన్నులై తత్పాదంబులకు మ్రొక్కి పలుక వెఱచి, మెల్లమెల్లన 'జగద్వల్లభా, దేవర పాదసేవయే సకల పురుషార్థంబునకుం శరణంబని యెంచునట్టి మాయెడం దయ చూడకుండుటకుఁ గారణంబేమి?' అనిన రఘువరుండు చారుల వాక్యం బులు పలుకరించి, 'దుష్టపురుషునిచే నిందితంబగు వేదంబు కరణి, క్షుద్రజను లచేఁ బరమసాధ్వియగు సీత నిందంజెందె. అశనిపాత సంకాశంబైన లోకాప వాదంబునం గలుగు భయంబు డెందంబు వ్రక్కలింపం దొడంగె. జన్మమరణ భయభీతుండగు యోగిపురుషుండు మాయనుంబోలె పరమసాధ్వియైన సీతను బరిత్యజించెద'. అనిన విని భరతుండు భయకంపిత స్వాంతుండై, 'అయ్యో, నీవంటి వివేకి యిట్లానతీయందగునె? కపిల ధేనువును సంపాదించి, యంటు వడెననుచు నడవిలో విడువనడుచువాడునుం గలడె? తొలుత లంకాపురంబున దశముఖుని సంహరించిన పిమ్మట ననలంబు లోనంజొచ్చి, బ్రహ్మపురందర బృందారక బృందంబులు వినుతింపఁ గందకుండ నున్న యిన్నారీమణింజూచి, యీ పతివ్రతాతిలకంబు తనకుం గోడలైన కతంబునఁ బుణ్యలోకంబులు గలిగె. కావునన్నం బుత్రశోకంబున మృతిం బొందిన వారలకు గతి కలుగ నేర్చునే? అని దేవ దానవ రాక్షస వానర వీరులు వినుచునుండ మన తండ్రియగు దశరథ మహారాజు కొనియాడినట్టి శుభ చరిత్రయు, నిక్ష్వాకుకుల పవిత్రయు, సౌజన్య పాత్రయునగు జనక పుత్రికను, ఘోర మృగ పక్షిగణాకీర్ణంబును, నిశాచర విహారస్థానంబైన కాననంబునఁ ద్యజించుట కంటెఁ బాపంబు లేదు. కావున నిట్లు చేయుట యనుచితం' బనిన లక్ష్మణుడు, రోషారుణ లోచనుండై 'లోకమాత యగు సీత నిట్లాడిన నరాధమునిం బరిమొండెంబులు సేయవలయుఁగాని,

యాయంబఁ బరిత్యజింప నగునే?' అనుటయు, శత్రుఘ్నుండును నట్లన పలికిన, రాఘవుండు భరతాదులం జూచి, 'జానకి లోకపావని యగుట నేనెఱుంగుదు, నైన లోకాపవాదంబు పుట్టిన యెడ నర్థంబునైన, ననుజులనైన, హితులనైన, దేహంబునైనం దృణంబుగాఁ ద్యజింతు ననిన యెడ నిది యేమి యెచ్చు? మన వంశ సంభవులును మానధనులునైన హరిశ్చంద్రాదులు తొల్లి కీర్తికొఱకుఁగా సర్వస్వంబునుం బరిత్యజించిరి. కీర్తిహీనులు జీవన్మృతులుగా నెఱుంగుఁడు. తొంటి రాజర్షులు తనువులైనం బరిత్యజించి కీర్తి సంపాదించిరి. అట్లగుట కతనఁ బావన చరిత్రయైన సీత నుజ్జగించి, కప్పసంబూడ్చిన సర్పంబు తెఱంగునఁ బ్రకాశించెద'. అనిన, రఘువీరుని తెగువ గనుంగొని భయంబున మాటాడ వెఱచి భరత శత్రుఘ్నులప్పటికిం దలంకి చనిరి.

తదనంతరంబ దుఃఖంబునం జిక్కిన యన్న యొద్ద లక్ష్మణుండొక్కరుండనిలిచె. అప్పుడు కాకుత్స్థుండు లక్ష్మణుని జేరంబిలిచి, 'సీతను గంగా తీరంబున నడవిలో విడిచి రమ్ము. కాదేని యీ ఖడ్గంబుచే నా శిరంబుఁ దెగ వ్రేయుము. జానకిం గానలో విడిచిన పాతకంబు నాకుంగాని నీకుం బనిలేదు'. అనిన విని భుజంగంబు కరణి నిట్టూర్పులు నిగిడించుచు, గమనోన్ముఖుండై యన్నకు మ్రొక్కి, యరదంబు నెక్కి, యనేకంబులైన యపశకునంబులు గనుచు, సీతాంగన యుండు నంతఃపురంబునకుం జనుదెంచి, యయ్యంబ పాదారవిందంబులకుం బ్రణమిల్లి, 'తల్లీ, నీ వల్లభుండు నీ కోర్కె చెల్లింపం దలంచె; విచ్చేయు' మనుటయు, నాయమ్మ తానొక్కసారి వేడినఁ, జనవిచ్చి పంపె. పెనిమిటికిం దనమీఁద నెంతఁ బ్రేమయోయని సంతసించుచు, శ్రీరాముని పాదుకలు మున్నుగాఁ గైకొని, రత్నభూషణంబులును, రజత కనకంబులు, నంబరంబులు, సుగంధంబులు, నానావిధంబులగు భక్ష్యంబులు హవణించి, రథంబు మీఁద నునిచి, యత్తలకు మ్రొక్కి, కౌసల్యతో నిట్లనియె: 'నాదు కోరికి సమకూర్చుటకు సుమిత్రాసూనునిం గూడఁ బయనమ్ము సేసి, గంగాతీర వాసినులయిన సువాసినులం జూచిరమ్మని మీకుమారుండు పనిచె' ననినఁ, గోసల రాజతనూజ భూమిజం జూచి, 'అమ్మా, కోమలాంగివి. ఘోర వనంబుల కెట్లు చనియెదవు? ఎండచే నెమ్మొగంబు గందు. తనులత వాఁడు. ఇదేమి కోరిక? మానుము'. అనుటయు, 'సమస్త భయ నివారకుండయిన శ్రీ రఘు వీరుండు నా మనంబున నుండుట కతన వంత రవంతయును రాదు. మీ కరుణ

కలిగియుండ నశుభంబు లేశంబును లేదు. మనసు కొదవపలు మాని నన్నుం బంపు' మనుటయు, నయ్యమ్మ యేమియు ననక యూరకుండినఁ దక్కిన వారల వీడ్కొని యవ్వేలంది యుత్తరీయంబుఁ జక్కఁజెక్కి, పచ్చని గుఱ్ఱంబులు పూన్చిన రథంబు నెక్కి కదలుటయు, సుమిత్రాసూనుండు గద్గద స్వరంబుతో సారథిం జూచి (యిట్లనియె:)

## -లక్ష్మణుఁడు సీతాదేవిని వనంబునకుఁ గొనిపోవుట-

'అశ్వంబులు కన్నీరు నించి తలలు వంచుచున్నయవి. ఇదియేమి ?' యనుటయు, 'దేవా, నేనశ్వహృదయంబు చక్కఁగా నెఱుంగుదును. సమరంబుల యందు నిరాఘాటంబుగా సంచరించు నీఘోటకంబులిట్లుండుటచే నెద్దియేని యొక దుర్దశ రాఁగలదని తోఁచుచున్నది. అయినను నా నేర్పుజూడు' మని గుఱ్ఱంబుల గందంబులు దట్టి ధే యనివాగె సడలించిన, వాయు వేగంబున నరదంబు పోవునెడ వాయసంబును, జాల భరద్వాజంబును, గరుడుండును గగనంబునం గనుపట్టె. కుందేలు, నక్క మొదలగు మృగంబులు రథంబునకు నడ్డంబుగాఁ బఱవం దొడంగె, నయ్యమ్మకు దక్షిణ నేత్రంబదరె. అప్పుడు సీతాదేవి రామానుజునిం గనుంగొని, 'బెట్టుగా దుర్నిమిత్తంబులు దోఁచుచున్నయవి. చేవెట్టి కలంచిన గతి నా యుల్లంబు దురపిల్లుచున్నయది. కరుణా సముద్రుండును, శౌర్య, సముదీర్ణుండును నగు శ్రీరామ భద్రునకు శుభంబు గలుగుం గాక. ఏ వీరుండు ఖరదూషణాది రాక్షసులం బదునాల్గు వేల నొక ముహూర్తంబున నుక్కడంచె, నేమేటి యెలయించుకొని పోవు మారీచ మస్తకంబు ఖండించె, నే మహానుభావుండు గొండలు పఱపించి సముద్రంబున సేతువు గట్టించె, నే జగజట్టి రావణ కుంభకర్ణాదుల వధియించి లోకత్రయంబున సౌఖ్యంబు సంపాదించె, నే దయానిధి విభీషణునకు శాశ్వతంబునగా లంకా సామ్రాజ్యం బొసంగె, శరణాగత సంరక్షణ వ్రతుండును, రాజేంద్రుండును, ననంత కల్యాణ గుణసాంద్రుండునైన యా శ్రీరామ చంద్రుం డయోధ్యా నగరంబు నేలుచు, నాచంద్ర తారకంబుగా సుఖంబున నుండుగాక!' అని పలుకుచుఁ గొంత దవ్వు చని జానకీదేవి, యుభయ తీరంబులం బొడమిన తరులతా నికరంబుల పుష్పవాసనలం బరిమి, శితంబులును, బూర్వ సముద్ర పరిచుంబితంబులునునై, సప్త శత ప్రవాహ ముఖంబులం గనుపట్టుచుఁ జక్ర

వాక పక్ష మారుత సంచరద్వీచీ కలాపయైన దివ్యాపగం గనుంగొని, పకుళ తిలక సహకార నమేరు ప్రియక మేదురంబైనతటంబున,జనక తనూజయు, సుమిత్రా సుతుండును రథంబు డిగ్గి, కువలయ మనోహరంబును, సత్కావి సేవితంబును, సుధా ప్రకాశంబునై, రాఘవుని కీర్తిం బోలుచున్న గంగం గనుంగొని, సంత సంబునం గొనియాడుచు, నావికుండు దెచ్చిన యోడ నెక్కి, యవ్వలి గట్టునకుం బోయి, స్నానంబులు సేసి, ధౌత పరిధానంబులు ధరియించి పాదచారంబునఁ జీమలకుం దూఱఁగూడని కాఱడని తెరువుఁబట్టి, యకుంఠితంబులైన కంఠీరవ కఠోర ఘోషంబులం ఘూర్ణిల్లు మదగజంబులు, జంబుకంబులు, వృకంబులు, వాలుమెకంబులు మొదలగు మెకంబుల భయంకర ఘోషంబులును, నడవి యీఁగల ఝుంకృతులును, నిలకోళ్ల జీంకృతులును, వన మహిషంబుల ఖాంకృతులునుం జెవులు వ్రక్కలు సేయ, భీకరంబైన యక్కాననంబు నవ లోకించి భూపుత్రి సుమిత్రా పుత్రునితో నిట్లను. 'జీర్ణంబులు, నీరసంబులు, ఛాయ వర్జితంబులు నైన వృక్ష షండంబులచేఁ బ్రవేశింపం గూడని యరణ్యంబు గను పట్టుచున్నయది. కాని, పావనంబులైన తపోవనంబులు గానరావు. వికటంబులు, దీక్ష్ణ కంటంబులు నైన బలుసు, తుమ్మ, చంద్ర, వెఱుతురు, కొరింద మొదలగు పొదలు గనుపట్టుచున్నవి. కాని, పుణ్యా పేటికలైన యతి వర మఠవాటికలు గానరావు. కాఱుచిచ్చు వలనంబెచ్చుపెరిఁగిన పొగలెగయు చున్నయవి. కాని, హోమ ధూమంబులు గానరావు. సివంగులు చిఱుత పులులుం గనుపడుచున్నయవి కాని, ముని బాలకులు గానరారు. పాషాణ కర్కశంబు లైన కాపథంబులు గనుపెట్టుచున్నయవి, కాని నడయాడు మార్గంబు గానరాదు. దశరథరాజ నందను నెడఁబాయ నోర్చిన ననుబోటి పాప కర్మురాలికి మంచిది యేల కానవచ్చు?' నని సంతాపంబు నొందు సీతాసతి నవలోకించి సౌమిత్రి మొగంబు వాంచి, బాష్ప పూరంబులు రాల్చుచు, 'దల్లీ, లోకాపవాద నిమిత్తంబుగా నిన్నుఁ గాంతారంబు నొందించి రమ్మని రాఘవుండు కృపా విహీనుండ నగు నన్నుం బనిచె,' నని యొడి తీవ్ర భాషణంబు లశనిపాతంబు రీతిఁ గర్ణ రంధ్రంబుల సోకుటయు, సురగాలి చేత వ్రాలిన కుసుమ వల్లియుం బోలె మూర్ఛఁ జెంది పుడమింబడి, యొడలెఱుంగక యున్న జనక పుత్రిం జూచి, సౌమిత్రి పటాంచలంబున విసరి, యుపచారంబులు సేయఁ, దెలివి నొందక యుండుటయుఁ, 'ద్రికరణంబుగ శ్రీరామచంద్రుని చరణాక

విందంబుల యందు నిజభక్తి గలవాఁడ నేని, జనకజనందన బ్రతుకుం గాక' యని ప్రతిన సేయుటయుఁ గన్నులు తెఱచి యా యన్నులమిన్న యన్నువ పక్షియుంబలె విలపించుచు (నిట్లనియె)

## —లక్ష్మణునియొద్ద సీత దుఃఖించుట—

'అన్నా. నీ యన్నయు నీవును బదునాలుగేండ్లరణ్యంబునఁ గాపాడితిరి. ఇప్పుడిట్లు నట్టడవిలో దిగవిడువం దగునే ? మఱఁదులలో నీవు నాయెడ భక్తి విశ్వాసములు గలవాఁడవు. తొల్లి దండకవనంబున నేఁ దెమ్మనిన పువ్వులు దెచ్చియిచ్చి, తనూభవుని కైవడిం గాపాడిన దయాపరుండవగు నీవిట్టి నిర్దయత్వంబున కొడిగట్టితివే ! అపకీర్తికి వెఱవని సుగ్రీవునకు, విభీషణునకు నిట్టి చెయిదంబులు సెల్లుంగాని, నీకుం జెల్లునే? తండ్రీ, యేమనఁగలదాన ? నా పాప కర్మంబు నాకు వనవాసంబునం గోరికగా బరిణమించెఁ, గాకున్న నెల్ల కార్యంబులు పరామర్శించి చేయు నీ యన్న నిష్కారణంబుగా నన్నుఁ గాఱడవిలో విడిచి రమ్మనునె ? మున్ను నా నిమిత్తంబుగాఁ గొండవిల్కాని కోదండంబు బెండువలె విరిచివైచె. నాకొఱకు మారీచమృగంబు మస్తకంబు ఖండించె. నన్నుఁ దెచ్చుటకై పాథోనిధిం గపులచే బంధింపించి సేనల దాఁటించె. నన్నుం జెందుటకై పదిమొగంబుల రక్కసుని శిరంబులు ఖండించె. అట్టి గుణాభిరాముండును, దయారసధాముండునైన శ్రీరామచంద్రుండు, కాకులు దూఱని కాఱడవి నన్ను విడిచి రమ్మనియెనే? ఇది నా నోము ఫలంబుగాని నీవేమి చేయుదువు ? మీ యన్న యానతి సేసితివి. మీ ప్రతిన నెఱవేరె. వేగంబ సాకేతనగరంబునకుఁ బొమ్ము'. అని జనకనందిని సుమిత్రానందనుం గనుంగొని, 'తమ్ముఁడా, వశిష్ఠ విశ్వామిత్రులు జనక దశరథులుం జూచుచునుండ నాఁడు వివాహ సమయంబునఁ జిప్ప కూఁకటి యొప్పమీఱుచు, రత్నఖచితంబులైన కర్ణభూషణంబులం బొలుపొందుచుఁ, దెలిదమ్మి రేకులం దెగడు కనుఁగవయు, బింబాధరంబును, మందహాసంబునం జెలువొందఁ బూర్ణేందు సన్నిభంబైన రాఘదేవుని ముఖాంబుజంబు ధ్యానంబు సేయుచునుండం గలదాన. నన్నెడఁ బాసిన విరహవేదన సైరింపంజాలక రాఘవుండే తీవియలం గౌఁగిలించుకొని యెనో యయ్యడవి తీఁగలలో నన్నుం ద్రోసిరమ్మనె. నా దురదృష్టంబు నేమందు ? అత్తలకెల్లం గేలుమోడ్చితి ననుము. పూర్ణగర్భయు, నిరపరాథయు

నైన జానకిని నిష్కారణంబుగా నట్టడవిలో విడిచి వచ్చితి ననుము. వత్సా, నీకు మేలగుఁగాక! భరత శత్రుఘ్నుల నడిగితి ననుము'. అని పలవించు భూమినందనం గనుంగొని లక్ష్మణుండు, 'సాధ్వీశిరోమణీ, దైవయోగం బిట్టు లుండె. ఏల వగచెదవు? అల్లవే తాపసాశ్రమంబులు గనిపించుచున్నయవి. భాగీరథియు, భూమిదేవియు, వన దేవతలు నిన్ను రక్షింపుదురుగాక! నీ యోర్పును, నీ పాతివ్రత్యంబును నిన్నుఁ గాపాడు'నని యూఱడం బలికి, కన్నీరు ఱెప్పల నప్పళించుచుఁ, బ్రదక్షిణంబు సేసి, లక్ష్మణుం డలంఘనీయంబైన రాఘవుని శాసనంబులకుం దలంకుచుఁ, దిరిగితిరిగి చూచుచుఁ, బశుబాలకుండు దోలుకొనిపోవ నంబారవంబు సేయుచు వత్సంబు విడువ నోపని ధేనువు తెఱంగునఁ బలవరించుచు, జనకరాజనందన చూచుచుండ, హుటాహుటి రథంబుఁ దోలుకొని రామానుజుండు దవ్వుగానరిగి యదృష్టిగోచరుండగుచు నయోధ్యకుం జనియె.

(ఇచట) ధరణిపుత్రియు నరణ్యరోదనంబు సేయుచు, మూర్ఛనొంది పుడమిపైఁ బ్రాలినం బక్షులు రెక్కలచే నీడ గల్పించుచు నంబరంబునం దిరిగె. చమరీ మృగంబులు వాలంబుల నల్లనల్లన విసరె. సింహ శరభ శార్దూలాదులు చుట్టునుం బరివేష్టించి కాపాడుచునుండె. మదపుటేనుంగులు కరశీకరంబులచే జలధూమ్రంబులు నించె. భానుండు కిరణంబుల వేడిమి సోకకుండ వెన్నెల కరణి నెండగాసె. వాయుదేవుండు శైత్యమాంద్య సౌరభంబులతో మెల్లమెల్లన విసరుచు సేదదీర్చె.

## -వాల్మీకి సీతను తన యాశ్రమంబునకుఁ గొనిపోవుట-

అయ్యవసరంబున వేదవేదాంగ కోవిదుండును, దత్త్వవిశారదుండునునైన వాల్మీకి నిఖిల విద్యారహస్యంబులు దెలిసిన శిష్యులు పెక్కండ్రు పరివేష్టింప, యాగార్థంబుగా సమిధలును, యూపంబులును, దర్భలు, గుసుమంబులుఁ గంద మూలంబులు సంపాదించుటకై యయ్యడవికిం జనుదెంచి, యప్పరమపావనిం గనుంగొని 'అమ్మా, నీ వెవ్వతెవు? ఏకతంబున నేకతంబ యిప్పవనంబున శోకించెదవు?' అను నమ్మునీ యాదరణవాక్యంబులకు వేసవియెడం గొట్టువడిన మయూరి మేఘగర్జితంబునకుం బలె, నాహ్లాదంబునొంది, వీడియున్న ధమ్మిల్లంబు

చక్కనొత్తి గద్గదస్వరంబున 'అయ్యా, యేను మిథిలాపతి పుత్రికను. నా వల్లభుండు శ్రీరాముండు. లోకాపవాద భయంబునఁ గల్లనిజంబులు విచారింపక కానలకు వెడలనడిచె. ప్రాణంబులు త్యజింపఁజూచిన భ్రూణహత్యా దోషంబు వచ్చుచున్నయది. కావున సాహసంబు సేయనెంచిన దానంగాను. ఏను జేసిన పురాకృతకర్మంబున నిటువంటి దుర్దశ ప్రాప్తంబయ్యె. నిన్నుం జూచిన మజ్జనకుం బోలెనున్నది. నన్ను రక్షింపు' మని చరణంబులపయి వ్రాలిన, వాల్మీకి దయాకులిత మానసుండై, 'సాధ్వీ, శోకింపకుము. మీ తండ్రియగు జనకునకు నేను సఖుండ. నీవు శీఘ్రంబ బలపరాక్రమ సంపన్నులు, నుత్తమ చరితులు నైన పుత్త్రుల నిరువురం గనియెదవు. గర్భశోభంబుగాఁ దెగువసేయం దలంతురే?' అని యోదార్చి జానకిం దోడ్కొని యాశ్రమంబునకుం జనియె.

## -కుశలవుల జన్మ వృత్తాంతము-

తదనంతరంబ యా వాల్మీకి మునీంద్రుఁడు మునిభామల రావించి, యా సతీమణి గర్భంబునకు హానిరాకుండం గాపాడుండని యాజ్ఞాపించిన, వారలు జానకినిఁ బర్ణశాలలోనికిం దోడ్కొనిపోయి, నివాతస్థలంబున దర్భలపయిం బఱచిన కృష్ణాజినంబుపై నునిచి, పాదపద్మంబులఁ గాడిన ముండ్లు మెల్లనఁ దివిచి, వెచ్చని కరంబులఁ బాదంబులం గాఁచి, కొంచెంబుగాఁ గాచనూనె పంకించి, తల చిక్కువాపి ముడిచి, చెక్కుటద్దంబుల గాఱు కన్నీరు పయ్యెద చెఱంగుతోనొత్తి, మొగంబు పుడికి, పుడమిపయిం బొరలాడిన కతంబున దుమ్మొయైన వలువ పరిహరించి, పలుచని నారచీరలు గట్టి, కందమూలంబులు, నడవికూరలు లఘుతరంబుగా నారగింపంజేసి, పూఁటపూఁటకు నుపచారంబు లొనర్చుచుఁ, బోషింప ననుదినంబును బుణ్యకథా ప్రసంగంబులఁ బ్రొద్దులు గడపఁ, దొమ్మిది నెలలతిక్రమించుటయు, సౌమ్యగృహంబులైదు సూర్యునిం గూడక యుచ్చకేంద్ర స్థానంబుల వెలుంగుచున్న శుభలగ్నంబున జనకపుత్రిక యిరువురు కొమరులం గనియె. అప్పుడు దిక్కులు ప్రసన్నంబులయ్యె. పుష్ప వృష్టి గురిసె. అగ్ని ప్రదక్షిణార్చులం గనుపట్టె. పరిమళ మారుతంబులు వీచె. దివ్యదుందుభులు మొరసె. అప్పుడు తాపసాంగన లవ్వృత్తాంతం బెఱింగింప పఱువులం బనుచుటయు, వారు 'లక్క యమడ బిడ్డలం గనియె' నని చెప్పిన,

వేగంబవచ్చి సీతాసుతులం జూచి, సంతసంబున నుప్పొంగి, సూర్యవైశ్వానర తేజస్కులైన కవలకుఁ గుశలవంబులచే సభిమంత్రించి, రక్షయొనర్చి జాత కర్మంబు నిర్వర్తించి, కుశలవులను నామకరణంబుసేసి పెనిచిన, వారలును ననుదిన ప్రవర్ధమానులై పెరిగి, కరికలభంబుల భంగి నొప్పుటయు, వాచంయమ శ్రేష్ఠుండైన వాల్మీకి చౌలంబు సేసి, యుపనయనమ్ము గావించి, యమ్మహోత్స వంబునకుఁ గామధేనువుం దలంచుటయుఁ, దోడనె వచ్చి జీరకట్టి సన్నబియ్యంపు టన్నంపు రాసులు, నౌలువుఁ బప్పులతిప్పలు, నేతిదొరువులు, పిండివంటల కొండలు, కూరల రాసులు, పానకాల కాలువలు, పనస రసాల కదళీ ఖర్జూరాది ఫలసమూహంబులును నిర్మించిన, బంగరు పళ్లెరంబుల నునిచి, బంతులు సాగించి, మునిసతులు వడ్డింప, షడ్రసోపేతంబుగా నారగించి, మునీంద్రు లాశీర్వాదంబులు గావించి, కర్పూర తాంబూలంబులు బహుమానంబులు గైకొనిపోవుటయు, సూర్యచంద్రులుంబోలెఁ దేజోవిరాజితులై, యక్కుమారులు నాలుగు వేదం బులు, షడంగంబులు, నానాపురాణంబులు, నాగమంబులు నధికరింపఁజేసి, ధనుర్వేదంబు సాంగంబుగా నేర్పి, దివ్యాస్త్రసంధానంబు నాకర్షణంబు. నుప సంహారంబును, లాఘవలక్ష్యశుద్ధిం జిత్రత్వ దృఢత్వంబులును దెలియఁజేసి, సంగీతశాస్త్రంబు సమర్మంబుగాఁ దెలిపి, శ్రీమద్రామాయణం బుపదేశించుటయు, నేకసంథాగ్రహణంబున గ్రహియించి కుశలవులు వీణయు, దాళంబునుం గైకొని నానారాగంబుల స్వరమైత్రియు, విన్యాస విశేషంబులు, నారోహావరోహణక్రమం బులు, లయకాలంబునుం దెలిసి వీనులవిందుగా నమృతంపు సోనలు గురియ, నెండిన మ్రానులు చిగురింప, జాళ్ళు కరగంగ, రామాయణంబు గానంబు సేయుచు, మునికుమారులతో నడవికిం జని, కందమూల ఫలంబులు, తేనియలు, కుసు మంబులు, మధురోదకంబులు దెచ్చి యొసంగఁ, కొడుకులంజూచి శోకంబుమాని సీతాంగన యాశ్రమంబున సుఖంబుండె.

## -శ్రీరాముఁడశ్వమేధముచేయ హయంబును విడుచుట-

తదనంతరంబ, శ్రీరామచంద్రుఁడయోధ్యానగరంబున రాజ్యపరిపాలనంబు సేయుచు, బ్రహ్మకు నాలవ మనుమడైన రావణునిం జంపుటవలననైన బ్రహ్మ హత్యా దోషంబు నివారింపం దలంచి, హయమేధంబు సేయ తలంపున, ననుజ పురోహిత మిత్రామాత్య సామంత రాజులు గొలువ సింహాసనంబున నాసీనుండై,

వశిష్ఠ వామదేవ గాలవ గాధేయాదులం జూచి, 'యశ్వమేధంబువలన బ్రహ్మహత్యా దోషంబు తొలంగునను శ్రుతివచనంబు వినంబడుచున్నయది. ఆ యాగంబు సేయు విధానంబు సవిస్తరంబుగా నెఱింగింపు'డనిన, వశిష్ఠుండు 'నరేంద్రా, అశ్వమేధంబు సేయుట బహుప్రయాసంబు. గోక్షీరవర్ణంబైన శరీరంబును, కుంకుమంబునుంబలెఁ గెంపుఁ జాయ గులుకు కంఠంబును, గనక వర్ణంబైన వాలంబును, నల్లని చెవియునుంగల యశ్వంబును, శౌర్యనిధులైన యోధులం గూర్చి, యథేచ్ఛముగా విహరింప విడువవలయును. విద్యా తపో ధనులైన ఋత్విజులు గావలయు. వారలకు నొక్కొక్కనికి యొక్క గజంబు, నొక్క యరదంబు, నలుగురు కాలుబంట్లు,నూఱు గుఱ్ఱంబులు,నన్ని ధేనువులు, వేయి బారువుల ధనంబు, నలుతుము ముత్యాలును దక్షిణలుగా నొసంగం దగు. భార్య లేని వారలకు యాగంబున నధికారంబు లేదు. పత్నీసమేతంబుగా దీక్షించి, యసిధారావ్రతంబుగా హయమేధంబు నెఱవేర్పవలయు'. అనిన, నినకుల తిలకుండు బంగారుచే సీతా రూపంబు గావించి, మునుల యనుమతి గైకొని, యీ చెప్పిన లక్షణంబులుగల హయంబును దనలాయంబున వెదకి తెప్పించి, విహిత దక్షిణ లొసంగి, వేవురు ఋత్విజులం గూర్చి, జాతరూప సీతాసమేతుండై దీక్ష వహించి, చామర రత్నకింకిణీ చిత్రమాల్య పరిధాన గంధ కస్తూరికాద్యనులేపన పూజితంబైన వాజినిటలంబున, 'మిత్రకులాగ్రణియు, దివిజస్తుత్య పరాక్రముండును, వీరమాతయగు కౌసల్యాదేవికిం బుత్రుండునైన రఘువీరుండు విడిచిన యాగీ తురంగంబు నుర్వీతలంబులో శౌర్య సాహస సహానులైన రాజకుమారులు గలరేని పట్టి కట్టుం' డని లిఖించిన కాంచన పట్టంబు గట్టి, వాద్య ఘోషంబులతోఁ బ్రదక్షిణంబు సేసి, మ్రొక్కు సమయంబున, నిత్య శత్రుఘ్నుండైన శత్రుఘ్నుం డక్షౌహిణీ త్రయంబుతో వచ్చి యన్నకు మ్రొక్కిన, దీవించి, కౌగిటం గదియించి, 'హయ సంరక్షణంబు సేయుము. అష్టదిక్పాలకులు, హరిహరబ్రహ్మాదులు విరోధించిరేనియు నిరోధించి జయంబు సేకొను'మని పంపుటయుఁ, గ్రతుఘోటంబు నిరాఘాటంబుగా నిఖిల దేశంబులు దాఁటి పోవునెడఁ గొందఱు నరేంద్రు లెదురొచ్చి తదీయ ఫాలస్థితంబైన పత్రికం జూచి, చేతులు మొగిడ్చి కొలిచిరా నయ్యశ్వంబు వాల్మీక్యాశ్రమ సమీప కాననంబునం బ్రవేశించె.

## -యాగీ యాశ్వమునకై లవశత్రుఘ్నులు పోరాడుట-

ఆ సమయంబున వల్మీక భవుండు వరుణపురంబున యాగంబు సేయుటకై చనియుండె. అపుడు వేల్పుటేటి తటంబున శ్యామలంబులు కోమలంబులునైన దూర్వాదళంబులు మేయుచు దర్శనీయంబైన యాగహయంబు సంచరింపం జూచిన బ్రహ్మచారులును, సజ్జీకృతకార్ముకుండై యయ్యాశ్రమ కాననంబు రేపగలు రక్షించుచుండు లవునకుం జూపుటయు, నతండును దాని నిటలంబునం గట్టిన హేమ పట్టికను లిఖించిన బిరుదాక్షరంబులు చదివికొని, 'బళి బళీ! రాఘవునిం గన్నతల్లి కౌసల్య వీరమాతయంట. కుశలవులం గన్న సీతాంగన గొడ్డుపోయెం గాంబోలు' నని, పకపక నవ్వి, యత్తురంగంబుపయిం దన యుత్తరీయంబు వైచి యీడ్చితెచ్చి, యాశ్రమ సమీపంబున నున్న కదళీ తరువునం గట్టి వేయుటయు, విప్రకుమారు లతనిం జూచి 'నిరర్థక వైరంబు లేమిటికి? దీని వెంబడి సైన్యంబు లల్లవె కనుంగొనుము.' నావుడు సీతా తనయుండు ముని తనయులం జూచి, 'మీకు రాజధర్మంబు తెలియదు. అని మొనం గినిసి పగఱం బరిమార్చుటయొండె. లేకయున్న సమరహతుండనై కైవల్యంబు గాంచుట యొండె, గాక వేఱె కలదా?' అని పలుకునంతలో నశ్వ రక్షకులైన భటవీరులు కొందఱు వేగంబ పఱతెంచి, 'యెవ్వండురా, ఘోటకంబునుం బట్టిన దుండగీం' డనిన, విని సీతా కుమారుండు 'యజ్ఞతురంగంబును బట్టినవాండు లవుండు. ఏమిటికి రిత్తనొాచ్చెదరు? పొండు పొండ'నిన నవ్వి యవ్వీరులు, 'బాలకా, పొమ్ము పొమ్మ'ని యనాదరణంబుగా సైంధవ మోక్షణంబు సేయ, లవుం 'డుండుండ'నుచు, వారల కరంబులు, శరంబులం దునియనేసిన, నబ్బలంబులు మెరయ, ముద్గర చక్ర తోమరంబులు ప్రయోగించిన, నతండు గోదావరిలోం గ్రుంకిన జనుండు పాపంబుల రూపణంచు చందంబునం జూర్ణంబులు చేసిన, నవ్వృత్తాంతంబు విని శత్రుఘ్నుండు తేను గదియం దోలించిన, లవుండు నిశ్శంకుండై మాహేశ్వరాస్త్రంబు వింటం దొడిగి శరపరంపరలచే విపక్షు పక్షంబు గవాక్షంబుగాం జేయుటయు, మూర్ఛంజెంది లవణాసురాంతకుండు క్రమ్మఱం దెలిసి, లవుని ఫాలతలంబున మూండు వాండి తూపులు నొనుపుటయుం, దామర మొగ్గలు వైచిన చందంబున నొవ్వక నవ్వుచు, నయ్యమ్ములు దివిచివైచి

కుశానుజుండు పినతండ్రిం జూచి, రోషభీషణాకారుండై ధనుర్గుణారావంబున దిగంతరాళంబులు పగులం జేయుచు, నొక్క విశిఖంబునం గేతనంబును, సూతుని నాలుగు సాయకంబులం, జక్ర రక్షకుల నన్నియ బాణంబుల రథ్యం బులం ద్రుంచి, యొక్క భల్లంబున హృదయంబు భేదించి యార్చుటయు, లక్ష్మణానుజుండు కన్నులం గెంపుగులుక నేయస్త్రంబుచే లవణాసురుందునిమె, నయ్యస్త్రంబు వింట సంధించి, 'వత్సా, యిది యమోఘంబైన బాణంబు. సంగ్రా మంబునకుం దొలంగి పొమ్ము. నీమీఁది యంతఃకరణంబునం బలికితి' ననిన, సీతాకుమారుండు తన మనంబున 'మా యన్న కుశుండుండె నేని యీ యస్త్రంబు చూర్ణంబు సేయు, నైనను మా తల్లియగు సీతాదేవి పాతివ్రత్య ధర్మంబువలన నిబ్బాణంబు ఖండించెద' నని ప్రతినసేసి, యెదురు నిలిచి, శత్రుఘ్నుండేసిన యస్త్రంబుపై వేఱొక్క యస్త్రంబు ప్రయోగించి ఖండించిన, సగంబు ఖండి తంబై పుడమిం బడియె. మిగిలిన సగంబు నెగసిచని విల్లు ఖండించి, వక్ష స్థలంబు దూరి భూమింగాడిన, నిశ్చేష్టితుండు రక్తసిక్తాంగుండునైన లవుండు పుడమింబడిన, భేరీ శంఖ మృదంగ పటహ ఢక్కారవంబులు సెలంగ సింహ నాదంబులు సేయుచు, హతశేషులైన సైనికులు తురంగంబు గొనిపోయిన, శౌర్యనిధానుండైన శత్రుఘ్నుండు కుశానుజుం గాంచి, బాణఘాత సంతాపంబు మాన, మేనంబొదివి, యెత్తుకొని, 'యికుమారుండు రాఘవ ప్రతిబింబంబు కరణి నున్నవాఁడు. అతనికిం జూపవలయు' నని తనువునం దొరఁగు రుధిరం బును సలిలపూరంబులం గడిగి, రథంబున నబ్బాలు నిడికొని మఘాశ్వంబేగు దెసకుం జనియె.

## -సీత లవుని దలఁచి విచారించుట-

అంత నక్కడ భూపుత్రి తన యాత్మగతంబున 'నక్కటా! లవుండా కొనియె, నీవేళకు వచ్చిన వాఁడు కాఁ' డని శోకంబునం బొక్కుచుండ, ముని కుమారులు పఱతెంచి, 'యమ్మా, నీ కొడుకు మఘతురంగంబును బట్టి మార్కొను నరి బలంబులం గనుపుకొట్టి యొక్క మహారథికు నెదిరించిన, నతండు విల్లు ద్రుంచి మూర్ఛ నొందించి పట్టికొని పోవుచున్న వాఁడ' నిన, మేఘ గర్జితంబునకుం భయపడు మెరాళ బాలిక పోలికఁ వనయుం బేర్కొని బహు విధంబుల నఘలచునుండం, గుశుం డంతకు మున్న మూల ఫలంబులు

సమిత్కుశ పత్ర పుష్పంబులు సుం దెచ్చుటకై వనంబునకుం జనినయెడ నెడమ కన్నదరెం గావున, మనంబున భయంబు నొంది, తోడనె సమర విజయ సూచకంబులగు నిమిత్తంబులు గనుపట్టిన 'నెద్దియేనియు నొక్క యుద్ధంబును, దాన జయంబునుం గలుగు' నని సంభ్రమించుచు వచ్చి, ధనంబు గోలుపోయిన చందంబునఁ జిన్నవోయిన ముఖంబుతోఁ జెన్ను దొఱంగియున్న తల్లికి వందనంబు సేసి, 'యమ్మా, నీ మనంబున నింత యుమ్మలిక యేమిటికి? లవునిం గాన, నెందుఁ బోయె? నెఱింగింపు' మనిన, 'నెచ్చటినుండియో యశ్వరాశ్వంబు వచ్చినం బట్టి కదళీ తరువునం గట్టి పెక్కండ్రు వీరుల తోడం బెనంగి, చతురంగ బలంబులు సమయించినయెడ నొక్క పాతకుండు బిడ్డని విల్లు ఖండించి, పట్టుకొని పోయెనఁట. అతని చేటుపాటు తెలియక పొగిలెద. శాత్రవునిం జయించి. యనుజుని మరలించి నా దుఃఖం బార్పు' మనిన, 'నంబా, శోకంబు మానుము. బాణ బాణాసన తూణీర చక్రగదా కుంత ముసల ముద్గర కవచంబులు దీవించి యొసంగు' మనినం, 'గుమారకా, కుశలంబుతో నిరంకుశంబుగా రిపులం గెలిచిరమ్ము. కుశ కుమారకా, యెల్ల దేవతలు నిన్ను రక్షింపుదురు'.అని దీవించినఁ, దల్లి చరణ పద్మములకుం బ్రణమిల్లి,యా జగదంబ యొసంగిన శర శరాసన కవచాదులు గైకొని, సన్నాహంబై, సమర కౌతూహలంబున భుజంబు లప్పళించుచుఁ, గల్పాంత మేఘంబు కరణిం గర్జించుచు, గమన వేగంబున వృక్షంబులు వేళ్లతోడం బెల్లగిల్ల, శైలంబులు చూర్ణంబులుగాఁ, బద ఘట్టనంబులం బుడమి గడగడ వడంక, దిగంతబులం జీఁకటులు గ్రమ్మ, సజ్జీకృత కార్ముకుండును, సంధీకృత బాణుండును, సంభృత కవచుండును, సమర సన్నద్ధుండునై సరభసంబుగా సింగపుం గొదమ తెఱంగున వచ్చు నవ్వీరుం జూచి, సైనికులు నిలువంజాలక నలు దిక్కులం బఱచిరి.

అంత శత్రుఘ్నుండు చెదరిన సైనికులఁ గ్రమ్మఱం బురికొల్పి, సారథిం గనుంగొని, 'యుగాంత కాలంబున సంహారోన్ముఖుండై వచ్చు కాలరుద్రుని చందంబున నిక్కుమారుం డసహాయ శూరుండై మన పయినివ్వచ్చుచున్న వాఁడు. వీనిం జూచి సైన్యంబు దైన్యంబు నొంది కలగం బాఱె. దిశాపసాశంబులు ధూళి ధూసరితంబులయ్యె. కాక ఘూక కంక గృధ్రంబులు రథికుల శిరంబుల మీఁద వ్రాలె. ధ్వజ పతాకలు పొగయుచున్నయవి. ఉల్కములు యశనిపాతంబులు గలిగె. నక్కలు సేనాముఖంబునం బొవందొడంగె.

ఒఱలఁ గ్రైదువులు డుస్సిన విరిగి పడియెడు. ఇది మొదలుగాఁ గల విపరీత నిమిత్తంబులు గలిగె. కావున మనము పదిలంబుగాఁ గదనంబు సేయ వలయు' నని సేవావాహుండను సేనాపతిం జూచి, 'నీదు చాప విద్యా కౌశలంబున నిక్కమారుఁ జీకాకు పఱచి వేయుము. చంప వలద'ని యాజ్ఞాపించుటయు, గఱకు మీఱిన సేన తోడం గూడఁ దాఁకసిల్లి, ములుకు టమ్ము లనేకంబులుగాఁ గురిసిన కుశుండు ప్రతి శరంబుల వెంబడించి, సారథి తురంగ కేతన పతాకాచ్ఛత్ర చామర బాణ బాణాసన సమేతంబుగా రథంబు పొడిసేసి, వాని హస్తంబులు మస్తకంబును భేదించి, సింహనాదంబు సేసిన, నగుంతను వాఁడు తన యన్నపాటు గనుంగొని, దిగ్గజోపమానంబైన గజంబునెక్కి, డీకొలుపుచుఁ, గనక ఘంటా ఘణిఘణితంబైన శక్తిం బ్రయోగించుటయుఁ, గుశుడు నైదు విశిఖంబులచే దానిం దునియలు సేసి, పెచ్చుపెరుగు మచ్చరంబున నాలుగమ్ములు కార్ముకంబునం దొడిగి,దంతావళంబు నాలుగు పాదంబులం దెగనేసిన, నేనుగు పడుటకు మున్న,నగుండు బీకర గదా దండ హస్తుండై, పుడమికిందుమికి, యెదురు నడుచుటయు, గదాదండ మండితంబైన భుజాదండంబు ఖండించిన, నతండు వేఱొక్క కరంబునఁ జక్రంబు సారింపుచుఁ జేరవచ్చుటయుఁ, గుశుండు క్రూరనారాచంబున నాచక్రంబు తోడం గూడ బాహువు ద్రుంచిన, భానుంబట్టఁ దివురు స్వర్భానుని చందంబునఁ గలియ వచ్చుటయుఁ, లవాగ్రజుఁ డర్ధచంద్ర బాణంబునఁ వాని శిరః కపాలంబు ఖండించిన, దాని భండనంబునఁ దాండవంబు సలుపు భైరవుండు పాన పాత్రంబుగాఁ గైకెనియె. అవ్విధంబున నగుండు పడుటయు గలగుండు పడి, సైన్యంబులు పఱచిన వెనుదగిలి సీతాసుతుండు శతశరంబుల గజతురగ స్యందన వీరభట కదంబకంబులఁ జిత్రవధంబొనర్ప లక్ష్మణానుజుండు వాయువేగంబులైన యాశుగంబుల నడరించినఁ గుశుండు క్రోధ కషాయి తాక్షుండై సన్నత పర్వంబులును, గనక పుంఖంబులును, గంక పత్రంబులునైన యంబకంబులు శత సహస్ర సంఖ్యలు నిగిడించి, రథ్యంబులం జంపి, సారథిం గీటడఁగించి, కేతనంబు ఖండించి, ఛత్రంబు దునుమాడి, తేరు చక్కడిచి, వక్ష స్థలం బగడ్చుటయు, శత్రుఘ్నుండు గిరి శిఖరంబున నుండి జాఱి పడిన భద్రదంతావళంబు తెఱంగున, నేలం బడుటయు, హత శేషంబులైన సైన్యంబులు దైన్యంబునొంది నలుదిక్కులం బఱచె.

అంతలో లవుండు మూర్ఛదెప్పిటి యన్నకడకుపవచ్చి, మొక్కి, తదను మతంబున యాగీయాశ్వంబు నొక్క మహీరుహంబునం గట్టిన<, బెనుగాలి తోడంగూడిన కార్చిచ్చుకైవడి సోదరునితోడం గుశుండు రణాంగణ నిరంకు శుండై ప్రకాశించె.

## -కుశలవుల పాటవము రామునకు భటు లెఱింగించుట-

అంత హతావశిష్టులైన భటులు కొంద రయోధ్యాపురంబునకుం బఱచి, హయమేధదీక్షితుండును, యజ్ఞవేదికా సమాసీనుండును, మునిజనపరివేష్టితుం డును, భరత లక్ష్మణ సేవ్యమానుండును, కురంగశృంగపాణియు< గృష్ణాజినాం బర ధరుండును, దండమేఖలాభరణుండును, గనకసీతాసమేతుండును, దిలసమి దాజ్య హోమాధూమారుణలోచనుండునైన శ్రీరామచంద్రుసింగాంచి, ప్రణమిల్లి 'దేవా, నీ యధ్వరాశ్వము నానాదిక్కులుందిరిగి యడవిలో నొక్క బ్రహ్మ చారియగు నొక్క బాలకునిచే< గదళికాతరువునం గట్ట<బడియె. ఆకుమారుని యాకారంబు మీయట్ల యున్నయది. వా<డు మన సేనలం గనుపుగొట్టి, మీ కూర్మితమ్ముని నెదిరించి, పెద్దయుం బొద్దు కదనంబు గావించి, ఖండితకార్ము కుండై మూర్ఛ<జెంది పట్టువడియె. అనంతరంబ యతని పోలికగానుండు బాలకుండొక్క<డు కవచకార్ముక ఖడ్గధరుండై ,లేడిగుంపులపై చునుకు బెబ్బులిం బోలె< జేతుల కసితీఱ సేనలం గసిమసంగి శత్రుఘ్నుని గ్రూల్చె' ననిన,విని రఘు వీరుండు 'మీకు వెఱ్ఱిపట్టెనో, భూతంబు సోకెనో? నా తమ్ముండు పగఱచే< బడుట యేమి?' యనుటయు, 'దేవా, నీ పదసేవకులకు భ్రమ కలుగునే? ఈమాట నిక్కం' బనుటయు, రామ భూమీశ్వరుండు మనంబునం గళవళం బందుచు 'నా యెదుట నిలిచి యెన్నడు మారుత్తరంబీయ<డు. లవణాసురుం దాకి యొక్క<డె కయ్యంబున గెలిచె. ఇట్టి నా తమ్ముండాజిలో నొక్క వడు గున కెదిరింపం జాలక పడియెన<ట! దైవం బెంత సేసె?' ననుచు భానుకుల తిలకుండు ఱెప్పల నుప్పతిల్లు బాష్పంబులు కరపల్లవంబుల నప్పళించుచు లక్ష్మణుని దెస మొగంబై (యిట్లనియె):

## -రాము<డు సౌమిత్రిని యుద్ధమునకు< బంపుట-

'యాగదీక్షితుండనైన నేను దరలరాదు. కావున హయంబుం బట్టిన బాలకుం గెలిచి శత్రుఘ్నునిం దోడ్కొని రమ్ము. సౌమిత్రి'నుటయు<,బూచిన తరు

పులింబొలుపొందు గిరుల చందంబునం గనక కేతన సమేతంబులును, మదధారా బంధురంబులునగు సింధురంబులును, జలనిధి తరంగంబుల తెఱంగునం గెరలు తురంగంబులును, శరదభ్ర విభ్రమంబులును, గల్పిత మనోరథంబులుంబలె నమంద శౌర్య విశంకటులైన వీరభటులును, ప్రళయ భైరవ హుంకార శంకా రవంబులైన పటహ భాంకారంబులును మెఱయ, రఘువీరునకుఁ బ్రణామంబు సేసి, కల్పాంత కాలంబునం గట్టుదాఁటి మట్టుమీఱిన నీరధులంబలె నిరవధి కంబులైన సేనా బృందంబులతో వచ్చి, వాల్మీకి వనంబు సొచ్చి, రణాంగణం బున విరిసిన కేశపాశంబును, విధ్వస్తంబైన కవచంబును, విఱిగిన శరాస నంబును, వీడిన యంప పొదులునుం గలిగి, ధూళి ధూసరిత గాత్రుండై పడి యున్న శత్రుఘ్నుం జూచి, బాష్పాకులిత లోచనుండై, సౌమిత్రి సమరంబున కుద్యుక్తుండయ్యె; నని జైమిని మునీంద్రుం డాన తిచ్చుటయు, జనమేజయ నరేంద్రుండు తదనంతర కథా వృత్తాంత శ్రవణ కౌతూహలాయత్త చిత్తుండై యుండె.

ఉ. వారణఘోట వీర భటవర్గ నిరర్గళ ధూళిపాళి సం
పూరిత వార్ధి, (ధావి) తరిపువ్రజ సాధ్వసహేతు చక్ర వా
ళోరు గుహాంతరాళ బహుళోజ్జ్వల దోఃపరిఘ ప్రతాప వి
ద్యా రవిమండల ప్రకరధామధురా మధురాధినాయకా.

కం. ముంగొంగుఁ బసిడి, చెంగటి
బంగరు మల యొద్ది, యమరపాదప, మింటన్
రంగైన కామధేను, వ
నంగ నిజాశ్రితులఁ బ్రోచు నవ్య కృపాబ్ధీ!

భుజంగ ప్రయాతము.

మదేభేంద్ర యానా సమాజాబ్జ బాణా
సదానంద సన్నీతి శాస్త్ర ప్రవీణా
ప్రదానాంబు సంపూర్ణ ఫాలాక్షతూణా
సదాయత్త విద్వత్ప్రశస్త ప్రఘాణా,

గద్య :

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ మహీనాథ
కరుణా కటాక్ష సంపాదిత గజ తురంగ మాందోళికా ప్రముఖ నిఖిల
సంపత్పారంపరీ సమేధమాన, సముఖ మీనాక్షి నాయక
తనూభవ, మీనాక్షీదేవీ కటాక్షలబ్ధ కవితాసంప్రదాయ
వేంకట కృష్ణప్ప నాయక ప్రణీతంబైన జైమిని
భారతంబున నశ్వమేధ పర్వమ్మను
వచన కావ్యంబునందుఁ
తృతీయాశ్వాసము.



# జైమిని భారతము

## చతుర్థాశ్వాసము

క. శ్రీధర చరణాంబురుహా
సాధారణ భక్తియుక్త, శరణాగత ర
క్షాధౌరేయ వ్రత రఘు
నాథ, విజయరంగ చొక్కనాథ మహీశా.

అవధరింపుము. జైమిని మునీంద్రుండు జనమేజయ నరేంద్రున కిట్లనియె: "అట్లు సమర సన్నద్ధుండైన సౌమిత్రి నవలోకించి, సీతాకుమారుండైన కుశుండు నిజానుజుండైన లవునవలోకించి, 'లెక్కకు మిక్కుటంబైన చతురంగ బలంబులతో మహారథుండెవ్వఁడో మనమీఁద వచ్చె; నింకంజేయఁదగిన కార్యంబేమి', యనలవుం 'డన్నా, చెప్పందగినదేమి యున్నది? శరపరంపరలచేఁ బరబలంబుల వెంపరలాడివచ్చెద. నీవును నీ రణంబునకుం దొడంగు' మని పలికి, మున్ను శత్రుఘ్నునిచేతఁ దన ధనువు విరిగిపోవుటకతన, నియమపురస్సరంబుగా నిటలంబున నంజలి ఘటియించి,సూర్యునుద్దేశించి,'సవితయుఁ,త్రిమూర్తి స్వరూపంబును' సప్తసప్తియుఁ, జండభానుండును, బూషుండును, సదాప్రకాశుండును, జలజ మిత్రుండును, ఋగ్వేదమయుండును, మేషవృషభాధీశ్వరుండును, ద్యుమణియు, హిరణ్మయుండును, భాస్కరుండును, గర్మసాక్షియు, భవరోగ వైద్యుండును, భక్తి శుభంకరుండును, సహస్రకరుండును, సురనికర పూజితుండును, యతిజన ప్రియుండును, దివాకరుండును, సంవత్సరకరుండును, ననూరుసారథియును, నంధకారభేదుండును, గిరీటమాలికాధరుండును, నిశాకర సహాయుండును, జగదాశ్రయుండును, నయిన సూర్యునకు వందనంబు సేసెద'నని మంత్రంబు లుచ్చరించుచుఁ బ్రార్థించెను.

### -సూర్యుఁడు లవునకు విల్లొసంగుట-

అపుడు సూర్యుఁడు ప్రత్యక్షంబై కనక రేఖా విరాజితంబును, దివ్యరత్న ఖచితంబును, జయప్రదంబు నభేద్యంబును, త్రిభువన భయంకర జ్యానాద మేమ

రంబును, నగునొక్క ధనువు దయచేసి దీవించి వేంచేయుటయు, భాస్కరుండి చ్చిన విల్లుగైకొని లవుండగ్రజునింజూచి యాధనుర్మహత్త్వంబుఁదెలిపె.

అత్తఱి సీతాకుమారకులు సుమిత్రా కుమారునిందాఁకుటయు, గజఘటలు తురంగ బృందంబులు, రథసమూహంబులు, భటవ్రాతంబులు, లెక్కకు మిక్కుటంబుగాఁ బ్రళయకాల సముద్రంబుకరణి నపారంబైన సైన్యంబుఁజొచ్చి శరవర్షంబులు వర్షించుటయు, ముహూర్తమాత్రంబులో నొక్కటియు నరయోజనంబు దూరంబు లోపలందగిలిన సైన్యంబులు తొలు కోత్తలం గీటడంగె. అయ్యద్భుత పరాక్రమంబు సూచి, లక్ష్మణుని సేనాపతియగు కాలజితుండు పెక్కువేల క్షౌముల తోడంగూడఁజుట్టుముట్టె*.

ఇవ్విధంబున సేన లవరోధించుటయు, లవుండు ప్రళయకాలకాలుని చందంబునం గనలుచు, ననర్గళ మార్గణాసారంబులచే నలువది క్షౌముల సైన్యంబులం దెగటార్చి, కత్తి, కేడెంబును, గదయుఁ, జక్రంబును, ప్రాసంబును, సురియయుఁ, బట్టిసంబును, గుంతంబును, దోమరంబును, శూలంబు మొదలైన కైదువులం బోరిపోరి, పగతుర ప్రయోగించిన యస్త్రశస్త్రంబులచే జర్జరీభూతంబును, రక్తసిక్తంబునగు గాత్రంబుతోఁ, గుశునింగానక నలు దిక్కులుం జూచుచు, నున్నయపుడు రుధిరాక్షుండను రాక్షసుండు లవణాసురుని మేనమామయగువాఁడు, లవణాసుర సంహారానంతరంబ శత్రుఘ్నుని శరణుసొచ్చి. రాఘవునకు సేవకుండై వర్తించువాఁడెడసొచ్చి పరాకుగాఁ జూచుచునుండు లవుని చేతికార్ముకం బొడిసికొని యాకసంబునకుం బఱచె.

## -లవుండు రుధిరాక్షునిఁ జంపుట-

అంత నక్కుశానుజుండు చాపంబులేక చక్రంబు కేలంబూని, చక్రపాణి చందంబున గురుకృపాలబ్ధంబైన వాయుమంత్ర జపంబువలన గగనంబున

* నూఱువేల యేనుంగులు నొక్క యేనుంగునకు వేయేసి రథంబులు, నొక్క రథంబునకునూఱేసి గుఱ్ఱంబులు, నొక్క గుఱ్ఱంబునకు నూర్గురు పదాతులుఁ గూడినసంఖ్య క్షౌమియనంబరగు. (ఈ క్షౌమీలాక్షణముగూడ మూలమునందే వ్రాయఁ బడియున్నది)

కెగసి కొద్ది పక్షిపయిం బాఱు జాలెడేగ తెఱంగున దైత్యునిం దునుము టయు, సైన్యంబులు వెగ్గలంబులంది బాణరంధ్రంబుల వెంబడి గజకళే బరంబులు సొచ్చి, యందుండి యాకాశంబు చూచువారును, భగ్నంబులైన రథం బులలోనం జొరబడి చప్పుడు చేయకుండువారును, హయకబంధముల మీఁది పక్కెరలు తమమీఁదం ద్రోచుకొని యవలనుండువారును, వీరభట శరీరంబులు మీఁద వైచికొని యరిగలమఱుంగున నణంగియుండువారును, నై యితండెవ్వరి మీఁద నుఱుకునో, యెవ్వరి శిరంబు ద్రుంచునోయని కళవళపడుచునుండు నపుడు, దశరథరాజు మంత్రియగు సుమంతు (త్రు) ని కొడుకులు సింహుం డును, జంద్రకాలుండును, ధార్మికుండును, మదనుండును, శత్రుసూదనుండును, శరద్వంతుండును, జితశ్రముండును, నందుండును, సువేగుండు, నతులుండు ననువారలు పదుగురు జ్యాఘోషంబులు భీషణంబులుగా, నొకముహూర్తంబునఁ బది బాణంబులేసి, లవుని చేతిచక్రంబును తుత్తునియలు సేసిన, సీతా తనూ భవుండు భూతంబునకు లంఘించి పరిఘాయుధంబులు కేలం గైకొని, చిత్రం బుగాఁ ద్రిప్పుచుఁ జిటికవేసిన మాత్రంబులో దశరథరాజ మంత్రికుమారుడైన దశమహారథులఁ గీటడఁగించె. అంతలో మదోద్ధతుండైన రుధిరాక్షుండు గ్రమ్మఱం బాఱుతెంచి, గదాదండంబుచే శిరంబు పగుల నడుచుటయు. లవుండు మూర్ఛగ్రమ్మి విసంజ్ఞుండై కొంత తడవుండి యంతటం దెలిసి కుంతంబు ద్రిప్పుచు శకుంతాధీశ్వరుండైన గరుడుండు సర్పంబులపయిం దారు తెఱంగున దైత్యునింజేరి కుత్తుకం ద్రుంచి వాఁడు ముచ్చిలించికొనిపోయిన చాపంబు గ్రమ్మఱం బుచ్చికొని కడంగుటయుఁ బ్రసవానంతరంబున బాలకుని మోహ జాలంబు చుట్టుకొనిన తెఱంగునఁ జతురంగ బలంబులు సీతాకుమారునిం జుట్టు కొనిన, నణంగిన చంద్రనిప్పు తనయొద్ది మద్దిచెట్టు నాద్యంతంబులు గాల్చి పేర్చి కాఱడవిం దహించురీతి బెక్కుభంగుల సేనలం ఒక్కాడుచునుండె.

## -కుశ లక్ష్మణుల యుద్ధము-

అప్పుడు కుశుండు సింహనాదంబు సేసి లక్ష్మణు నెదుర్కొనిన, నతం డైదు తూపులచేఁ బేరురంబు వ్రక్కలించిన, సుక్కక యక్కుమారుండు వాయవ్యాస్త్రంబు సంధించి నిలునిలుమని యదల్చి యేయుటయు, లక్ష్మణుని

యరదంబు సుడిగాలి లోనం దవిలి కుమ్మరసారె గతి ముహూర్తమాత్రంబు తిరుగుచు నుండఁ దద్వేగంబున నాలుగు రథ్యంబులు నాలుగు దిక్కులం బడి పంచత్వంబు నొందిన, లక్ష్మణుండు వేఱొక్క తేరెక్కి కక్కసంబులైన యుక్కుటలుగులైదు ప్రయోగించి కుశుని కవచంబును, గిరీటంబును దునుముటయుఁ, గుబుసంబు వీడిన నాగేంద్రుని తెఱంగున మెఱయుచు, లక్ష్మణు నుద్దేశించి 'రిత్తమోపుగా నున్న కిరీట కవచంబులు తీయించి భారంబు మాన్పిన నీవు పరమోపకారివి. నీసైన్య భారంబంతయుఁ బోవంజేసి ప్రత్యుపకారంబు సేసెద' నని పలుకుచు, నాధర్వణ శిరోమంత్రంబుల నాగ్నేయాస్త్రంబు నభిమంత్రించి ప్రయోగించుటయు, దగ్ధంబులైన రథంబులును, మండెడు నేనుంగులును, గాలెడు తురంగంబులును, నివురులైన పదాతి వర్గంబులును, బొగలతోడం గలసి యెగసిన ఛత్ర చామరాభరణంబులునుం గలిగి, చమూ సమూహంబులు దావానలంబులోఁ దవిలిన మెకంబుల రకంబున, నలుదిక్కులకుం బఱచుటయు, దాశరథి వారుణాస్త్రంబున నివారణం బొనరించినం, గుశుండు వాయవ్యాస్త్రంబు వింటనొంటించి, చాపవిద్యాకౌశలంబు మెఱయ నేయుటయుఁ, జండమారుత వేగంబునఁ బండుటాకు లెగయువడువున నాయోధనంబునం గల యోధవరు లాకసంబున కెగసి వీర లక్ష్మి విహరించు మణిమండపంబునకు మంజిష్ఠి పట్టు మేలుకట్టు తెఱంగునం గనుపట్టుటయుఁ, సేనల దురవస్థ గనుంగొని సేనాధీశ్వరుండగు కాలజిత్తు కుఱుచ కనుపుల కోరి కోలచేఁ గుశునురంబు నాటించి నవ్వుచు, 'నా బలపరాక్రమంబు లెఱుంగవు. బాలుండవు. నీకేల యాలంబు? తొలంగు' మని పలుకునంతలోఁ గుశుండలుక నొలఁక నొక్క వాలిక తూపుచే వాని నాలిక ద్రుంచి తోడన మహోగ్ర నారాచంబున శిరంబు ఖండించె.

## -లక్ష్మణుండు మూర్ఛితుండగుట-

అంతఁ గాలజిత్తు పాటు గనుంగొని సౌమిత్రి వేలకొలందు లాశుగంబులు నిగిడించిన నక్కుమారుం డన్నియుం జూర్ణంబులు సేసి, చక్రంబు వైచిన ఖండించి, శూలంబు ప్రయోగించినం ద్రుంచి, ముసలంబు విసరినం గసిమసంగి భిందివాలంబు నిగిడించినం దునుమాడి, వాలును బలుకయుం బూనినఁ జిద్రుపలు సేసి, యెన్ని కైదువులెత్తిన నన్నియు నఱికి, వాల్మీకి యొసంగిన యైదు

బాణంబులు గార్ముకంబునం గూర్చి యార్చుచు వైచిన, తెక్కలి తోడి పెను బాములుంబలెఁ బఱతెంచి యురస్థ్సలంబునం దూఱుటయు, స్వల్ప కిరణంబులతో నస్తమించు నర్క బింబంబునుం బలె లక్ష్మణుండు రుధిరధారాభిషిక్తుండై పుడమి పయింబడినఁ, గుశుండు కరవాలంబు పలుకయుం గైకొని, కరినికరంబుల కుఱికి, యింద్రుండు వజ్రధారచేఁ గులగిరులం గూల్చు చందంబునం గూల్చి, రణాంగణంబు బయలుపఱిచి తమ్మునింగాంచి, యిరువురుం గూడి చిచ్చుఁగరువలియుం గలసినట్లు సైన్యంబు నిరవశేషంబుగాఁ జలపట్టి మట్టంబు సేసి, హర్షంబున నాశ్రమంబునకుం జనుదెంచిరి.

అంతకు మున్న గంగా తీరంబున యాగశాలలో దీక్షఁబూని వశిష్ఠాదిమునులతోఁగూర్చున్న రఘూద్వహుండు భరతుంజూచి, 'అనఘా, శత్రుఘ్ను నని లోనంగూల్చిన హయ చోరకునింద్రుంచి లక్ష్మణుం డిదివరకు నేమిటికి రాఁడయ్యెనో ! ఏ వీరుఁడు విరోధించిన యెడ ముల్లోకంబులు నొక్క మొత్తంబుగా నెత్తివచ్చిన నెదిరింపంజాలఁ;లవట్టి సుమిత్ర తొలు పట్టితోఁ జలపట్టి పోరు వారలుంగలరె ! బుద్ధి తెలియక యత్తురంగంబుఁబట్టిన బాలకులు చలంబునం బోరి దురంబునం గూలిరో ! కాక వారల తల్లిశోకంబునం బొగులుచుఁ బుత్రభిక్ష వేఁడికొనియెనో ! యాగంబు నుపక్రమింప నింకమూఁడు దినంబులున్నయవి. నన్నును, సుగ్రీవ విభీషణాదులను దలంపక, లక్ష్మణు బాహుశౌర్యంబు నూహింపక, సాహసంబున నాడింభకులిట్టి దుండగంబులు సేయందగునె? అచ్చటి వృత్తాంతంబు తెలియలేదు. వేగవంతులు బుద్ధిమంతులు నైన వేగరులంబంపి శీఘ్రంబుగా నచ్చటి వార్త దెప్పింపు' మనుటయు, భరతుండు లావు వెరవునుం గల దూతల నేవురం బయనంబు సేసి సముఖంబునకుం దోడితెచ్చిన రాజేంద్రుండు వారల నుపలక్షించి, 'బాలకులు నేరక యపరాధంబు సేసిరి కావున వారలకభయంబొసంగి తోడ్కొని రమ్మనుఁడు. కాక చలపా దితనంబునం బోరిరేని సమ్మోహనాస్త్రంబున మోహింపఁజేసి యిచ్చటికిం బట్టికొని తెమ్మనుఁడు. ఆ చిన్న బాలకులు నన్నుంబోలియున్నారని వేగరులచే వింటి; నదియుంగాక సీత ముఖ లక్షణంబు లవ్వటువుల ముఖంబులం గలవని వింటిని. మీరును గలయం జూచి తెలిసి యడవి నేల తిరిగెదరు ? మీ యంబ పేరేమి? యని తెలియనడిగి సౌమిత్రింగూర్చుకొని వారలం దోడ్కొనిరండ'ని పలికెను.

## -సౌమిత్రిం గూర్చి రాముఁడు దుఃఖించుట-

అంతలో గాయంబులం దొరఁగు నెత్తురులు వెల్లువలు గట్ట హతశేష సైని
కులు పఱతెంచి దీక్షితుండైన రాముని పాదంబుల వ్రాలి 'ఓ రఘుకులావతంసా,
శత్రుఘ్నుని చందంబున లక్ష్మణుండును గుశుని నిశిత విశిఖంబులఁ బంచత్వంబు
నొందె. సమర తలంబునం గాలజితుండును సుమంతు(త్రు)ని కుమారులు పదు
గురును సౌమిత్రి కన్న మున్న కుశుని సాయకంబులచే రక్తధారలు గుబులుకొన
గైరిక ధారా రంజితంబులైన శైలంబుల మాడ్కిఁ, బూచిన మోదుగులకైవడి,
జగతీ తలంబునం గూలిరి. కోపావేశంబుఁజూచునెడలం గుశుండిచ్చటికి వచ్చు
వాఁడని తోఁచుచున్నయది. ఇంక నేటి యాగంబు ! ఆహవంబునకు నాయత్తం
బుగ విచ్చేయుఁడు. చిచ్చంటికొనిన పిమ్మటఁ జేటలం గ్రమ్మ శక్యంబు గాదు.
తగిన యుపాయంబిప్పుడు చేయవలయు, నని పలికిన పలుకులాలకించి రఘు
వీరుండు వెన్ను విఱిగిన చందంబున, బరశు ఖండితంబైన భూజంబుపోలిక,
మూర్ఛితుండై, భరతుని సమీపంబు సంబడుటయు, నతండు విన్ననైయున్న
యన్న నీక్షించి హిమాంబుపూరంబులచేఁ గన్నులొత్తి, కర్ణంబులం గంబురాదు
మారంబు లూఁది, శైత్యోపచారంబు లొనర్చుటయు,బెద్దయుంబొద్దునకు నొక్కింత
తెప్పిఱి కాకుత్థ్సుండు జలధర గంభీర స్వనంబున వావిడిచి యేడ్చుచు, 'సకరా!
పదునాలుగేండ్లాహార నిద్రలు మాని పెక్కు భంగుల నన్నుంగాపాడి, దేవ దానవు
లాశ్చర్యంబునొంద సమరంబున నిద్రజిత్తుం ద్రుంచి, మహారథిశ్రేష్ఠుండును,
గాత్రవీర్యునికన్న మిన్నయని పొగడతఁ గనిన నిన్ను మానవ మాత్రుండెట్లు
నిర్జించె! మహావీరా, హా ప్రియానుజా, హా సుమిత్రాపుత్రా, నీవులేని జన్మంబేల ?
ఈ రాజ్యంబేమిటికి ? ప్రాణంబువలనం బ్రయోజనంబేమి ? తమ్ముల నెడఁబాసి
యుండంజాల. వారల సమీపంబునకుం జనియెద. కార్ముకంబు నస్త్రంబులందెమ్ము.
తమ్ముడా, తామసంబు సేయవలద'ని పలికినం, గేలుమొగిచి భరతుండు 'దేవా,
సంగ్రామ రంగంబున భయభ్రాంతులై చారులు పఱతెంచి విన్నవించినగతిం దోచు
చున్నయదిగాని, యిమ్మాటలు నిక్కంబులుగావు. లక్ష్మణ శత్రుఘ్నులు మూర్ఛం
బొందిరికాఁబోలు ! అమ్మహాభుజులకు మరణంబెక్కడిది ? ఏను వారలకు సహా
యంబుగాఁజని దేవర ప్రతాపాతిశయంబుచేఁ దురంగ చోరకులం బట్టి బంధించి
కొని యశ్వంబుదెచ్చెద. నన్నుంబనుపు' మనిన, నినకుల తిలకుండు నీకుం
దోడుగాఁ జేరువగల వానర వీరులం బనిచెద. సుగ్రీవుండు, విభీషణుండు నియువు

మా యుద్ధనుండ నిమ్ము. సరవానర రాక్షస బల సమన్వితుండవై కదనంబునకుం జను'మనియె.

## —భరతాదులు యుద్ధమునకు వచ్చుట—

అంత భరతుఁడు రఘుపతికిం బ్రణమిల్లి, ధనుర్బాణ తూణీర కవచ శిరస్త్రాణంబులు ధరియించి, రథంబెక్కి సేనాసమేతంబుగా వెడలె. అప్పుడు కైకేయీపుత్రుండు పవన నందనుం బిలిచి, 'నీవు ముందరంజని సుమిత్రా తనయుల చందంబు తెలిసిరమ్మ'ని పంచినం, బఱచి హనుమంతుండు వారలంగని, తన సందిటం బొదివికొని వచ్చి భరతుని సన్నిధింబెట్టి 'కుశ విశిఖ సంఘట్టనంబునం గడునొచ్చిపడియున్న లక్ష్మణుం జూచితే? ఇతండు తొలుత నింద్రజిత్తుని యస్త్రంబుల నింత నొవ్వం'డని పలికిన, హనుమంతుని పలుకులు విని భరతుండు శోకవ్యాకులిత మానసుండై, 'యివ్వీరుల నింత పరిభవించిన వారలు బృందారకులుగాని, దారకులు గా'రని, యయ్యిరువురం దన యరదంబున నునిచికొని, వచ్చుచున్నంతలో, సైనిక వీరుల సింహనాదంబులు, నట్టహాసంబులు, పటహభాంకారంబులు నాలకించి కుశుండు కోపవశుండై, కోదండ మౌర్వీ ఘంటారవంబులు సెలంగ నెదురు నడచు సమయంబున, వారల యుద్ధంబు శక్యంబుగాదను భంగి సూర్యుండ స్తమించె. పక్షికులంబులు కలకలంబులు సేయుచు గూండ్లకు బారులు దీరె. మృగంబులు పల్వలంబుల నుదకంబులు గ్రోలుటకు వెడలె. కాటుకరాసుల కరణిఁ జీఁకటులు దిక్కుటాహంబులఁ గప్పె. అప్పుడొకరొకరి మొగంబుగానని యంధకారంబున భరత సైన్యంబులు కుశ లవులం జుట్టుముట్టి, గదాకుంత ముసల తోమర ముద్గర భిందివాల క్షురికాది సాధనంబులు వర్షించిన, లవుండు నన్నకు సహాయంబుగా బాలభానుకిరణ ప్రకాశంబులైన నారసంబులు ప్రయోగించి, తిమిరంబులు విరియించుచు, వాఁడి గొడ్డలిచేఁ గాష్ఠంబులు నఱకిన కరణి, ఖడ్గంబుచే దంతిదంతంబులు తెగవ్రేయు నపుడు, మిణుంగురులు పుడమికి మింటికి నొక్కటిగా నెగసి దళంబుల దహింపం దొడంగె. కుశుండును కార్ముక జ్యానాదంబు రోదసీ కుహరంబునం బర్వ జ్వలింపఁగల క్రోధానలంబునకు సూచకంబుగా ధూపరేఖపర్వెనసం బొలుచు భ్రుకుటిమండలంబు ముఖ చంద్రమండలంబునకు నలంకారంబుగాఁ జండమార్తాండ కిరణంబులం గ్రేణిసేయుచు, బాణంబులు నపారంబుగాఁ గురి

యుచు, సైన్యంబు దైన్యంబు నొందించిన, వారింప శక్యంబుగాక చింతించు నవసరంబున, హనుమంతుండు రామానుజుం జూచి, 'వీరి యాకారంబులు రాముని యట్లనున్నయవి. కావున సీతాతనూభవులు గావలయు. కాదేని, యాది కూర్మంబునకు, శేషునకు, దిగ్గజంబులకుఁ గులాచలంబులకు భారంబు దోఁచు నట్లుగాఁ బీనుఁగుపెంటలు సేసి, బలంబులం దునుముట యెట్లు?'ని పలుకుచు నుండం, గుశుండు లవునిం జూచి 'వీరలు పౌంచు తెఱంగు గనుంగొనిన యుద్ధ సరణిగాఁ దోచలేదు. ముచ్చులవలెఁ గనబడుచునున్నవారు. నీవు హయంబు నేమఱకయుండుము. సైన్యంబులనెల్ల నేనుక్కడఁణగించెద'నని పలికి, భరతున కభిముఖుండై 'నీ సోదరులు పడిన చోటికి నిన్ను దైవంబు దెచ్చె. లవాగ్రజుని యెదుటఁబడి యెందుఁబోఁగల'వని కైకేయీనందను నేడు కాండంబుల, సుషేణు నన్నియ తూపుల, నంగదుని వేయిబాణంబుల, నాంజనేయుని నూఱు సాయ కంబుల, నీలుని నేనూఱు మెఱుంగుటమ్ముల, గవయు నిన్నూఱు శరంబులఁ, బనసుఁ దొంబది నారసంబులఁ, గుముదుని నన్నూఱు ప్రదరంబుల, జాంబ వంతుని మూఁడువేల కంకపత్రంబుల నొప్పించి, హతుల మూర్ఛితులఁ బరాజి తులంజేసి, సింహనాదంబు సేయుటయు, దేవతలు పుష్పవర్షంబులు గురియిం చిరి. ఘోరతరంబైన సీతాకుమారుని సమరంబుఁ జూచు వేడుకచేఁ బొడవుగా నెక్కనోయనఁ బొడుపు గుబ్బలి యుత్తమాంగంబునకు మణిమయకిరీటంబు కరణిం బ్రకాశించుచు మార్తాండ మండలంబు తూర్పుదెసఁ జూపట్టె.

అప్పుడు భరతుని శాసనంబునఁ జతురంగబలంబు లొక్కమొగిం జుట్టు ముట్టిన, లవుండాబలంబు విరియించి యాఱునారసంబుల భరతుని కోదండంబు ఖండించినం, గుశుండు మార్గణాసారంబు లనర్గళంబుగాఁ బ్రయోగించిన, భరతుండు మూర్ఛితుండై యరదంబుమీఁద నొరగంబడుటయు, మారుతకుమా రుండు కట్టలుకం బెట్టుగా నట్టహాసంబు సేసి, యొక్కమహీధరంబు పెకలించి వైచుటయు, దాని శకలంబులుసేసి కుశుండు బలప్రకరంబులు వికలంబుగాఁ బరిమార్చెను.

## -భరతుఁడు మూర్ఛిల్లుట విని రాముఁడరుదెంచుట-

(అంత) హతశేషులు పఱతెంచి తద్వృత్తాంతంబు శ్రీరామభద్రునితోఁ దెలియం జెప్పిన, సమ్మహారథుండు విభీషణ సుగ్రీవుల తోడఁగూడఁ జతు

రంగబలం సమేతంబుగా నరుగుదెంచి యాహవ రంగంబున సాహస ధురీణులు సౌందర్య రేఖాలంకృతులును, శరచాప తూణీర ధరులును, నంగజ ప్రతిమానులు, నాత్మ ప్రతిబింబంబులునైన యర్భకులం గనుంగొని 'మీకు జాతకర్మ నామకరణాదు లెవ్వరు గావించిరి ? ధనుర్వేదం బెవ్వరిచే నభ్యసించితిరి ? యుద్ధ కౌశలం బెవ్వరు నేర్పిరి ? మీకుం దలి దండ్రు లెవ్వరు ? ఎఱింగింపు, డను టయు, లవాగ్రజుండు 'సమరంబునకు వచ్చి మా పుట్టు పూర్వోత్తరంబు లేం యడిగెదరు ? మీ తేఁట మాటలకు లోఁబడి హయంబు నిచ్చువారము గాము. అయిన మీయంతవారలడిగినఁ జెప్పకుండుటయుం దగవు గాదు. మాకు జాత కర్మంబు నామకరణంబుఁ జౌలంబు నుపనయనంబును వేదశాస్త్ర రహస్యంబులు విలువిద్యయు దివ్యాస్త్ర సంపదయు గదాఖడ్గకుంత తోమరాద్యాయుధ నైపుణం బును, నఖిల పాపహరంబును సకల మనోరథ సాధనంబును, గైవల్యప్రదం బునునైన శ్రీరామాయణంబును, వాల్మీకి మునీంద్రుఁడు నిర్వ్యాజ కృపాకటా క్షంబున నెఱింగించె. మా తల్లి సీతాదేవి యిక్కానలో మమ్ముఁగాంచె' నని సీతా నామ స్మరణంబు సేయుటయు, రఘునాథుండు రథంబు మీఁద నొఱగి, ముహూర్తమాత్రంబునకుఁ దెలివినొంది, సుగ్రీవునిం జూచి,'వీరలెవ్వరో తెలియం జూడు' మనిన, నినతనందనుం 'డిక్కుమారులు పురాణ పూరుషుని పోలిక నున్నారు. మీ కుమారులగుటకు సందియంబు లేదు. కాకున్న నిట్టి శౌర్య ధైర్య సాహసంబులు పుట్టునె ?' అని పలుకునంతలో, నీయుండొక్క మహాశైలంబు పెకలించి వైచుటయు, వారలన్నగంబు చూర్ణంబుసేసి కాలానల శిఖా సంకాశం బైన శరం బరివోసి యేసిన నీలుండు గూలె. తోడన తద్రక్తబిందువు లెన్ని గల వన్నియు నీలురై మార్కొనుటయు, జానకీ కుమారుం డందఱ నన్ని శరంబుల రూపుమాపి నరవానర రాక్షస సైన్యంబుల నానాశస్త్రాస్త్రజాలంబుల గుదులు గ్రుచ్చిన, రాఘవుండు భ్రాతృజనుల పాటును సైనికుల చేటును, నక్కు మారుల పోటును జూచి, హాలాహల కీలాకరాళంబులైన మెఱుంగుటమ్ములు వింట సంధించి, ప్రయోగించిన, నది యక్కుమారుల పయిం దాఁకక, కేడించి చనుటయు, రఘువీరుండు మరల దివ్యబాణంబు లనేకంబు లేసినఁ, గవలు వాని నన్నింటి నాలుగేసి తునుకలు గావించిన, రాఘవుండు వారల కరలాఘ వంబు తనకు సమానంబని తెలిసి, యుద్ధంబు సేయ నొల్లక యూరక యుండె.

## —శ్రీరాముఁడు మూర్ఛిల్లుట—

(అప్పుడు) కుశుండు నిశిత విశిఖంబులచే మర్మంబులు నొప్పించిన, మరణ సమానంబైన మూర్ఛనొంది (శ్రీరాముఁడు) రథంబుపై నొఱగంబడు టయు, లవుండు లాఘవంబున నయ్యారదంబున కుఱికి, యతనిం బొరలించి, కిరీట కుండల హార కేయూర కటకాంగదాది భూషణంబులును, పీతాంబరంబు నొడిసికొని, భరత లక్ష్మణ శత్రుఘ్నుల భూషణాంబరాదులు గైకొని, రఘు వీరుని ధరాతలంబున దొర్లించి, యా దివ్యరథంబుపై నధివసించి, యన్నయుం దమ్ముండునుం బోవునెడ నొక్కచోట మిక్కుటమ్ములైన యుక్కుటమ్ములచేఁ జాల నొచ్చి పడియున్న జాంబవంతుని హనుమంతునిం జూచి, లవుండు నవ్వుచు, 'మన యమ్మకు ముదంబుగా నీ భల్లూకంబును వానరంబునుం గొని పోవుద' మని పలికిన, నాంజనేయుండు భల్లూక వల్లభుం జూచి, మెల్లన 'కంటివే? రామ లక్ష్మణ భరత శత్రుఘ్నుల యవస్థ! మన మెంతవారము? బ్రహ్మాదులకేనియు శుభాశుభము లనుభవింపకఁ దీరదు. వీరలం గిరుకు వెట్టి పోవుదమంటిమేని, లవుండు మిక్కిలి మొక్కరీఁడు. కావున మనకుఁ బ్రాణ హానియగుం గాని ప్రయోజనంబు లేదు. దైవానుకూల్యంబును జాలదు. జీవంబులుండిన వలసిన శుభంబులు పడయవచ్చు. పట్టుకొని పోయినం బోవ నిమ్మ'ని యూరకుండుటయు, బాలభాను ప్రభాభాసమానంబును, సముజ్జ్వల కేతనంబును, సమీర సంచలత్పతాకంబును, దివ్య సైంధవ బంధురంబును, నవ రత్న ఖచితంబును, జలధర గంభీర స్వనంబును, వాయువేగంబునైన దాశరథి రథంబున జాంబవంతు హనుమంతులఁ దీవియలఁగట్టి, యీడ్చుకొని పర్ణశాలకుం జని, యెదురుసూచుచున్న తల్లికి మ్రొక్కి 'అమ్మా, నీకు వేడుకగా నీ భల్లూ కంబును, వానరంబును బట్టికొని వచ్చితిమ'ని, ముందరంబెట్టి, రామలక్ష్మణులు మొదలగు నన్నలువురన్నదమ్ములపాటు విన్నవించుటయు, జానకీదేవి విస్మయా క్రాంతయై, 'రఘువీరుని మీరు జయించుట జింక పిల్లలు సింహంబును జయించిన తెఱంగుగా నున్నది. దీని నమ్మఁగూడదు. అయినను దైవయోగం బెవ్వరికి నెఱుంగనగు? అక్కటా! నే నజ్ఞాతవాసంబు సేయుచు నా యునికి యొరు లెఱుంగకుండఁ దపంబు సేయుచు నుంటి. నన్ను బయలుపఱచితిరి'. అని

లవునిం జూచి, 'వాల్మీకి యిచటికి రాకమున్నె యభిమాన ధనులైన యీ జాంబవంతుని, హనుమంతుని నచ్చటనే విడిచి రమ్మ'నుటయు, నతండట్ల కావించె.

## -వాల్మీకి శ్రీరామాదుల మూర్ఛ దీర్చుట-

అంత నారదునివలన నావృత్తాంతబంతయు నెఱింగి వరుణలోకంబు నుండి వాల్మీకి సత్వరంబుగా నిజ తపోవనంబునకు వచ్చి, యాశ్రమ ద్వారంబున మూర్తిమంతంబులైన దివ్యాస్త్ర మంత్రంబుల కైవడి నతుల తేజో విరాజమానులైన జానకీ సుతులంగాంచి దీవించి, కౌఁగిలించుకొని, 'మీకుఁ గయ్యంబు సంఘటిల్లెనని వింటి. రాఘవుల దివ్యాస్త్ర ఘాతంబులచే గాయంబులు లేవుగదా?' అని పాణితలంబున మేనులు నిమురుచు 'మీకేల యాలంబయ్యె? సవిస్తరంబుగా నెఱింగింపుఁ' డనినఁ, గుశుండు హయంబుఁ బట్టుటయును, సౌమిత్రి భరత శత్రుఘ్నుల పాటును, నరవానర రాక్షస వధంబును, రామ విభుని నిధనంబునుం దెలిపిన, విని వాల్మీకి, 'యక్కటా! యిట్లు చేయుదురే? ఏమియు నెఱుంగని బాలకులు మీర'లని పలుకుచు, రక్తమాంస మేదో మస్తిష్కమయంబును, భూత బేతాళ పిశాచ సంకులంబునై, దానవ మానవ వానర దేహఖండంబులచేతం గనుపట్టుచు, ఘోరతరంబైన రణాంగణంబునకుం జని, రఘువీరుల నలువురం జూచి, కమండలూదకంబు కరంబునం గొని యభిమంత్రించి చల్లుటయు, వారలు సుఖ నిద్రఁజెంది మేల్కాంచిన తెఱంగున మూర్ఛలు దొఱంగి, యుదయార్కబింబంబుల చందంబునం బ్రకాశించుటయు, దివ్య దుందుభి ధ్వానంబులు, నప్సరోనాట్యంబులుఁ, బుష్పవృష్టియుం గలిగె. దేవత లమృత వర్షంబులు వర్షించుటచే నర వానర యాతుధాన బలంబు లన్నియు నెప్పటియట్ల బదికె. అంత, మునిజన సేవ్యమానుండైన వాల్మీకి మహామునికి రాఘవుండు, తమ్ములుం దానును నమస్కారంబు గావించిన, నత్తపోధనుం డాశీర్వాదంబు సేసి యిట్లని (స్తుతించె):

## -వాల్మీకి శ్రీరాముని స్తుతించుట-

'మహాత్మా, నీవు జగన్నాయకుండవు. సృష్టి స్థితి సంహారంబులు నీ లీలా విహారంబులు. కులాయిండు చిఱుతకలశంబులు, గరగరలు, కటాహం

బులుంజేసిన కరణి, నీవు కొందఱ నధికులను, గొందఱ నల్పులనుగా సృజించి నాఁడవు. నీవు శ్రీమన్నారాయణుండవు. సీతాదేవి శ్రీమహాలక్ష్మి. మీ లీలావినోదంబులు వేద సన్నుతంబులు. కొడుకు లెఱుంగక తప్పు సేసినను దండ్రి సహింప వలయుంగాని, నిగ్రహింపఁ జనదు. పుత్రుల శౌర్యంబును దేజంబును విద్యయు జనకులకు సంతోష కరంబులు గదా! అతి బాల్యంబునఁ దాటకను వధించి, హరుని కోదండంబు ఖండించి, భార్గవుగర్వంబు మాన్పి, విరాధు వధించి, ఖరదూషణ మారీచ కబంధాదులఁ దెగటార్చి, వాలినొక్క కోలం గూల్చి, లవణ జలనిధిం బంధించి, రావణ కుంభ కర్ణ ప్రముఖ నిఖిల రాక్షస సంఘంబుల నంతంబునొందించి, బ్రహ్మరుద్రాదులు నుతింపఁ జటిల ప్రతాప దీపితుండ వైన నీ యెదుటఁ బద్మ గర్భాదులైన నిలువం జాలరనిన యెడఁ, జెక్కుగీఁటిన నేడువనేరరు. ఉగ్రుద్రావు ప్రాయంపు శిశువు లెదిరింపం జాలుదురె? నేను బాతాళంబునకు వరుణుని యాగంబు నెరవేర్పబోయి యుండుటకతన నీ తనూభవులు నిన్నెఱుంగని కతంబున నింత యపఖ్యాతి సంభవించె?'

అనిన విని, శ్రీరామచంద్రుండు సంతుష్టాంత రంగుండై, యబ్బాల కులంజూడవలెఁబిలిపింపు మనుటయు, వల్మీక సంభవుండు శిష్యులంబనిచి పిలి పించినఁ గుశలవులు గపదొనలు బిగియించి, ఖడ్గంబులుపట్టి, శరచాపంబులు వీణియలుంబూని, వచ్చి, గురు సమక్షంబున నిల్చి, నమస్కరించి, తదను మతంబునఁ బంచపాతక హరంబును, గాయత్రీమయంబును, భుక్తి ముక్తి ఫల దంబును, సీతా చరిత్రంబును, బవిత్రంబునైన శ్రీరామాయణంబు నానారాగంబుల వర్ణవిన్యాస విశేషంబులఁ, దాన మానంబులం దుంబురు నారదులకరణి గానంబు సేయుటయు,రఘువంశాగ్రగణ్యుండు వారలం బునః పునరాలింగనంబు సేయుచు, సీతా వియోగ సంతాపంబుమాని, హర్ష బాష్పంబులుగురియ గద్గదకంఠంబున సౌమిత్రితో, 'వీరల ముఖ సౌందర్యం బవయవ సౌకుమార్యంబుఁజూచిన జానకి యట్లయున్నయది. కంటివే?' యనుటయు, సౌమిత్రి 'మిత్రకులాగ్రణీ, నీ శాస నంబున నిర్భర గర్భ పరిపూర్ణయైన జానకీదేవిం గాఱడవిలోన నిర్దయత్వంబున

విడిచివచ్చిన, నయ్యమ్మ యప్పుడే మూర్ఛిల్లి పంచత్వంబు నొందినట్లుండె' నను టయు, వాల్మీకి, 'రఘునందనా, ఆ సమయంబున నేను యాగ యూప దారు హర ణార్థముగా నా వనంబునకుం జని, యబలావిలాపంబు నాలకించి, చేరంజని శోకాక్రాంతయు, ధూళి ధూసరిత కేశభార వివర్ణవదనయు నైన, వధూమణిం గనుంగొని, నీవెవ్వరిదానవు? ఏల శోకించెద వనిన, నేను జనక రాజ తనూజను. రఘూద్వహుండను మద్భర్త. లోకాపవాద నిమిత్తంబుగా నన్ను నడవులం ద్రోయించె ననిన, నూఱడించి, యాశ్రమంబునకుం గొనిపోయి, తపస్వినుల నియమించుటయు, వారలు గర్భ సంరక్షణంబు సేయుచుండ, గతిపయ దినంబు లకు నొక్క శుభ లగ్నంబున నిక్కుమారులం గనిన, నేను జాతకర్మాది విధా నంబు లాచరించి, వేదవేదాంగంబులు ధనుర్వేదంబుం జాపవిద్యాకౌశలంబును, శ్రీమద్రామాయణంబును నేర్పితి' ననిన, రాఘవుండు, 'మహాత్మా, నీ కృప యెవ్వరియందు గలిగె వారలు కృతకృత్యులై నీ యనుగ్రహంబున నభివృద్ధిం బొందుదురు. మా బోంటులంబేర్కొననేల?' యనియె.

## -శ్రీరాముడు పుత్రులంగొని యయోధ్యకుం జనుట-

అప్పుడు వాల్మీకి యర్భకులం జూచి, కనుసన్న సేయుటయు, వారలు తండ్రి పాదంబులకు మ్రొక్కి దండప్రణామంబులు గావించి, 'యజ్ఞానులము. అపరాధులము. ఊహాపోహా పరిజ్ఞానంబు లెఱుంగని మూఢులము. ఆత్మద్రోహు లము. మమ్ముం గటాక్షింపుము. మేము వైదేహీనందనులము'. అని పలికి వెండియుందండ ప్రణామంబు సేసి లేవకుండిన, శ్రీరామచంద్రుండు కరుణాకలిత హృదయుండై, తన దీర్ఘ భుజంబులచే వారిని లేవనెత్తి, శిరంబులు మూర్కొని, యంకంబున నునిచి, సంతసంబున మన్నించి, యధ్వరాశ్వంబుం దోడ్కొని, సేనా సమేతంబుగా నయోధ్యకువచ్చి వాల్మీకి నవలోకించి, సభామధ్యంబున నిట్లనియె. 'మునీంద్రా, నీ పుత్రికయగు సీత పరమసాధ్వి. నాఁడు దేవతలు, రాక్షసులు, వానరులుంజూడ నగ్నిప్రవేశంబు సేసె. అది ప్రజలెఱుంగరు. కావున సంది యంబు నొందెదరు. వీరల సందేహ నివృత్తిసేయంగోరెద. ధరిత్రీనందనం బిలి పింపు' మనిన, మహర్షివర్యుండు నిజాశ్రమంబునకువచ్చి, యందుం దపఃకృశ శరీరయునైన జనక పుత్రికంగాంచిన, నద్దేవి మునీంద్రు పాదంబుల కెఱఁగి 'మహాత్మా, నా తనయు లెచటనున్నారు? క్షాత్రవులబారిం బడిరో? పతి నెచట

బాయుటయుంగాక, పుత్రశోకంబు నొందవలసియున్నదో? నన్ను బ్రహ్మదేవుండు శోకంబునకై సృజించెనో?' అని విలపింప, నూరార్చి యమ్మునీంద్రుండు 'వత్సంబునెడబాసిన ధేనువు కరణి నేల యడలెదవు? దుఃఖార్తవైన నీవేమి పల్కిన మాకు నెగ్గుగాదు. నీ కుమారు లిరువురు నయోధ్యాపురంబునం దండ్రి చెంగట సుఖంబున నున్నవారలు. కాకుత్స్థుండు నిన్నుం దోడ్కొని రమ్మనిపంచె' నని పలికి యరుగుదెమ్మని యమ్మానవతీమణిం దోడ్కొని యయోధ్యాపురంబునకు వచ్చుటయు, రఘూద్వహుండు పరమానంద కందళిత మానసుండై పుత్రులు గొలువ, భార్యాసమేతంబుగా హయమేధంబు సాంగంబుగా నెఱవేర్చి, సంపూర్ణ దక్షిణల బుత్విజులం బ్రీతినొందించి, ధన కనక రత్న భూషణాంబరాదులచేత నాశ్రితుల, మిత్రుల, భృత్యుల, భూసురుల నృపులనందఱం దనియించి, రాజ్యపరిపాలనంబు సేయుచు సుఖంబున నుండె. ఏ సరణిం గుశలవులతో శ్రీ రామభద్రుండు రణంబు సేసె, నారీతి నర్జునుండు బభ్రువాహనునితో యుద్ధంబు సేసెను.

ఇవ్విధంబున బభ్రువాహనుం డర్జునునితోడం దారసిల్లు నవసరంబున, హంస కేతనుండు తన తనూభవులు గయ్యంబునం బడిన యప్పుడు శ్రీకృష్ణుండు తన యందుఁ జేసిన సన్మానంబు మనంబునం దలంచి, శౌరికిం బ్రియ సఖుండైన కిరీటి కార్యంబునఁ బ్రాణంబులీయ నిశ్చయించి, బభ్రువాహనుని దాకి, యతని చక్రరక్షకులగు యోధవరులు వేయింటిని వేయి బాణంబుల ఖండించి, వెండియుఁ గాలదండోపమానంబులగు కాండంబులు నిగిడించి, యరదంబు చక్కడిచి, ప్రతివీరుండు ప్రయోగించు శిలీముఖంబులు విముఖంబులు గావించి, తోడనే తన్నుఁజుట్టుకొనిన యయిదక్షౌహిణుల సైన్యంబు రథగజతురగ పదాతి బృందంబుల తోడం దెగటార్చి, ప్రళయ కాలరుద్రుండునుంబలె మండుటయు, బభ్రువాహనుండు సత్వరంబుగా వేఱొక్క రథంబెక్కి, హంస ధ్వజుని మార్కొని, వేయిబాణంబులచే నరదంబు వేయితునుకలు గావించి, మఱియు నిశిత విశిఖంబులు పరఁగించి యా రాజును మూర్ఛితుంజేసి, మూర్ధాభిషిక్తులైన రాజేంద్రుల రథ రథ్యసూత సమేతంబుగా వేయిమంది నొక్కనిమిషంబునం దెగటార్చి యార్చుటయు, యౌవనాశ్వకుమారుండైన సువేగుండడ్డుపడి, తొమ్మిది బాణంబులఁ గిరీటి నందను యురంబును,మూఁడు నారసంబుల నాతపత్రంబు,ధనువునుఁ బతాకయుఁ దునిమి, యతని యొద్ది వీరయోధుల వేయింటిని వేయిబాణంబులం

దెగటార్చి, వెండియుఁ బదిమాఱుల ప్రదరంబులు నిగిడించి బభ్రువాహనుని దేహంబు నిరంతరంబుగా గ్రుచ్చె.

## -సువేగ బభ్రువాహనుల యుద్ధము-

ఇవ్విధంబున సువేగుని శరవేగంబుఁ జూచిన దేవేంద్ర పౌత్రుండు దావ పావకంబునుంబలె విజృంభించి, వాని బాహుగర్వంబు వారించుచుఁ, బ్రచండ కాండంబులు ప్రయోగించి తెల్ల యేనుంగు తండంబులం ద్రుంచి, మాతంగ తురంగ శతాంగ భట కళేబరంబులచే రణభూభాగంబు గప్పి, వెండియుం గ్రోధావేశంబునఁ గోదండంబునందొక్క పాఱవాతి యమ్ము దొడిగి, యాక ర్ణాంతంబుగాఁ దిగిచి, సువేగుని రెండుగా ఖండింప దలంచి యేసినఁ, గ త్తిరించిన చందంబునఁ బూర్వాధఃకాయంబులు సమంబుగాఁ దూచినట్లు తెగి, తత్ఖండంబులు క్రిందంబడునంతలో సువేగుని కరలాఘవం బేమని వర్ణింప! నాల్గు బాణంబులు వింట సంధించి, బభ్రువాహను వక్షస్థలంబు దుయ్యనేసిన, మూర్ఛాకలితుండై కప్పడి పట్టి ధరాతలంబునం బడియె. అవ్విధంబుఁజూచి సిద్ధసాధ్యచారణ సంఘంబులు వినుతించె. అనంతరంబ, యతి శీఘ్రంబుగా మూర్ఛదెలిసి చిత్రాంగదాకుమారుండు ప్రళయకాల రుద్రుండునుం బలె రౌద్ర రసోల్లాస భాసురుండై, కిరీటి చుట్టునున్న యోధవీరులం బెక్కండ్ర నుక్కణఁ గించె. అప్పుడు బభ్రువాహనునిచే ఖండనంబునం బడిన రాజులం దత్పురంబునకుం గొనిపోయి, చిత్రాంగదా సపత్నియగు నులూచి విశల్యకరణీ ప్రముఖంబులైన యౌషధంబులచేఁ జికిత్సలొనరించి కాపాడుచుండె. అప్పుడు ధనంజయుండు కర్ణకుమారుం జూచి, 'మన సైన్యంబులు నిరవ శేషంబుగా సమయింపఁ బడియె. హంసధ్వజుండును, యౌవనాశ్వుండును, సువేగుండును, నీలధ్వజుండును, మొదలైన దొరలు పెక్కండ్రు పడిరి. ప్రద్యుమ్నుండు పట్టుబడియె. అనుసాళ్వుండేమయ్యెనో యెఱుంగము. కుమారకా, కాలంబు విపరీతంబుగాఁ దోచుచున్నయది. నా దేహచ్ఛాయ శిరోవిహీనంబుగాఁ గనంబడియెడు. కనులఁ గోపాగ్నిజ్వాలలు పుట్టుపడియె. మఱియు దుర్నిమిత్తంబులనేకంబులుగాఁ గనుపట్టుచున్నవి. ఏమయిన నేమి! చావునకుం దలంకం బనిలేదు. నీవును బాణ సహస్రంబులచే జర్ఝరితాంగుండవై మిగుల నొచ్చియున్నవాఁడవు. నేను

జీవితుండనై యుండు నప్పుడే నీవు దప్పి పొమ్మ. తిలోదకంబులైన నిత్తువు. అకటకటా! అసిధారావ్రతంబుగాఁ బాండవాగ్రజుండు యాగంబునకు దీక్షించి నా భుజావిక్రమంబు నమ్మి, మహా క్రతువు నుపక్రమించిన యత్నంబు విఫలంబయ్యె. ఖదిర బదరీ పలాశ బిల్వ యూప కలాపంబు లోపంబునొందె. చషాలకల్పనంబు మృషయయ్యె. అరువది నలుగురు విప్రదంపతులు యజమానునకుఁ జేయం బూనిన కనక కలశ పాత్రాభిషేచన విధానంబు వృధ యయ్యె. కనక మయంబైన శలాకా శతంబుచే విరచితంబును, శార్దూల చర్మోపయోజితంబునునైన ధవళ ఛత్ర సముల్లాసంబు హ్రాసంబయ్యె. యాగ మండపాభ్యంతరంబున హర్షమాణులైన బ్రహ్మర్షి మహర్షి పుంగవుల మంగళాశీర్వాదంబుల యర్థంబులు వ్యర్థంబులయ్యె. అవభృథస్నాన సమయంబున బంగరు శలాకల కరణి శృంగారంబులు దనర సర్వాభరణ భూషితలై యమూల్యంబులైన గంధ మాల్యాంబరంబులు ధరియించి పదేసి యేండ్ల బాలికలు కనక దండ మండితంబులైన చామరంబులు విసరు వైభవమ్ము వమ్మయ్యె. రుక్మిణీ సమేతుండైన పుండరీకాక్షునకు నగ్రపూజ సేయవలయు నను ప్రసంగంబు భంగంబయ్యె. ఇంకనెంత వగచిన నేమికార్యంబు! నా జన్మంబు వ్యర్థంబయ్యె. సంగరాంగణంబునం బగతుని తోడం దలపడి నాయోపినంతయుం బోరి మరణంబు నొందుట మేలు. నీవు కృష్ణ యుధిష్ఠిరుల పాలికింజని యీ వృత్తాంతంబు పలుకరెంపు' మనిన, వృషధ్వజుండు కపిధ్వజునితో నిట్లనియె: 'అయ్యా, బహు భాషలు నేను బలుక నోడుదు. రవి బింబంబు ధరణీతలంబున వ్రాలిన, సముద్రంబు లింకిన, ధరణీతలంబు తలక్రిందైన, మేరువొఱగిన నేనియు, వైరి వీరులకు వెన్ను సూపువాఁడగాను. దేవేంద్రాది దేవత లెదిరించిరేనియు, జయింపం గలయట్టి నా ముందఱ నీ శాత్రవులేమాత్రము! నీ ప్రాపు నుండుటఁ జేసి నా కసాధ్యంబు లేదు. ఏలినవారి కార్యంబున, మిత్రకార్యంబున, గో బ్రాహ్మణకార్యంబున, నెవ్వాఁడు దేహంబు పరిత్యజించు, నతనికిఁ 'గైవల్యం బెదురుగా వచ్చునని ధర్మకోవిదులు పలుకరింతురు. నా పరాక్రమంబు గనుగొను'మని మ్రొక్కి, రథారూఢుండై దుర్వార భుజాగర్వంబు నిర్వహింపబూని, యుభయ సైన్యంబులు వినుతింప, వృషకేతనుండు ఘలయు కేతనునిందాకె.

## -వృషకేతన బభ్రువాహనుల యుద్ధము-

అంతఁ గిరీటి నందనుండు వృషకేతను వీక్షించి, యతని వక్షంబునందు మూడు బాణంబు లేసిన నది వెన్నున దుస్సి, పాతాళ గంగాజలంబులు గ్రోలం బోవు చందంబునఁ బుడమిలోనం దూఱిన, సూర్య పౌత్రుండీడఁజనక మూఁడు శిలీముఖంబు లురంబునం గ్రుచ్చిన, బభ్రువాహనుండు సారథి రథ రథ్య కేతన ఛత్ర సమేతంబుగా రథంబు దునుమాడినం, గర్ణపుత్రుండు వేఱొక్క శతాంగంబునెక్కి, పరాక్రమించినం, బార్థనందనుండు దానిం జక్కడిచె. వెండియు నొండు రథంబు మీఁద నెక్కిన, నవ్వీరుండు దాని ఖండించె. అవ్విధంబున వేయి రథంబులు ఖండించిన, రాధేయ తనూభవుండు వేఱొక్క యరదంబు నెక్కి, నానావిధ శస్త్రాస్త్రంబులు గురిసిన, నరనందనుండు సరిపోరు నెడ వృషకేతనుం డాగ్నేయ పార్జన్య యామ్య సౌరాది బాణ పరంపరలు ప్రయోగించిన జిత్రాంగదా కుమారుండు నారాయణాస్త్రంబున నన్నియు ఖండించి కర్ణసూనునిం జూచి, 'మద్బాహాపరాక్రమంబునం బొలిసిన నీ సేనల చందంబు గనుగొంటివె ? వృత్రాసురుం డమరేంద్రు నెదిరించు చందంబున నీవు నా యెదుటం బడితివి. ఎందుబోయెదవు ?' అని చిరునగవు నెమ్మొగమ్మున నివ్వటిల్ల, వాయవ్యాస్త్రంబు వింట సంధించి, వృషకేతనుని యురంబు డుయ్య నేయుటయు, నతండెగసి బ్రహ్మాండ కటాహంబునం గొట్టువడి భూమి పయిం బడక జీర్ణపర్ణంబు సుడిగాలిలోనం దవిలినట్లు, ప్రాక్పశ్చిమ దక్షిణోత్తర దిశాభాగంబులం జుట్టుముట్టి, మూఁడు ముహూర్తంబులలో గ్రమ్మర యుద్ధంబునకు వచ్చి, వ్రాలి, కర్ణపుత్రుండు కుదురుకొని, బభ్రువాహనునిపయి నుద్ధురాస్త్రంబు ప్రయోగించుటయు, నతండు రథంబుల తోడం గూడ రవిమండల పర్యంతంబు నెగసి భగ్న రథుండై, దగ్ధపక్షుండైన సంపాతి పక్షియుంబలె పుడమిపయింబడిన, నతని నవలోకించి, వృషకేతనుండు 'హంసధ్వజాది నృపాలురం బలువురఁ బొలియించితి. మదీయ శరాగ్ని దగ్ధుండవై యప్పాతకంబుఁ బాపికొనుము'. అని శిఖి శిఖాసంకాశంబులైన శిలీముఖంబు లనేకంబులు ప్రయోగించినం, గవ్వడి తనయుండు నవ్వుచు వాని ఖండించి, గగనంబున కెగసి, మందర నగంబు చందంబున వృషకేతను నరదంబుపయిం దుముకుటయు, నయ్యరదంబు భూతలంబున నణంగి కనం బడదయ్యె.

వృషకేతనుండు లాఘవంబున నవ్వలికిం దుమికినఁ గిరీటి తనయుండు శరపంచకంబున నతని మర్మంబులు నాటించి, యార్చినం, దరణిపౌత్రుండు పినతండ్రిం జూచి, 'మున్ను మీతోడం బోరునప్పుడరదంబు పుడమిలో నణంగిన రాధేయునంత యోధు నిన్నుం జూచి నిలువుమని వేఁడె. నేనట్లు పలికినవాఁడఁగాఁను. నా ప్రతాపంబు గనుఁగొన నవధరింపు'మని పలుకునంతలో, బభ్రువాహనుం డొక్క శరంబునఁ గర్ణజుని శిరంబు పగులనేసిన సరకుగొనక, యతండు పెక్కుశరంబు లొక్కుమ్మడిం గురిసె. ఇవ్విధంబున నొకరి నొకరి చీరికింగొనక, కొంతతడ వంబరంబునం, గొంతసేపు భూతలంబునం, గొంతవడి దిగంతంబులయందును రథంబు లెక్కియు, విరథులయ్యును, నిమిష మాత్రంబు నిలువక తమ శరీరంబులంగాఁడి పాఱిన కాండంబులచే ఖండితంబులైన మాంసఖండంబులకై కాక కంకగృధ్రంబు లాకసంబున గుంపులు గూడ నయిదహోరాత్రంబులు నిరంతరంబు సమరంబు సేసిరి. అంత నాబభ్రువాహనుండర్బుదన్యర్బుద సంఖ్యలైన బాణంబులచే నొప్పించి, 'కర్ణనందనా, యిన్నిదినంబులు నాతోడ నెదిరించి పోరినయపుడే మెచ్చుకొనవచ్చు; నింకనిన్ను బొరిగొనక విడువ. ముకుంద చరణారవిందంబులు డెందంబునం బాదుకొల్పు'మని పలుకుచు, మెఱుంగులు దురంగలించు నర్ధచంద్ర బాణంబు నిగిడించినఁ గర్ణతనయుండా బాణంబు మూఁడు తునుకలుగా ఖండించి, యట్టహాసంబు సేయునంతలోఁ బార్థసూనుండు గనకరేఖావిరాజితంబును, గంకపత్రచిత్రితంబును, గాలాగ్నికీలా సంకాశంబునైన కాండంబు నా వృషకేతను కంఠంబు లక్ష్యంబుగాఁ బ్రయోగించిన; గుండలాలంకృతంబును, జంద్రమండల సన్నిభంబునైన యాతని ముఖమండలం బెగసి పుండరీకాక్షునిఁ బేర్కొనుచు గాండీవి పదంబుల వ్రాలినం, దత్కబంధంబు చతురంగ బలంబుల మడియించుచుఁ బుడమిమీఁదం బడియె.

అంతఁ గుంతీనందనుండు పూర్ణచంద్రోపమానంబును, గిరీట కుండలాలంకృతంబునైన కర్ణజుని శిరంబు కరంబుల బూని, 'హా, వీరమూర్ధన్యా, హా, యుధిష్ఠిర సన్మాన్యా, హా, కుమార కంఠీరవా, హా, వైరిభయంకర జ్యారావా, నిను రిత్త చంపికొంటి. ప్రియనందనుండవు, నర్కుని మనుమండవు నైన నిన్నుఁ గైదువుల పాలుసేసి లోకబాంధవుని తోడి విరోధంబు సంపాదించికొంటిని. అభిమన్యునంతరంబున నన్వయంబు నీవలన నిల్చునని నమ్మియుంటి.

గుణనిధానుండవైన నిన్నుం గోలుపోయి కృష్ణయుధిష్ఠిరుల చిత్తంబులుత్తలంబు నొందించితి. మున్ను హయమేధాశ్వంబు సాధించి తెచ్చునప్పుడు భీమసేనునకు సహాయంబుగాఁ జని వైరుల జయించి వాజిని హరించిన నీవిప్పుడు నాకు సహాయంబుగా వచ్చి, విపక్షుల చేతంబొలిసి యటవి పక్షుల పాలయితివే! కుమారకా, దినమణి లేని దినంబు కరణి, దీపంబులేని యంధకారమందిరంబు చందంబున, లింగంబు లేని పీఠంబు కరణి, నీవులేని జయంబు నిష్ఫలం'బని, బహుప్రకారంబులం బలవించి, తన యురంబున నతనిశిరం బునిచికొని, మూర్ఛితుండై, పెద్దయుం బ్రొద్దునకుఁ దెలిసి వెండియుం బరిదేవనంబు సేయు ధనంజయుం గనుంగొని, బభ్రువాహనుండిట్లనియె: 'ఏను వైశ్యానకుం బుట్టిన వాఁడఁ గావున సంగరంబను సముద్రంబులో, సరదంబను నావనెక్కి, వీరయోధ శిరోరత్నంబులు బేరంబులాడుచుఁ, గర్ణసూనుని శిరంబనియెడి యనర్ఘంబైన రత్నంబు వెలకుం గైకొని నీకునిచ్చితి. దీనినిం బశుపతికి నర్పించి, పాశుపతాస్త్రంబు గైకొని నన్ను మార్కొనం జూడు' మనిన విని, కిరీటి, కర్ణసూతి మస్తకంబు రథంబుపై నునిచి, కన్నుల నిప్పులు ప్పతిలం జూచుచు, సరభసంబుగాఁ జాపంబు సజ్యంబు గావించి, గుణంబు మ్రోయించుచు, 'నోరీ దురహంకారీ, పెక్కు మాటలేమిటికిం బ్రేలదవు? శూరుండవైతివేని నాయెదుటం బౌరుషంబు సూపు'మని పలికెను.

## --అర్జున బభ్రువాహనుల యుద్ధము--

(అట్లు పలుకుచు నర్జునుండు) చిత్రజిల్లుగా భల్లంబులు గురియుచుఁ, గాలసర్పోపమానంబులును, గనక పుంఖంబులునై, కుటిచ కనుపులం గనుపట్టు శిలీముఖంబులు బహు ముఖంబులం బ్రయోగించుటయు బభ్రువాహనుండు తూలె. బలంబులు సలుగడలకుం బఱచె. అప్పుడు శిరంబులు లేని మొండెంబులీడ్చి కొని దెసలకుం బఱచు వాహనంబులును, నుగ్గు నూచంబునుం బొడి పొడియునునై గగనంబున గాలికిం బోవు రథంబులును, దుండంబులు, గండంబులు, పాదంబులు, రథంబుఖండెగి, రక్తసిక్తాంగంబులై సమీర తాడితంబులైన సాంధ్య మేఘంబులకైవడి దెసలకుం బరువెత్తు నేనుంగులును, భిన్నభిన్నంబులై శిరః పాణి పాద వక్షోమధ్య జంఘా జాన్వాద్యవయవంబులతోడం బొరలు వీర భటులును, గలిగి సమరాంగణంబు రక్తమాంస కర్దమంబులం దుర్దమంబయ్యె. మఱియు, నకౌంతేయు దివ్యాస్త్రజ్వాలలు కాలానలంబు కైవడిం గెరలి

బభ్రువాహనుని మణిపురంబుసం దరికొని, ప్రాకారంబుల నిరాకారంబులను, నట్టాలకంబున నేలమట్టంబులను, నగారంబుల నిగుఱులను, వీధుల బూదులను గావించుచు, విజృంభించుటయుఁ, జిత్రాంగదా నందనుండు నిజబాహుశక్తిచే జంభారిసుతుని సంరంభంబు స్తంభింపజేసి, మూడు బాణంబుల సారథినొప్పించి, నాల్గు మార్గణంబుల ఘోటకంబుల గీటడఁగించి, యేకమ్ముఁ గపిధ్వజమ్ము నాటించి, ఫాలాక్ష ఫాలాగ్ని కీలా కరాళంబులైన బాణజాలంబుల మర్మంబులు నొప్పించుటయు, గాసింజెంది గంగా శాపంబు సన్నిహితంబగుట కతన నాగ్నేయ వారుణ వాయవ్య గాంధర్వ పైశాచ సమ్మోహనాస్త్రంబులలో నొక్కటియుం దోఁచకుండుట వలన వివర్ణత్వంబు నొందిన వదనంబుతో, నస్తమయ సూర్యుని చందంబును, క్షీణంబగు తేజంబుతోడం గుందు పౌరందరిఁ జూచి, మణిపురాధీశ్వరుండు నవ్వుచు, 'నయ్యా, పతివ్రతామతల్లియైన మా తల్లిని సభామధ్యంబునం దొల్లి యప్రియ వచనంబులు పలికిన పాతకంబునకుం గాలంబు సేరవచ్చె. ఇవ్వేళఁ దల్లినిఁ దండ్రిని, నన్నదమ్ముల, జుట్టంబుల నెవ్వరిం దలంచినఁ బ్రయోజనములేదు. సనాతనుండును భవదీయ సూతుండునైన శ్రీకృష్ణుని ధ్యానంబు సేయు'మని పలుకు నవసరంబున నీరదంబులు నెత్తురులు గురిసె. మొరపఱాలు రువ్వుచు ఝుంఝూమారుతంబులు వీచె. దిగంతంబులు గావిరి గప్పె. పొగలేక యాయుధంబులు మండె. ఇవ్విధంబున నర్జును వినాశ సూచకంబులైన యుత్పాతంబు లనేకంబులు గనంబడుచుండ బభ్రువాహనుండు మండుచు, నవరత్న ఖచితంబును, గంకపత్రవిభ్రాజ మానంబును, స్వర్ణ రేఖాంకితంబును, సన్నతపర్వతంబును, గాలవంతోపమానంబును, నర్జును ప్రాణాపహరణ కారణంబును, జ్వాలా నామకంబునైన శరంబు వింటం బూన్చి యాకర్ణాంతంబుగాఁ దివిచి కిరీటి కంఠంబు లక్ష్యంబుసేసి ప్రయోగించె.

## —అర్జునుండు శిరంబు దెగిపడుట—

అది యపూర్వ వైరానుబంధంబున మథ్యమాన సాగర సముద్భూత కాలకూటంబు కరణి, చటచ్చటా శబ్దంబుల మింటనంటు మంటలు, మిణుంగురులు, పొగలు, సెగలు రగులుకొన, జగంబులు దిగులువడం జేయుచుఁ, బఱతెంచినం గని ఫల్గునుండు లేశమాత్రంబేని మనంబున భయంబు నొందక, నానావిధంబులైన దివ్యాస్త్రంబులు ప్రయోగింప, వానినెల్లం గబళీకరించుచు, దశదిశాభాగం

బులు ఘూర్ణిల్లం జనుదెంచి, కంచు కంఠంబును, గమల దళ నేత్రంబులును, గనక రత్నకిరీట కుండలాభిరామంబును, గైరవ మిత్రబింబోపమానంబును నైన కవ్వడిశిరంబును ఖండింప, నది 'కమలనాభా, కనకాంబరధరా, కౌస్తుభోద్భాసితాంగా, కమలామనోహరా, కైటభాంతకా, నిన్నే నమ్మినవాఁడ!' నని కీర్తించుచుఁ గార్తిక మాసంబున శుక్లపక్షంబునం దేకాదశీ భౌమవాసరంబున, నుత్తరానక్షత్రంబున ధరణీతలంబునం బడియె. తద్దేహంబు వృషకేతనుని దేహ సమీపంబునం గెడసె. అప్పుడా కర్ణపురందరనందనుల శిరంబులు రత్నకుండల కిరీట ప్రభాదీప్యమానంబులై రెండు సూర్యబింబంబులుంబలెఁ బ్రకాశించె.

ఇవ్విధంబున బభ్రువాహనుండాహవంబున వృషధ్వజ కపిధ్వజుల వధియించి, జయోత్సాహంబునం బొదలుచు, మగిడి వచ్చునప్పుడు, పురంబున పన్నీరు చిలికించి, కప్పురంపు రంగ వల్లికలు దీర్చి, పట్టాంబరంబుల మేలుకట్లు గట్టి, తోరణంబులు సవరించి, వారాంగనా నాట్యయోగ్యంబులైన యంత్ర విశేషంబులమర్చి, యగురు సాంబ్రాణి ధూపవాసనలు గుబులు కొనంజేసి, పూర్ణకలశంబులు దధిదూర్వాక్షత మంగళ ద్రవ్యంబులు సంఘటించి, వాద్యఘోషంబులు సెలంగ, జయజయ నాదంబులతోఁ బౌరజనంబులెదుర్కొనఁ, జయోల్లాసంబున వచ్చు వైభవంబులు సౌధాగ్రంబున నుండి కనుంగొని, చిత్రాంగద చెంగటనున్న సఖీజనంబుల నవలోకించి 'పట్టణంబున నేమి యుత్సవం'బని యడిగెను.

## - అర్జును మరణంబునకుఁ జిత్రాంగద చింతించుట -

(అప్పుడు) 'నీ కుమారుండైన బభ్రువాహనుం డర్జునుని సంహరించి జయంబు సేకొని వచ్చుచున్నవాఁడ'నిన, విని, యక్కలకంఠకంఠి, కంఠీరవంబుఁ గనిన గజరాజ కన్యకయుంబోలెఁ, గఠోర మేఘ గర్జనంబు వినిన కలహంసి తెఱంగున, బోయవాని వింటి నారి ధ్వని వినిన చిన్నారి లేడి విధంబున, బిడాల నిర్ఘోషంబు వినిన బాలమూషిక చందంబున, హృదయంబు వ్రక్కలై మూర్ఛిల్లి పుడిమిం ద్రెళ్లినం జూచి, యులూచి, దుఃఖావేశంబున మోము నురంబును మోదికొనుచుఁ బరిదేవనంబు సేసినం, దత్సఖీజనంబులు నేడువ దొడంగిన, నతింపురంబు రోదన ధ్వనులచేతం ఘూర్ణిల్లుటయు, నక్కోలాహలంబు నాలకించి బభ్రువాహనుండు చిన్నవోయిన మొగంబుతో

నంతఃపురంబునకుం బోయి, ధారుణింబడిన హారంబులును, ఖండితంబులైన కటకంబులును, విరిగిన మంజీరంబులును, బోరగిలంబడవైచిన దూర్వాక్షత లాజ పాత్రంబులు, నాఱిన నీరాజనంబులును, విరయంబడిన కురులతో నేడ్చు సఖీజనంబులుం గలిగి, దుఃఖాక్రాంతంబైన యంతఃపురంబున( జింతా క్రాంతలై మూర్ఛిల్లిన తల్లులం జూచి, 'తల్లులారా, యింత వంత నొంద నేమి టికి? ఏను శత్రు సంహారంబు సేసి జయ రమాసమేతుండనై వచ్చినయెడ నన్నభినందింపకుండుటకు( గారణం బేమి?' యనిన విని చిత్రాంగద, 'కుమారకా, నీవే నా పగదాయ వైతివి. వృక్షశాఖ వలనం జనియించిన యగ్నియే యా వృక్షంబును దహించిన తెఱంగున, నీవు పుత్రుండవై జనియించి, తండ్రి యగు నర్జునుని సంహరించితివి. కావున నింక విధవకు భూషణంబులేల? కుమారకా, నీచే నంతంబు నొందిన కౌంతేయుని చెంగటికి నన్నుం దోడ్కొని పొమ్ము. అగ్ని ప్రవేశంబు సేసి యమరలోకంబున నర్జును నాననంబు నవలో కించెద', ననిన విని యులూచి చిత్రాంగద( జూచి, 'నా యుద్యాన వనంబులో నేను గూరిమి( బెంచునట్టి యెదుదాడిమి తరువు లున్నయట్ల యుండి నిన్నటిరేయి నిష్కారణంబుగా దహింపబడియె. ఆ దుర్నిమిత్తంబు గనుంగొని మన ప్రాణ వల్లభుండైన కిరీటి మరణంబు నిశ్చయించితి' ననియె. అప్పుడు చిత్రాంగద, బభ్రువాహనుని( జూచి, 'తండ్రిం జంపిన మహాపాతకంబు సంభవించె. బుద్ధి పూర్వకంబుగా నింత పాపము వచ్చె; నింక నేటి యుత్సాహము? ఏమిటి జయంబు? సమర స్థలంబునకు మమ్ములను బిలిచికొని పొమ్మ'నిన, బభ్రు వాహనుండు భయాకులిత మానసుండై, మొగంబు వెలవెలబాఱ(, దల్లులం దోడ్కొని పోవునప్పుడప్పడంతుకలు, బెబ్బులి ఘోషంబు వినిన ధేనువుల చందంబున 'హా!' యని యుల్లంబున తల్లడిల్లి, ఖండితంబులగు కదళీ కాండంబుల చందంబున భూమండలిని వ్రాల( బరిచారికా జనంబులగు మగువలు లేవనెత్తిరి.

## -చిత్రాంగద, యులూచి యుద్ధభూమికేగుట-

(అప్పుడు వారు) నెత్తమ్ముల( బోలిన కన్నుల బాష్పధారాపూరంబులు కాల్వలై పాఱ(, దెవపులెంచ(, బొరలి యేడ్చుచు, లేచి కుప్పిరిగొను మోహం బున( బయ్యెదలు జాఱ జీరాడ, ముత్యాల పేరులు కుచకుంభంబులం బుటంబు

లెగసి దుముకులాడ, నసదుగౌను లల్లాడ, గప్పుకొప్పులు వీడ, నడుగుదమ్ములు తడఁబడ, డెందంబులఁ బొగులుచుఁ, గ్రందుగొని ఖేదంబున సమరాంగణంబు నకుఁ జనిరి.

తదనంతరంబ చిత్రాంగదయు, భుజంగ రాజ తనూభవయును, ఫల్గునుని పాదంబులపయింబడి యురంబులను, శిరంబులను మోఁదుకొనుచు, వికీర్ణ కేశ పాశలై 'హా మహావీరా, పురందరనందనా, నివాత కవచ కాలకేయాంతకా, దేవతాసమూహంబులను దఱిమి, యాఖండలుని జయించి, నగ్నిదేవుని కాహుతిఁ జేసిన నీ శౌర్యంబెందుఁ జనె? ఎక్కటి కయ్యంబున ముక్కంటి తోడఁ బెనంగి మెప్పించి పాశుపతాద్యస్త్రంబులఁ గైకొన్న నీ విక్రమంబెందణంగె? కాలకేయ నివాతకవచాది దైతేయుల నుక్కణగించి జయంబు గైకొనిన మహాప్రతాపం బేమూల డాఁగె? భీష్మద్రోణ కర్ణ కృపాశ్వత్థామ దుర్యోధన దుశ్శాసన వికర్ణాదుల జయించి. ఏకవీరుండవై గోగణంబు మరల్చిన బాహుబలంబే చక్కిం జనియె? అన్నయగు ధర్మజునిచే రాజసూయాధ్వరంబుం జేయింపంబూని, యిలావృత కింపురుష భద్రాశ్వ కేతుమూల కురువర్షంబుల దేవతాయోగ్యంబులైన దివ్యవస్తు వాహనంబుల నపారంబుగాఁ దెచ్చిన భుజావిజృంభణం బెక్కడఁ బోయె? యాదవ బలంబుల సరకు సేయక సుభద్ర నరదంబుపై నుంచుకొని వచ్చిన యా మగటిమి యేదిక్కునం బోయె? చక్కర విలుతుని ధిక్కరించు చక్కదనంబు గల నీ చొక్కటపు నెమ్మేను దుమ్మునఁ గ్రమ్మి యున్నయది! ఇంద్ర నీలకవాటంబు కరణి వాటంబైన నీ యురస్తటంబున నిశిత విశిఖంబులు నాఁటి యున్నయని! చంద్రబింబోపమానంబును, మందస్మిత సుందరంబునైన నీ వదనారవిందంబు ఖండితంబయ్యును గలకల నగుచుఁ, జెన్నుఁ దొలగక యున్నయది!' అని బహు ప్రకారంబులఁ బలవించి, తత్సమీపంబునఁ గర్ణనందనుని శిరంబుగాంచి, పక్షంబునఁజేర్చికొని, 'తండ్రీ, కుమారకంఠీరవా! కర్ణకుమారకా, నీకుఁ బినతండ్రిమైన ధనంజయుని సూడు దీర్చుకొనక యిట్లుండఁ దగునె?' యని పలికి బభ్రువాహనునిఁజూచి, 'తనూభవా, దాన శూరుఁడైన కర్ణకుమారునిం జంపితివి. ఇది నీకేమి కీర్తికలిగె? అధ్వరాశ్వంబు వెంబడి హస్తినాపురంబునకు జని కుంతీ ద్రౌపదీ సుభద్రలం, దక్కుంగల బాంధవుల నవలోకించి, యశ్వమేధావభృథ స్నానంబు సేసి, మా వల్లభుండైన సవ్యసాచితో విహరింపవలయునను కోరిక లంకురించుచునుండ వానిని ఖండించితివి. నీ జన

కునిం జంపిన తెఱంగున జనను ల మగు మమ్ముఁ బరిమార్చి మా కాంతుని చెంతకుఁ బంపుము. ఇట్లుచేసితివేని, తల్లిని మాత్రంబు జంపిన పరశురాముని కన్న మిన్న గావించితివని కొనియాడుదురు. ప్రియుఁడు పరలోకగతుండైన పిమ్మట ననుగమనంబుఁ జేయుట సతులకుచిత కృత్యంబు. కావున, నందులకుఁ దగిన యత్నంబు సేయుము. అగ్నిముఖంబునఁ బ్రవేశించి పతివిరహాగ్ని సంతాపంబు బాసెద' మని పలుకుచున్న తల్లుల నవలోకించి బభ్రువాహనుండు, 'అంబలారా, మున్ను మన సేనాపతి యెఱుఁగక హయంబుఁ బట్టిన, నది నేను విచారించి, తురంగంబును, ధనకనక వస్తువాహన రత్న భూషణాంబరంబులఁ గానుకలుగాఁ గొనుచుంజని, సాష్టాంగ దండ ప్రణామంబు గావించి, తురంగంబు మరల నొప్పగించుటయు, నాదరింపక సభా మధ్యంబునఁ దుచ్ఛ వాక్యంబులఁ బలుక గ్రించిన సహించి యుండితి. అంతట నిలుపక మాతృనిందాకరంబులైన నీచ వాక్యంబులాడుట కతనం గోపంబువొడమె. అందువలనఁ బితృహత్య సంభవించె. ఇమ్మహాపాతకంబుఁ బాపుకొనుటకై, వనంబునకుంజని, కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతంబులు, యజ్ఞదానాధ్యయనాది సత్కర్మంబులుంజేయుచు నుపవాసంబులచే మేనుశోషింపఁజేసెద. మున్ను నేను జనియించిన లగ్నంబునఁ బితృస్థానంబు క్రూరగ్రహాధిష్ఠితంబు నశుభవీక్షితంబునై యుండెంగావునఁ బితృఘాతుకుండని యెఱింగి చిత్రాంగద నన్నుంజంపక పెనుచుటవలనఁగదా యిట్టి పాతకంబు సంభవించె! ఇక నిమిషమాత్రంబేనియు శరీరంబు నిలుపుకొనంజాల. అగ్ని ముఖంబున నాహుతిగావించి పాతకవిముక్తుండనయ్యెద' ననిన, విని, యులూచి తనయునిఁజూచి, 'కుమారకా, వదరకుము. మా తండ్రియైన శేషుని నగరమున మృత సంజీవన మణి గలదు. పన్నగాంతకుండైన గరుత్మంతుని ఘాతచేఁ బ్రతి దినంబును మృతింబొందెడు పన్నగులయెడ దయచేసి పన్నగాభరణుండు నాపన్నరక్షకుండునై నీలకంఠుండు నాగకుల సంరక్షణార్థంబుగా నా రత్నంబు నా తండ్రికి దయచేసె. కుళిక వాసుకి శంఖకర్కోటక తక్షకాది నాగంబులు మణిప్రభామండితంబులైన ఫణిమండలంబులతో దానిం గాపాడుచునుండుదురు. కావున బలిమిచేతంగైకొనంగూడదు. సామవచనంబుల వేడినఁ దేవచ్చును. అంపు దకు మా వాకిటి ప్రధానియగు పుండరీకుఁడు తక్క వేఱొక్కరుండు దేనోపం'డని వానిఁబిలిచి తన తాటంక మంగళ సూత్రంబులు వానిచేతికిచ్చి, ఫణిలోక స్వామితోఁ దన మర్దశఁదెలిపి యమ్మణిం జేకొని రమ్మని పెద్దవేలిపె.

## - ఉలూచి మృతసంజీవన మణికై పుండరీకుని పంపుట -

అంతం బుండరీకుండు, విజయ వృషకేతువుల శరీరంబులు వికారంబు నొందకుండ మూర్కొని, వారినిఁ గాపాడుకొని యుండుండని బభ్రువాహనునితో నెచ్చరించి, మహీతలంబుసొచ్చి, మరకతమణిమయంబులైన చందన వృక్షంబులం బొలుపొందు రసాతలంబు నతిక్రమించి, భోగవతీ పురంబున నభిరామంబైన యారామంబునఁ బొలుపొందు హాటకేశ్వరు నాలయంబున నటనంబు సేయు నాగకన్యకల గానంబులచే నాదమేదురంబైన పాతాళంబునకుం జని, యచ్చట భోగవతీ నామికయగు పాతాళ గంగలో స్నానంబుసేసి, నిత్య కృత్యంబులు నిర్వర్తించి, సువర్ణమయంబులైన పంకజంబులచే హాటకేశ్వరుఁ బూజించి, ఫాలంబున నంజలిఁగీలించి, యద్దేవుని వీడుకొని, రాజమందిరంబునకుం జని, యచ్చట నవరత్నఖచితంబును నలినమిత్రాడంబర విడంబకంబు ననేక సహస్రస్తంభ శోభితంబునగు నాస్థాన మండపంబున, వాసుకి కర్కోటక తక్షకైలాపుత్ర కాళీయ ధృతరాష్ట్రాది మహా నాగేంద్రులు పరివేష్టింప, నవరత్న స్థగిత సింహాసనంబున సుఖాసీనుండును, శ్రీమన్నారాయణ స్మరణ నిర్ధూత నిఖిల మాయా విశేషుండునైన శేషునిం గనుంగొని సవినయంబుగాఁ బ్రణామంబు సేసి, యులూచి పంచిన కుందనంపు మెఱుగు కమ్మలును, దాళి బొట్టునుఁ జూపి, 'యర్జునుండు ధర్మజుని మఖవాజి సంరక్షణార్థంబుగా వచ్చునెడ బభ్రువాహను మార్కొని హతుఁడయ్యెఁ గావునఁ దనకుఁ బతిదానంబుఁ జేయుమని యామె వేఁడుకొనియె. ధరణీతలంబు ఫణామండలంబునం దాల్చి సమస్త జీవకోటులకుం బరమ సుఖంబు గావించెదవు. ఫాలనేత్రుని వింటికి గుణంబవై త్రిపురజయం బొసంగి వేల్పులఁ బ్రోచితివి. పన్నగ నాయకా, నీ విహారంబులన్నియుం బరోపకారంబులు గావున నీ నగరియందు మహానాగ సంరక్షితంబైన మృత సంజీవన మణిం దయసేసినఁ బార్థుండు బ్రదుకగలండ'నిన, విని శేషుండిట్లనియె:

'హరిభక్తిపరాయణుండైన యర్జునుని జయింప నాది నారాయణుకుందక్క నెవ్వరి తరంబు? ఇతండు సమరంబున మృతుండయ్యెననుట యద్భుతంబయ్యెడి'. అనిన విని పుండరీకుండు, 'భుజంగవల్లభా, విజయుని మార్కొను సాటి మేటి మగలు ముజ్జగంబున లేరనుట నిజంబు. పుత్రశోకోపహతయగు గంగానదీ

శాపంబున సతని కిత్తెఱంగు వాటిల్లె' ననిన, దయార్ద్ర హృదయుండై యనం
తుండు 'మృత సంజీవన మణియు, నమృత కుంభంబు నొసంగి సమర హతుం
డైన సవ్యసాచిం బ్రదికించి జగత్త్రయంబున నతులితంబైన కీర్తి వహించెద'నని
నిశ్చయించి, ధృతరాష్ట్రుండను ఫణిపతిం బిలిచి, 'సంపాదించిన వస్తువులలో
దాతయైన పురుషున కీయరాని వస్తువులేదు'. అనిన విని యాభుజంగం బిట్లనియె.
'దేవా, యొక్క విన్నపంబు వినుము. మర్త్యు లసత్యవాదులు. కృతఘ్నులు.
వారియెడ నేక్రియలు ఫలింపవు. నాగకులంబునకెల్ల జీవన హేతువులైన యీ
వస్తువుల నొసంగితిమేని, మనకు, నీరు పామునకు విశేషం బెయ్యది? గరుడండు
ప్రతి దినంబునుం దఱుముకొని తిఱుగు. ఊరజోగులు మంత్రబలంబునం బట్టి
యాడింతురు. వడంతులు వడగలనున్న రత్నంబుల నొలుచుకొనియెదరు.
మున్ను మతంగ మహాముని శాపంబు వలన వైనతేయుండిచటికి రాకుండ
నున్నాఁడు. ఇవ్విధంబెఱింగెనేని, రత్నంబు, నమృతకలశంబు నపహరించు
కొనిపోవుగాని మనకేల యీయనిచ్చు? రాజు మద గజంబు వంటివాఁడు.
అతండు మేర మీఱి నడచిన యెడఁ గ్రమంబున మఱలింప వలయుంగాని మీఱ
నీయం దగదు'. అనిన విని, శేషుండు ధృతరాష్ట్రుంజూచి, 'మున్ను చతుర్ము
ఖుండు లేఁగ దూడలం గోపబాలకుల నటమటించిన యెడ వెన్నుఁడు బ్రహ్మ
సృష్టికిం బ్రతిసృష్టినొనర్చె. అఘటన ఘటనా విహారుండైన యాకేశవునకు
నసాధ్యంబెద్ది? అతండు చేపట్టినం బూరిపుడుక వజ్రాయుధంబగు. శ్రీమన్నా
రాయణుని కరుణలేకున్న మహామేరువైనం దృణంబగు. అద్దేవుని కృపాకటా
క్షంబునంగాదె మనమందఱము బ్రతికియున్నాము'. అనినవిని ధృతరాష్ట్రుండు
శేషుంజూచి, 'యా వనజనాభుండే వాసవతనయునిం బ్రతికింపంగలడనిన
యెడ సంజీవన మణియు సుధాకలశంబు నేమిటికి? నిరర్థకంబుగా నిచ్చుట వలన
ఫణికులంబునకు హాని సంభవించుటే కాని ప్రయోజనంబు లేద'నుటయుఁ,
గుండలీంద్రుండు పుండరీకునిజూచి 'మా కులంబు వారు సంజీవన మణియు,
సుధాకలశంబు నీయరు. శ్రీహరి కృపకలిగిన యర్జునున కేమికొదవ? ఆ దేవుండు
తానె బ్రతికించు'ననిన విని, పుండరీకుండు విఫల మనోరథుండై, వచ్చిన
త్రోవఁ బట్టి చని, సంగరాంగణంబునకు వచ్చి, యచ్చట గంధ తైలావసిక్తం
బులుఁ, గనక దండ మండితంబులుఁ, గర్పూర ప్రదీప్తంబులు నైన కరదీపికా

సహస్రంబులు ప్రకాశింపఁగొలువున్న బభ్రువాహనుని, నతని చెంగట నర్జునుని శిరంబు నంత తలంబున నునిచికొని, దీనవాక్యంబుల పలవించుచున్న యులూచి చిత్రాంగదల నవలోకించి, విషాదంబుదోఁప నిట్లనియె. 'తల్లీ, నీ జనకుండైన శేషుండు సంజీవ రత్నంబీయక లోభంబునం బలికిన రోసి వచ్చితి. మీరలింకఁ బవిత్ర దత్తంబైన యగ్నిం బ్రవేశింపుం' డనిన, విని బభ్రువాహనుండు క్రోధారుణ లోచనుండై, కనుబొమల ముడిపాటు ఘటించి కార్ముకంబుఁ గరంబునఁ గైకొని, '[వృథా] శేషఫణి గర్వించి నన్నెంచక సభలో నిరాకరణ వచనంబులు పలికెనే? దుర్మంత్రులైన వాసుకి తక్షక కర్కోటక ధృతరాష్ట్రాదుల దుర్బుద్ధులు విని జీవరత్నం బీయడాయెనే? ఈ క్షణంబ పాతాళ క్షోణికిం జని, సాక్షాత్కారంబుగా నిటలాక్షుఁడు వారికి సహాయుండయ్యేనేని, నాగలోకంబు నిశ్శేషంబు గావించి, మృత సంజీవన మణియు, సుధారసంబునుం దెచ్చెద, వగవకుండు'ఁడని పలికెను.

## -బభ్రువాహనుండు సర్పములతోడి యుద్ధంబున కేగుట-

(ఇట్లు పలికి యాతండు) మాతంగ తురంగ రథాంగ వీర భట సమేతుండై, పుండరీకుండు మార్గంబు సూపఁ గాతాళంబునఁ బాతాళంబునకుం జని, శంఖ భేరీ మృదంగ నిస్సాణాది వాద్య ఘోషంబులు దిక్కులు గ్రక్కతిల్లఁ గదంగుటయు, శేషుండు తక్షక వాసుకి కర్కోటక ధృతరాష్ట్రాదులం జూచి, 'బభ్రువాహనుండు పితృమరణ వ్యథాకులిత మానసుండై మన మీఁదికిం జనుదెంచె. చెలువకులంబు నిరవశేషంబు సేయక విడువండు. ధృతరాష్ట్రుని దుర్నీతి నాచరించుట వలన నాగ కులంబున కింతటి యాపద యొదవె. ఇంకనేమి సేయంగలవారము? మీరు నపార బలసమేతంబుగాఁ బోరికిం జనుండు'. అనిన, విని, కుండలి మండలీంద్రుని యాజ్ఞ శిరంబున ధరియించి, వాసుకి తక్షక శంఖ కర్కోటక మూషద కాళీయ ప్రభృతులైన సర్పకులాధ్యక్షులు, రత్న కుండల కిరీటహార కేయూర మాల్యచందన దుకూలాదులు ధరియించి, కరి తురగ రథ భట సమూహంబులతో వెడలి, కదనంబునకుం దలపడుటయుఁ, గల్పాంతకాలంబున ఘూర్ణిల్లు పూర్వ పశ్చిమ సముద్రంబుల కైవడింగనుపట్టె. నాగకుమారులు కరి తురగారూఢులై పంచయోజన విస్తీర్ణంబైన నరసుతుని సేనపైఁ గొంచు విషజ్వాలామాలికల వహించుటయు, విజయసుతుండుపస్టంభ విజృంభితుడై, మయూరాస్త్రంబు ప్రయోగించుటయు, సహస్రంబులైన మయూ

రంబులు వెడలి, యిన్నూఱు, మున్నూఱు, నన్నూఱు పడగలు గలిగిన ఫణుల ఫణంబులు నుఱుమారుటయు, వాని శిరంబులనుండి ప్రళయ కాలంబు నంచలి యుల్కాప్రాంతంబుల కరణి శిరోరత్నంబులు రాలం బొడంగె. ఇత్తె ఱంగునఁ గేకిలోకంబు కాకోదరంబులం జీకాకుపడం జుంచుచుఫులం జీరి, నఖంబులం జించి, ఱెక్కలం గొట్టియుఁ బ్రేవులు ప్రోవులుపడ నాలికలు పేలికల విధంబునం దూలఁ దూలించుటయు, నవ్విధంబుఁ గనుంగొని యక్కుమార కంఠీరవుండు తోడనె మధుబాణంబుం బ్రయోగించినఁ దేనియ వాన గురిసె. ఆ వెంబడిఁ బిపీలికాస్త్రం బేయుటయు నందువలన నుక్కుముఖంబుల చీమలు పెక్కులు వెలువడి పాముల శరీరంబులు దొలిచి, తొంటలు వాఱం జేయు టయుఁ, జలువదళంబులు తల బీకసకాయలు యథాయథలుఁ గకావికలునై మొనగట్టంజాలక శేషాహి చెంగటికిం బఱచిన, వారలం గనుంగొని భుజంగ పుంగవుండు, 'ధృతరాష్ట్రి, నీ దురంతంబు వలన నింత యాపద సంభవించె. ఇప్పుడు నీ కుయుక్తి యెక్కడికిం బోయె ?' నని నిరసించె.

## —బభ్రువాహనుఁడు సంజీవనమణిఁ దెచ్చుట—

ఆ క్షణంబ నాదిశేషుఁడు బభ్రువాహనునకుఁ గర్బుర మయంబైన దివ్యక వచంబును, శత శలాకాచ్ఛత్రంబును, రత్నకుండలాభరణంబులును, గంధమాల్యా దుకూలాదులు, నుపాయనంబులు ఘటించి, గాండీవికిఁ దగిన కట్నంబులు బంగరు పెట్టియల జతనంబు సేయించి, మృత సంజీవన మణియు, నమృత కుంభంబునుం గొనుచుఁ దక్షక కర్కోటకాదులు గొలువఁ బాతాళ గహ్వరంబు వెలువడి, బభ్రువాహనుని సంధించికొని యతని తోడఁగూడ మణిపురంబు నకు వచ్చె.

## —నాగ కుమారు లర్జును తల నపహరించుట—

అప్పుడు శేషుండు సభలోఁ దన్నవమానించుటవలన ధృతరాష్ట్రిండు మఃఖితుండై, గృహంబునకుంజని, దుర్బుద్ధి దుస్స్వభావులను నామధేయంబులు గల కుమారులంబిలిచి, బభ్రువాహనునిచేనైన పరాభవంబు చెలిపి, 'నేను ధృత రాష్ట్రి నామధేయుండఁగావునఁ బాండవులకు మనకు మొదలనుండి యెడతెగని

వైరము మీ రెఱింగినదియే కదా! ఇప్పుడాఖండల సుతుండు బ్రతుకకుండు నుపాయము చింతింపుండ'నుటయు, వారలు తండ్రి నవలోకించి, 'శిరంబు దాచితిమేని, కిరీటిం బ్రతికింప సంజీవన మణియు శేషుండునుంగాదు, శ్రీకృష్ణుం డేనియుం జాలండు. అంతట నయ్యశ్వంబెవ్వండేనియు హరించు. ధర్మనందనుండు యజ్ఞవిహీనుండై చెడు. అంతట నీ పగ దీఱు. కావున నర్జును శిరంబు మేమపహరింతుము. నీవు మనంబునం గుందవలవ'దనిన, ధృతరాష్ట్రుండు సంతుష్టాంతరంగుండై, 'యుత్తెఱంగు సేయుండ'ని పుత్త్రులంబనిచి, తానెఱుంగనియట్లు శేషాహి వెంబడిం జనియె. ఆక్షణంబ ధృతరాష్ట్రుని కొడుకులు మాయారూపంబుల వచ్చి, విజయుని శిరంబు నపహరించుకొని, గరుడ సంచార వర్జితంబైన బక దాల్భ్యాశ్రమంబున దాంచిరి. అప్పు డులూచియు, జిత్రాంగదయు గాండీవి మస్తకంబు గానక నలుదిక్కులు బరికించి, వదనోదరంబులు మోదికొనుచు వసుధాతలంబునం బొరలాడుటయు, నకోలాహలం బాలకించి బభ్రువాహనుం డరుదెంచి, యర్జును శిరంబుగానక మూర్ఛాక్రాంతుండై పుడమిం బడియె, ఆ రాత్రి కరినగరంబునంగుంతీదేవి దుస్స్వప్నంబుం గని, దిగ్గన లేచి, దగులు సెంది, కన్నుల బాష్పకణంబులొలుక, వెన్నుండును యుధిష్ఠిరుండున్న యెడకుం జనుదెంచి, గద్గద కంఠంబుతోం, 'గంసమర్ధనా, నేడు నా కలలోన నీ మఱందియగు నర్జునుండు నూనియమేన నలందికొని తైలకూపంబున మునింగినట్లును, గోమయంబు శరీరంబునం బూసికొని, రక్తమాల్యంబులు ధరియించి, యెంబెనెక్కి దక్షిణాభిముఖుండై పోవునట్లుగాం గలంగంటి. నా స్వప్నంబు దప్పదు. కిరీటికిం గీడు వచ్చుట నిజంబు. అంతరంగంబు గలంగుచున్నయది. నీవు దయ సేయుటకిది సమయం'బని రోదనంబు సేయుటయు, నాపద్బాంధవుండైన యచ్యుతుండు వెఱవకుమని యూరడించె.

## - శ్రీకృష్ణుండు మొదలగు వారర్జునుని దగ్గఱకు వచ్చుట -

అప్పుడు స్మరణమాత్ర సన్నిహితుండైన పక్షిరాజుమీదం గుంతీయశోదా దేవకీ భీమసేనుంతోడంగూడ నధిరోహించి, ముహూర్తమాత్రంబున మణిపురంబునకుంజని యచ్చట ఖండితంబులైన వేదండ శరీరంబులును, భిన్నభిన్నంబులైన తురంగ దేహంబులును, జెక్కుచెక్కులైన యరదంబులును, జల్లెపడ్డకంతలు పడి వొర్లిన సుభట కాయంబులును, జూర్ణంబులైన భూషణంబు

లును, నురుములైన గదా ఖడ్గ ముసలాద్యాయుధంబులును, భిన్నంబులైన యాత పత్రంబులును, శీర్ణంబులైన కేతనంబులును, నిధనంబునొందిన మహారథి కులును గలిగి దుర్నిరీక్ష్యంబైన యుద్ధరంగంబునఁ బక్షికులపుంగవునిందిగి పద్మాక్షుండును, భీమసేనుండును, గుంతియు, దేవకీ యశోదలును, నిరుత్సాహంబుగా నరిగి శిరోవిరహితంబైన గాండీవి కాయంబు గనుంగొని,రోదనధ్వనులు రోదసీ కుహరంబునంబర్వ మూర్ఛలమునుంగుచు నుండునంతఁ, గుంతి నిధనంబు నొందిన ధనంజయుంగనుంగొని, వదనంబు కరపల్లవంబుల మోదికొనుచు, గన్నులనీరు చెక్కుల జాఱి వెల్లువలువాఱ, నపారశోక సాగరంబున మునింగి, చెన్నుదొఱంగ, డెందంబు కరంగి, మూర్ఛనణంగి, యొక్కింత సేపునకుఁదెలిసి (యిట్లని విలపించదొడంగె):

## -కుంతి యర్జునుని మరణంబునకు విలపించుట-

'హా సుకుమారా, హా వరగుణాధారా, హా విద్యావినయవిహారా, హా కులకలశపారావార కుముదబాంధవా, నోమరాని నోమిలునోమి, చేయరాని వ్రతంబులు సేసి, యుండరాని యుపవాసంబులుండి, యనేక దానంబు లొనర్చి, నిన్నుఁగాంచి, నాటఁ బెంచువానిఁ బూటఁబెంచి, దాదిటొమ్మన దూది పాన్పున నుంచి, యభివృద్ధి నొందించి, కతపట బభ్రువాహనుని యస్త్రాగ్ని పాలు సేయవలసెనే! నీ భుజాబలంబు మంటంగలసెనే! ఎండకన్ను నీత కన్నెఱుంగనట్టి పుట్టుభోగికి నిట్టివెతలు గంగాశాపంబునఁ బుట్టెనా ? ధూళిధూసరిత గాత్రుండవై శిరంబులేక చేష్టలుదక్కి ధరాతలంబునఁ బడియున్న నిన్నుఁ జూచి కడుపు దహించుకొనియె.అన్నా,నన్ను గన్న కన్నా, నిన్నుఁగన్నది మొదలుగా నడవులం దిఁరిగియు, నిడుమలం బడియు, వెతలఁ జెందితినే కాని, సుఖంబున నుండనోచ నైతిని. నా ముద్దుల కొడుకా, యెటులోర్తురా ! నీ వంటి న్యాయానువర్తికి, నీ వంటి ధర్మమూర్తికి, నీరీతి ధాత వ్రాయఁదగునే ? నన్నుఁ గన్న తండ్రీ, యరవింద దళంబులంబోలు కన్నులు, నరుణబింబాధరంబు, సంకురిత దరహాసంబునైన నీ ముఖంబుఁ గనుఁగొనకయున్నను, జక్కెర పానకంబుల బోలు నీ చక్కని పల్కులు వీనుల విందుగా వినకయున్నను, నిమిషమాత్రంబేనియుఁ బ్రాణంబు నిలుపజాలమురా!ఈశోక సాగరం బెటువలెనీదుదురా ! ఎన్ని విధంబులఁబిలిచినఁ బలుక వేమిరా ! దేవదేవుండైన

శ్రీకృష్ణుండు ప్రాపై యుండ నీకితర భయంబు లేదనియెంచి, కన్నులపండువుగా నుండు నీ మేను గంటఁ గదయ్యా! భానుకిరణంబుల నీ మేను గందు గదయ్యా! ఇంత నిన్నేలాగున మఱతు? నాకెవ్వరు దిక్కు? నన్నెవ్వరాదరించువారు? కమ్మని మాటల నెమ్మి మీఱ 'నమ్మా'యని నన్నెవ్వరు పిలుచువారు? తనయా, సద్గుణ సంజాతనయా, దైవంబు తన మనంబునకు నిన్ను బరువుగా నెన్నెనో! చతుస్సముద్ర ముద్రిత మహీపతుల యతుల మణి కిరీటంబులఁ దాపిన పద్మ రాగంబుల డంబుల కెంపు సొంపు సంపదలం బొదలు పదంబు గలిగిన మహా రాజవైన నీకుం బండియుండుటకుఁ జేరెడు పఱపు లేదయ్యేనే! అయ్యయ్యో నందనా, హరిచరణారవింద నందనా', యని తన యునికి నీ పాటు వచ్చెఁ దనయునికి నీకనేమిటికని, దైవమా యనుచు, దైవమాయను దెలియ వశమాయనుచు, వగచి వగచి పేరెలుంగునఁ గుమారునిం బిలిచి పిలిచి, యడలుచుండు సమయంబున, శ్రీకాంతుండు కౌంతేయుని చెంగటికింజని 'ధనం జయా, కుంతియు, యశోదయు, దేవకియు,నిన్నుంగానని దుఃఖంబునఁ బొగులు చునుండ నివ్విధంబున రాక యుందువే? ఎందుఁబోయితివి? ప్రాణసఖుండ నైన నన్నుంగన్నులు దెఱచి చూడవదేమి?' అని పలవించు శ్రీకృష్ణువింజూచి, భీమసేనుండిట్లనియె: 'దేవా, నీవు రమ్మని పిలుచుటంజేసి విజయుం డవశ్యం బును బ్రతుకును. మీ చరణారవిందంబులు నమ్మిన వారల కావంత యేనియు వంతరాదు'. అని పలుకుచున్నంత సూర్యోదయం బగుటయు, బభ్రువాహనుండు తల్లులుఁ దానును మూర్ఛదెలిసి,కదనంబునం జిక్కిన ప్రద్యుమ్ననిచే శ్రీకృష్ణుని, భీమసేనుని, దేవకీ యశోదా కుంతీదేవులను నెఱింగి, భయ భక్తి వినయ సంభ్రమంబులతో, శ్రీకృష్ణునకు మ్రొక్కి, భీమసేనునకు వందనంబు సేసి, కుంతీ దేవకీ యశోదలకుం బ్రణమిల్లి కృతాంజలియై యుండె. అప్పుడు పన్నగా ధీశ్వరుండు పద్మనాభుని సన్నిధింజేరి యిట్లనియె:

## -శ్రీకృష్ణుం డర్జునుని బ్రదికించుట-

'దేవా, సంజీవరత్నంబు వచ్చియున్నయది. మీ చెలికాని శిరంబు నపహరించిన నీచమతులంబట్టి తొల్లి రాహుకేతువులం దునిమిన మాడ్కిఁ దెగటార్పుము. ధర్మజు కులంబు నిలుపుము. ఇంతటికి హేతు వర్జునుని బ్రతి కించుట. శిరంబులేక బ్రతికింపంగూడదు గావున, దేవర దివ్యదృష్టిచే నరుని

శిరంబున్న తావెఱింగి రప్పింపు'మనుటయు, బ్రహ్మమయుండైన పురుషోత్తముండు, ప్రతిన సేయ దలంచి, 'నేను ద్రిలోక విఖ్యాతంబైన నైష్ఠిక బ్రహ్మచర్య వ్రతంబునం బెంపొందినవాఁడ నైతినేని, సత్యంబు దప్పనివాఁడ నైతినేని, నరుని శిరంబు వచ్చుఁగాక ! తచ్చోరకుల శిరంబులు వ్రయ్యలగుంగాక !' అని పలికిన యాక్షణంబ వాసవసుతు నిశిరంబు వచ్చె. ధృతరాష్ట్రి సూనుల శిరంబులు శత శకలంబులయ్యె. అంతఁ గిరీటి వృషకేతనుల శిరంబుల శరీరంబుల తోడంగూర్చి సంజీవ రత్నంబురంబున నునుచుటయు, నయస్కాంత సంయోగంబున లోహంబునుం బలె వారల తలలు నట్టులు నేకంబులై తోడన ప్రాణంబులు వచ్చె.

తదనంతరంబ సంజీవన రత్నవైభవంబున వృషకేతుండు లేచి, శ్రీహరిం గీర్తించుచు, సమీపస్థితుండైన వైరి నదలించుటయు, ముకుందుండు ముదంబునం గౌఁగిలించె. అర్జునుండు నట్లే లేచుటయు, నెండఁగొట్టువడిన సస్యంబులు వాన చేతం దేఱిన చందంబునఁ బాండవ సైన్యంబులు కిరీటి నవలోకించి హర్షంబు నొందె, అయ్యవసరంబున భేర్యాది రవంబులుచు, వంది జనస్తోత్రంబులును, బృందారకుల పుష్పాల వానలు, దివ్యదుందుభి ధ్వానంబులును జెలంగె.

## - శ్రీకృష్ణాదులు మణిపురంబున కేగుట -

కుంతీదేవియుఁ బునర్జన్మంబునొందిన పుత్రునింగనుంగొని కౌఁగిలించె. అంతఁ బ్రద్యుమ్నుండు దర్శింపఁ జతురంగ బలంబులు నేల యీనిన తెఱంగునఁ బట్టణంబు సేరంజనునెడఁ బద్మనాభుండును, ఫల్గుణుండును రాజమార్గంబునం జనుదెంచునెడ, నన్నగర నారీశిరోమణులు నివాళించి చల్లు దివ్యమణులంజూచి, కుబేరుండు సైతంబు శిరఃకంపంబు సేయుచు నచ్చెరువొందె. అట్లు రమణీయంబైన మణిపురంబున బభ్రువాహనుని, మందిరంబునకుంజని, దివ్యరత్న ప్రభాస్థానంబున మేరుశిఖరోపమానంబులైన సింహాసనంబుల శ్రీకృష్ణుండును, గాండీవియుఁ గూర్చున్న యవసరంబున, హంసధ్వజాది మహీపాలకులు నుచిత పీఠంబులం గూర్చుండిరి. అపుడు తలవంచుకొనియున్న నరునింజూచి శేషాహి యిట్లనియె: 'అర్జునా, జయపరాజయంబు లనిత్యంబులు. అందులకై వగవం బనిలేదు. విశేషించియు క్షత్రియులకు సర్వత్ర జయంబుగలిగినను బుత్రుని

చేతఁ బరాజయంబు నొందుట మోదావహంబుగాని, ఖేదావహంబుగాదు. నీ కూర్మిపట్టియైన బభ్రువాహనుని క్షాత్రంబుగని మెచ్చక యిటువలె లజ్జించుట యుక్తంబుగాదు. అదియునుంగాక, నీకు గంగాభవాని శాపనిమిత్తంబుగ నిట్టి యాపద సంభవించె. చిత్తంబున నుత్తలంబునొందక ముకుంద చరణారవింద భక్తి వైభవ సంపాదితంబైన భవదీయ నందనుని రాజ్యభోగంబు లనుభవింపుము. నీ కళత్రంబులైన చిత్రాంగదయు నులూచియు డెందంబుల నానందంబు నొందు నట్లుగా సూఱడింపుము. నిన్నెదిరించుట వలన లజ్జితుండైన కుమారునిం గౌఁగిలించుకొని యాదరింపుము'. అని పలికి యహివల్లభుఁ డంబుజనాభుని గనుంగొని 'దేవా, కవ్వడి మనంబునందలి నొవ్వుదీఱ బోధించి దేవకీ యశోదలుఁ గుంతియుఁ జిత్రాంగదయు, నులూచియు మొదలగు వారల మనంబులకు హర్షంబులు గలుగం జేసి భవదీయ చరణారవింద సేవా నిరతుండును, పితృభక్తుండును, భ్రాతృ వత్సలుండును, మానధనుండును, యశోనిధియునైన బభ్రువాహనుండు జనకునిం జంపిన పాతకంబునకుం బ్రాయశ్చిత్తంబుగా హిమవంతంబున కరిగి తన శరీరంబు పరిత్యజింపఁదలచి యున్నవాఁడు గావునఁ, దగు తెఱంగునం దెలియం బలుక వలయు' ననిన యెడ, వడముడి బభ్రువాహనుం జూచి, 'కుమారకా, యాచార్యునిం బితామహుఁ దోబుట్టువుల వధించియు నచ్యుతుని కటాక్షంబు వలనఁ గలుషంబులంటక మేము సుఖంబున నున్నవారము. నీవేటికి వెఱచెదవు? మీ తండ్రియుం బ్రదికె. నీవు క్షత్రధర్మంబు చెల్లించుకొంటివి. నాల్గు యుగంబుల నేదేవుని నామస్మరణంబు గావించిన మాత్రంబునఁ బాపంబులు రూపణంగు, నద్దేవుండైన యీ దేవకీనందనుని నమ్మియున్న మనకు శోకంబును, పాపభయంబును, దైన్యంబును బొందఁ బనిలేదు' అని బహువిధంబులం దెలియంబలుకు భీమసేనుని వాక్యంబులు విని చిత్రాంగదా నందనుండు విషాదంబు మాని, ప్రసన్నముఖుండగుటయు, రాజాధిరాజులందఱు నతని గుణంబులు నానావిధంబుల నుతియించిరి. అంత మురాంతకుండు, కౌంతేయ మధ్యముండును, భీమసేనాదుల తోడం గూడ నపరిమితంబులైన భోగంబు లనుభవించుచు, సంగీత సాహిత్య నాట్యప్రముఖ విద్యావినోదంబులం బ్రొద్దు గడపుచు, మణిపురంబున నయిదు దినంబులు వసియించిరి. ఆ సమయంబునఁ గృష్ణుండు పురందర నందనునిం జూచి, 'నీ నందనుని మందిరంబున నయిదు దినంబులుంటిమి. అఖిల శ్రమంబులు దీఱె. మన తల్లులను, గోడండ్రను, ధన

కనక వస్తువాహన సమూహంబులను, భీమసేనుని వెంబడిం గూర్చి యజాత శత్రుని కడకుం బంపుదము. వీరలు ధర్మజుచే యజ్ఞం బుపక్రమింపం జేసి, తద్విధానంబు నడిపించెదరు. ఇంక మీఁద నింతకంటె బలవంతులైన రాజులు పెక్కండ్రు గలరు. కావున హయరక్షణంబునకు నిన్నొంటిగా నంపంజాలను. నేనుఁ గూడ వచ్చెద' నని పలికి, దేవకి మొదలైన సతీనివహంబులను, ధన రాసులం గూర్చి భీమసేనుని వెంబడి హస్తిపురంబునకుం బనిచె. అనంతుండు చిత్రాంగదాకుమారునిచే బహుమానంబుగాంచి, కృష్ణార్జునుల వీడ్కొని పాతాళంబునకుం జనియె.

## --తామ్రధ్వజుండు పాండవాశ్వంబును బట్టించుట--

తదనంతరంబ గోవిందుని యనుమతిచేఁ దరలింపంబడిన యధ్వరాశ్వంబు నానా జనపదంబులు గడచి, క్రమంబున మయూరధ్వజుండను వసుంధరావరునిచేఁ బరిపాలితంబైన రత్నపురంబు సేరంబోవు నవసరంబున, నా మయూర ధ్వజుండు తాను నశ్వమేధంబు సేయ సంకల్పించి పుత్రుండైన తామ్ర ధ్వజుని దురంగ రక్షణంబునకుం బంపిన, దైవయోగంబున నా రెండు గుఱ్ఱంబులు నొండొంటి నెదుర్కొని, కయ్యంబునకుఁ గడింగి, భీషణంబులైన హేషారవంబులు సేయుచు, మోము మోమునం జేర్చి, పూర్వఖురాగ్రంబుల భూతలంబులుద్రవ్వి, దుమ్మెగయించుచు, నొకటొకటిం జుట్టుకొని కందంబులం గబళించి విదళించునెడ, మయూర ధ్వజుని హయంబు లోఁబడుటయుఁ, బాండవ హయంబు పైకొని దంతంబులం గబళించి, ...... గడంగుటయుఁ, దామ్రధ్వజుండు క్రోధ తామ్రాక్షుండై, నకులధ్వజ నామకుండైన సేనానాయకుం జూచి, 'యీ హయంబెవరిది ? విచారింపు'మనిన, నతండు సత్వరంబుగా నా ఘోటకంబు దాటకుండఁ జతురంగంబులఁ జుట్టునిలిపి వేడెంబులు వెట్టు నా వాజింబట్టుకొని, చుంచువు బిగియం బట్టి, నుదుట నున్న హేమ పట్టికఁ గలయం జూచి, చదివి, యవ్విధంబు తామ్రధ్వజునితో విన్నవించుటయు, నతండు నవ్వుచు, 'మన దొరయగు మయూర ధ్వజుం డేడశ్వమేధంబులు సేసె. ఇంక నెనిమిదవ యాగంబు సేయుంగాక' యని యత్తురంగంబుఁ బట్టి కట్టించి, నకుల ధ్వజునిం జూచి, 'సేనాగ్రణీ, పాండవ సైన్యంబున వృషకేతుండును, గాండీవియు దక్కఁ జేవగల మగలు లేరని నిన్న నారదుండు

పలికె. నేఁటికి నరనారాయణులతోడి సమరంబు మనకు దొరకె' అనిన విని దళవాయి యతనిం జూచి, 'పాండవ సైన్యంబున బభ్రువాహనుం డొక్కరుండు శూరుండంటిమేని వాఁడును దేవర నాటకశాల వధూటులకుఁ బుష్పాంజలులు సేయందగు ముత్తియంబు లొసంగువాఁడు. తక్కిన వారలెవ్వరున్నారని' వీరాలాపంబులు పలుకుచు, సైన్యంబు నర్ధచంద్ర వ్యూహంబుగాఁ బన్నించి తానునుం గట్టాయితంబై విక్రమాటోప విజృంభితుండైన తామ్రధ్వజుని ముంగల నిలుచుటయు, నారాయణుండు నరునిం జూచి, 'మహాయోధవీరులకు మరణ కారణంబైన రణంబు నేటికిఁ బ్రాపించె. ఎదుటి వారలు కాలాంతక రుద్రులకు సమానులుగాని సామాన్యులుగారు' అని పలికి ప్రద్యుమ్నునిం జూచి, 'మన బలంబులనెల్ల గృధ్రవ్యూహంబుగాఁ బన్నింపు'మని నియమించి, దారకుండు తెచ్చిన తన యరదంబునెక్కి, దిక్కులుపిక్కటిల్లం బాంచజన్యంబు పూరించె. అమ్మహావ్యూహంబున ననుసాళ్వుండు కంఠంబును, హంసధ్వజుండు వక్షంబును, ప్రద్యుమ్నానిరుద్ధులు పక్షంబులును, సాత్యకి కృతవర్మలు చరణంబులును, బభ్రువాహనుండుచు, సత్యభామా తనయులగు చిత్రభాను చారుచిత్రులు ముఖంబును, జుంచువులును, నపరిమిత సేనాసమేతుండైన గాండీవి యుదరంబును, నతని నలుగెలంకులఁ బుండరీకాక్షుండును, వృషకేతనుండును, యౌవనాశ్వుండును, మేఘవర్ణుండునుంగా నభేద్యంబైన వ్యూహంబుఁ బన్ని యెదిర్చినం గనుంగొని తామ్రధ్వజుండు గరుడ ధ్వజునిం జూచి, 'నారాయణా, నీవు శూరుండును బౌరుషవంతుండునుం బలె శంఖ చక్ర గదాద్యాయుధంబులు పూని నన్నెదిర్చితివి. నా హయంబుఁ బట్టింప వలవదె?'అని పలికి యలుకవలనం గన్నుల విస్ఫులింగంబులు దొలుక నిజకధంబు సేరందెచ్చె.

## —ప్రద్యుమ్నాది వీరులు తామ్రధ్వజునితోఁ బోరాడుట--

తదనంతరంబు తామ్రకేతుండు గాండీవి మొగ్గరంబు తగ్గటి, యర్ధచంద్రబాణంబు లనేకంబులుగాఁ బ్రయోగించి, రక్తమాంసంబులు నలుదిక్కుల పెదజల్లి ,కార్ముక జ్యానాదంబనియెడు మంత్రంబుచే శాకినీఢాకినీ ప్రముఖంబులైన భూతగణంబులఁ బిలిపించి, రణధరామండలంబు మెండుకొనం జేసి, యేడు వాడిబాణంబుల వాసుదేవు వక్షంబు వ్రక్కలించి, యేనింట సూతుని డ్రుక్కడంచి, నాల్గు నారసంబుల సైన్య సుగ్రీవ మేఘ పుష్పవలాహకంబుఁ

గ్రుచ్చ, యర్జును డెబ్బది బాణంబుల, సాత్యకిం దొంబది శరంబులఁ, గృతవర్మ నెనిమిది సాయకంబులఁ, బ్రద్యుమ్నుని వేయి మార్గణంబుల, ననిరుద్ధుని లక్ష విశిఖంబుల నుంచి, వెండియుం దనివోక, హంసధ్వజ యౌవనాశ్వప్రముఖు లైన మహీపతుల నుక్కడంచి, పట్టపగలింటి సూర్యుని పగిది బ్రతాపించి, సింహ నాదంబు గావించుటయుఁ, దనమీఁదం గురిసిన బాణవర్షంబు నివారించి, యనిరు ద్ధుండు మహోద్ధతుండై, యనేక సహస్ర సంఖ్యంబులైన యాశుగంబులు గురి యించి, యెదిరించిన వీరుల మదంబణంచుచుఁ, బ్రచండ కాలానల జ్వాలాభీలం బులైన యమ్ములొక్కుమ్మడిం గుమ్మరించుచు, నలుదిక్కుల నెత్తురుటేరులు పారించి, మూఁడక్షౌహిణులు సమయింపం జేసి, శింజినీ నాదంబును, సింహ నాదంబును జెలంగఁ, బగతునిఁ జూచి, 'ఏమిరా, యింకమీదనైనఁ దురంగంబు విడవవేని, బంటుతనంబున గెంటక నా యెదుట నొంటి కయ్యంబునకు నిలువు' మనినఁ, దామ్రధ్వజుండు తామ్రాధరంబున నించుక చిఱునగ వంకురింపఁ, 'బువ్వుల విలుకాని కొడుకవు గదా! అనిరుద్ధా, నిన్నుఁ దొల్లి బాణుండు నిరుద్ధుం చేసినప్పు డుషాకన్య మంగళసూత్ర వైభవంబునఁ దలదప్పె. నేఁటికింక నిన్నుబోనిచ్చువాఁడం గాను'. అనిన, యనిరుద్ధుండు మహోద్ధతి మెఱయ బడ బానల శిఖాసఖంబులైన విశిఖంబులడరించి, వక్షస్థలంబు వ్రక్కలించి, యొక్క నెలవంక బాణంబున సూతుని తల దులిచి, తేరితురంగంబుల నాల్గింటం గూల్చి యార్చిన, సుచిత్రనామకుండైన యా తామ్రధ్వజుండు కత్తియుఁ గేడెంబునుం బూని, తేరుడిగ్గనుఱికినఁ, బ్రద్యుమ్న కుమారుండును, గరవాలంబును బలక యుంబూని భూమికి డిగిన, నయ్యిరువురు సింగంపు కొదమల తెఱంగునం గెరలి, ఖడ్గాఖడ్గిం బోరాడుచు గ్రమ్ముచు గ్రుమ్ముచు, లోవెలిం జిమ్ముచుఁ, గృపాణంబులఁ డోకించుచు, నొండొరులం జౌకించుచు, మర్మంబు లదరంట వ్రేయుచుఁ, జండించి వెనుకకుం బాయుచు, బిసబిస లెసంగ నసిలతల విస రుచు, 'మేలు! బళీ! యేడి మాయన్న!' యని కొసరుచుఁ, గత్తెర యడుల గతిం జిత్తర పాతరలవలె నటించుచుఁ, గేడంబు లడ్డంబుగా ఘటించుచుఁ, బేరెంబులు వాఱుచు, బీరంబు మీఱు నెత్తు పుంటి గట్టునఁ గోరాడిన మదపుటేనుగుల చందం బున నెత్తుటం జొత్తిల్లిన గాత్రంబులం గనుపట్టుచు, నొండొరుల వ్రేటులచే ఖేటక కృపాణంబులు తునుక లగుటయు విఱుతిఱియని బంటుఁదనంబున బాహుయుద్ధంబునకుం జొచ్చి, యాజగజెట్టు పగదొట్టక ముష్టిముష్టి, బాహా

బాహిఁ, గచాకచిం గడంగి, పెద్దయుం బొద్దు పోరాడిన యెడ, ననిరుద్ధుండు దగ సిలువం జాలక జగతీ తలంబునం బడి మూర్ఛ నొందుటయు, సుచిత్రుండు గగనంబు పగుల నార్చుచు, వేఱొక్క యరదంబెక్కి ప్రద్యుమ్ను సుతుంబు నైదుశరంబులఁ గరంబు నొప్పించుటయుఁ, గర్ణనందనుండు సుచిత్రుని గాత్రంబున నాఱుశరంబులు గ్రుచ్చి విరథునింజేయ, నతండు వేఱొక్క రథం బెక్కి విలుగుణధ్వనిసేయ నయ్యరదంబునుం దునిమె. ఇవ్విధంబున మున్నూఱు రథంబులు, ముహూర్త మాత్రంబులో శకలంబులు గావింప, వేఱొక్క తేరెక్కి నిశిత విశిఖంబులు కర్ణపుత్రుని పయిం బ్రయోగించిన, రోగంబు తనువునం బుట్టిన మాడ్కిదుర్దశం జెందె. ఆ వృషకేతనుని పాటు గనుంగొని, యనుసాళ్వుం డెదిరించుటయు, నతని నైదింటను యౌవనాశ్వునొక్క యుక్కుటమ్మునఁ, గృతవర్మని రెండు కాండంబుల గ్రుక్కించుటయు, సాత్యకి మార్కొని యారాజు తేరివాజులం దునిమి, శంఖంబు పూరించిన, నా నాదం బాలక మున్న తామ్రధ్వజుండు క్రూర నారాచ పరంపరలచే సాత్యకి వక్షంబు విక్షోభంబు సేసిన, మూర్ఛాపరవశుండై శైనేయుండు లోచనంబులు మోడ్చి, యరదంబు మీఁద వ్రాలినఁ, జిత్రాంగదా కుమారుండు వజ్రోపమానంబులైన వాఁడి బాణంబులైదు వాని యురంబున నాటించుటయుఁ, దామ్రకేతుండు చిఱునవ్వు మొగంబు నలంకరింప 'బభ్రువాహనా, నీకు నెప్పుడప్పనంబుగా నీయందగిన ముత్తియంబులు పెటికలం బట్టి తెప్పించితే?' అని పలుకుచు, కల్పాగ్నికీలాసఖంబులైన విశిఖంబుల వాన గురిసి విముఖునింజేసి, యంత విలువక మహోగ్ర బాణంబులచే మరాళ కేతనునిఁ బరాజితునిం జేసి, ప్రళయకాల తాండవోద్దండ ఖండ పరశుండునుం బలెఁ బాండవ సైన్యంబు ఖండించుచు నుండె.

ఇవ్విధంబున వైరిసేనా ధూమకేతుండైన తామ్రకేతుని భుజా విజృంభణంబు గనుంగొని,పాండవ సైన్యంబులు దైన్యంబు నొంది,చచ్చియు,నొచ్చియు, విచ్చియుఁ జెల్లాచెదరుగాఁ బఱచునెడఁ, దురంగ మాతంగ వీరభటాంగంబులం దొరఁగు రక్తంబను జలంబును, గేశంబులను నాఁచు తీవియలు, బాణకృపాణ కుంత తోమరంబు లని యెడు మీనంబులును, ధవళాతపత్రంబు లనియెడు నురుగులును, యోధవీరుల ముఖంబు లనియెడు పద్మంబులును, ఖండింపఁబడిన వేదండ తండంబు లనియెడు గట్లును, ధ్వజంబు లనియెడు వేతస కుంజంబులును, రథంబు లనియెడు నోడలునుం గలిగి రక్తనదీ ప్రవాహంబు ప్రవహించె,

అప్పుడు, కిరీటి చెంగటి వీరులు వాలంపగములం బొందునంబడి యేదు వెరిగిన చందంబునఁ జేయికాలు గదలింపం గూడని నాలంబునకుఁ జాలంబురి కొనంజాలక, సవ్యసాచింజూచి, 'బంధువధ జనితంబగు పాతకంబు నివారింప గోరి, యశ్వమేధంబు సేయ సమకట్టి మమ్ముఁ దామ్రధ్వజుఁబారికి బోరి గోరియలం జేసితివి. ఇందున నీకేమి ప్రయోజనంబు?' అని దూరినం గ్రీడి 'యోడకుండుఁడ'ని వారల నూఱడించి, తేరు వైరి సమ్ముఖంబు సేసి, మెఱుంగు వాలంపగుంపులచేఁ దామ్రధ్వజుని కాయంబు గాయంబులు సేసి, విరథునిం గావించుటయు, నబ్బిరుదు మగండు వేఱొక్క యరదంబెక్కి, 'కవ్వడీ, యెక్కడఁ బోయెదవు ? యాగ సైంధవంబుతో నిన్నుంగూడ బంధించికొని పోయెద' నని పలుకుచుఁ, గులశైలంబు వర్షధారలం గప్పు కాలమేఘంబు చందంబునఁ, గంక పత్ర విచిత్రంబులైన నిశిత విశిఖంబులం బరగించుటయు, వానివేగంబున నర్జును రథంబు యోజన మాత్రంబు వెనుకకుం జనిన, మగిడించి, యతివేగంబున వచ్చి, తన సేనలం బొలియించు తామ్రధ్వజుని పఱపి దేవదత్తంబు పూరించె. ఇవ్విధంబున నంతంతకు వంతునకెక్కు పంతంబులను, బిఱుతివియని చలంబులును, నగ్గలికలు మెఱయ నేడహోరాత్రంబులు చిత్ర విహారంబులం బోరిరి. ఆ సమయంబునఁ ద్రామధ్వజునితేరు తిలమాత్రశకలంబులుగా ఖండించి, గాండీవి వెండియు వాఁడెక్కిన రథంబులు రెండువేలు చూర్ణంబులుగాఁ జేసి, యక్షౌహిణీ బలంబుఁ బరిమార్చె. తామ్ర ధ్వజునిచేఁ గౌంతేయుని బలంబును నట్ల నిధనంబునొందె. అంత, మహాబల పరాక్రమ ధురీణుండైన తామ్ర ధ్వజుండు, మాంస ఖండంబు రెమ్మికొనిపోవు సాళువంబు చందంబునం గిరీటి తోడం గూడఁ దద్రథంబు నొక్క కరంబున నెత్తికొని యాకసంబునకు దాఁటి భూతలంబునకుం ద్రిప్పివైచుటయు, వివ్వచ్చుండు చచ్చెఁ జచ్చెనని సైనికులాహారవంబులు సేసిరి. అప్పుడప్పురుషోత్తముండు, నిజకరాబ్జంబునం బడకుండఁ బట్టికొనుటయుఁ,దామ్ర కేతుం డలుకనొలుక గదాధరునిం జూచి,'యర్జునునితోఁ బోరునపుడు దొమ్మికిం దలపడితివి. ఇది వీర ధర్మంబు గా'దని పలుకుచు దంభోళి సన్నిభంబైన యొక్క శరంబు వింట సంధించి, యాకర్ణాంతంబుగాఁ దివియునంతలో, మురాంతకుండు వాని రథంబునకు దాఁటి తద్వక్షస్థలంబు దన్ని, తన చేతి గదా దండంబు ద్రిప్పి, వాని నడునెత్తిగాతు కలఁగఁగొట్టి లంఘించుటయు, నతండును జలింపక, నిజ స్యందనంబు చిత్రగతుల నటింపం

జేయుచుఁ, జతురంగ బలంబుల బారి సమరుటయు, ముకుందుండు నర్జునుం జేర్కొని, 'మన యోధ యూథంబులు యథాయథలుగాఁ గలంగె. ప్రద్యుమ్నాది యోధవీరులు మూర్ఛదెప్పిఁజం జాలక యున్నారు గావున, మన మిరువురము వీనితోడం దలపడి పోరవలయు' నని, శార్ఙ్గకోదండంబెక్కుపెట్టి, దిక్కులు గ్రక్కదల గుణధ్వని గావించుటయు, గాండీవియుఁ దన కోదండంబు నధిజ్యంబు గావించి మౌర్వీరావంబున భూనభోఽంతరంబులు పూరించె. ఇవ్విధంబున గృష్ణార్జును లిరుగెలంకులం బిడుగులంబోని బెడిదంపుటంపజాల పరంపర వాఁచుటయుఁ, దామ్రధ్వజుండు సరకుఁ గొనక యిరువుర చాపంబులు మౌర్వీ నెడలం జేయుటయు, నింద్రనందనుం డుపేంద్రునిం జూచి, 'యీ యల్పుని మీఁద నీవాయుధం బెత్త నేమిటికి? ముహూర్త మాత్రంబున వీనిం బరిమార్చెద. నీవు నాకు సారథివై యుండినం జాలు,' ననిన, వనజనాభుండియ్యకొని యుగ్యంబుల పగ్గంబులు గేలంబూని చిత్రంబుగా సారథ్యంబు సేయుటయుఁ, దామ్రధ్వజుండు క్రోధ తామ్రాక్షుండై, పది తూపులం గృష్ణుని, నరువది శరంబుల నర్జునుని నాటించి, గొడుగు తెగవేయుటయు, వాసవ తనయుండు వాని యరదంబు నూఱు శకలంబులు సేసె.దానం గలంగక యా రాజనందనుండు మదపుటేనుంగు నెక్కి యుక్కుటమ్ముల్ లొక్కుమ్మడిం గురిసినఁ, దూపుల ఱెక్కల వలనం బొడమిన సుడిగాలిలోనం దవిలి నరుని యరదంబు గాలిచక్రంబు చందంబున బిఱబిఱం దిరుగు సమయంబునఁ బ్రద్యుమ్నాది యోధవీరులు మూర్ఛదెప్పిజె నిశితశరపరంపరల నొవ్వనేయుటయుఁ, దామ్రధ్వజుం డవక్ర పరాక్రమంబున నవ్వీర వరుల నారాచధారాపూరంబుల ముంచి మగుడ మూర్ఛ నొందించె.

## -తామ్రధ్వజుండు యాగ-హయంబుఁగొని పురంబునకుఁ బోవుట-

తదనంతరంబు కంసమర్దనుండు కోపాటోపదీపితుండై సహస్రధారా ఘోరంబైన సుదర్శనంబు గేలంబూని నక్షత్ర తారాగ్రహ సహితంబైన గగనంబును, శైలకానన సమేతంబైన భూతలంబును గంపింప, రథంబు దిగ్గనుఁజీకి యెదురు వచ్చుటయుఁ, దామ్ర ధ్వజుండు నవ్వుచు, ''శ్రీకృష్ణా,

వృష్ణికుల భూషణా, యానాఁటికిఁ గౌంతేయుని గావంబూని నీవు చేసిన సుకృతంబు నిచ్చివేసితివి. ఇప్పుడీ దేహంబునే యీయం జూచెదవు. మంచిది. కానిమ్ము, నిన్ను, నీ మఱందిని నీ హయంబు తోడంబట్టికట్టి కొనిపోయెద' నని యేనుంగు డిగ్గి శ్రీకృష్ణ దేవుని కరాంబుజంబు మెలిపెట్టి, చక్రంబు నులిమికొను నంతలో రమాకాంతుండు పేరెలుంగెత్తి, 'యర్జునా, నా చేతి చక్రంబు నాఁచు కొని పోవుచున్నవాఁడు. వీని క్రూర నారాచ ధారాపరంపరల వెంపరలాడి విడిపింపు' మనుటయుఁ, గౌంతేయుండు శత నిశిత విశిఖంబుల వాని పార్శ్వంబు నొప్పించిన, లెక్కగొనక తామ్ర ధ్వజుండు కృష్ణార్జునుల నిరువుర రెండు చేతులం బట్టి బిగియించి, మూర్ఛనొందించి, భూమిం బడవైచి, రెండు యాగ హయంబుల బట్టికొని, పురంబునకుం జని, నిజ జనకుండైన మయూర ధ్వజుని చెంతకుం బోయి మ్రొక్కి నిలిచిన, సేనాపతియైన నకుల ధ్వజుని దిక్కు గనుంగొని, నతండు మయూరధ్వజునితో, 'నీ కుమారుండు కృష్ణార్జునులం గెలిచి సవన హయంబుం బట్టికొని తెచ్చె' ననిన, విని యతండు కోపంబునం గన్నులఁ గెంపు గదురఁ గొడుకు నవలోకించి, 'నీవు శ్రీకృష్ణార్జునుల గొనిరాక తురంగంబు మాత్రమే తెచ్చితివి. ఇంత పడుచుఁ దనంబు గలదె? యజ్ఞమ యుండును, యజ్ఞకర్తయు, యజ్ఞభోక్తయు, యజ్ఞఫల ప్రదాతయునైన శ్రీవాసుదేవుండు లేని జన్మంబేమిటికి? ఎవ్వరి నుద్దేశించి యాగంబు సేయం గలవారము?' అని భార్యయుం దానును బరితాపంబు నొందుచు, నడలుచు నున్న సమయంబున, నర్కుండ స్తగిరి శిఖరంబునకు నలంకారంబై నిలిచె. పాండవ సైనికుల వదనంబులు పంకజంబులం బోలె ముకుళితంబులయ్యె. గాయంబు వలనం బొడమిన రక్తరాగంబు సంధ్యారాగంబుతో నైక్యంబుఁజెందె. జారుల మోడ్పు గన్నులును, గైరవంబులును వికాసంబు నొందె. అవ్వేళ మూర్ఛఁదెలిసి లేచి, నరుండు శ్రీహరిని నిరీక్షించి, 'యింత తడవు కయ్యంబు సేసిన యోధ సవన తురంగంబుం గొని యే త్రోవం బోయెనో నాకెఱిగింపు; మతని రణంబునఁ గెలిచి యజ్ఞవాహంబు గొని వచ్చెద' ననిన, నవ్వి, యమ్మో స్నుండు 'కపికేతనా, తామ్ర కేతుండు మనల నిరువుర గెలిచి మూర్ఛఁబుచ్చి హయంబుగొనుచు రత్నపురంబునకుం జని తన తండ్రికొసంగె. ఇంక మనము గాము; త్రిమూర్తులొక్కటై వచ్చినను గెలువఁ జాలము గాము. వాఁడు మదీయ ఛత్రాగ్రగణ్యుండు. దాన క్షాత్రాధీశ్వరుండు. వాని సాహసౌదార్యంబులు

చూడవలయునేని నావెంబడిం జనుదెమ్మ'ని తోడుకొనిపోయి బలంబులు పుర సమీపంబున నిలిపెను.

## -శ్రీకృష్ణుండు మాయారూపంబున నర్జునునితో రత్నపురంబు సేరుట-

(అప్పుడు) శ్రీకృష్ణుఁడు ప్రాత ముదుక సీర్కావి బ్రహ్మకమ్మి దోవతియు, నందు పైనఁ జినిగిన యుత్తరీయంబును, నుదుట గోపీచందనపు టూర్ధ్వపుండ్రంబును, వక్షస్థలంబునఁ బద్మాక్షమాలికయు, గర్ణరంధ్రంబుల నులి వాఁడిన శ్రీతులసియు, భుజంబున యాయవారపు గోనెసంచియుఁ, గక్షభాగంబులఁ గృష్ణాజినంబు దేవతార్చన కక్షపాలయు, దక్షిణహస్తంబునఁ బుప్పివెదురూఁత కోలయు, గూని వీఁపునఁ జినిగిన గొడుగు తునకయు, వణంకెడు బడుగు దేహంబునుం గలిగి, వృద్ధ బ్రాహ్మణరూపంబునం దన కూర్మి సఖుండైన యర్జునుని బ్రాహ్మచారివై శిష్యుఁడవుగ రమ్మని పూర్వ రాత్రంబున రత్నపురంబునకు జనియె.

తదనంతరంబు, శ్రీకృష్ణదేవుం డర్జునునితోడం గూడ నా రత్నపురంబు సొచ్చి, యగురు సాంబ్రాణి ధూప సమ్మిళితంబును, గుంకుమ కర్పూర కస్తూరి కాది పాణింధమంబును, నానావిధ కుసుమ మాలికా సముద్గీర్ణ సౌరభంబును నైన యొక్క వీధింజనునెడ, నందంబైన యిందుకాంత సౌధంబున నొక్క మందయాన తోడంగూడఁ గ్రీడించుచు, నొక్క విటుండా కుటిలకుంతలం జూచి, 'నీ కురులకుఁ గృష్ణత్వంబుగలిగె. మేలు, బళీ!' యని మెచ్చుటయు, నా కల కంఠి ప్రాణేశుని కేలు కేలునం దెమలించి, 'నీ కరంబులు శంఖ చక్రాంకితంబులై యున్నయవి. కావున నీవు పురుషోత్తముండవు' అని పలుకుటయు, సమ్మాటలు విని సరసిజాక్షుం డర్జునుని గనుంగొని, 'యీ యాశ్చర్యంబు వింటివే? కేళి కాలంబునందును, మదీయ నామ సంకీర్తనంబు సేయుచున్నవారు. ఇట్టి వారల చిత్తంబులు మత్పదాయత్తంబులు. వీరల వచనంబులు మదీయ దివ్యనామ రచనంబులు. ఈ జనుల కృత్యంబులు మత్కైంకర్య సత్యంబులు. ఈ పట్టణంబు భూలోక వైకుంఠంబు' అని పొగడుచు, నరుడునుం దాను,

నా రాత్రి యెల్లఁ బట్టణ వీథులం దిరిగి, వేఁకువ జామున నర్మదానదికిం జని, యందలి నిర్మలంబులగు నుదకంబుల స్నాన సంధ్యావందనాది కృత్యంబులు నిర్వర్తించి, సూర్యోపాస్తిఁ జేసి, తత్సమీపంబున రాజహంస కూజితంబుల చేత ద్విగుణీకృతంబులైన కింకిణీరవంబులచే నలంకృతంబైన ఘోటకంబుచే నొప్పు యజ్ఞ వాటంబునకుం జని, యయ్యాస్థానంబును, నందలి ఋత్విక్కులను, దత్సభాసదులను, వారలచే నుచ్చరితంబులైన ఋగ్యజుస్సామ మంత్రంబులను, వానిచే నావహింపబడి దివ్య విమానంబులతో వచ్చు నింద్రాది దేవతలను, యజ్ఞశాలామధ్యంబున దీక్షాపరుండును, బత్నీ సమేతుండును, దర్భాసనాసీనుండును, సకల సామంత మహీకాంత కిరీట ఘటిత మణిప్రభానీరాజితపదుండును నైన మయూర కేతనుంగాంచి, యా కపట భూసురు లిద్దఱు 'రాజోత్తమా, భద్రమస్తు'. అని యాశీర్వాదంబు సేసిన, నన్నరవరుండు ప్రత్యుత్థానంబు సేసి, సమస్కరించి, 'ధరణీ సురోత్తమా, నేను వందనంబు సేయక మున్నె మీ రాశీర్వాదంబు సేయుట శపియించుట గాని దీవించుట గాదు. ఎందుండి యెందుఁ బోవుచు నిందులకు విజయంబు సేసితిరి ? నా వలనం గాఁగల కార్యం బెయ్యది?' అనిన, నా కపట భూసురుండు పరమానంద కందళిత హృదయుండై 'రాజకులావతంసా, మేము కార్యార్థులమై వచ్చిన వారము గావున, ముందుగా నాశీర్వాదంబు సేయుటయు, వెనుక నీవు వందనంబు సేయుటయు నెగ్గుగాదు'. అనిన విని, జన నాయకుం 'డనఘా ! అభ్యాగతస్స్వయం విష్ణుః, అనబడును గనుక నీవు సాక్షాజ్జనార్దనుండవని తోఁచు చున్నది. దొడ్డు కొంచెంబనక వేఁడుము. దేహ వంచనయు, మనోవంచనయు, ద్రవ్య వంచనయు లేక యొసంగెద'. అనిన విని యమ్మహీసురుండు, 'రాజశేఖరా, ధర్మపురంబున వాసంబు సేయుదును. కృష్ణశర్మ యనువాఁడను. ఇతండు నాకు శిష్యుండు. ఇతని తోడం గూడ నేను మత్కుమారునిం దోడ్కొని నీపురోహితుండైన సుశీలుని యింటఁ గన్నె యున్నదని విని, మత్కుమారునకు వివాహంబుగా నడుగవలయి నను తలంపున వచ్చుచున్నయెడ, నతి భయంకరంబైన యరణ్య మధ్యంబున నాఁకలి గొని కోపోద్దీపితంబైన యొక్క సింహంబు మదీయ పుత్రునిం గదిసి యతని గళంబు పట్టికొనుటయు, విడిపింపం దరంబు

గాక, వేఱొక్క యుపాయంబునుం గానక 'శ్రీనృసింహ, శ్రీనృసింహ' యని నూటయెనిమిది మాఱులు జపించిన నద్దేవుండు ప్రత్యక్షంబయ్యు నా పుత్రుం గావలేఁడయ్యె. ఇవ్విధంబున నాపన్నుండైన కుమారునిం జూచి, యత్యంత పరితాపంబు నొందుచున్న నన్నుంగని, యా మృగరాజంబు వాలంబు సారించుచు, నా పుత్రుని గాత్రంబు నఖంబుల గ్రుచ్చుచు, దంష్ట్రాంకురంబుల నప్పళించుచు, మనుష్య భాషణంబుల నన్నుద్దేశించి. 'భూసురా, నా చేతం దగిలిన జంతువును గృతాంతుండేనియు విడిపింప నోపఁడు. అట్టియెడ నీవెంత వాఁడవు ? నాకన్న బలవంతుండు జగంబున లేఁడు. శిష్యుండును, నీవును, గృహంబునకుం బొండ'ని నిరాశగాఁబలికిన నేను నాపరాని క్లేశంబున నా శివుఁ బాసిపోవంగాళ్లాడక పుత్రహీనుల కూర్ధ్వగతి లేదని వినియుండుటంజేసి, మచ్ఛరీర కబళంబుగొని నా సుతుని శరీరంబు మగుడ నొసంగుమనిన, విని యక్కంఠీరవం బకుంఠితోత్కంఠ మెఱయ నన్నుం గూర్చి యిట్లనియె. 'నావంటి దుష్టజంతువులము మృత్యువునకు భృత్యులముగావున నిట్టి యల్పాయుష్కులంగాని నీవంటి దీర్ఘాయుష్కులం బట్టనొల్లము. నీవు పట్టికొఱకై యింతఁబట్టి పెనంగం బనిలేదు మరలిపొమ్మ'నిన, నే నా మృగరాజంబునుం జూచి, 'యోయీ, పంచాననా, నేఁజేసిన సుకృతంబులన్నియు నీకు నిచ్చెద, నిప్పాపని నొప్పింపక నాకు నొప్పింపు'మని వేఁడుకొనిన నియ్యకొనక, 'మాకు నీవలనఁ గావలసిన ప్రయోజనం బొక్కటియు లేదు. మయూరధ్వజుని వలనం గాఁదగిన కార్యంబు గలదు.' అని పలికె. అక్కార్యంబు నీవంగీకరించెదేని యెఱింగించెద.'

అనిన విని యా భూసురోత్తమునకు రాజసత్తముండిట్లనియె. 'ఆ సింహంబు సాక్షాన్నృసింహదేవుండెగాని, సామాన్య సింహంబుగాదు. మదీయ దేశ కాననంబున గిరులం జరించు సింహ వ్యాఘ్ర వరాహ మహిష దర్వీకరాది జంతువులు ప్రాణిహింసఁ జేయ వెఱచు; నైననేమి ? నీయడిగిన పదార్థంబునెల్ల దామసింపక యొసంగెద. నా మాట వృథగాదు. నీవు కావలసిన దాని నడుగుము'. అనిన భూసురాగ్రేసరుండా నృపాగ్రణింజూచి, 'దుర్బలస్య బలం రాజా యను వచనంబున్నది. కావున మము బోఁటి యర్థులకు మిముబోఁటి దాతల వేఁడుటకు సంశయింపఁబని లేదు. నా యార్తిని హరింపుము. ఆ సింహము నీ దేహంబులో సగంబు నిచ్చిన నా కుమారుని విడిచిచెదననిన నేను నా సింహంబు నవలోకించి బహుజన సంరక్షకులైన మహారాజుల దేహంబులఁ గోసి యిమ్మనుట మాబోఁటి

విప్రుల కుచితం బగునె ? అనిన విని యా కంఠీరవంబు నన్నుఁజూచి, సురేంద్రా, యన్నరేంద్రుని సామాన్యునిగాఁ దలంపకుము. దీనజన రక్షకుఁడు, నాత్మ విద్యావిశారదుఁడు, నుత్తమోత్తముండు, నుదారుండును సత్యసంధుఁడు నైన మయూరధ్వజ మహారాజునకు దొడ్డు కొంచెంబు లేదు. కావున నతని నడుగ వలసిన కార్యంబునకు నీవు సంశయంబు నొందవలదు. అతని నడిగిన నుత్తర క్షణంబున నీ కోరికను ఫలియింపజేయు, నది యట్లుండె. నీ శరీరంబు కుమారునకు బదులొసంగెద నంటివి. జరచే ముదిసి, తపంబుల శోషించి, యుపవాసంబులఁ గృశించి, బలహీనంబగు నీ బడుగు దేహంబు మాకేమిటికి ? ఆ రాజదేహంబు సకల రసంబులఁ దృప్తినొంది సర్వసుఖంబులచేతఁ దనిసి నవనీతంపు ముద్దయుంబలె నా నోటి కింపై యుండునని సింహంబె నన్నుం బొమ్మనె. దశరథ నందనుండు మృతుండైన బాలునిఁ బ్రతికించిన తెఱంగున నా పుత్రునిం బ్రతికింపుము. కాదేని, నీకు కొదపకాని మాకేమి ?' అనుటయు మయూరకేతనుం డామాటలు విని, యా భూసుర కుమారునకు బదులుగ తన శరీరం బీయఁదలంచి, మంత్రి పురోహిత బంధుమిత్రాదులం జూచి, 'రాజులకు రణంబున నేనియు, గోబ్రాహ్మణ నిమిత్తంబేనియు శరీరంబుఁ దృజించు టుచిత ధర్మంబు. తొల్లి శిబి కర్ణ జీమూతవాహనాదులు పరార్థంబుగా నిజ శరీరంబులఁ దృజించి, స్వర్గ సుఖంబులం జెందిరి. కావున నే నీవిప్రోత్తమునకై నా శరీరంబు నొసఁగి కృతకృత్యుండ నయ్యెద. దీనికి విఘాతంబుగాఁ బలుక వలవ'దని, కుమారుఁడగు తామ్రకేతుని రాజ్యాభిషిక్తునిగాఁ బ్రతిష్ఠించి, నర్మదా నదిఁ గృతస్నానుండై, యనేక దానంబులజేసి, యావిప్రపుంగవుం బిలిచి, 'సలిల ధారాపూర్వకంబుగా మదీయ దేహంబులో సగంబొసంగుట వలన శ్రీ కృష్ణ దేవుండును బ్రీతుండగుంగాక !' అని భూసురుని చేత ధారవోసి శంకా రహితుండై, యజ్ఞవేదికా స్థలంబున దర్భాసనంబునఁ గూర్చుండి బృందారక బృంద వందితుండై, ముకుంద చరణారవిందంబుల హృదయార విందంబునం దిరంబుగా నిలిపి, మొగలి రేకుం బోలిన యంపంబున శిరంబు మోపి, తెగువసేయం బూనినంత లోపలఁ, బుణ్యచారిత్రయు, సౌభాగ్యవతియు, బతివ్రతా శిరోమణియుఁ, బరమసాధ్వియు నైన యతని భార్య కుముద్వతీదేవి యువ్విధం బెఱింగి సత్వరంబుగాఁ జనుదెంచి, 'పురుషుని యర్ధ శరీరంబు భార్యయను వేదవచనంబు గలదు. కావున మదీయ దేహంబు బ్రాహ్మణార్థంబుగా సమర్పించెద నిలువు'

పిదప, అని యా కపట భూసురుండు మహీపాలుం జూచి, 'పురుషుని వామాంగంబు స్త్రీ భాగంబు గావున మయూర కేతను వామ భాగంబు తేవలవదని యా సింహంబు పలికె, నట్టియెడ నియ్యంగన శరీరం బొప్పుకొనునె?' అనునంత, నమ్మహారాజసుతుండగు తామ్రకేతుండు నమ్మహీసురునకు నమస్కరించి యిట్లనియె: 'మహీసురోత్తమా, తన యాత్మయె పుత్రుండై జనియించు నని వేద వచనంబు గలదు. కావున మజ్జనకుని దేహంబునకుఁ బ్రతినిధిగా నా శరీరంబు నిచ్చి నేను ఋణత్రయ విముక్తుండనై తండ్రి చేసిన ప్రతినఁ జెల్లించి, శ్రీరామభద్రుండును, భీష్ముండునుం జెందిన కీర్తిం జెందెద' ననిన, నక్కైతవ భూసురోత్తముండు 'రాజనందనా, సింగంబు పలికినమాట వినుము. ఆ రాజు దేహంబును దత్కళత్రంబును, సుతుండునుం గోసియిచ్చిన నందులో దక్షిణ భాగంబుఁగొని తెమ్మని నన్నుంబనిచెఁ గావున నవ్వచనంబును సత్యంబు గావింపం జనదు' ననిన, నా రాజు దరహసిత వదనుండై తన భార్యను గుమారునిఁ గనుంగొని, 'యీ భూసురుండు పలికినట్లు గావింపుం'డని తనచేత నున్న రంపంబు వారలచేతికి నొసంగుటయు, నారాజపత్నియైన కుముద్వతియు నందనుండైన తామ్రకేతుండును గైకొని, యతి ధీరయగు కుముద్వతీసతి, కుమారుని చిత్తం బుత్తలంబు మానం బలికి, యిరువురు రెండు పార్శ్వంబుల నిలిచి, యతి తీక్ష్ణతరంబైన యా రంపంబు భూపాలకుని శిరంబునఁ జేర్చి, 'రఘుపతీ, శ్రీమన్నారాయణా, హరిహరీ, శ్రీ కృష్ణా, పురుషోత్తమా,' అని కోయునెడ మేదినీశ శిఖరంబునుండి పాఱఁగ గైరిక ధాతు ఝరంబుల తెఱంగున రక్త పూరంబు లపారంబులుగాఁ గురియ భూజను లాహాకారంబులఁ గావించిరి. ధీర జనులు కొనియాడిరి. దేవతలు ప్రశంసించిరి. అప్పుడమ్మహీపాలుండు చిత్తంబును వాసుదేవ పదాయత్తంబుఁ జేసి ధీరుఁడై యుండునెడ నతని యెడమ కంట నీరు గ్రమ్ముటయు, నమ్మహీసురుం డది గనుంగొని కోపాటోపంబునఁ గరంబుల విదల్చి, వేణుదండంబును ధరాతలంబునం బడవైచి, యిటునటు గంతులు వైచుచు, 'నపుత్రత వలన నూర్ధ్వలోకంబులు లేకపోయినం బోవ నిమ్ము. ఏడ్చుచు నొసంగిన దానంబు నే నొల్ల'నని శిష్యుని కరంబు బట్టి యీడ్చుకొనిపోవుటయు, నమ్మహీపాలుని సతీమణి తన ప్రాణేశు మస్తకంబు గదియంబట్టి, 'మహీసురా, ఈ శరీరంబు వ్యర్థంబుగాఁ గోయించి, తాను నొల్లనని యివ్విప్రుండు తన దేహంబుల వెట్టి యలిగిపోవుచు నున్నవాఁడు. ఇంక నెట్టు' లనిన, నమ్మహీ

రమణుండు చనుచున్న మహీసురుఁ జేరఁబిలిచి, 'మహాత్మా, నీ వేటికిఁ గోపంబుఁజెంది పోయెదవు? నీ వంటి సత్పాత్రంబున కీశరీరంబులోన దక్షిణ భాగం బుపకారంబునకు వచ్చె. వామాంకంబగు తా నుపయోగంబునకు రాక పోయితిని గదా యని కంట బాష్పములు గ్రమ్మ నడలుచున్నయది. వేదన చేతఁ దొఱఁగెడి బాష్పంబు లంటివేని రెండు కన్నులం బొడమ వలదె? నాయెడ దయచేసి నీ భాగమ్ముఁ గొని పొమ్మ'నుటయు, నర్జునుని తోడఁ గూడ శ్రీకృష్ణుండు ప్రత్యక్షంబై నిలిచి, యమ్మహీపాలకుఁ గౌగిలించికొని, 'రాజకుల చంద్రా, నీ ధైర్య స్థైర్య సాహసౌదార్యంబులకు మెచ్చితి. నీ సుతుండును, సతీమణియుఁ గొలువ మా యాగీహయంబుల నెంటినుంచుకొని, యాగ ద్వయం బును నీవె చేయుము. కర్మను కర్తనునై నేన సర్వంబు నిర్వహించెద. నీకుమా రుఁడు మమ్ము నిరువురఁ దానొక్కరుండె యుద్ధంబున జయించె. నీవు దేహంబు నొసంగి మమ్ము జయించితివి. ఈ రాజకులంబు లోననీవంటి వీర వితరణ గుణంబులు గల మేటి లేఁ'డనియె. అప్పుడ ప్పుడమిఱేఁడును దామోదరుని కరారవిందస్పర్శంబున గాయంబు మాని, సంతసంబున నద్దేవుని చరణ పద్మం బులకు సాష్టాంగ దండ ప్రణామంబు సేసి, 'దేవా, కర్మఫలదుండవు. సకల యాగ సమారాధ్యుండవు, యజ్ఞమయుండవునైన నిన్నుఁ గనుఁగొంటిని. ఎండగొట్టున దప్పిఁగొనిన వానికి విమలోదకంబులచేత దప్పి తీఱవలయునుగాని, మంచు తుంపరలం దీఱునె? పునరావృత్తి రహిత మోక్ష సామ్రాజ్య ప్రదుఁడ వైన నిన్నుఁ బ్రత్యక్షంబుగాఁ గనుంగొనియుఁ జాలక కర్మారంభంబు సేయం బూనిన నన్నుఁజూచి విద్వజ్జనులు నవ్వరె? ద్రవ్యంబుఁ గుమ్మరించి పట్టి కొప్పెరఁ దెచ్చిన వెట్టివాని విధంబున, దురంబున మీ స్వరూపం బెఱుంగఁ జాలక నా కుమారుఁ డవివేకియై రిత్తహయంబుఁబట్టి తెచ్చె. దేహంబు లస్థిరంబులని తెలియక యీ హరిఁబట్టి తెచ్చె; నందువలన శ్రీహరివగు నీ సందర్శనంబు కలిగె. నేను ధన్యుఁడనైతిని. ప్రళయసాగరంబున శ్రుతిచోరకుఁడగు దైత్యుని సంహరించుటకు మీనరూపంబవైన నీకుఁ బ్రణామంబు. కూర్మ రూపధరుండవై జలధి మథనంబు గావించి సురల కమృతంబు నొసంగిన నీకు వందనంబు.

లీలావరాహమూర్తివై భూమి నుద్ధరించిన నీకు నమస్కారంబు. స్తంభంబునం బుట్టి ప్రహ్లాదుంగాచిన నరసింహా, నీకు దండంబు. వామనమూర్తివై మూండడుగుల ముల్లోకంబుల నాక్రమించిన త్రివిక్రమా, నీకుం బ్రణుతి నొనర్చెద. క్షత్రియకుల ధూమకేతువైన భృగురామా, నీకు మ్రొక్కెద. దశకంఠకంఠలుంఠక నారాచ ధారా చకితర దానవశైల వజ్రాయుధా, హలాయుధా, నీకు జోహారు. త్రిపుర సంహారహేతు బౌద్ధా, యనిరుద్ధా, నీకుం గేలుమోడ్చెద. మ్లేచ్ఛనికరవిచ్ఛేదన ప్రచండమండలాగ్ర ధారాసంపాదిత కీర్తీ, కలికిమూర్తీ, నీ పదాబ్జంబులకు నమ్రుండనైతి,' నని బహువిధంబులం బ్రస్తుతించి, సమస్త వస్తు జాతంబు లమ్మాధవునకర్పించి, సంప్రీతుంజేసి, పురందర నందను నట్ల పూజించి కౌంగిలించి, బంధుజన సమన్వితుండై శ్రీకృష్ణార్జునుల నిజపురంబు నకుం దోడ్కొనిపోయె. అంత గోవిందుండు గాండీవికి మయూరధ్వజుని భక్తి దెలుపవలసి బలసమన్వితంబుగా దివసత్రయంబధివసించె, అనిన జనమేజయుండు జైమిని మునితోం దరువాతి వృత్తాంతంబెఱింగిపుమనుటయు-

శా. ఆలంకా మిహికాచల ప్రకట శౌద్యాగాధ గాఢాశతో
ద్వేల... స్స్వయశోవిశోభిత ధరిత్రాఖండ, ఖండాదిక
స్వాలాపామృత సేచనోల్లసిత విద్వత్కర్ణ, కర్ణాటల
క్ష్మీలీలైక ధురీణ, వీణనృప రాజా లంఘితా శాంతరా.

క. కల్పక సమదానకళా
కల్పక నిజబాహుదండ గండర దండా,
కల్పక సత్కవి వినుతా,
కల్పక సత్కీర్తిసాంద్ర, కనక మృగేంద్రా.

పంచచామరము: ఘనాఘనౌఘ నాదనాది కాహళీ హళాహళీ
ఘనర్విభా విభాసిత ద్యుగర్భరార్భటీ
కసద్ధరావరాహకేతు కాండ చండ వాహినీ
ఖినోద నోదనగ్న భగ్నవీరవైరి మండలా,

గద్యము

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ
మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగమాందోళికా
ప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధ మాన
సముఖ మీనాక్షీ నాయక తనూభవ మీనాక్షీ
దేవీ కటాక్ష లబ్ధ కవితా సాంప్రదాయక,
వేంకట కృష్ణప్ప నాయక ప్రణీ
తంబైన జైమిని భారతం
బున నశ్వమేధ పర్వ
మ్మను వచన
కావ్యంబు నందుఁ
జతుర్థాశ్వాసము.



# జైమిని భారతము

## పంచమాశ్వాసము

క. శ్రీ మధురాపురనాథా
...మధురాధరగభీర...నిజవినోదా,
భూమీసుత భూరికళా
స్తోమాంకా, విజయరంగ చొక్క మృగాంకా.

అవధరింపుము. జైనమునీంద్రుఁడు జనమేజయ నరేంద్రునిఁ గనుఁగొని యిట్లనియె. అవ్విధంబున రత్ననగరంబునఁ గృష్ణార్జునులు రాజుచేతఁ బూజలు గొనుచు, మూఁడు దినంబులుండి, నాలవనాఁడు సముత్తుంగ తురంగ శతాంగ వీరభట పరంపరలతో, మయూరకేతనుండు కొలిచిరా, యాగతురంగబులఁగదలింప, నవియు నానాదేశంబులు, నదులు, నదంబులు, జనపదంబులు నతిక్రమించి, క్రమక్రమంబున సారస్వతపురంబునకుం జేరనరిగె. ఆ రాజు రాష్ట్రంబున నెల్లకాలంబును గృతయుగంబునందునుంబలె ధర్మంబు నాల్గు పాదంబుల నడచు. ఏ సత్య సంధుని దేశంబునందలి ప్రజలు కలవరించియేనియుబొంకరేవదాస్యండు చేయుదాన ధారాప్రవాహంబులచేత మేదినీ తలంబు ముక్కాఁటును బండు, నేసుశీలుండు 'బ్రాహ్మణో మమదైవతం'బని నిశ్చయించి విప్రసంతర్పణంబు నెడ విడువక సేయు.

### - వీరవర్మ గుఱ్ఱంబును బట్టుట -

అట్టి పరమ ధార్మికుండైన వీరవర్మ తన చారులచేతఁ గపిధ్వజ మయూరధ్వజుల యాగీయ ఘోటకంబులు తన దేశంబునకు వచ్చెనని విని, వానిరెంటినిఁ బట్టికొనఁ జెంగటివారలం బంచుటయు, వారలట్లుగావింప, యౌవనాశ్వానుసాళ్వ హంసధ్వజ మయూరధ్వజాది మహారాజ సేనాసందోహ సమున్నతంబును, నపరిమిత కరితురగ రథ భట పటల ఛటులంబునునై, కల్లోలినీ వల్ల

ఘుని విధంబున వెల్లివిరిసియు, బాండవసైన్యంబులకెల్ల నధిష్ఠాతయు, సమర కర్కశుండును, విక్రమ జిత శ్వేత వాహనుండును నైన బభ్రువాహనుం డెదుటి సైన్యంబులం గదిసి, తులిత భిదురంబులైన ప్రదరంబుల దరంబుగా నెదురం బ్రయోగించి, సేనాంగంబుల భంగంబు నొందించుటయు, నవ్వీర కుమారులు కువలుండును, సులతుండు ననువారలు దివ్యరథంబుల నధిరోహించి, బభ్రువాహనుఁదాకి, దంతధర దండోపమానంబులైన చండ కాండంబులఁ దండ తండంబులుగా నొండొండ నిగిడించుటయు, నుభయ సైన్యంబులకు ముష్టీముష్టి, బాహాబాహి, కచాకచి, ఖడ్గాఖడ్గి, దండాదండిగా భండనంబయ్యె. అప్పుడు పదివేల మహారథులతోడంగూడ వీరవర్మ కుమారులు బభ్రువాహనునిఁ గిట్టి పెట్టిన, దండె తీయక నిశిత శరనికరంబుల నొప్పించుటయు, నింద్రుని మనుమఁడు మండుచు, జండాంశు కిరణకాండ సదృశంబులైన శరప్రకాండంబులు వర్షించు టయు, నగ్నిలోనంబడిన శలభంబుల కైవడి వీరవర్మ సైన్యంబులు మ్రొగ్గతి లంబాఱె. అప్పుడతని యల్లుండగు నంతకుండు విఱిగిన దళంబులం బురికొల్పి, శత సహస్రాయుత నియుత కోట్యర్బుదన్యర్బుద ఖర్వ మహాఖర్వ శంఖ సంఖ్య లును, ఋంఖాను ఋంఖంబులునగు కంకపత్రంబుల నిగిడించిన, వ్రాలు నేనుంగు లును, గూలు గుఱ్ఱంబులును, దూలు రథంబులును, గీలు దప్పిన బొమ్మలగతిఁ బడు వీరభటులును, మూర్ఛల మునుంగు యోధులును, మునింగిన మహారథు లును, మోహంబు నొందిన మహీపతులునుం గలిగి, దీనదశంబొందిన సేనల నవలోకించి, కిరీటి కైటభాంతకునిఁజూచి 'వీఁడెవ్వఁడో దురంత పరా క్రముఁ డంతకుని తెఱంగున మన బలంబు నంతంబు నొందించుచున్నవాఁడు. నాకుఁజూడ వీని మనుష్యుం డనంగూడ'దనిన విని వనమాలి కిరీటింజూచి యిట్లనియె.

## - కృష్ణుం డర్జునునకు యమ వృత్తాంతంబుఁ జెప్పుట -

'ఈ రాజు కూఁతురగు మాలిని యను వధూటికి యముఁడు మగఁడు. కావున నతండు మామ నిమిత్తంబుగా మనతో నెదిరించి పోరుచున్నవాఁడు. ఆకన్య జమునిఁ బెండ్లి యాడిన తెఱఁగు వినుము. వీరవర్మ కుమారి మాలిని లోకైక సౌందర్య శాలిని మవ్వంపుజవ్వనంబున నివ్వటిల్లుటయు, నప్పువ్వుబోణిఁ జూచి, యవ్విభుండు 'తల్లీ, నీవెవ్వరిఁ బెండ్లియాడెదవు? సమ్మతుండైన పురుషునిం దెలు

పుము కల్యాణంబు సేసెద'ననుటయు,మాలిని జనకునితో నిట్లనియె:'పుడమిలోనం బుట్టిన జనునకుఁ జావు నిజంబు. వానితో ననుగమనంబు నొనర్చి యమలోకంబున కుంజని యముని శాసనంబునఁ బుణ్య పాప ఫలంబు ననుభవించి బహు జన్మం బులకెత్తుటకంటె, యమునిం బెండ్లియాడి సుఖంబున నుండుట మేలు. అందులకుఁ దగిన యుపాయం బొనరింపుము'. అని పలికి మాలిని, నానాటికి వైవస్వతుని మీఁది మోహంబు రెట్టింప, విరహ వేదనం జెందుట యెఱింగి, యా రాజు భూసురుల తోడఁగూడ యమస్తోత్రంబు నుడువుచు బహుకాలంబు యముసుద్దేశించి తపంబు సేయుచు నుండ, నక్కన్నెయు వ్రతనియమంబులఁ బూని సూర్యనందనుని నారాధించుచుండె. అంత, నారదుం డవ్వృత్తాంతంబెఱింగి యంతకుని పాలికిఁజని, యతనిచే నభ్యాగత పూజా విధానంబులఁ బూజితుండై 'దక్షిణ దిశాధ్యక్షా ! చిత్ర పురంబున వీరవర్మ పుత్రిక మాలిని బహు తపశ్శాలిని. నీకుఁ గళత్రంబుగా వలచి వ్రతనియమంబుల చేత నిన్ను నారాధించు చున్నయది. బంగరు తీగె రంగునీను మేనును, విజితభృంగ కుళకంబులైన యలకంబులును, సిద్దంపుటద్దంపు టెక్కులైన చెక్కులును, బింబ ఫలంబునకుఁ బ్రతిబింబంబైన యధర బింబంబును, గలువ రేకుల చెన్నులైన కన్నులును, గంబు విజయోత్కంఠంబైన కంఠంబును, జక్కవలకుం గవయైన చన్నుఁగవయును, బల్లవ శ్రీకరంబులైన కరంబులును, గలదు లేదను వివాదంబులచే సాధ్యంబైన మధ్యంబును, గిరినితంబ విడంబంబైన నితంబంబును, గదళికలం గేరు నూరువులును, మకర విజయ జంఘాలంబైన జంఘా యుగళంబును, దమ్మిలకుందమ్ములైన పాదంబులు గలిగి, మోదంబున నీయెడ మోహంబుమించి, పావనంబులైన హోమ నియమంబుల జపతపంబుల నాచరించుచు, నిన్నే యాశించియున్నయది. ఆ చేడియం బెండ్లియాడితివేని, నీకు సమానుండు వేఱొకండు లేఁడు'. అనిన విని నవ్వి, యవ్విబుధవర్యుండు మౌనికులధుర్యునింజూచి, 'నీవు ముందుగఁజని యా రాకొమారునితో మా రాక నెఱింగింపుము.నేను వైశాఖ శుద్ధ పూర్ణిమా దినంబున భూలోకంబునకు వచ్చెద' ననిన, నారదుండు చని యత్తెఱఁగెఱింగింప, వీరవర్మయు మోదంబునొంది వివాహంబునకుఁ దగిన యత్నంబుఁ జేయుచునుండె.

తదనంతరంబ యముండు దళవాయియైన రాజయక్ష్మనింబిలిచి, 'మనము చిత్రపురికిం బోవలయు, నీవు బలంబులనెల్లఁ బయనంబు సేయు'మనుటయు,

వ్యాధులకుఁ బ్రధానుండైన రాజయక్ష్మ, 'యా రాజు దేశంబున బ్రాహ్మణ పూజకు లేగాని, బ్రహ్మహింసకులు లేరు. నేనెట్లు రాఁగలవాఁడ ?' నని మొగంబు వెలవెలం బాఱఁ బెదవులఁదడప్రుచు నలుదెసలం జూచె. నూట యెనిమిది వ్రణంబులకు నధీశ్వరుండైన రాజవ్రణం 'దచట గురుపూజలేగాని గురు దూషకులులేరు. మాకు నచయాడఁగూడ' దని దిగులుఁ బొందె. త్రయోదశ సన్నిపాతంబులకు నధిష్ఠాత యైన జ్వరుండు, 'తద్దేశంబున నయవంతులేగాని, బాల హింసకులు లేరు. కావున నేను రావెఱతు'నని తల్లడించె. ఏకవింశతిమోహంబులకు నధిపతియైన మోహుఁడు 'రాష్ట్రంబున దేవద్రవ్యాపహారకులువేరు. నాకు రాఁగూడ' దని మూలమూలలకుం కుఁడాగె. మఱియు, మున్నూఱు భేదంబులఁబొలుపొందు శూలరోగంబు, 'విశ్వాస ఘాతకుఁడు, విషదాతయుఁ గనక కామియు, స్వోదరపోషకుండు నారాజు భూమిలో లేరు. కావున నేను రానోడుదు'నని, వెనుక కొదిగె. వేఁటకాండ్రచేతఁబట్టబడిన పక్షుల విడిపించునట్టి పుణ్యపురుషులారాష్ట్రంబునఁదఱచుగాఁ గలుగుటవలనఁ దాను బొలయంగూడదని పైత్య రోగంబుపయనంబునకు వెను దీసె. 'వాపీకూప తటాకాది భేదనంబులఁ జేయు పాపాత్మకు లందు లేరు. జీర్ణంబులగు చెఱువులు దొరువులు హవణించునట్టి ధన్యులాసీమలో మెండుగాఁ గలరు కావున నేను రానో ప'నని గ్రహణి తన గృహంబునకుం జనియె. 'మాషదానంబులు తిలదానంబులు సేయు ధర్మపరులకాని, సాధుజన బాధకులులేరు కావున, నాసంచారంబు గూడ'దని వాతరోగంబు వెలకిలంబడియె. 'ఉదక దానపరులేకాని భ్రూణ హత్యాపరులు లేరు కావున, నేను రావెఱతు'నని మహోదరంబు ముందువెనుకలు సూచె. 'కఱియావు దానంబు సేయువారేకాని, దాతల నిందించువారా భూమిలో లేర'ని యపస్మారం బవ్వలికరిగె. ఇవ్విధంబున సకలరోగంబులు గుసగుసలం బోవుచుఁ బయనంబు కదలవెఱచె.

అంత, సమవర్తి వారలంజూచి, 'మీరలు పాతకులకు భయంకరులు. పుణ్యపురుషుల కమృత స్వరూపులు. కావున మీరెవ్వరి నంటవలదు, కామ రూపంబులు గలవారలు గనుక మనుష్యరూపధరులై మావెంబడి నరుగుదెండ'ని పలికి, యముండు సౌమ్యాకారంబునం జూపట్టుచు, సకల భూషణభూషితుండును దివ్యవిమానాంబర ధరుండునై, నరాకారంబునఁ జిత్రవర్మ నగరంబునకు వచ్చిన, జమునింగనుంగొని ప్రణుమిల్లి, యర్ఘ్యపాద్యాది విధులం బూజించిన, సూర్య కుమారుండా రాజ కుమారికం బరిణయంబై, 'నీకు నభీష్టంబెయ్యది? వడుగు'

మనిన, నద్ధరణీశ్వరుం తల్లునిఁజూచి, 'ఇతర వరంబులనేనొల్లను. దేహావసాన సమయంబున దేవకీనందనుని పాదారవిందంబులు దర్శించునట్టి భాగ్యంబులు గలుగవలయును, నివ్వరంబు దయసేయు' మనుటయు, నంత పర్యంతంబంత కుండు 'నీచెంతనే యుండెడ'నని ప్రతిన గావించెంగావున మామతోడఁగూడి యముండు మనతోసంగరంబు సేయవచ్చె. ఈక్షణంబ యనేకాక్షౌహిణీ క్షయకరం బైన యుద్ధంబుగాఁగలదు. అర్జునా, నీవు వేడుకచూడు. బభ్రువాహను ననుసాళ్వుఁ గర్ణకుమారుఁ బ్రద్యుమ్ను ననిరుద్ధు మయూరధ్వజు మఱియును దక్కిన యోధుల సన్నద్ధులఁజేసి ననుపవలయు'నని పలికె.

## - అర్జున వీరవర్మల యుద్ధము -

తదనంతరంబ శ్రీకృష్ణదేవుఁడు గాండీవి యరదంబెక్కి పగ్గంబులు ముని కోలయుఁ బూని సారథ్యంబునకు నుపక్రమించిన, నావీరవర్మ, వారిజలోచనుం జూచి, 'వాసుదేవా, వాసవనందనుండు, నీవు నాశౌర్యంబుఁ జూచెదరుగాక !'యని పలుకుచు, నారాయణుని నారు నారసంబులఁ, గవ్వడి నేడు బాణంబుల, మయూర ధ్వజాదుల నైదుసాయకంబులఁ గంఠగత ప్రాణులఁజేసిన, బీభత్సుండు వీరవర్మ మర్మంబులు దూఱిపాఱ నలందీఱిన నారసంబుల నాటించినం, బెఱుతివియక యమ్మేదినీశ్వరుండు తెలివుగాంచి, కంజనయన ధనంజయుల శిలీముఖంబులం జిక్కువరచి, ప్రళయ జలధరంబుబోలి గర్జించుటయు, నర్జునుండూర్జిత విక్ర మంబున నిర్జరులు వెఱగంద, వాని శరీరంబు నిశిత శరంబుల జర్జరితంబుగాఁ బర్జన్య విధంబున శరవర్షంబులు గురిసి, వీరవర్మని వక్షస్థలంబు క్షురపంచ కంబున నొంచిన, నించుకేనియుం జలింపక, యర్జునునఱువదింట, నచ్యుతుని నూట, నన్నియ శరంబుల నాంజనేయునిఁ దేరివారువంబులఁదక్కిన వీరులఁ దెరలించి మొనలఁగలఁగఁజేసిన, బాండవవాహినీ సమూహంబు మోహంబుఁ జెంద, నప్పుఁడప్పురుషోత్తముండు గాండీవింజూచి, 'యకాలతిమిరంబుఁ గల్పించి సైంధవు ద్రుంచినట్లునుఁ, గర్ణుని తేరు ధరిత్రీతలంబునం గ్రుంగఁద్రోయించి జయించినట్లును, వీనియెడ వంచనోపాయంబులు చెల్లవ'ని బలవంతు హను మంతుఁబంచిన, నతండు కాలపాశంబునుబోలు వాల పాశంబున వాని రథంబు బిగియించి, తొల్లి మందుల కొండఁ బెల్లగించిన చందంబున నెత్తుకొని యాక సంబునకుఁబఱచిన, నాక్షోణీవల్లభుండు వాయునందనుని వంచించి, యరదంబు

డిగ్గి, యవనీతలంబునకు వచ్చి, నరుని తోడంగూడ నారాయణుని పట్టుకొని, గగనంబునకెగసి, యాంజనేయునిఁజూచి, 'యిద్దేవుండు పార్థునిమీఁది దయవలన క్షీరసముద్రంబును, శ్వేత దీపంబును విసర్జించి వచ్చియున్నాఁడు. కావున నచ్చట విరహతాపంబునం బొరలు శ్రీమహాలక్ష్మికిఁ బ్రియంబగునట్లు కలశాంబుధిలో శ్వేత ద్వీపంబున, శేష తల్పంబునఁ బడవై చెదఁజూడుము. నీవు నా రథంబు విడువు'మని, నరనారాయణుల నిరువుర జంక నిఱికి యవ్వాయుతనయునిఁ బిడికిటం బొడిచిన, గ్రుడ్లు వెలికుఱికి మిడుకుచుఁబుడమిపయింబడి కదల మెదల నేరకున్న, మధుసూదనుండు వాని మనోరథంబు సఫలంబుసేసినఁగాని తమ యాపద తొలంగదను తలంపున నతనిచంకనుండి మెల్లనవీడి యవ్వీరవర్మని తల నిజపదారవిందంబున గుప్పునందన్నిన, మహీతలంబునంబడి మూర్ఛంజెంది క్రమ్మఱఁదెప్పిఱి శ్రీకృష్ణార్జునులఁ గదియవచ్చి, 'బవరంబున దేవ దానవులేని యున్ననుఁ గదియఁజాలరు. విశేషించి, శ్రీకృష్ణా, నీ చరణారవిందంబు నా శిరంబున సోఁకెఁగావున చిరంజీవినైతి' ననిన, విని యచ్యుతుండు ప్రీతుండై యర్జునునితో, 'వీఁడు దుర్జయుండు, ధనుర్విద్యా విశారదుండు, మయూరధ్వ జాది యోధవీరుల జయించిన మద్భక్తియుక్తుండు'. అనిన విని క్రీడియుం గొని యాడె. అంత, వీరవర్మ హరిని నరునింజూచి, 'మీరు లోకరక్షకులగు నరనారా యణ మూర్తులరు. మిమ్ము నెదిరింప ముల్లోకంబులు నోపవు. నేనెంతవాఁడ?' నని పలికి విల్లెక్కుడించి, గోపికావల్లభు చరణపల్లవంబులకు సాష్టాంగ దండ ప్రణామంబుఁజేసి, పార్థునిఁ గౌఁగిలించుకొనియె. అప్పుడు యుద్ధంబునఁబడిన వారలనెల్ల నంతకుండు బ్రతికించినఁ, దద్బలంబుల తోడఁగూడఁ గృష్ణార్జునులు వాని పురంబున కరిగి యైదు దినంబులు వసియించిరి. అంత నవ్వీరవర్మ డెబ్బది వేల తెల్లయేనుఁగులఁ, గృష్ణవర్ణంబులైన తురంగంబులు తొంబదివేల, నష్ట విధంబులైన ముక్తామణిరాసుల, ననేకంబులగు దాసదాసీ నివహంబుల నిచ్చి, తనకుఁగల సమస్తరాజ్యంబుఁ దామరసాక్షునకు సమర్పించి, తానును గొలుచుచు, సవన హయంబులం దరలించినఁ గొన్ని దినంబులకు నా రెండు గుఱ్ఱంబులు నాయాదేశంబులఁ గడచిచని, యేనుంగుల మ్రింగఁజాలిన మీనంబులును, గండ శైలంబులఁ గబళింపఁజాలిన మకరంబులుంగలిగి, యతి భయంకరంబైన సింధు నదంబుఁజివ్వున దాటుటయుఁ, గిరీటి వీరవర్మఁజూచి 'హయంబులు రెంతును నదంబున కవ్వలికి దాటిచనె; నింక నుపాయంబేమి?' అనిన, నతండు దృఢ

తరంబులైన యోడలఁ దెప్పించి సేనాసమూహంబుల దాటించుటయుఁ, గుంతల దేశంబుఁజేరఁజని యచ్చట నశ్వంబులఁగానక బభ్రువాహనాదులైన దొరలు జిచ్చ వడియున్నయెడ, రెండవ మార్తాండ మండలంబన నఖండిత దేహుండయిన నారదమౌని కనుపట్టి, వారల వందనంబుల నభినందించి, వాసవకుమారునిఁ జూచి, 'నీ హయంబు కుంతల నగరంబుఁజేరె. పరభయంకరుండైన యా చంద్ర హాస నృపాలుని పరాక్రమంబు లెక్కించునెడ మీ వెంబడివచ్చు రాజులెల్లం బది యాఱవ పాలు సరిపోవంజాలరు. వాని చరిత్రంబు చిత్రంబు. వినిపింపవేళ గాదు. యాగ హయంబు దూరంబుచనుఁ గావున వేగంబు వెంబడింబొండ' నుటయుఁ, బార్థుండు 'నారదమునీంద్రా; సజ్జనుల చరిత్రంబాకర్ణించుట జన్మ ఫలంబు. కావునఁ జంద్రహాస మహీపాలుని చరిత్రంబు శ్రవణానందంబుగా నాన తీయవలయును'.

## చంద్రహాసోపాఖ్యానము

అనిన విని, హరితత్త్వ బోధనా విశారదుండైన నారదుండు పురందర నందనుంజూచి, 'తొల్లి కేరళాధీశ్వరుండు పెద్ద కాలంబు కొడుకులు లేకయుండి వ్రతంబులు, దానంబులు, జపంబులు, తపంబులు ననేకంబులు గావించి, బహు కాలంబునకు హరిభక్తులగు బ్రాహ్మణుల ప్రసాదంబున నొక్క కుమారునిం గనియె. వాఁడు సౌభాగ్యలక్షణ సంపన్నుండును, తేజోవిరాజమానుండును, జంద్ర కందర్పసదృశ రూపరేఖాకలా విలాస భాసురుండునయ్యుఁ దండ్రి గండం బున మూలానక్షత్రంబున జనియించె. అంతఁ గొన్ని దినంబులకు నా రాజు వైరి రాజులతోఁ బోరుదీరి యాజిఁగావించి, వెను దివియక శాత్రవులు ప్రయోగించిన యాయుధంబులచే భిన్నాభిన్నాంగుఁడై సంగరాంగణంబునంబడి యింద్ర సదనం బునకుం జనియె. అట్లు గండదోషంబునఁ దండ్రిమరణంబు నొందుటయుఁ దల్లి యతనితో నగ్నిప్రవేశంబు సేసె. శత్రువులచే రాజ్యంబు గోలుపోయి మంత్రులు యథాయథలుగాఁ జనిరి. ఇట్లు మాతాపితృ విహీనుండును, రాజ్యభ్ర ష్టుండునైన యబ్బాలకునిం గౌంతలపురంబునకు వచ్చి, యబ్బాలకునిం బెంచుచుండి రెండు మూఁడేండ్లలోన నా దాదులును బరలోకంబునకుం జనిన, ననాథుండైన యమ్మహీనాథ కుమారునిం జూచి, పౌర నారీజనులు కరుణచే నొక్క పుణ్యవతి జలకంబులార్చె; నొక్క సీమంతిని హితం బును మితంబునుగా నాహారంబు వెట్టె; నొక్కసతీమణి వాసి కటి తటం

బున బంగరు చెఱంగుల యొల్లియగట్టె. మఱియొక పురంధ్రీరత్నంబు కూఁకటి కూడ దువ్వి కొండెవైచి సిగబంధుచుట్టె; వేఱొక్క పతివ్రత యబ్బాలకు నెత్తికొని ముద్దాడుచు దీవించె. ఇవ్విధంబున వారిజాక్షులు గారామునఁ బెంచుచునుండ నైదేండ్ల ప్రాయంబగుటయు, నా రాచకొమారుం డందంద యాట లాడుచుం దుష్టబుద్ధియనం బరఁగిన యారాజు మంత్రి గృహంబునకుం జనిన, వాని కొలువులో దైవజ్ఞులైన మహామునులు శుభలక్షణలక్షితుండైన యబ్బాలు నీక్షించి, హర్షించి, 'యీ ముద్దు బిడ్డండెవ్వారి వాఁడో ! వీని లక్షణంబులు గనుంగొనిన భూమండలం బేలం గలండ' నిన, దుష్టబుద్ధి యీర్ష్యాసూయా పరవశుండై, యమ్మునుల మాటలు వినియు విననిచందంబున నూరకుండి, వారలం బోవం బనిచి, యబ్బాలకునింగాంచి, ఋషుల వాక్యంబు తప్పదని తలంచి, పెచ్చుపెరిగిన మత్సరంబు మెండుకొనఁ జండాలురంబిలిచి, 'యీ కొండికవానిం దోడ్కొనిపోయి నట్టడవిలో శిరంబు ఖండించి రండ'ని పంచినఁ, గాలకింకరులం బోలిన యమ్మాలలు, మద్యంబులు త్రావి, మదోన్మాదంబునఁ దాఁటుచు, హరిభక్తాగ్ర గణ్యుండతి పుణ్యుండు సుకుమారుండునైన యా రాజకుమారునిం దోడుకొని, గండక పుండరీక మాతంగ తురంగ మహిష వరాహ ఖడ్గ గవయ గంధసింధుర సింహ శరభాది మృగశరణ్యంబైన యరణ్యంబు సొచ్చి, యందొక్క శిలాఫలకంబున నమ్ముద్దు బాలకుం గూర్చుండనిడి, కత్తులు దూసి, మద్యపానమదోన్మత్తతం బేరెమ్ములు వాఱుటయుఁ, బ్రహ్లాదునికైవడి నా రాకొమారుండు హృదయంబున బెదరక, 'వరదా, వాసుదేవా, వైకుంఠవాసా, వనమాలికాభరణా, వారణాపదుద్ధరణా, వారిజాక్షా' యని దివ్యనామ సంకీర్తనంబు సేయుచు ధీరుండైయున్న యెడం, గృపాణంబు జళిపించి, యా రాచపట్టిం గొట్టఁదలంచి, హరికటాక్షంబువలనఁ జేయాడక యందఱు నేక వాక్యంబుగా 'నీ చిన్నిపాపనిఁ జంపుమని యా పాపాత్ముండు పంచిన మనమే గతిం జేయగలవార'మని, చంపక, యక్కుమారుని పాదంబు చిటికెనవ్రేలు గోసికొనిపోయి దుర్మంత్రియగు దుష్టబుద్ధి ముందఱం బెట్టి, మ్రొక్కిన, నతండును బ్రమోదంబునొందె. అమ్మహామునుల వాక్యంబులు దబ్బర సేసితిఁగదా యని యుబ్బుచునుండె.

అంతనక్కుమారుండు, మద్దంత వేదంత పుండరీక మండల మండితంబైన యమ్మహారణ్యంబున నంగులిచ్ఛేదనం బొరలుచుఁ, బట్టపగలింటి

యెండతాఁకునఁ గొట్టువడి, యాఁకట సొటసొటవోవుచు, వదన కమలంబు వాఁడ, జిప్పకూఁకటి యల్లన నాడఁ, గన్నుల నశ్రుజలంబులు జాఱఁ, 'గమలాక్షా, దీనరక్షావిచక్షణా, లక్ష్మీపతీ, క్షమావతీ, ఆపన్నశరణ్యా, అనాథనాథా, అంబుజోదరా, ఆదినారాయణా, నీవే దిక్కని' వెక్కివెక్కి యేడ్చుచు, వేఁడి యిసుకలోనం చొక్కుచు, మ్రుక్కుచు నున్నయెడ, నా వనదేవతలు, నందలి మృగంబులు, బక్షులు హితోపచారంబులు సేయును రక్షించుచుండె. అవ్వేళ మృగాకీర్ణప్రాంతంబైన కాంతారంబున నచ్చటి చెంచులకు, బోయలకు నధీశ్వరుండు, పరిపూజిత లక్ష్మీశ్వరుండును, బుళింద నామధేయుండును, నకొ్కంతలుని దుర్మంత్రికి విధేయుండునగు నొక్క పాళెగాండ్ర దొర, వేటాడుచు దైవవశంబున నవ్వనంబుసొచ్చి, యచ్చోటికివచ్చి, యశ్రుధారా పరిపూరిత నేత్రుండు, నుపవాస శోషితగాత్రుండునై, కమలమిత్రునింబోలు తేజంబున విరాజిల్లుచుఁ, జరణాంగుళి ఖండనవేదనం జాలగుందియు 'ముకుందా, గోవిందా, అరవిందనయనా, ఇందిరారమణా, నందనందనా' యనుచు న్నయా చిన్నిరా కొమరునింజూచె.

## – చంద్రహాసుఁడు పుళిందునకు దొరకుట –

(అప్పు) డాపుళిందకుండు దానును శ్రీహరి భక్తుండు గావునఁ గరుణాంతరంగిత మానసుండై కన్నీరునించుచు, 'నిక్కుమారుండెక్కడివాఁడో ? అక్కటా, యక్కటికంబులేక యీ చక్కని బాలుని నిక్కరణిం జేసిన యుక్కివులెవ్వరో ?' అని వగచుచు, గుఱ్ఱంబుడిగ్గి దగ్గఱకువచ్చి, వెఱవకుమని బుజ్జగించుచు, 'నే నపుత్రకుండనుగాన శ్రీహరిసేవా మహత్త్వంబున నిప్పుడు నాకుఁ గొడుకు కలిగె. కన్యకాపుత్రుండును, గుండుండును, గోళకుండును, నంగీకృతుండును, కన్యాదానకాలంబునఁ బ్రథమపుత్రుండు తన కొడుకని నిశ్చయింపఁబడినవాఁడును, గ్రయలబ్ధుండును, దల్లిదండ్రులచే ధారాపూర్వకంబుగా నీయంబడినవాఁడును, నెద్దియేనియు నొక్క యాపదవలనఁ దనకుఁ దానే చేరినవాఁడును, దనకు ధర్మపత్నియందు జనియించినవాఁడును, నిప్పుడు గురుఁ బుత్రులనంబరఁగుదురు. అందులో వీఁడు తనకుఁదానె చేరెంగావున, స్వయం ప్రాప్తుండను బరఁగు' నని, తనయునింగా నంగీకరించి, యబ్బాలుని శోకంబు నివారించి, తురంగంబుపై నిడుకొని, తన యేలెడు చందనావతీపురంబునకుం

జని, వెంబడివచ్చిన బంధు పరివారంబులఁ బరిజనంబుల సర్వప్రకారంబున నిండ్లకుబనిచి, యంతిపురంబున కరిగి, దైవజ్ఞులు, నుపాస్యులునైన జోస్యులం బిలిపించి, 'యశోదాకుమారుని కరుణవలన నీకుంగుమారుండు గలిగెఁ గైకొమ్మా' యని చేతికిచ్చుటయు, నచ్చిగురుఁబోణి మచ్చిక హెచ్చ గ్రుచ్చికౌఁగిలించుకొని స్తన్యంబులు సేపుటవలనఁ బరిపులకితగాత్రయై, యక్కుమారు నాపాదమస్తకంబు నిమిరి, వామ పాదంబునఁజిటికెన వ్రేలు లేమికి మనంబునఁ బురపురంబొక్కుచు, 'శ్రీహరీ, యవ్యాజకృపాలహరీ, నరహరీ, నీవు కృపనొసంగిన యిక్కుమారునకు నంగవైకల్యంబురాఁదగునే?' అని యంతరంగంబునఁ దలంచినయంత నయ్యింతి పాతివ్రత్య మాహాత్మ్యంబువలన నెప్పటియట్ల చిటికెన వ్రేలు మొలచిన నానందంబునొందె. ఆ పుళిందకుం డయ్యిందువదన తోడంగూడఁ గొడుకు నంక తలంబున నునిచికొని, చంద్రుని నవ్వునట్టి మొగంబు గలుగుటంజేసి, చంద్రహాసుం డను నామకరణంబొనర్చి, దాదిజొమ్మున దూది పెన్పునంపెనిచె.

అంత శుక్లపక్షంబున విదియ చంద్రుండునుంబోలె నక్కుమారుం డభివృద్ధిఁబొంద, నమ్మహీమండలంబున నెల మూఁడు వానలు గురిసె. సకల సస్య సమూహంబులు దున్నకయ పండె. ధేనువులు నపారంబుగా క్షీరంబులు గురసె. క్షామక్షోభంబులు విరిసె. బాంధవ కులంబానందంబున మెఱసె. అంత నద్ధరా కాంతుండు నందనునకు నుపనయనంబు గావించి, వేదవేదాంగంబులును, ద్రదహస్యంబులును, మన్వాది నీతిశాస్త్రంబులును, ధనుర్వేదంబును, విలువిద్య యందలి లాఘవ లక్ష్యశుద్ధి చిత్రత్వ దృఢత్వంబులును, దివ్యాస్త్రజాలంబులును, గత్తి, జముదాడి, వంకి, బాణా, పట్టా, సురియ, గద, గుదియ మొదలగు శస్త్రాయుధంబుల సాధనలును, అశ్వారోహణ, గజారోహణ, రథారోహణ, పద లాఘవ విచక్షణత్వంబునుం దెలియంజేసి, సకలజనులు నానందంబునొంద నప్పుళిందుండు యౌవరాజ్య పట్టాభిషేకం బొనర్చినఁ, గంధర్వకోటి విలాసుండైన చంద్రహాసుండు ధరణీ చక్రంబు నవక్రపరాక్రమంబున శక్రుని చందంబునం బరిపాలించుచు, రుక్మాంగదుని తెఱంగున శ్రీవిష్ణు భక్తి పరాయణుండై, తన దేశంబునందలి జనులెల్ల నేకాదశీవ్రతంబు, విష్ణు పంచమీ వ్రతంబు, శ్రీజయంతీ వ్రతంబు మొదలైన వైష్ణవ వ్రతంబులను యథావిధిగా నాచరింపం

జేయుచు, నట్లుచేయని వారల దండించు. ఏది యారేండ్లు నూఁగు మీసంపుఁ గొమరుఁ బ్రాయంబునఁ దండ్రిచే ననుమతిఁబడసి తురంగ మాతంగ శతాంగ వీరభట పటలీచటులంబైన సేనా సమూహంబులతో నరులు గెలిచి, బిరుదులు గైకొని, యటనంగ వంగ కళింగ కాశ్మీర కర్ణాట కరూశ కైవర్తకాది నానాదేశంబులు గెలిచి, తుంగంబులగు మత్తమాతంగంబులును, వేగజిత కురంగంబులునైన తురంగంబులును, వరరత్నంబులైన రత్నంబులును, గిరిశిఖరంబుల కన్న వాసులైన హేమంపురాసులును మొదలగు సంపదలుగైకొని, నిలింపపతిసొంపున భూతలంబు గంపింప, సేనాపరంపరలం తోడఁగూడ నానందంబైన చందనావతీ పట్టణంబునకు వచ్చి, తలిదండ్రుల పాదంబులకు వందనంబులుగావించి, నిజ భుజోపార్జితంబులు నూర్జితంబులునైన ధన కనక రత్న నికరంబులచే బొక్కసంబు గ్రిక్కిరియంజేసి, మాతాపితృశుశ్రూషణంబును, బంధు మిత్రామాత్యాశ్రిత పోషణంబును, విద్వత్కవి సంతోషణంబునుం జేయుచునున్న కుమారునిం గనుంగొని, కనుంగవ చెంగలింప, నప్పుడింద భూపతి, తనయునిఁ గరంబున నిమురుచు, 'నన్నా, మనము కుంతలాధీశ్వరునిం గొలిచినవారము. అన్నట మనకుం బ్రాపకులతని మంత్రియగు దుష్టబుద్ధియుఁ దత్పురోహితుండగు గాలవుండును. కనుకఁ, గనకటంకంబులు పదివేలు నైదువేలు రెండువేలు వేర్వేఱ యమ్మువ్వురకు మూటలు గట్టి ముద్రవేయించి పంపు' మనినఁ, జంద్రహాసుండట్లేయగుంగాక యని, బొక్కసంబునకు వచ్చి, ఒంటెలమీఁద, వేసడంబులమీద, బలీవర్దంబుమీఁద, రాజునకు, మంత్రికి, ధనంబు లపారంబుగా బెటికలఁ బెట్టించి, తండ్రి చెప్పిన క్రమంబున ముడుపులు గట్టించి, యా మూఁడువగల ముడుపులును బురోహితుల కిమ్మని పంపుటయుఁ, దీర్పరులు నేర్పరులు నైన నియోగులు కొంతలంబున కేఁగి, రాజునకు, మంత్రికిఁ, బురోహితునకుఁ బ్రణమిల్లి చంద్రహాసుండిచ్చిన పత్రిక నొసంగి 'యెప్పుడు నీయందగిన యప్పనంబున కన్నఁ బదియింత లధికంబు దెచ్చితిమి. కైకొని రాజున కి'మ్మని యమ్మంత్రికి నొప్పగించి, తక్కిన యమ్మూఁడు వగలముడుపులను నొక్క బంగరు పళ్లెరంబున నునిచి, తత్పురోహితుండగు గాలవునకు నిచ్చినఁ, దద్వృత్తాంతంబంతయు దుర్మంత్రియైన దుష్టబుద్ధి యాలకించి, 'మన పుళింగునకింత సంపద గలుగుటకు కారణంబేమి?' అని యసూయా మలీమసంబయిన మానసంబునఁ గుంతలాధిపునింజేరి, చంద్రహాసుని తెఱంగు విన్నపంబుసేసి, యతని తండ్రియగు పుళిం

మనిఁ బట్టుటకు రాజుచే ననుమతిఁగైకొని, పవనజవంబైన తురంగంబు నెక్కి, యపార దళంబుతో నాఱు యోజనంబుల దూరం బొక్కదినంబులోనం జని, చందనావతీపురంబు ముంచఁజొచ్చి, తన యొద్దియోధవరులఁ గలయంగనుంగొని, 'మున్ను సింహ శరభ శార్దూలాది మృగ సంకులంబైన యా యడవిలోని దైన యిది యిప్పుడమరావతీ పురంబు నిరసించుచు, నిలింపపతి సంపదలంబోలి సంపదలపెంపు దలిర్చుచున్నయది' అని పలుకుచు నరుదేరఁ బుళిందకుండు ప్రియ సుతుని తోడంగూడ నెదుర్కొని మ్రొక్కి, తోడ్కొనివచ్చి నిజమందిరంబున విడిదిపట్టుగావించె.

అంత, నానావిధంబులును, మనోహరంబులునగు వస్తు వ్రాతంబులర్పించిన, నా దుష్టబుద్ధి కపటంబు మనంబుననుంచి, వెలుపల వాత్సల్యంబుదోఁప నవ్వుచుఁ, జంద్రహాసుఁగనుంగొని, 'పుళిందకా, పున్నమచందురునింబోలె నయనానందుండైన నీ నందనుండు సౌభాగ్యలక్ష్మీ సమేతుండై యొప్పుచున్నవాఁడు. ఇతండు నీకేచందంబునం గలిగె?' అనినఁ, బుళిందుండు దుర్మంత్రినవలోకించి, 'మృగయా వినోదంబుగా వనంబునకుంజని కుంతలపురంబునకు రెండామడ దూరంబున దురవగాహంబైనఁ బాదాంగుళిచ్ఛేద వేదనాదోదూయ మాన మానసంబున, శ్రీహరిందలంచుచున్న యీ చిన్నవానింగనుఁగొని, శ్రీవిష్ణు భక్తునింగా నెఱింగి, తోడ్కొనివచ్చి కన్నకొడుకుకన్న మిన్నగా నెన్నికనెక్కం బెంచితిని. నాఁటికైదేండ్ల బాలుండ'నిన, విని, తామున్నుచేసిన యకృత్యంబు మనంబునం దలంచి, 'యా చిన్నవాఁడు వీఁడె' అని నిశ్చయించి, మాలబంట్లపయింబడ్డు గీఁటుచు, నసూయాక్రోపంబులు మనంబున నణంచికొని 'యిచట నితనినేమేనియుఁ జెనకఁ దలంచితిమేని, మనకేదోషంబువచ్చుఁ గావున నుపాయంబున వీనిం గొంతల పురంబునకుంబంపి, యచ్చట మత్సుతుండైన మదనునిచే విషంబు పెట్టించి చంపించెద'నని యూహించి, తన తనయుని పేర స్వహస్తలిఖితంబుగ నొక్క పత్రిక వ్రాసి, ముద్రవైచి, చంద్రహాసునిచేతికిచ్చి, వినయంబును నెనరునుం దోఁచునట్లుగాఁజేరంబిలిచి, 'యీ పత్రికంగొని నీ వొక్కరుండవు కొంతలంబునకుంజని నా పుత్రునకు నిమ్ము. అచ్చట నీకు సకల శోభనంబులు గలుగు.' అనిన, చంద్రహాసుండుమ్రొక్కి, యుక్కునుగ్గైకొని, మనోమారుత వేగంబైన-తురంగంబునెక్కి, నిమిషమాత్రంబునఁ(!) గొంతలంబునకుంజని, తత్పుర ప్రాంతంబునందుఁ జంచచ్చంచరీక ఝంకార సంకులబైన యొక్క యుద్యానంబు

మధ్యంబున హృద్యంబైన పద్మాకరంబుపొడగని, రాయంచ జక్కవ బెగ్గురుల గరుల కరువలిచే నెగయు పుప్పొడుల నప్పళించిన, విప్పుగు నల్ల గలువల సల సిల్లు తేనెసోనల నానిన, చలిగాలి మొలకల వలనం బథిశ్రమంబు దీఱ, దురంగంబును సాహిణీ వశంబుసేసి, పల్లవ పుష్ప ఫల భరితంబైన సహకార వృక్షంబు నీడ బడలిక దీఱం బవ్వళించి నిదురించుచునుండ, నా కౌంతల మహీకాంతుని కూఁతురు చంపక మాలినియు, దుష్టబుద్ధి తనయ విషయయు మన్మథుని నారాధింపంగోరి సఖీజనులతోడం గూడ నవ్వనంబునకు వచ్చి, పల్లవితంబులు కుసుమితంబులు ఫలితంబులు నగు పొన్నలు, పొగడలు, గోరంటలు, సేమంతులు, చూతంబులు, పారిజాతంబులు, జాజులు, విరజాజులు, మల్లెలు, మొల్లలు, పోఁక ద్రాకులు మొదలగు తరులతానికరంబుల సుమంబులు గోయుచు, విరిగుత్తుల నొండొరుల వ్రేయుచు, నొయ్యారంపు నడలచే వనమయూరంబుల గర్వంబులు డించుచుఁ, బూలరెమ్మలు వంచుచుఁ, బూలకై మదించుచు, సఖులజేరం బిలుచుచు, సరసంపు బెలుంగులచే మత్తకోకిలంబుల మదంబు లడంచుచుఁ, బువ్వుఁదీవియల వంచుచు, మేని మెఱుంగుల వనంబెల్లనింపుచు, నిటలంబుల నటించు కుటిలాలకంబులచేఁ దుమ్మెదలఁ గదుముచుఁ, బల్లవంబులం జదుముచుఁ, గోసిన విరులు పయ్యెదలలో నదుముచుఁ, దళుకువాలారుఁ జూపు తూపుల బాల కురంగ హృదయంబుల నాటుచుఁ, దేనియవాకలం దాటుచుఁ, దనూసౌరభంబులచే గుసుమ సౌరభంబులు మాటుచుఁబువ్వులు గోసి, కమలాకరంబు డాసి, వేడుక మీఱ జలక్రీడలాడి, విగళిత హారమణి గణంబులచేఁ గమలాకరంబు రత్నాకరంబుగాఁ జేయుచుఁ, దత్తటంబునం దువ్వటంబులు గట్టి సొమ్ములు పెట్టి, కుంకుమ కస్తూరిక లలంది యవ్వేలందులు మన్మథపూజ సేయుచు నుండిరి.

అయ్యవసరంబున నమ్మంత్రి కుమారిక యక్కొలని గట్టునఁ దియ్య మామిడిచెట్టు నీడ నిదురించుచున్న చంద్రహాసునిం గాంచి, యందియలు, మొల మువ్వలు, రవల మెట్టెలు మ్రోయ మెల్ల మెల్లనం జని, యక్కుమారవరుని రూపరేఖా సౌందర్య కలావిలాసంబులకుం జొక్కి, చక్కెర విలుతుని బారికిం జిక్కి, చేరంజని, యడపపు సంచి త్రాటం గట్టియున్న కమ్మ విడిచి, చూచి, తండ్రి చేయివ్రాలుగాఁ దెలిసి, యవ్వక్కణ మాద్యంతంబునుం జదివికొని, నిజ జనకుని విషమ బుద్ధికిం బరితాపంబు నొందుచు, 'రూపరేఖా విజిత రమా కుమారుండైన యీరాకొమారునకు విషము నొసంగి'మని వ్రాసినాడు. ఇతని నిర్ద

యుండు జగంబునఁ గలడే?' అని వగచి, 'విషము నొసంగి'యని వ్రాసిన యక్షరంబుల ముకారము యకారంబుగ దిద్ది, (నడుమ యకారంబు వ్రాసి) యెప్పటి యట్ల ముద్రవైచి, యడపపు సంచి త్రాటంగట్టి, పెన్నిధింజూచి విడువఁజాలని పేదవడువున నవల నడుగిడంజాలక, కొంతతడవు చూచుచు నుండి, పరాధీన కావున ధీరమానసయై, యెఱుంగని యట్ల రాజపుత్రిక కడకుం జని, తదను మతిఁ బడసి, నిజగృహంబునకుం జనియె. అంతఁ, జంద్రహాసుండు నిదుర మేల్కాని, సరసీ జలంబులఁ బ్రక్షాళిత పాదవదనుండై, నడగని నెక్క వడిగ నప్పురంబునకు వచ్చి, యెడనెడ శుభశకునంబులు వొడగనుచుఁ బ్రధాని వాకిటికిం జని, ఫణిహారిచేఁ దన రాక మంత్రికుమారున కెఱింగించుటయు, నతండు పుళిందకుని సుతుండు చంద్రహాసుండు వచ్చినాఁడనిన, విని, సంభ్రమంబుగా నెదుర్కొని, గాఢాలింగనంబు గావించి, సంతసంబున నేకాంత ప్రదేశంబునకుంఁ జని, పుళిందుని సేమం బడుగుచు తండ్రి ముద్రవైచిన పత్రిక నొసంగిన్న గైకొనుచు, 'శ్రీమత్సకల గుణ సమృద్ధుండైన దుష్టబుద్ధి, కుమారుండగు మదను దీవించి, పుత్తెంచిన శుభ ప్రయోజనంబు. పుళిందుని ముద్దుపట్టి, కులస్థాన పౌరుషంబులుగల మేటి, యెల్లప్పుడు మనకు మహా హితుండు, వీనిం గనుంగొనిన యాక్షణంబున సందేహంబుమాని విషయనొసంగి, నావచ్చునంతలో నెల్ల కార్యంబులు చక్కఁబెట్టునది' యను వక్కణ చదువుకొని, సంతసించి, 'నా సహోదరికి తగిన వరుండు దొరికె. మేలుమేల'నుచు, మౌహూర్తికుల రావించి, యా రాత్రిశుభలగ్నంబు గలుగుట వలన వివాహంబు గావించి, మహేంద్ర వైభవంబున సముచిత విధానంబు లాచరించుచుండె. అక్కడ దుష్టబుద్ధి, 'చంద్రహాసుం డితకుఁ గొంతలంబు సేరి మత్కుమారునిచే నీయంబడిన విషంబుచే నిహతుండౌ గదా! నా తలంపు నెఱవేఱు. మునుల వాక్యంబులబద్ధంబు లయ్యె'. అని సంతసించుచుఁ, బుళిందకునింబట్టి, సంకెల వేయించి, యతని పట్టణంబు చూఱలాడించి, మూఁడవవాఁటి వేకువజామున నతి త్వరితంబుగ బెస్తల జంకించుచు, బంగరు పల్లకి నెక్కి, కొంతలపుర ప్రాంతంబునకు వచ్చునెడ, నొక కృష్ణ సర్పం బడ్డంబుగా వచ్చి మానుష భాషణంబుల నిట్లనియె. 'నే నీ పట్టణంబులో బహు నిక్షేపంబులు రక్షించుచుంటి. వానికిం గర్తయగు వాఁడు వచ్చె; నింక నేను బోయివచ్చెద'. అని పలికి, రసాతలంబునకుం జనియె. అంత, నయ్యమాత్యుండు పాము పలికిన మాట పాటి సేయక,

ష్కరంబు సొచ్చి, చూతపల్లవ తోరణాలంకృతంబును, రంభాస్తంభ సంభృత గేహళీద్వారంబులును, జందనోదక సంసిక్త భూతలంబును, నగురు ధూప ధూపితంబునైన రాజవీధియుఁ, దన నగరునుం గాంచి, 'పట్టణాలంకరణంబునకు హేతువేమి?' యని యడిగి చంద్రహాసునకు విషయను వివాహంబు సేయుటగా నెఱింగి, వీఁపునెటుకు మనఁ దటుక్కున గృహంబు సొచ్చి, 'యేనేమి వ్రాసితిని? తానేమిచేసె?' నంచుఁ, బండ్లు కొఱుకుచు కుమారుని బిలిపించి, 'యోరీ దురాత్మకా, నేఁటివఱకు నా యానతి దాటవు. ఇప్పుడేమిగావించితివ'నిన, మదనుండు కరంబులు మోడ్చి, స్వహస్తలిఖితంబైన పత్రికఁజూపుటయు, నతండు నావక్కణంబు సూచి యచ్చెరువందుచుండ, మదనుండు తండ్రి నవలోకించి, 'దేవర యానతి శిరరంబునంబూని ప్రాణ ప్రదంబైన ముద్దు చెల్లెలి నొసంగితిని. ఇతని కెప్పుడెడరు వచ్చునప్పుడు ప్రాణంబులు విడువం గలవాఁడనని ప్రతిన గొంటి' ననుటయుఁ, దనయుని విశ్వసింపక కపటంబు మనంబున నడంచి, కుమారికయు నల్లుండు వచ్చి దండంబు వెట్టినఁ, గైతవంబుగా దీవించి, బాల హరిణంబులఁ జూచిన కోల్పులి వితంబున మనంబున హుమ్మని మ్రోయుచుఁ, గైతవోపచారంబుల వారల నాదరించి, నాగవల్లి/ సేయించి, యా రాత్రి నిద్దుర పట్టక మఱునాఁడు వేకువఁ 'గూతురు గొడుకులు నాకులంబు చెఱిచిరి. ఇంక మీఁదటఁ జంద్రహాసుం డెచ్చరిక పడియెనేని ప్రమాదంబు వచ్చు'నని డెందంబునం దలపోసి, 'యెట్టెఱంగుననైన వీనిఁ జంపి యమ్మహామునుల వాక్యం బసిద్ధంబు సేసెద'నని నిశ్చయించి, బ్రహ్మఘ్నుండు, గోఘ్నుండు, శిశుఘ్నుండు, గురుఘ్నుండు, మాతృఘ్నుండు, పితృఘ్నుండు, మిత్రఘ్నుండు, యజ్ఞఘ్నుండు, బంధుఘ్నుండు, స్త్రీఘ్నుండు నవంబరగిన పదుగురు కొండెగాండ్రం బిలిపించి, 'నాఁటికి మీరు సేసిన నేరంబు సైఁచితి. నేఁటికేనియు నా శాసన క్రమంబు నడువుండు. సంధ్యారాగ సమయంబునఁ బురంబునకు బయట నరణ్య సమీపంబున నున్న కరాళ కాళి కోవెలలో మీరలు డాఁగి యుండుఁడు. ఆ సమయంబునఁ నొంటిగాఁ గాళిక సేవింప నెవ్వఁడు వచ్చునో వానిం బట్టుకొని రెండు తుండెంబులుగా నఱికివైవుండు. ముందు వెనుకలు చూడంబనిలేదు. ఇట్లు చేసితిరేని, నాకు నడుచు రాజ్యంబులో నర్ధ రాజ్యంబునిత్తు. మత్ప్రియ పుత్రుండైన మదనుని తోడు. సందేహింపకుఁడ'ని పంపుటయు, నా చండాలు రియ్యకొని, మద్యపానంబుసేసి, క్రొత్తగా సానలు దీరిన కత్తులు కేలం గైకొని,

మూఁడవ జామునఁ గాళికా సదనంబునకుం జని యడఁగి యుండిరి. ఆ సమయంబున దుష్టబుద్ధి చంద్రహాసుని రావించి నెనరుదోఁప నిట్లనియె. 'అల్లుఁడా, నీకు శుభంబు గల్గునట్లుగా మత్కుల ధర్మంబు దెలిపెద. మా యింటఁ బెండిలియైన యల్లుండు సంధ్యారాగ సమయంబునఁ బురసమీప చండికా సదనంబునకుంజని సేవచేసి రావలయును. ఇది తరతరంబులనడచు కులాచారంబు. నీవు నట్లాచరింపుము'. అనిన విని, చంద్రహాసుం డట్లయగుంగాక యని సమ్మతించె అంతఁ, గుంతల దేశాధీశ్వరుండు నిజశరీర పతనారిష్టంబులుగని, పురోహితుండగు గాలవుఁ రావించి, నమస్కరించి, కనక పీఠంబున నునిచి, 'మునీంద్రా, నా శరీరచ్ఛాయ శిరంబులేకయే కనంబడియెడు. ఇది యరిష్టంబని విందు. రాజ్యంబు మీఁది యాసం దొఱంగితి. హరి చరణ సరోరుహంబులు భజియించి ధన్యుండ నయ్యెద. అరిష్టలక్షణంబులు వినంగోరెద;నెఱింగింపు'మనవుడు గాలవుండిట్లనియె.

## - అరిష్ట లక్షణంబులు -

'రాజేంద్రా, తొల్లి దత్తాత్రేయుం డలర్కునకు నేతెఱంగెఱింగిచె,నీకుఁజిత్త సమాధానంబు గలుగునట్లుగాఁ దత్క్రమంబు దెలిపెద. ధ్రువు వశిష్ఠు నరుంధతిని జూచినఁ దెలియకుండిన నరునకు సంవత్సరంబు లోపల, నగ్నియందు కిరణంబులు, సూర్యబింబంబునఁ గిరణరాహిత్యంబుం గనువాఁడు పదునొకండు నెల లోపల, ఐక్కివాఁడు బలిసినను, బలిసినవాఁ డున్నట్లుండి బక్కచిక్కినను నెనిమిది నెలలలోపల, నడుచునపుడు వేళ్లెనియు, గుదికాళ్లెనియు, ఖండితంబులైనట్టు లడుగుజాడం గనఁబడియెనేని యేడు నెలల లోపలఁ, గాకి గ్రద్ద గూబ శిరంబున సోఁకెనేని యాఱు నెలలలోపల, నభ్యంగన సమయంబున మేని చర్మం బపరెనేని యయిదు నెలలలోపల, తన నీడ వేఱొక్క లాగున నుండెనేని నాలుగు నెలలోపల, యముని దిక్కున మేఘరహితంబైన గగనంబున మెఱుపు గనంబడియెనేని మూఁడు నెలలలోపలఁ, దన బింబంబద్దంబునఁ దలలేక కనంబడియెనేని రెన్నెళ్లలోపలఁ, దన శరీరంబు నిర్వ్యాజముగా శవగంధంబు గలిగెనేని పక్షంబులోపల, జలకమాడినఁ దడితోడన నశించెనేనియు, హృదయ మధ్యంబున నలందిన చందనంబు శీఘ్రుంబ యెండెనేనియు, నీరు గ్రోలిన దాహంబు నిలువదేనియు, నయిదు దినంబులలోపల యమ సదనంబునకు వెంచేయుట నిశ్చయంబు. మనుజుల లోచనంబులలోఁ దనరూపంబు గానరాదేని, వీనులలో

ప్రేవ్లు సొనిపినయెడఁ బ్రాణఘోషంబు వినఁబడదేని, శీఘ్రంబ శరీరహాని సంభ వించు. తన నీడఁ దాను భక్షించునట్లును, గేశంబులు నుముకయుఁ దినినట్లును, దిగంబరుండైన జైన సన్న్యాసినవ్వుచు దగ్గర గంతులు వేసినట్లును, నాపాద మస్తకంబుఁ దైలంబు నలందికొని భూతలంబునంబడి నిద్రించునట్లును, భయం కరాకారులైన బంటురౌతులు వెంటఁబడినట్లును, గుడియలవారు పొడిచినట్లును, నల్లనిశూద్రులు తఱిమి త్రాళ్లు వేయునట్లును, నీలిచీర గట్టుకొనిన కాంత దక్షిణాభి ముఖంబుగాఁబోవ దాని వెంబడిఁబడిపోవునట్లును స్వప్నంబు గన్నవారికి మర ణంబు ధ్రువంబు. అరిష్టంబులు సంభవించినప్పుడు జపహోమసురార్చనాదులు సేయించి, సర్వసంగంబులు నిరసించి, యింద్రియ వికారంబులు జయించి, నదీజలంబు సముద్ర జలంబునంజేర్చిన యట్లు జీవునిఁ బరమపురుషుండైన నారా యణుంజేర్చి, తత్త్వరహస్య కోవిదులైన పురుషులు ధన్యులగుదురు'. అని గాలవ మునీంద్రుఁడు పలుకటయుఁ, గుంతలాధీశ్వరుండు గుబుసంబు నూడ్చు మహా నాగంబు తెఱంగున రాజ్యభోగంబులు విడువందలంచి, మంత్రి కుమారుండైన మదనునింబిలపించిన, నతండు వచ్చి మ్రొక్కి, 'యేమి కార్యంబున నియో గించెద'వనిన, 'నీ మఱఁదియగు చంద్రహాసు నీక్షణంబు పిలిపింపుము. మత్కు మారికయగు చంపకమాలినినిం బరిణయంబు సేసెద' ననుటయు, 'వల్లె' యని ముకుళితహస్తుండై యతివేగంబునం దన గృహంబునకుం జనియె.

## -చంద్రహాసునకుఁ గుంతల రాజ్యాభిషేకము-

అట్టియెడ సంధ్యారాగ సమయంబునఁ జండికా పూజనంబునకుం దగిన పూజాద్రవ్యంబులు గైకొని యొంటిగాఁ బోవునట్టి మఱంది నవలోకించి, మద నుండు, 'రాజనందనా, కుంతలనాథుండు నిన్నీక్షణంబున తోడి తెమ్మనె' నన వుడు నతండు 'మామ యానతిం జేకొని శాంభవీ పూజనంబునకుఁ బూజా ద్రవ్యంబులు గొనుచుం జనియెదఁ జండికాపూజానంతరంబ వచ్చెద' ననిన, మదనుండు, 'దేవ పూజనంబు నీకు బదులుగా నేను జేసివచ్చెద. నీవు రాజ సమ్ముఖంబునకుఁబొమ్మ'ని, యతని చేతనున్న గంధ పుష్పాక్షతాది పూజా ద్రవ్యంబులుగైకొని, తానెక్కిన గుఱ్ఱంబును ఛత్రచామరాదులు నతనికి నొసంగి నంపిన, నా చంద్రహాసుండు సత్వరంబుగాఁజని, ప్రణమిల్లి నిలుచుటయుఁ, గుంతల విభుండు గాలవ సంయమీంద్రుని శాసనంబునఁ జంద్రహాసునకుం

జంపకమాలినింబెండ్లిసేసి, తన సింహాసనంబున నునిచి, పట్టంబు గట్టి, సమస్త రాజ్యంబు నతనికొసంగి, విరక్తుండై, తొల్లి యనుభవించిన భోగంబులందలంచి యేవగించుచుఁ దపోవనంబునకుం జనియె.

అప్పు డమ్మంత్రి కుమారుండు నగరప్రాంతంబునఁ గాంతార సమీపంబున రుద్రకాంతా సదనంబునకుం జనుటయు, నమ్మహాధ్వాంతంబున నక్కోవెలలోన డాఁగియున్న పరశుహస్తులు పైఁబడి యాయుధమ్ములం గ్రుమ్మి పడవైచిరి. ఇక్కడఁ జంద్రహాసుండు చంపకమాలిని వివాహంబై కుంతలరాజ్య సింహాసనా రోహణంబున మహోత్సాహంబు నొంది, వంది సందోహంబులు కైవారంబులు సేయ, వేలకొలందులగు వేత్రపాణులు సాహోనినాదంబుల నెచ్చరికలు దెలుపుచు ముందటం గ్రందుకొను సందడులు తొలగింప, మెఱుంగుల పరంపరలం శతముఖ సహస్రముఖంబులుం గల దివ్వటీలు పెక్కువేలు నివ్వటిల్లఁ, జంద్ర జ్యోతులు ననేక సహస్రంబులు ప్రకాశింపఁ, జంపకమాలినీ సమేతంబుగా శచీ సమేతుండైన యాఖండలుండునుంబలెఁ దెల్లయేనుంగు నెక్కి యక్కజంబైన విభవంబునఁ బురప్రవేశంబుగాఁ జనుదెంచి, మంత్రి గృహంబువాకిట మదావళంబు డిగ్గి, యంతకమున్న చారులచే నిజవృత్తాంతంబువిని కలంగియెదురువచ్చిన మామ గారికిం బ్రణమిల్లి మదనుండు కాళికా గృహంబునకుం దనకు బదులు వోవుటయుఁ, దాను రాజు సముఖంబునకుం జనుదెంచుటయు, మొదలగు వృత్తాంతంబు నాద్యం తంబు సవిస్తరంబుగా నెఱింగించిన, నమ్మంత్రి నిప్పులు ద్రొక్కినగతిం బొక్కి పడి, ముఖవికారం బణంచికొని కైతవ ప్రియంబున నల్లుని యుల్లంబు పల్లవిం పంజేసి, నగరికిం బోవంబనిచి, యయ్యమాత్యవరుం డత్యాహితంబునందలయుఁ జీరయు వీడఁ గాళికా గృహంబునకుం బఱచి, ఖండిత శిరస్కుండైన కొడు కుంగని సంతాపంబునొంది 'శ్రీవిష్ణు భక్తునకు ద్రోహంబు దలంచిన పాపాత్ముల యత్నంబులు ఫలించునె?' అని యా దేవి బలిపీఠంబునం బెట్టుగాఁ దాకి, భగ్న శిరస్కుండై ప్రాణంబులెడఁబాసె. అంత, వేకువజామగుటయుఁ, జండికఁబూజ చేయ నర్చకుండు వచ్చి, కోవెలవాకిటంబడియున్న మంత్రినిఁ, దత్కుమారునిం జూచి, 'యెట్లు పొలిసిరో? ఏమి దుర్నిమిత్తంబో!' యని మొత్తుకొనుచుఁ బఱతెంచి చంద్రహాసున కెఱింగించుటయు, నతఁడు పాదచారియై కాళికా గేహాభ్రప్రాంతం బునం బడియున్న సచివుఁ దత్కుమారునిం గాంచి, శోక సంతప్తుండై వీరలఁ

బ్రతికింపకఁ బోయితినేని నా కపకీర్తి పాయదనుచుఁ, జతురస్రంబుగా బాహు మాత్ర ప్రమాణంబున నా రుద్రాణి సన్నిధిని హోమకుండంబు త్రవ్వించి, పావకునిఁ బ్రజ్వలింపంజేసి, శర్కరాతిల పాయస ఘృతంబులతోఁగూర్చి తన మేని ఖండంబులు ఖండించి వేల్చి (దేవితో నిట్లనియె).

## —చంద్రహాసుఁడు దుష్టబుద్ధిని మదనుని బ్రతికించుట—

'దేవీ, నీవు విష్ణుదేవుని చిచ్ఛక్తివి. నీకుం బ్రియంబుగా శిరంబు పూర్ణాహుతిఁగావించెద' ననుచు ఖడ్గంబు జళిపించునంతలో, నవ్వైష్ణవ శక్తి యప్పుడమితేని కరంబువట్టికొని, 'వీరప్రతాపా, నీసాహసంబునకు మెచ్చితి. వలయు వరంబు గోరు' మనుటయుఁ, జంద్రహాసుఁడు 'మంత్రిని, నతని కుమారునిముందుగాఁ బ్రతికింపుము. నాకు నారాయణ చరణారవిందంబుల దృఢభక్తినొసంగు' మనిన, నా భద్రకాళియు 'నట్లేయగు. అదియునుంగాక, బలపరాక్రమ సమున్నతులైన సుతులిరువురు నీకుంగలిగెద' రని చంద్రహాసుని శాయంబిలిచి, హస్తమస్తక సంయోగంబుగావించి, భగవంతుండైన రమాకాంతుని స్వరూపపసుణ విభూతి విశేషంబులును, జీవాత్మ పరమాత్మ స్వరూపంబులును, సంసార నివృత్తి ప్రకారంబును, మోక్ష స్వరూపంబును, దత్త్వ విజ్ఞానంబునుం దెలిపి, చండిక యంతర్ధానంబు నొందుటయు, నయ్యమాత్యుండును, దత్సుతుండును నిదుర మేల్కనిన చందంబున సమాగత ప్రాణులైరి. తోడనె యా చంద్రహాసునిపయిం బుష్ప వృష్టి గురిసె. దేవతలు గొనియాడిరి. అంత నా చంద్రహాస రాజేంద్రుఁడు నమాత్యునిం దత్కుమారునిందోడ్కొని పురంబునకు వచ్చి యాదరించి, గృహంబున నునిచి, తల్లిదండ్రులైన మేధావినిం బుళిందునిం బిలిపించి, వినయంబున మ్రొక్కి యథేష్టభోగంబులు సమర్పించి, చంపకమాలియందును, విషయ యను యోషామణియందును బద్మాక్షుండు, మకరధ్వజుండు నను నిరువురు కుమారులంగాంచి, బహుయాగంబు లాచరించి, ముకుంద చరణారవిందన్యస్త మానసుండై మున్నూఱు సంవత్సరములనుండి రాజ్య పరిపాలనంబు సేయుచునున్న వాఁడు.

అని నారద మునీంద్రుం 'డర్జునా, ఇవ్విధంబున నీర్ష్యాసూయాపరుండైన యా దుష్టబుద్ధి నరకంబునం బడక యుండుటకుఁ గారణంబు గలదు వినుము,

మున్న దాను భజియించు సాలగ్రామంబు శ్రీతులసీ దళంబుల తోడంగూడ మ్రింగియుండె. అది కారణంబుగా నతనికిహంబున దైవాను కూల్యంబు తప్పెను. కానిపరలోక బాధ లేదాయెను.సాలగ్రామ తీర్థంబు శిరంబునఁ జల్లికొనిన మానవులకు నేఁబది కోట్ల యోజనంబుల విస్తారంబైన భూమండలంబునంగల పుణ్యతీర్థంబుల నెల్ల నాడిన ఫలంబు లభించు. సాలగ్రామంబు ధరించుట వలనఁ జతుర్దశ లోకం బులు ధరియించిన పుణ్యంబుదొరకు. సాలగ్రామదానంబున భూచక్రదాన ఫలంబు గలుగు. సాలగ్రామ పూజవలన సకల దేవతలఁ బూజించిన సుకృతంబు చేకూరు. సాలగ్రామ వర్ణనంబు వలన సకల వేద పారాయణ ఫలంబు సిద్ధించు. సాలగ్రామంబు, సన్న్యాసియు నను నీ రెండును శ్రీవిష్ణు దేవునకు స్థావరంబు చరంబునైన దేహంబులని బ్రహ్మ కొనియాడుచుండు. అంతకంటె శ్రీతులసి యధికంబని పెద్దలు మందలింతురు. శ్రీకృష్ణదేవుండు శిరంబున నెమిలి పించె మును, గర్ణంబుల మకర కుండలంబులను, నురంబునఁ గౌస్తుభంబును ధరియించు, అంతకంటె శ్రీ తులసీ దళం బతిశయంబని ధరించుచునుండు. ఇక్కథవిన్న వారల కభీష్టంబులు చేకూరును'. అని పలికి నారద మహాముని దేవలోకంబునకుం జనియె.

## —చంద్రహాసుని కొడుకులు మఘాశ్వంబులం బట్టుట-

అంత, నర్జునుండు విస్మయంబునొంది తోడి రాజులతోఁ జంద్రహాసునిం గొనియాడుచు, గొంతలంబుఁ జేరంబోయిన నా రాజ కుమారులు బలపరాక్రమ సంపన్నులయిన మకరధ్వజ పద్మాక్షులను (వారు) మున్నాడి పఱతెంచిన జన్నంపుఁ దేజులఁ బట్టికొనిపోయి తండ్రి సముఖంబునఁ బెట్టినఁ, జంద్రహా సుండు గనుంగొని, 'యివి ధర్మనందనుని మఘాశ్వంబులు. వీని సంరక్షించు టకుఁ గిరీటి వచ్చుచున్నవాఁడు. అతని మున్నాడి యిత్తురంగంబులు పాఱి వచ్చె. కుమారులారా, మీరలు పదియైదు దినంబులీ రెండు గుఱ్ఱంబులను రక్షించు చుండుఁడు. ఇంతలో వారలు రాకుండిరేని ధర్మసుతుని యాగంబు కొదవపడ కుండునట్లుగా మనమే పంపుదము'. అని పలుకుచుండు నంతలోఁ బార్థుని యెలగోలు మూఁకల* కలకలంబు భూనభోఽంతరములు, దిక్కులు బ్రక్క-

* ఎలగోలు మూఁకలు - రాజుతో వచ్చు సైన్యమునకుముందే వచ్చెడి సైన్యము. (Adanvce Army)

లింప వినంబడుటయుం జంద్రహాసుండు ముఖచంద్రహాస చంద్రికలు గ్రందు కొన కొడుకులం జూచి, 'మీరలు సైన్యసమేతంబుగా మోహరింపుఁడ'నుటయు, వారలు తత్పురంబు బయలువెడలి యర్ధచంద్ర వ్యూహంబు మోహరించి యుండునెడ, శ్రీకృష్ణదేవుం డింద్రనందనునితో, 'వీఁడు చంద్రహాసుండను మహారాజు. పరమవైష్ణవుఁడు. ఇతండు విద్యచేత, విజ్ఞానంబుచేత వృద్ధుండగు. అయినను సమరాంగణంబున యౌవనస్థుండు సుమ్ము!' అని పలుకు నవసరం బునఁ జంద్రహాసుండు నిజసేనలఁదల కడచి, వచ్చి, యర్జునుని యరదంబున శంఖచక్ర పద్మ హస్తుండును, గౌస్తుభ మాలికా కిరీట కేయూర మకర కుండల మేఖలా దామ మంజీ రాది దివ్యభూషణ భూషితుండును, సనక సనందనాది మహాముని ధ్యానగమ్యుండును, నైన గోపాల దేవునింగని, భక్తివినయ సంభ్ర మంబులు మెఱయ, శరశరాసనంబులు పాఱవైచి, మాణిక్యరథంబు డిగ్గనుఱికి, 'యదునందనా, శ్రీకృష్ణా'యని సాష్టాంగ దండ ప్రణామంబు గావించి లేవకుం డిన, శ్రీవాసు దేవుండు తాను నరదంబుడిగ్గి, నిడుద భుజంబులు సాఁచి, లేవ నెత్తి, కౌఁగిలించుకొని, సవ్య సాచింజూచి, 'నాకితండు నిజభక్తుండు, త్రికరణం బుగా నన్ను నమ్మినవాఁడు. బ్రహ్మరుద్రాదుల కేని యు నజేయుండు. ఇతనితోడ సమరంబు వలదు. కౌఁగిలించికొను'మనుటయుఁ, గౌంతేయుండు 'నా కురు వంశంబు నేఁటికిఁ బావనం బయ్యె'నని చంద్రహాసునిం గౌఁగిలించుకొనియె. అంతఁ, గుంతలేశ్వరుని యాజ్ఞవలనఁ దత్కుమారుండైన మకర ధ్వజుం డశ్వ మేధాశ్వంబుల రెంటిఁ గొనివచ్చి, శ్రీహరి సన్నిధియందునిచి, కృష్ణార్జునులకు నమస్కరించిన, నయ్యవసరంబున రాజసమాజంబుతోఁ దేజస్వియైన చంద్ర హాసుండు సుధారసనిరాసంబులైన వాగ్విలాసంబుల నుపచరించి, వాసుదేవునిం దన పురంబునకుం దోడ్కొని పోయి యచట దుష్టబుద్ధి మదనులఁ, జంపక మాలినీ విషయలఁ గానిపించి, శ్రీకృష్ణ పదారవింద భజనాయత్త చిత్తుండై, తనకుంగల రాజ్యంబంతయు ముకుందున కొసంగి, యనంతరంబ గాలవ మహా మునిం బిలిపింప, నతండు సచ్చిదానందమయుండైన శ్రీ కృష్ణదేవుని విగ్ర హంబు గనుంగొని, పులకాంకిత గాత్రుండును, హర్షాశ్రుజడీకృత నేత్రుండునై, ముహూర్త మాత్రంబు తన్మయుండై యూరకుండె. అంత రుక్మిణీ కాంతుడు కుంత లేశ్వరుం డొనర్చు నర్చనల సంత సిల్లుచు, దివసత్రయం బతని పట్టణం బున నివసించి, నాలవ నాఁడు చంద్రహాసుండు తనకు మున్నర్పించిన

రాజ్యంబు తత్పుత్రులైన పద్మాక్ష మకర ధ్వజుల కొసంగి పట్టంబు గట్టినఁ, జంద్రహాసుండు నందనులం జూచి, 'యీనందనందనుని చరణారవిందంబులు భజించి మోక్షానందంబు నొందుఁడు. నాయట్ల కీర్తిఁ జెందుం'డనుచు దీవించి, బుద్ధి సెప్పి, వారలచే వీడ్కొని, చతురంగ బలంబులు గొలువ సవ్యసాచికిం దోడై వెడలె.

అంత, నమ్మహాశ్వంబు నానా భూములు, సీమలు, జనపదంబులు, నదంబులు, హ్రదంబులు గమించుచుఁ జనుచుండఁ, దత్తద్దేశాధీశులు మెప్పైన కప్పంబులుగొని, భక్తియుక్తులై సేవింప, విక్రమోపార్జనుండైన యర్జునుఁడు హరియును హరుల వెంబడిం జనునెడ, నవియుత్తర సముద్ర తీరంబునకుంజని, యందఱుంగను గొనుచుండ సాగర మధ్యంబునకు దాఁటుటయు, నమ్మహీ పాలు లందఱు నివ్వెఱఁగంది, నిశ్చేష్టితులై, యంబుధి సాధించు విధంబు దెలియక విహ్వలత్వంబునొంద, శ్రీకృష్ణుండు మయూరధ్వజా నర్జునులఁ బ్రద్యుమ్న హంసధ్వజుల,బభ్రువాహనునిం బిలిచి,'మీరథంబులకు దశదిశాభాగంబుల గిరివన సముద్రాది దుర్గంబుల నడ్డంబులేదు. కావున మీరేవురు నా వెంబడి రండ'ని. సకల దళంబుల నచ్చట నిలిపి, యంబుజాక్షుండు రథారూఢుండై సముద్రంబు సొచ్చి, వెదక(సాగె)

## -శ్రీకృష్ణాదులు ఒక దాల్భ్యుని జూచుట-

(అప్పుడచ్చట) నొక్క దీవియందు జీర్ణ శరీరుండును, శ్మశ్రు జటా పటల భూషితుండును, భాను సహస్రతేజుండునై, చిలికిన వటపత్రంబులు కొన్ని శిరంబునకు నడ్డంబుగా వైచికొని, యనవరత హరిధ్యానానంద సాగరమగ్నుం డును, వరతపః ప్రాగల్భ్యుండు, నగు బకదాల్భ్యుం గనుంగొని, యేపుర మహా రథుల తోడంగూడ రథంబులు డిగ్గి, నమస్కరించుటయు, నమ్మహాముని శ్రీకృష్ణునిం గనుంగొని, 'యివ్వెన్నునికెన్ని వింతలు! ఇమ్మూలకింత సందడి నెందులకుఁగొనివచ్చె?' అని యసహ్యపడుచునుండ, నరుండు మెల్లన నత్తపోధ నుంజేరి, కేలుమొగిచి, 'మీశరీరంబున వింతలు గనుపట్టుచున్నయవి. సందు సందులఁ బుట్టలు పెట్టె. అందున నూఱు వేయుంబడగలు గల సర్పంబులు పర్వంబున నటియించుచున్నవి. మోఁగాళ్ల మోఁడేతుల మహావృక్షంబులు పుట్టె.

కర్ణంబుల గూండ్లు కట్టుకొని యనేక పక్షి సహస్రంబులు సంచారంబులు సేయు చున్నయవి. మీరు జీర్ణంబులగు పటపత్రంబులు గొన్ని తలమీఁద వైచికొని యున్నవారలు. ఇదియేమి?' అని యడుగుటయు, నమ్మహాముని నవ్వుచు, 'క్షణభంగురంబైన శరీరంబు నీటి బుగ్గ చందంబున నెప్పుడెవ్వేళ నవిసిపోవునో తెలియదు. సంగంబులు దుఃఖ ప్రదంబులు. గృహారామ క్షేత్రంబులు నశ్వ రంబులు. అల్పకాలంబు బ్రతుకున కింతచాలదేయని మఱ్ఱాకు శిరంబున కడ్డంబుగా నునిచికొనియున్నవాఁడ'. అనినవిని, యర్జునుం డాశ్చర్యభరిత మానసుండై 'తపోధనా, మీకెన్ని సంవత్సరంబులయ్యె నాస తీయవలయు'ననుటయు, నమ్మ హాముని పార్థునింజూచి, 'నేను జనియించిన తరువాత మృతులైన రోమశులకు లెక్కలేదు. మార్కండేయుల నెన్నఁదరంబుగాదు. నేను బుద్ధియెఱింగిన వెనుక నిరువది బ్రహ్మ పట్టంబులయ్యె. మున్నొక సమయంబున సప్తసాగరంబు లేకీ భూతంబులై మహాప్రవాహంబుగా వచ్చునప్పుడిచ్చటికి భూలోకంబు, భువర్లోంకబు సువర్లోకంబు దేలియాడుచు వచ్చె. అప్పుడొక్క మఱ్ఱిచెట్టిక్కడనుండె. దానికి సహస్రశాఖలు గలవు. శాఖకు వేయేసి బ్రహ్మాండంబులు వ్రేలుచుండె. ఆమఱ్ఱి చెట్టుకొన చివురాకునందు నొక్క చక్కని బాలకుండు పవ్వళించి కోమలంబైన పాదాంగుష్ఠంబు ముఖారవిందంబుననిడి చీఁకుచు వెడ వెడ యేడ్చుచు నవ్వుచుండె. వాని ధర్మంబున నా ప్రళయకాల మహామారుతంబున యీసముద్రంబు సుడులలోనం దగులక సంచరించితి. ఆ సుద్దులిప్పుడేమిటికి? అర్జునా, ఈ దీర్ఘబాహుండును, నీలమేఘశ్యామల గాత్రుండును గౌస్తుభ వనమాలికా కనకాంబర ధరుండును, నైన యితండు నీకు బావగదా! మీతోడంగూడఁ దిరిగి తిరిగి యాచంచంబయ్యె. రమ్మపొమ్మను వారు లేక యొంటిగా సర్వంబునుం దానమై హాయిగా నున్న వానికి నాభియందొక్క కమలంబు గలిగె. దానియందు నాలుగు మొగంబుల కొడుకొక్కడు గలిగె. వానికెంగలిగె నీచరాచర జగంబులు. అదిచాలక నాఁటి చిన్నవాఁడు యదుకులంబునంబుట్టి, పదియాఱువేల నూట యెనమండ్రం బెండ్లియై, మీవంటి వారితో వియ్యంబులంది యీ సంసారం బేమిటికిఁ దెచ్చి కొనియె?' అని నవ్వుచు, 'నోయీ, త్రైలోక్య కుటుంబీ, యిందు రావోయీ,' అని శ్రీకృష్ణుంజేరఁ బిలిచి కౌఁగిటంజేర్చుటయు, నాశౌరియమ్మునికి నమస్కరించి, 'యిరువది బ్రహ్మకల్పంబులు చూచిన పెద్దవు. విష్ణుభక్తాగ్రేసరుం డవు. కావున నీవే విష్ణుదేవుండవు. నీ వరుసుదెంచి ధర్మపుత్రుని యాగంబు సఫలంబుగా నెఱవేర్పవలయు'ననుటయు, దాల్భ్యుండు, 'దేవా, సత్కీర్తిఁ బ్రస్తు

తించి గర్వంబను వెఱ్ఱి పట్టింపకుము. నీ చందంబునకు వెఱతు. తొల్లి నాగర్వం బును, బ్రహ్మగర్వంబును జెఱిచిన పుణ్యపురుషుండవుగావె! అకథ నీ సఖులు వినంజెప్పెద'నని పలుకందొడంగె.

## -బకదాల్భ్యుఁడు విష్ణు మహిమ చెప్పుట-

'అర్జునా, తొంటి బ్రహ్మకల్పంబున నొక్క చతుర్ముఖ బ్రహ్మదేవుండు నా యెదుటనిలిచి, 'మునీంద్రా, చింపిమఱ్ఱాకు చాఁటున నేమిటికిఁ దపంబు సేసె దవు? వలయు వాంఛితంబుల నిచ్చెద. తపంబు చాలింపు' మనిన, నతనిం గనుంగొని, 'నే నిరువదుంద్రు బ్రహ్మలం గంటి. వారిలో నీవు కడపటి వాఁడవు. నీవేమి వరంబిచ్చెదవు? నేనేమి గైకొనియెద?' నని నవ్వుచుండ, నప్పుడు మా యిరువురనడును ధరణీ చక్రంబు వ్రక్కలించుకొని, యొక్క యుత్పాత మారుతంబు పుట్టి, మమ్ము నిరువుర నెత్తికొని, వేఱొక్క బ్రహ్మాండంబులోఁ బండుటాకువలెం బాఱవైచుటయు, నందొక్క యెనిమిది ముఖంబుల బ్రహ్మ, 'మీర లెవ్వరెచ్చటి నుండి వచ్చితి'రనిన, 'నేను జతుర్ముఖ బ్రహ్మను. సత్యలోకంబున నుండుదు. ఇమ్మౌని నా శిష్యుండు'. అనుటయు, నాయష్టముఖ విరించిన నవ్వుచు, 'నోరీ, నాలుగు ముఖంబుల వాఁడవు. నీవేమి? బ్రహ్మపట్టం బేమి? శిష్యుఁడేమి? పాండిత్యంబులు మాని మాకు దాసులరై యుండుఁ'డనియె. అట్టియెడ నచ్చట మునుపటికంటెఁ బదింతలధికంబుగ నొక్క మారుతంబుపుట్టి, మమ్ము ముప్పుర నెత్తికొని, మఱియొక్క బ్రహ్మాండంబునఁ జొక్కాకులుం బలెఁ బడవేయుటయు, నచ్చట నత్యున్నతాకారులు, నతి వదాన్యులునైన మహా పురుషులు మమ్ము ముప్పురం జూచి, 'మీర వెచ్చటనుండు వారల'నిన, నా యష్ట బ్రహ్మ 'నేను జగద్విధాతను.పద్మసంభవుఁడ' ననుటయు,వారు మమ్ము ముప్పురం దోడ్కొనిపోయి పదియాఱు ముఖంబుల బ్రహ్మ సముఖంబున నిలుపుటయు, నతండు తన సముఖము వారినిం జూచి, యిమ్ముప్పుర మన యూడిగంబులో నిలుపుండని పలుకుచుండ, నర్జునా, యమ్మహాశ్చర్యంబేమని పలుకుదు? అచ్చటఁ దొంటికంటె శతగుణంబుగా వేఱొండు చండమారుతం బుదయించి, మమ్ము నలువుర నెత్తికొని ముప్పుడి రెండు మోముల తమ్మిచూలి సమ్ముఖంబునం బడ వేయుటయు, నంతడు నట్లపలుక, నందొక్క చక్రవాతంబు పుట్టి, మమ్ము నేవుర

నెత్తికొనిపోయి యరుపడి నాలుగు మోముల యంబుజభవుని చెంతం ద్రోచె. ఇట్లు క్రమక్రమంబున బహు పద్మ సంభవులతోడం గూడఁ జనిచని, కడపట సనకసనందనాది మహాముని సేవితుండును, సహస్రముఖుండును, దుర్నిరీక్ష్యతేజోరాశియు నైన యొక్క సహస్రముఖ పరమేష్ఠిగన నతండు మమ్ముం గనుఁగొని, ప్రత్యుత్థానంబు సేసి, యర్ఘ్యపాద్యాదులొసంగి, స్వాగతంబిచ్చి, 'మీ కృపాకటాక్షంబున నీ లోకంబున నధికారంబు సేయుచునున్నవాఁడ. నేనును, నా శరీరంబును, మత్పరిజనంబులును మీ యధీనంబులు. నాకేమి కైంకర్యంబు నియమించెదరు?' అనినఁ దొంటి పద్మ సంభవులందఱు గర్వంబులుడిగి మదంబులు మాని, బహ్మత్వాహంకారంబులు దొఱంగి దండప్రణామంబులుసేసి, 'దేవా, నీవు సాక్షాదధోక్షజుండవు. నీ యైశ్వర్యంబపారంబు. నీ మహిమ నీకు సహితమెఱుంగం దరంబుగాదు. మహాసముద్రంబున ఫేనబుద్బుదంబులు పుట్టు చందంబున నీయందనేక కోటి బ్రహ్మాండంబులు పుట్టుచుం గిట్టుచునుండు,' నని వినుతించుటయు, సహస్రముఖుండైన యవ్విరించి వారలనాదరించి, యా కమల సంభవుల నయ్యై పదంబుల నిలిపి, నన్ను నిచ్చటికిఁబనిచె. నాఁటి బతలికలు దీర్చుకొనుచు, నిచ్చటనున్నాఁడ. కవ్వడీ, గర్వంబెవ్వరికింగారాదు'. అనినం గృష్ణార్జును లమ్మునినిం బ్రార్థించి, నవరత్నమయంబైన పల్లకియందునిచి, తోడ్కొని, యచ్చటనున్న యాగహయంబుల మరలించికొని, సాగరంబు వెలువడి, సమస్త రాజలోకంబు సంతసింపం జతురంగ సేనాసమేతులై యవ్వలం దరలిరి.

## -అర్జునుని రాకవిని, సైంధవుని పుత్రుండు మృతుండగుట-

తదనంతరంబ, యాగహయంబులు సింధు దేశంబు సొచ్చుటయుఁ, దద్దేశాధిపతియగు సైంధవుని కుమారుండు కొలువున నుండి, మహారథికులతోడంగూడ గాండీవి యాగ హయంబుల వెంబడి వచ్చెనని చారులవలన వినినమాత్రంబున గుండియలవిసి దిగులునం బ్రాణంబులు పరిత్యజించె. అంత దుర్యోధను సోదరి యైన దుస్సల మృతుండగు తనయునిం గనుంగొని, పదంబులు తొట్రుపడ నేడ్చుచు నగరంబు వెలువడివచ్చి, శ్రీకృష్ణుని పదంబుల పయింబడి 'హా కృష్ణా, ద్వారకానాయకా, అనాథనాథా, పార్థుండు మున్ను నా పెనిమిటింజంపి యిప్పుడు నా బిడ్డను జంపె. అన్యాయ మన్యాయము. నన్ను గావవే!' అని మొఱ్ఱయిడుటయు,

నర్జునుండరథంబు డిగ్గి, యయ్యమ్మకుం బ్రణమిల్లి, 'పుత్రశోకంబునఁ దల్లడిల్ల కుము. మన పాల శ్రీహరి గలండ'ని పలుకుచు, నంబుజనాభుని దోడ్కొని యప్పట్టణంబునకు వచ్చిన, నచ్యుతుండు కొలువుతోనం గత జీవుఁడై పడి యున్న సైంధవ కుమారునిం దన కరారవిందంబున నిమిరిన, నతండు దిగ్గన లేచి నమస్కారంబు గావించిన, సభ వారలందఱును బ్రమోద భరిత మాన సులై 'ద్రుపద రాజనందన నభిమానంబునఁగాచిన భయత్రాతవు! ఆర్తినొందిన గజేంద్రునింగాచిన దయానిధివి గదా! గదాధరా!' అని వినుతించిరి. అంత, సైంధవ కుమారుండు కృష్ణార్జునులకు మ్రొక్కి నృత్త గీత వాద్యంబులతో మహో త్సవంబుగా వారలఁ బూజించె. అంతఁ గౌంతేయుండు దోఁబుట్టువగు దుస్సలకుం దత్పుత్రునకును మత్త దంతావళంబు లనేక సహస్రంబులు, బహులక్ష తురంగంబులు, నసంఖ్యాక రథంబులు, నపరిమిత ధన కనక రత్న భూషాంబ రంబులు నొసంగి, ధర్మతనయుని యజ్ఞంబుఁ జూడరండని ప్రార్థించి, వారలు వెడలిన యనంతరంబు సంవత్సరంబు సమాప్తప్రాయం బగుటంజేసి, వారు వంబుల స్వేచ్ఛావిహారంబు మాన్పి, హస్తినాపురి కభిముఖుండయ్యె.

అప్పుడు శ్రీకృష్ణుండు రాజులం గనుగొని, 'ధర్మపుత్రుం డసి పత్ర వ్రతంబులు సలుపుచు బడలి యున్నవాఁడు. నేను మున్నుగాఁజని మీ పరిణామ స్థితులు దెలియం జేసెద. తురంగంబులఁ గూర్చుకొని మీరు సాయంకాలమునకు రం'డని పలికి, యా కంసాంతకుండు కరిపురంబు సేరంజని, యచ్చట గంగా తీరంబున రత్నకాంచన ప్రభా దేదీప్యమాన సభాంతరంబున మహాముని సమేతుండైన ధర్మతనయుం గనుగొని, ప్రణమిల్లి, 'జననాథా, నీ ప్రతాపంబున ఘోటకంబు నిరాఘాటంబుగా సంచరించి వచ్చె. దిక్కుల రాజుల నెల్లంగెలిచి నీయనుజుండు కప్పంబు గొనివచ్చె'నని హంస ధ్వజుండాదిగాఁగల రాజన్యుల జన్యప్రకారంబు దెలియంజెప్పి, యచ్చటనున్న ముని జనులకు నమ స్కారంబును, గుశల ప్రశ్నంబును గావించి, కుంతి మొదలగు గురువనితా జనంబులకుం బ్రణమిల్లి, తనకు మ్రొక్కిన భీముని, మాద్రేయుల సుభద్రా ద్రౌపదుల నాదరించి, వృకోదర సహితంబుగా నిజ మందిరంబునకుంజని, రుక్మిణీ సత్యభామాది యోషారత్నంబుల యుల్లంబులు పల్లవింప నించుక వడి వినోదించి, తోరణ వితానాదులచేఁ బురంబు సింగారింప నియమించి, పౌరులు,

పురోహితులు,సామంత దండనాథులు, తద్వధూ జనంబులు, వారసుందరీ బృందం బులు, ధర్మరాజానుమతంబున బయలు మెఱయుటయు, భీమాది యోధవరుల తోడంగూడ నమ్మాధవుండు చతురంగబలంబులు గొలువ, బకదాల్భ్యు నెదు ర్కొనుటకుఁ గదలి, వికసిత కుసుమ సౌరభ సంభరితంబైన పురోద్యాన సమీ పంబున నర్ధచంద్ర వ్యూహంబు వన్నించి నిలిచె. అంతఁ, బద్మినీకాతుండు పశ్చిమ సముద్రంబు చెంత నిలిచె. అపుడు గంధతైలావసిక్తంబులగు కర దీపికా సహస్రంబులు వెలుంగ నభినవ భూషితాంగులగు రాజ పుంగవులు గొలువ, మంథాన మధ్యమాన మహార్ణవ ఘుమం ఘుమిత ఘోషగంభీరంబైన సేనాకోలాహలంబు తోడ జలధరగర్భ నిర్భేదనారంభ విజృంభమాణ మాణిక్య ధ్వజంబులు చెలంగఁ, బ్రచండ మారుత పూరిత కులాచల ధరీ ఝరీ జృంభమాణ గంభీర నిస్వనంబులఁ బురుడించుచు, నిస్సాణ రవంబుల తోడ ననర్ఘ్యమణిమయ శిబికాధి రూఢుండైన బక దాల్భ్య మునీంద్రు వెంబడి నశ్వమేధాశ్వంబుల. మున్నిడుకొని, గాండీవ ధన్వి యెదుట నున్న పుండరీకాక్షుతోడ సంధించు కొనియె. పౌర పురంధ్రీ మణులింద్ర నందనుని మీఁదఁ జల్లు మౌక్తికంబుల వలన భూమి రత్నగర్భయయ్యె. వారలు చల్లెడు పూవుల వలన గంధవతి యయ్యె. భీమసేన మాద్రేయ ముఖ్యులు బకదాల్భ్య మునీంద్ర పాద పద్మంబు లకుఁ బ్రణమిల్లి, ఫల్గున సేవా ప్రకరంబుల తోడంగలసి పట్టణంబునకుం జనిరి.

## -శ్రీకృష్ణుండు వచ్చినరాజులనుధృతరాష్ట్రునకెఱింగించుట-

తదనంతరంబ, మహీపాలకులందఱు విచిత్రంబులైన కానుకలు గొనుచు వ్రత దీక్షాపరుండైన ధర్మనందనుని పాదార విందంబులకుఁ బ్రణమిల్లిరి. అపుడు విదుర సంజయ కృపాచార్య ప్రముఖ మిత్రబాంధవ సుహృజ్జనుల తోడం గూడఁ గొలువై యున్న ధృతరాష్ట్రుచెంతకుం జని, మహీపాలకులనెల్ల సమక్షంబు సేయించి, పుండరీకాక్షుండు వారల వేర్వేఱ యిట్లని యెఱింగించె. 'ఇతండు శౌర్యసమున్నింద్రుండైన, నీలధ్వజుండు. స్వాహావధూ వల్లభుండైన వైశ్వా నరుండీతని యల్లుండు. ఇతండు చిత్రాంగదాకుమారుండైన బభ్రువాహనుండు. రణంబున సాత్యకి ప్రద్యుమ్న వృషకేతన కపికేతనుల జయించి,సంజీవరత్నంబుఁ దెచ్చి మగుడ బ్రతికించె. ఇతండు చంద్రహాస భూపాలుండు. ఇతని చరిత్రంబు విచిత్రంబు. ఇతండలిగెనేని దేవదానవులు వడవడ వడంకుదురు. ఇతండు

మయూర కేతనుండు. ఈ రాజు నౌదార్యంబు శౌర్యంబు వర్ణింప నా తరంబు గాదు. వృద్ధ బ్రాహ్మణ రూపంబునంబోయి నేను వేఁడినయెడఁ దన శరీరంబు సగంబు గోసియిచ్చె. ఇతండు హంస ధ్వజుండు. ఈ రాజు కొమరులను బవరంబున గెలుచుటకై నేను పూర్వంబు చేసిన పుణ్యంబులన్నియు వెచ్చఁ బెట్టితిని. వారల శిరః కపాలంబులు రుద్రుండు హారనాయకంబుగా ధరించె. ఇతండు వీరవర్మ. సర్వప్రాణ సంహారక కర్తయైన యముండితని యల్లుండు. వీరలందఱు నొక్కరికన్న నొక్కరధికులు. వీరలనెల్ల నీ తమ్ముని కుమారుండైన యర్జునుండు నిర్జించె. నీ భాగ్యంబునకుఁ గొఱంతయేమి?' అని వినిపించుచుండ ఫల్గునుండు ధృతరాష్ట్రునకు నమస్కరించి, తల్లికి మ్రొక్కుటయు, నామె బహు శాస్త్ర శస్త్రవ్రణ కిణాంకితంబులగు యతని యంగంబుల నిమురుచు, మ్రొక్కిన కర్ణనందనుం గౌఁగిలించుకొనియె.

తదనంతరంబ, ద్రౌపది శుభముహూర్తంబున హాటక పుటికలో నానా విధంబులైన విత్తనంబులు గొనుచు, మురారి యయ్యమ్మ ననువర్తించి, పిఱుంది దెస నరుదేర నానాథపృథివీపాలకులు దూరంబున నిలువ యమ నందనుండు నధ్వరభూమి శుద్ధిగా నాఱు వృషభంబులఁ బూన్చిన బంగరు నాగలిఁ గైకొని, మహామునులు మంత్రంబులు పఠించుచు వెంబడిరా యాగస్థలంబు దున్నె. అంత దీక్షితుండగు ధర్మనందనుని రత్నకుంభ సంభృతంబులును, గంధ ద్రవ్య పరిమళ మిళితంబులు, నానా విధౌషధీ యుక్తంబులునైన పుణ్య సలిలంబులచేఁ గుంతియు దేవకియు, యశోదయు, సాదరంబుగాఁ గనకాభిషేకంబు గావించిరి. ఋత్విజులు నెనమన్నూట తొమ్మిది కుందనంపు టిటికలు గరుడాకారంబుగా నమర్చి, యిట్టులొకటొకటి నినుమడి సంఖ్యగా గరుడా కారంబున నైదు వేదిక లమర్చి, శాస్త్రోక్తంబుగా నిష్టకాచయనంబుసేసి, యష్టద్వార సమన్వితంబు నష్టోపదేష్టకా మయంబును, వివిధ విచిత్ర తోరణ ధ్వజాలంకృతంబునుంగా యాగశాల గట్టించి, బదరీ బిల్వ పలాశ యూపంబు లిరువది యొక్కటి వరుసగా నిలిపి, సుక్స్రువంబులు నులూఖల జుహూ మొదలైన యజ్ఞ పాత్రంబు లలంకరించిరి.

## –ధర్మరా జశ్వమేధం బొనరించుట–

వింశతి బ్రహ్మకల్ప జీవియైన బకదాల్భ్యుండు బ్రహ్మయు, వేదవేదాంగ రహస్య నిస్సంశయుండైన సాత్యవతేయుం డధ్వర్యువు, వశిష్ఠ వామదేవ

రోమశ గాలవ కపిల సుమంత భాగురి భరద్వాజ జమదగ్ని రైభ్య కౌండిన్య గౌతములు ఋత్విజులుగా, నరుణి పులహ పులస్త్యోపమన్యు విశ్వామిత్ర మధుచ్ఛంద విభండక ధౌమ్య వాయుభక్ష కులరక్షోఘ్నులను మంత్ర పాఠకులుగా నియమించి, ధర్మనందనుండు, మృగ శృంగ ధరుండును, కృష్ణాజినాంబరుండును, కుశాసనాసీనుండునై యున్న సమయంబునం బరాశరనందనుండు రాజలోకంబు నవలోకించి, 'మీరలు కళత్ర సమేతంబుగా జాహ్నవీ పవిత్రోదకంబుల ధర్మరాజు నభిషేకింపవలయు'ననియె. అంతట ననసూయయు, నత్రియు,నరుంధతియు, వశిష్ఠుండును, రుక్మిణీ శ్రీకృష్ణులును, హిడింబా భీమ సేనులును, సుభద్రార్జునులును, మాయావతీ ప్రద్యుమ్నులును, ఉషానిరుద్ధులును, ప్రభద్ర వృషకేతనులును, ప్రభావతీ యౌవనాశ్వులును, సునందా నీలకేతులును, ధమ్మిల్లానుసాళ్వులును, మొదలుగాఁగల యఱువది నలువురు దంపతులు పంచ పల్లవ సమంచితంబులైన కలశంబులు గొనుచు, మందమంద గమనంబులం గదలి, ముందట గీత వాద్య నృత్యంబులు మెరయ, గజాధిరూఢులై, విప్ర కన్యలు చల్లు మౌక్తికంబులు మెరయఁ, గుంతీ దేవకీ యశోదలం బురస్కరించికొని యరుగు సమయంబునఁ గలహఘటనావిశారదుండైన నారదుండు సత్యభామా గృహంబునకుం జని పూజలు గైకొని యిట్లనియె. 'భామామణీ, మగండు నీ దెస కూర్మికలవాఁడని మిగుల గర్వించి యుందువు. నేఁడు పెద్దతనంబు రుక్మిణీదేవికిచ్చె. అది యెట్లంటివేని, మూర్ధాభిషిక్తులైన క్షత్రియోత్తములు పట్టంపురాణులతోడం గూడఁ జుట్టునుం గొలువ, ఛత్రచామరంబులు మెఱయ, భ్రాజిష్ణుండైన శ్రీకృష్ణదేవుని తోడంగూడ రుక్మిణీదేవి కలశాభిషేకంబు సేయుటకై జాహ్నవికిం జనియె.నీచనువు వ్యర్థంబయ్యె.' అనిన, సాత్రాజితి కలహాశన మునింజూచి 'యేకాంతంబునందును ప్రాణేశ్వరుండు నన్ను మఱచునే' యని తన కేళిసౌధంబున నున్న మురారిం జూపిన, సురముని విస్మితుండై విష్ణుదేవుని వ్యాపకత్వంబు గొనియాడుచు యథేచ్ఛముగాఁ జనియె.

## -అశ్వమేధ విధి-

అనంతరంబ, యరువది నలుగురు దంపతులు కొంగు ముళ్లతోడంగూడఁ గుసుమ గంధ బంధుర హేమకుంభ సంభరిత గంగా తరంగిణీ పవిత్రోదకంబులఁ దెచ్చి ఋత్విజులు వేదమంత్రంబులు చదువ, హేమ కటాహంబులం బోసి ధర్మతనయున కభిషేక మాచరింపఁ, బూతాత్ముండగు నతండు,

మఘాశ్వంబునకు నభిషేకంబు సేసి, మహామునుల నెల్లఁ గనకాసనంబుల నిడి, గంధ మాల్యాంబర భూషణంబు లర్పించి, యథోక్త దక్షిణ లొసంగి, యయ్యశ్వంబును యూపస్తంభంబునం గట్టినఁ, దానినిఁ బాంబాలియుఁ దానును బూజ చేసి వలగొని, యగ్ని శిఖాముఖంబున గంధర్వ లోకంబునకుం జనుమనిన, నయ్యశ్వంబు మోర యల్లార్చుచుఁ దన యభిప్రాయంబు నభినయించిన, నశ్వహృదయజ్ఞుండైన నకులుండు ధర్మజునిం జూచి, 'క్రతుఫలప్రదాయకుండైన శ్రీహరి తన ముఖంబున నున్నవాఁడు. స్వర్గఫలం బేమిహెచ్చు?' అని యశ్వంబు దెలుపుచున్నదన, శ్రీకృష్ణ సహితంబుగా ఋషులు సంతోషించిరి. అంత నగ్గంధర్వ రత్నంబును మంత్రంబుల విశసనంబు గావించిన, సౌమ్యుండైన ధౌమ్యుండు వాజి దక్షిణ కర్ణంబు మెలిబెట్టినఁ బాలు వెడలె. భీమసేనుండు పురోహితుని యనుమతిని గృపాణంబుగొని యశ్వశీర్షంబు ఖండించిన, నది తేజోరూపంబున నెగసి సూర్యునిం గలసె. మురహరుండు నత్తురంగ కళేబరంబు విశసనంబు సేసినఁ దత్తేజంబు శ్రీహరిలోనం గలసె. తన్మాంస రాశి కర్పూర రాశియైన, మునులు గనుంగొని 'కుంతీ తన యాగ్రణీ, నీభాగ్యంబునకుఁ గొఅంత యెయ్యది? అప ఘనసారంబు ఘనసారంబయ్యె' నని సన్నుతులు సేయనక్కర్పూరంబు ప్రథమాహుతిగా నాచార్యుండు నింద్రు నుద్దేశించి చేసిన, నయ్యింద్రుండు చేయిచాఁచి యాహుతింగైకొనియె. అట్లే దేవతలందరు వేదవ్యాసులొసంగు నాహుతులు సాకారంబుగా వచ్చి కైకొనిరి. త్రైలోక్యంబును దృప్తిఁబొందె. పురోడాశ ప్రాశనంబును సోమ పానంబునుం జేసి ఋత్విజు లానందించిరి. ధర్మనందనుండు పూర్ణాహుతి గావించి యవభృథస్నానంబు నాచరించె. అయ్యశ్వమేధ యాజిని రాజీవాక్షుండు నందంద కౌఁగిటం జేర్చి యభినందించె. అంత, ననసూయ మొదలగు వధూజనులు నీరాజనంబులు సేసిరి. అజాత శత్రుండు బక దాల్భ్యునకు రత్నమయ వృషభంబును, వ్యాసునకు సకల భూమండలంబు దక్షిణగా నొసంగిన, నతండు క్రమ్మఱనా భూమి విక్రయించి యాధనంబు దీనుల కొసంగె. ఒక్క యరదంబు నొక్క మదగజంబును, నూఱు గుఱ్ఱంబులు, నూఱు ధేనువులు, నాలుగుసోలల లముత్తియంబులు, నలువురు సైన్యపతుల నొక్కొక్క ఋత్విజునకు దక్షిణగా నొసంగి, సభా సమలైన ద్విజులకు నపారంబుగా దక్షిణ లొసంగి, కోటి స్వర్ణంబులు, పదివేల గుఱ్ఱంబులు, నూఱేనుంగులు, నొక్క వరుస సొమ్ములు వచ్చిన రాజులకెల్ల వేర్వేర నొసంగి,

యాదవులకెల్ల నందులకు నెట్టి ప్రత్యేకంబుగా బహుమానంబు సేసి, రుక్మిణీ ప్రముఖులైన గోపాల దేవుని వనితా మణులకు నపరిమిత రత్నభూషణంబు లొలంగి, భీమార్జున మాద్రీపుత్రుల మన్నించి, యుధిష్ఠిరుండు నవరత్న ఖచిత సింహాసనంబున శ్రీకృష్ణదేవుని రుక్మిణీసమేతంబుగా నునిచి, యాతని దివ్య శ్రీపాదంబులు బంగరు పళ్ళెరంబులోఁ బన్నీటంగడిగి, తడియొత్తి గంధపుష్ప దివ్య భూషణాంబరంబుల నలంకరించి, యయ్యశ్వమేధ క్రతుఫలంబు సమస్తంబును దత్కరంబున ధారవోసె. అప్పుడు పుష్పవృష్టియు దివ్య దుందుభి ధ్వానంబునుం గలిగె. మఖ పూర్తిగనుంగొని దేవతలు, మునులు, రాజర్షులు, మహాపురుషులు హర్షంబునం గొనియాడిరి.

## -భీముని పాక మహిమ-

అప్పుడు భీమసేనుండు తన పాక చాతుర్యంబు నందఱకు నెఱింగిం పంగోరి, విందు సేసి బిరుసుమెత్తనయు, ననుఁబ్రాయియుఁ జిమిడికయుంగాక గరకరికయగు కలమాన్నంబును, బద్మకేసరచ్ఛాయ ననుకరించు పప్పును, దివ్యగంధబంధురంబులైన గోధుమ పిండి వంటలోను, నానారుచుల చిత్రంబులైన శాకపాకంబులును, భక్ష్యభోజ్యలేహ్యచోష్య పానీయంబులు మొదలగు సమస్తంబును, నిమిషమాత్రంబున సమర్చి, పసిడి పళ్ళెరంబున నించి, ఋషుల, రాజుల, బంధువులను బంతులు దీర్చి, సర్వా లంకార భూషితలైన యోషాసహస్రంబులచే వడ్డన చేయించుటయు, 'జింపి నార చీర లేమి సేసెడివని మనంబున నెన్నకుఁడు. ఇవి ఖండశర్కరామయంబులైన మండెగలు. తెగిన జంఁదెంబులివియేల యనకుఁడు. ఇవి వింతలైన గోధుమ పూజంతికలు. ఔదుంబర ఫలంబులివియని యెన్నకుఁడు. నమలి చూడుఁడు. మేలి పూర్ణంబులిడిన కుడుములు. తెల్ల నురుఁగు లేమిటికంటికొని యెడునని దూఱకుఁడు. ఇవి వాసన రుచిరంబులైన పేణియలు'. అని యొడంబడఁ జెప్పుచుఁ బదంతుకలు వడ్డింప, మహా మునులు భుజియించి, గంధోదక ధౌత హస్తాంబుజులై, కర్పూర వీటికా సుగంధ మాల్యంబులం దనిసి, యనిలజునిఁ బలు విధంబులఁ బ్రశంసించుచు, యాగశాలఁ గూర్చుండియుండిరి.

## -కృష్ణ ధర్మరాజులు బ్రాహ్మణవివాదంబు వినుట-

ఆ సమయంబున నిరువురు బ్రాహ్మణులు తమలోనఁ గోలాహలంబుగాఁ గలహించుచు వచ్చి, ధర్మనందనుం గనుంగొని యాశీర్వదించి, 'మా వివాదంబు

దీర్చవలయు' ననిన నతం, 'దరుణి పులహ బకదాల్భ్యాది మహామునులు,నీ గోపాల దేవుండును విన మీ వాదంబులు దెలుపుఁడ'నవుడు, వారిలో నొక్కరుం డిట్లనియె: 'నా పేరు యజ్ఞశర్మ. ఈతని నామధేయంబు విష్ణుశర్మ. ఇతనికి నేనొక్క క్షేత్రంబు నమ్మితిని. ఇతండాక్షేత్రంబు దున్నించునప్పు డొక నిక్షేపంబు గానం బడియె. ఆ నిక్షేపంబు నన్నెత్తుకొమ్మనిన నాకు నిమిత్తంబు లేదంటిని. అందుల కితండు మల్లాడుచున్నాడు. ఈతనికి మీరలు దెలియ బలుకరింపుండ' నిన యనంతరంబ విష్ణుశర్మ యిట్లనియె. 'ఇతండు నాకుఁ గ్రయంబుసేయు నప్పుడు నిక్షేపంబు తోడం గూడఁ గొనినవాడంగాను. నాకుఁ గార్యంబేమి? ఈతఁడు ధర్మబెఱుంగని వెఱ్ఱివాఁడు. తన ద్రవ్యంబు నాకేమిటికి? మీరలీ తగవు దీర్పుండ'నుటయు, శ్రీకృష్ణదేవుండు నవ్వుచు నిట్లనియె: 'విప్రవరులారా, మీరలిరువురు మూఁడు నెలలకు మగుడ రండు. అప్పుడు తగవు దీర్చెద. పొండు. వృథా జగడంబు వలద' నిన, వారలిరువురుఁ దద్ధనంబు నగరికి నప్ప గించి చనుటయు, ధర్మనందనుండు శ్రీకృష్ణదేవుం గనుంగొని, 'బకదాల్భ్య వ్యాస కణ్వ వశిష్ఠాది మహామునులుండఁ దగవు తేఱుగడ సేయక యేల యూరక పొండంటి' వనిన, ముకుందుం డిట్లనియె: 'నీ సమక్షంబున నానాసౌఖ్య గోష్ఠీవినోదంబులం బ్రొద్దు గడపునెడ నిదేమి వృథా సంవాదంబని పొండంటిని. మాసత్రయానంతరంబున కలియుగంబు సంప్రాప్తంబగు. అప్పటికి వీరల కీబుద్ధి యుడిగి మగుడఁ గలహించి మన యొద్దికి వత్తురు. అప్పుడు సమంబుగాఁ బంచి యిచ్చి పొండందము. అంతియగాదు. కలియుగాచారంబులు వినుము. వేద విహితంబులుగాని దురాచారంబుల చేతను, జనుల యన్యోన్య వైరంబులచేతను, అన్యాయ వర్తనులగు రాజుల చేతను, స్త్రీ ద్యూత మృగయా పానాది దుర్వ్య సనంబుల చేతను, ధర్మపత్నీనిరాదరణంబు చేతను, బరదార పరిగ్రహంబు చేతను, వేశ్యాసంగమంబు చేతను, బరద్రవ్యాపహరణంబు చేతను, నానాటికి రెట్టించు లోభ మోహ మాత్సర్యంబులచేఁ గలియుగంబు దర్పించి, ధర్మంబు నొప్పించి, యందులోనఁ బ్రథను పాదంబున దురాచారంబులు సదాచారంబులు సమ్మిశ్రంబులై, పెరుగు వడ్లు కలిపినకరణి వర్ణాశ్రమ ధర్మంబులు సంకరం బులగు. అప్పుడేనొక్క రాజరూపంబున నవతరించి, కొంత కొంత ధర్మ ప్రతిష్ఠాపనంబు సేయుదు' నని యానతిచ్చి, శౌరి ధర్మనందనునిచే బహువిధ సత్కారంబులు గైకొని పదియాఱువేల నూట యెనమండుగురు భార్యలతోడం గూడ హంస ధ్వజాది రాజాధి రాజులు గొలువ, మహా వైభవంబున ద్వారకా

నగరంబునకు వేంచేసి, సబహుమానంబుగా రాజులనెల్ల నాయాపురంబులకుఁ బనిచి, దివ్యభోగంబు లనుభవించుచు, సుఖంబున నుండె. యుధిష్ఠిరుండు సకల ధాత్రీమండలంబు నేలుచు, నభీష్టభోగంబు లనుభవించుచు, హరి పదారవిందంబుల డెందంబునఁ గుదురుకొలిపి యానందంబు నొందుచుండె.'' అని జైమిని మునీంద్రుండు మఱియు నిట్లనియె.

''జనమేజయ మహీపాలకా, అజాత శత్రుని యశ్వమేధారంభంబును, యౌవనాశ్వ హంసధ్వజ చంద్రహాసాది మేదినీ వల్లభుల వర్తనంబులును, శ్రీకృష్ణుని భక్తవాత్సల్యాది దివ్యశ్రీగుణంబులును ప్రతిపాదించునట్టి యీ యితిహాసంబు, వినినఁ జదివిన, వ్రాసిన, భారత రామాయణంబు లాకర్ణించిన ఫలంబును, గన్యాదాన గోదాన గోసహస్ర తులాపూరుషాది మహా దానంబుల కంటెను నూఱింత లధికంబు ఫలంబు గలదు. ఆయురభివృద్ధియు, నభీష్ట సిద్ధియు, హరిపద భక్తియు, నభివృద్ధిఁ జెందు. ఈ మహాపురాణంబు తేట పడ వినిపించిన విద్వాంసులకు రత్నభూషణంబులును, రజత కనకంబులు, రమణీయ ధవళ చామరంబులుఁ, బీతాంబరంబులు గ్రామంబు లొసంగి, డెందంబున నానందింపవలయు'' నని జైమిని మునీంద్రుఁ డానతిచ్చుటయు, జనమేజయ నరపాలుండు కౌతూహలాయత్త చిత్తుండై, యమ్మునివరునకుఁ గనకాంబరంబులు, రత్నమయ భూషణంబులు, నపారంబగు గోసహస్రంబులు సమర్పించి, చతుస్సాగర వేలా వలయిత మహీచక్రంబు నేలుచుఁ, దర్వాతి సత్కథలు వినుచు, శాశ్వతైశ్వర్య భోగంబు లనుభవించుచునుండె.

గద్య

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ
మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగమాందోళికా
ప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధ మాన
సముఖము మీనాక్షీ నాయక తనూభవ మీనాక్షి
దేవీ కటాక్ష లబ్ధ కవితా సాంప్రదాయక,
వేంకట కృష్ణప్ప నాయక ప్రణీ
తంబైన జైమిని భారతం
బున నశ్వమేధ పర్వ
మ్మను వచన
కావ్యంబు నందుఁ
బంచమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.

14-5-92
VEN

దీర్చవలయు' ననిన నతం, 'శరుణి పులహ బకదాల్భ్యాది మహామునులు,నీ గోపాల దేవుండును విన మీ వాదంబులు దెలుపుఁడ' నవుడు, వారిలో నొక్కరుం డిట్లనియె: 'నా పేరు యజ్ఞశర్మ. ఈతని నామధేయంబు విష్ణుశర్మ. ఇతనికి నేనొక్క క్షేత్రంబు నమ్మితిని. ఇతండా క్షేత్రంబు దున్నించునప్పు డొక నిక్షేపంబు గానం బడియె. ఆ నిక్షేపంబు నన్నెత్తుకొమ్మనిన నాకు నిమిత్తంబు లేదంటిని. అందుల కితండు మల్లాడుచున్నాడు. ఈతనికి మీరలు దెలియ బలుకరింపుండ' నిన యనంతరంబ విష్ణుశర్మ యిట్లనియె. 'ఇతండు నాకుఁ గ్రయంబుసేయు నప్పుడు నిక్షేపంబు తోడం గూడఁ గొనినవాడంగాను. నాకుఁ గార్యంబేమి? ఈతఁడు ధర్మమెఱుంగని వెఱ్ఱివాఁడు. తన ద్రవ్యంబు నాకేమిటికి? మీరలీ తగవు దీర్పుండ'నుటయు, శ్రీకృష్ణదేవుండు నవ్వుచు నిట్లనియె: 'విప్రవరులారా, మీరలిరువురు మూఁడు నెలలకు మగుడ రండు. అప్పుడు తగపు దీర్చెద. పొండు. వృథా జగడంబు వలద' నిన, వారలిరువురుఁ దద్ధనంబు నగరికి నప్ప గించి చనుటయు, ధర్మనందనుండు శ్రీకృష్ణదేవుం గనుంగొని, 'బకదాల్భ్య వ్యాస కణ్వ వశిష్ఠాది మహామునులుండఁ దగవు తేఱుగడ సేయక యేల యూరక పొండంటి' వనిన, ముకుందుం డిట్లనియె: 'నీ సమక్షంబున నానాసౌఖ్య గోష్ఠీవినోదంబులం బ్రొద్దు గడపునెడ నిదేమి వృథా సంవాదంబని పొండంటిని. మాసత్రయానంతరంబున కలియుగంబు సంప్రాప్తంబగు. అప్పటికి వీరల కీబుద్ధి యుడిగి మగుడఁ గలహించి మన యొద్దికి వత్తురు. అప్పుడు సమంబుగాఁ బంచి యిచ్చి పొండంపము. అంతియగాదు. కలియుగాచారంబులు వినుము. వేద విహితంబులుగాని దురాచారంబుల చేతను, జనుల యన్యోన్య వైరంబులచేతను, అన్యాయ పర్తనులగు రాజుల చేతను, స్త్రీ ద్యూత మృగయా పానాది దుర్వ్య సనంబుల చేతను, ధర్మపత్నీనిరాదరణంబు చేతను, బరదార పరిగ్రహంబు చేతను, వేశ్యాసంగమంబు చేతను, బరద్రవ్యాపహరణంబు చేతను, నానాటికి రెట్టించు లోభ మోహ మాత్సర్యంబులచేఁ గలియుగంబు దర్పించి, ధర్మంబు నొప్పించి, యందులోనఁ బ్రథను పాదంబున దురాచారంబులు సదాచారంబులు సమ్మిశ్రంబులై, పెరుగు పడ్లు కలిపినకరణి వర్ణాశ్రమ ధర్మంబులు సంకరం బులగు. అప్పుడేనొక్క రాజరూపంబున నవతరించి, కొంత కొంత ధర్మ ప్రతిష్ఠాపనంబు సేయుదు' నని యానతిచ్చి, శౌరి ధర్మనందనునిచే బహువిధ సత్కారంబులు గైకొని పదియారువేల నూట యెనమండుగురు భార్యలతోడం గూడ హంస ధ్వజాది రాజాధి రాజులు గొలువ, మహా వైభవంబున ద్వారకా

నగరంబునకు వేంచేసి, సబహుమానంబుగా రాజులనెల్ల నాయాపురంబులక బనిచి, దివ్యభోగంబు లనుభవించుచు, సుఖంబున నుండె. యుధిష్ఠిరుండు సక ధాత్రీమండలంబు నేలుచు, నభీష్టభోగంబు లనుభవించుచు, హరి పదారవి దంబుల డెందంబునఁ గుదురుకొలిపి యానందంబు నొందుచుండె.'' అని జైమి మునీంద్రుండు మఱియు నిట్లనియె.

''జనమేజయ మహీపాలకా, అజాత శత్రుని యశ్వమేధారంభంబున యౌవనాశ్వ హంసధ్వజ చంద్రహాసాది మేదినీ వల్లభుల వర్తనంబులున శ్రీకృష్ణుని భక్తవాత్సల్యాది దివ్యశ్రీగుణంబులును ప్రతిపాదించునట్టి య యితిహాసంబు, వినినఁజదివిన, వ్రాసిన, భారత రామాయణంబు లాకర్ణించి ఫలంబును, గన్యాదాన గోదాన గోసహస్ర తులాపూరుషాది మహా దానంబు కంటెను నూఱంత లధికంబు ఫలంబు గలదు. ఆయురభివృద్ధియు, నభీ సిద్ధియు, హరిపద భక్తియు, నభివృద్ధిఁ జెందు. ఈ మహాపురాణంబు తేట ప వినిపించిన విద్వాంసులకు రత్నభూషణంబులును, రజత కనకంబులు, రమణీం ధవళ చామరంబులుఁ, బీతాంబరంబులు గ్రామంబు లొసంగి, డెందంబు నానందింపవలయు'' నని జైమిని మునీంద్రుఁ డానతిచ్చుటయు, జనమేజం నరపాలుండు కౌతూహలాయత్త చిత్తుండై, యమ్మునివరునకుఁ గనకాం రంబులు, రత్నమయ భూషణంబులు, నపారంబగు గోసహస్రంబులు సమర్పించి చతుస్సాగర వేలా వలయిత మహీచక్రంబు నేలుచుఁ, దర్వాతి సత్కథల వినుచు, శాశ్వతైశ్వర్య భోగంబు లనుభవించుచునుండె.

గద్య

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీ విజయరంగ చొక్కనాథ
మహీనాథ కరుణాకటాక్ష సంపాదిత గజతురంగమాందోళికా
ప్రముఖ నిఖిల సంపత్పారంపరీ సమేధ మాన
సముఖము మీనాక్షీ నాయక తనూభవ మీనాక్షి
దేవీ కటాక్ష లబ్ధ కవితా సాంప్రదాయక,
వేంకట కృష్ణప్ప నాయక ప్రణీ
తంబైన జైమిని భారతం
బున నశ్వమేధ పర్వ
మ్మను వచన
కావ్యంబు నందుఁ
బంచమాశ్వాసము.

సర్వము సంపూర్ణము.